శ్రీరస్తు

శ్రీమతే శఠకోపాయ నమః



శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీ పరాంకుశ శ్రీ సూక్తిసుధ



సంపాదకులు:

ఉ.వే. శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్య :



ప్రకాశకులు:

**ఉభయ వేదాన్త సభ**

పెంటపాడు - 534 166

# శ్రీ పరాంకుశ శ్రీ సూక్తిసుథ SRI PARAMKUSA SRI SUKTHI SUDHA

ప్రమాథి



ప్రథమ ముద్రణ: 1999

ప్రతులు: 1000

మూల్యము: రూ. 85/-

ప్రాప్తి స్థానములు:
1. ఉభయ వేదాన్త సభ,
పెంటపాడు - 534 166, (A.P), ఫోన్: (08818) 23963
**Email: satyatpg@md4.vsnl.net.in**

2. ఉ.వే. శ్రీమాన్ వి. శ్రీరామాచార్యులు గారు
ఫ్లాట్ నెం: 12, సెక్టార్ నెం. 11, ఎమ్.వి.పి. కాలనీ
విశాఖపట్నం (A.P) ఫోన్: 532276

3. ఉ.వే. శ్రీమాన్ ఎస్.ఎన్.సి. నరసింహాచార్యులు గారు
7/16, దేవుని అల్వాల, బొల్లారం పోస్ట్
సికిందరాబాద్ - 500 010, (A.P) ఫోన్: 7866078

4. ఉ.వే. శ్రీమాన్ వి. వెంకటాచార్యులు గారు
అడ్వొకేట్
కోటిపల్లి వారి వీధి,
నరసాపురం- 534 275, ఫోన్: 08814- 74902

డి.టి.పి. & ప్రింటింగ్
శ్రీ సత్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్
తాడేపల్లిగూడెం-534 102
ఫోన్: 23360, 23350
**Email: satyatpg@md4.vsnl.net.in**



विशेष कार्य अधिकारी
OFFICER ON SPECIAL DUTY

राष्ट्रपति सचिवालय,
राष्ट्रपति भवन,
नई दिल्ली - 110004.
President's Secretariat,
Rashtrapati Bhavan,
New Delhi - 110004.

No.F.2-M/99

19th May, 1999



# MESSAGE

Dear Shri Charyulu,

The President of India, Shri K.R. Narayanan is happy to know that the Ubhaya Vedanta Sabha, Pentapadu is bringing out a Souvenir titled "Sri Paramkusa Sri Sukthi Sudha" on the occasion of Nammalwar'sJayanti Celebrations.

The President extends his warm felicitations and warm greetings to all those associated with the Sabha and wishes the publication and the event all success.

With regards,

Yours sincerely

(S.N. Sahu)

Shri NVLN Ramanuja Charyulu,
Secretary,
Ubhaya Vedanta Sabha
Pentapadu- 534 166
Andhra Pradesh

**NARA CHANDRABABU NAIDU**



**CHIEF MINISTER**
ANDHRA PRADESH

HYDERABAD
19.5.1999



# MESSAGE

I am happy to learn that the Ubhaya Vedanta Sabha is organising the Nammalwar Jayanthi Celebrations during 'Pramadi', being Nammalwar's birth year, at Narsapur of West Godavari and bringing out a Commemorative Souvenir to mark the occasion.

I hope that the Celebrations would attract huge number of devotees and help promote spiritual values in the society in a big way.

I wish you all success and Goodspeed in your pious efforts.

(N.CHANDRABABU NAIDU)

N.V.L.N. Ramanujacharyulu
Secretary,
Ubhaya Vedanta Sabha



# కృతజ్ఞతాంజలి




## ACKNOWLEDGEMENT

*This Book is published with the financial assistance of*

***TIRUMALA TIRUPATHI DEVASTANAMS***

under their Scheme

Aid to Publish Religious Books.

# *Acknowledgement*


We acknowledge with hearty thanks for giving
message for the publication of

**SRI PARAMKUSA SRISUKTHI SUDHA**

and

***51st Centenary Celebrations of Sri Nammalwar***

to

Hon'ble President of India
**Sri. K.R. Narayanan,**

&

Hon'ble Chief Minister of Andhra Pradesh
**Sri. Nara Chandrababu Naidu**

***Secretary,***
Ubhaya Vedanta Sabha



ఉ.వే. శ్రీమాన్ వేదాల కోనమాచార్య స్వామి, శ్రీమతి రాఘవమ్మ దంపతులు

# ACKNOWLEDGMENT

*We acknowledge with hearty thanks and Managalasasanams for the Finnacial Assistance for the publication of*

**SRI PARAMKUSA SRI SUKTHI SUDHA**

*to*

**SRIMAN VEDALA KONAMACHARYA SWAMI**

**Trust: matsyapuri (w.G.Dt) A.P.**

*-Ubhya vedanta Sabha*



ఉన్నదిక్కోగ్ అమర్న్దు పుగున్దేనే
శ్రీనివాస పెరుమాళ్, తిరుమల



శ్రీ ఆదికేశవ పెరుమాళ్, నరసాపురం



శ్రీ నమ్మాళ్వార్, నరసాపురం



భగవద్రామానుజులు, నరసాపురం



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య

ఉ.వే. శ్రీమాన్ వానమామలై జీయర్ స్వామి వారు

శ్రీః
శ్రీమతే రామానుజాయ నమః

# ఆశీర్వచనమ్

**శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య**
**శ్రీమత్ కలియన్ వానమామలై రామానుజ జీయర్ స్వామి**
**నాఙ్గునేరి 12.5.99**

అయి భోః! విపశ్చిదపశ్చిమా! అస్మచ్ఛ్రీ వైష్ణవ సంప్రదాయస్యాత్యుత్తమస్య విదిత చరమేవేదానీం సమేషామస్మాకం యదాద్యస్య నః కులపతే శ్రీవకుళ భూషణ మహామునే శ్రీ శఠరిపు స్వామినః 5100 తమ జయన్తీ మహోత్సవోధునా ప్రమాధి సంవత్సర వైశాఖ విశాఖాయాం మహత్తమేన వైభవేన తత్ర తత్ర సర్వత్ర దివ్యదేశేషు విశిష్య చ శ్రీ శఠారాతి దివ్యసూరే రవతార దివ్యక్షేత్రే శ్రీకురుకాపుర్యాం సమ్మాన్యేత సర్వైరపి శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంతిభి స్సజ్జనైరితి ।

ప్రవర్తమానస్య కలియుగస్య ప్రథమ శతాబ్ద్యామేవాత్ర జగదుద్ధరణాయ సమవతీర్ణస్య శ్రీ శఠమథనమహామునేస్తుల్యో మహాచార్యో న కోఽపి సముద్భూతః, న సంభవతి, న సంభవిష్యతి చాస్మాకం మహీతలే సమగ్రేఽపి। సనాతన ధర్మశబ్ద వ్యవహార్య స్యాస్మదీయ శ్రీవైష్ణవ సంప్రదాయస్య మూలప్రమాణం ద్రావిడబ్రహ్మ సంహితైవేతి సుదృఢో రాద్ధాన్తోఽస్మాకం సర్వేషామితి జానన్త్యేవ తత్ర భవన్త స్సర్వేఽపి విద్వన్మణయః॥ నాత్ర కాపి విప్రతిపత్తిః కస్యాపి భవితుమర్హతి మనాగపి। చతుర్ణామపి ఋగ్యజు స్సామాధర్వనామభాజాం వేదానాం ద్రావిడామ్నాయత్వం రారాజతే శ్రీ శఠకోప సూరివర్యస్య చతుష్కేపి దివ్యప్రబంధతల్లజేషు। తేషాం దివ్యప్రబంధానాం చతుర్ణామపి ద్రావిడ వేదానాముపబృంహణరూపేణ శ్రీ పరకాల దివ్యసూరేష్షడఙ్గభూతా దివ్యప్రబంధా నిబద్ధా ఇత్యపి వయం సమ్యక్ జానీమః।

శ్రీ పరాంకుశ దివ్యసూరిః కిం వా శ్రీ సేనాపతేర్విష్వక్సేనస్యావతారో వా ఉత సాక్షాత్పర బ్రహ్మణ శ్రీమన్నారాయణస్య వైష్ణవ వామన దివ్యక్షేత్రాధీశస్య సుందర పరిపూర్ణభగవతోఽవతారభూతో వా ఆహోస్విత్ భగవతః పరమ కారుణికస్య సర్వజగత్కారణస్య శ్రీమన్నారాయణ స్యావ్యాజ కరుణా పరీవాహ గోచరః కశ్చన విలక్షణో జీవాత్మా వేతి నిర్ణయం కర్తుం న పారయతి కోఽపి, మోముద్యన్తే మానసాని సర్వేషామస్మదాచార్యవర్యాణా మిత్యపి జానీమో వయమ్। ఏతద్విలక్షణ శతాబ్ది

పరిపూర్తిముపలక్ష్య పరమ విలక్షణ దివ్యమంగళ విగ్రహ దివ్యలావణ్యేన ద్రష్టృజన చిత్తాన్యపహరతాం భగవద్రామానుజాచార్యణాం అస్మత్సిద్ధాన్త ప్రవర్తకాచార్యాణాం దివ్యసన్నిధినా సమలంకృతే శ్రీనరసాపుర దివ్యదేశేఽపి మహతా విభవేన మహః ప్రచలిష్యతి 29.5.99 తమే సుదినే.

తదా శ్రీ వేదాల కోనమాచార్యస్వామి నిక్షేపనిధి సాహాయ్యేన "శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధా" శుభనామ్నా కాచిత్పత్రికామతల్లికా ప్రకాశయిష్యత ఇతి విదిత్వా మానసమస్మాకం మోముద్యతే తమామ్।

ప్రచలిష్యమాణో మహోత్సవస్తథా ప్రకాశయిష్యమాణా సంచికా ప్రవరాచ శ్రీ శఠరిపు దివ్యసూరేర్దివ్యానుగ్రహేణ శ్రీమన్నారాయణ కృపా కటాక్షగోచరీ భావనశ్చ రారాజేతాం, సమ్మోద్యేతాం చ సుశోభనతయేతి వయం దివ్యదంపతి చరణ నళిన యుగళమూలే హార్దం సంప్రార్థయామహే॥

శుభం భవతు సర్వదా సర్వథేతి మంగళాని భూయాంసి సమాశాస్యన్తే సర్వేభ్యః, విశిష్య చ శ్రీమదుభయ వేదాన్త వాచస్పతి కిడాంబి శ్రీనివాస రామానుజాచార్య స్వామిభ్యః యైస్సహాస్మాకం పత్రవ్య వహారోఽభూత్॥



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి
చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయరు స్వామి వారు

# మంగళాశాసనములు



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ శ్రీ శ్రీ త్రిదణ్డి చిన శ్రీమన్నారాయణ
రామానుజ జీయర్‌స్వామివారు
వేదవిశ్వవిద్యాలయం - సీతానగరం.

ప్రియ శ్రీమాన్ యన్.వి.యల్.యన్. రామానుజాచార్య స్వామిన్.

శ్రీమతే నారాయణాయనమః !

**అనేక మంగళాశాసనాలు!**

శ్రీ పాంచరాత్రాదిశాస్త్రాలలో భగత్స్వరూపము పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపముగ విశద వైభవముతో ప్రతిపాదింపబడింది. అన్ని రూపాలలోనూ భగవంతుడు సర్వకళ్యాణ గుణ పూర్ణుడైయ్యే ఉంటాడనేది 'పూర్ణమిదం.... అవశిష్యతే' అనే మంత్రం తెలుపుతోంది. వీటిల్లో 'సులభహ్యుత్తరోత్తరః' అంటూ మిగిలిన వాటికంటే అర్చామూర్తి గుణాలలో మిగిలిన వాటిని అతిక్రమించి ఉంటుందని నిర్ణయం.

సామాన్యులకు గూడ అందుబాటులో ఉండటం, ఆరాధనలందుకోవడం, సర్వఫలప్రదుడు కావడమనేది అర్చామూర్తిలోని విశేషాలు, సకల మనుజ నయన విషయతాంగతుడవ్వడమే కాక 'అర్చక పరాధీన నిఖిలాత్మ స్థితి' కల్గి ఉండటం వల్ల సర్వులకు సమారాధ్యుడౌతాడు అర్చామూరి, ఆతడానందంతో వేంచేసి ఉండే ఆలయాలనే 'దివ్యదేశములు' 'ఉకన్దు అరుళిన నిలంగళ్' అంటారు.

అర్చామూర్తి ఆనందించేట్టు, తమప్రేమకు కట్టుబడి ఉండేట్టు చేసుకొని, ఆస్వామి యొక్క అసాధారణ వైభవాన్ని తామనుభవించిన రీతిలో, విశదతమ జ్ఞానముతో మనవంటివారము కూడ అనుభవించదగిన రీతిలో తాముపాడుకుంటున్నట్లుగ మనకుపదేశించిన మహానుభావులే ఆళ్వార్లు.

భక్తిబలాత్కారముతో వారి దివ్యముఖారవిందము నుండి నిస్సృతములైన వాఙ్మయ మకరందధారలే దివ్యప్రబంధములనే పేర ప్రసిద్ధాలు. ద్రావిడమందు వేదములైన ఆప్రబంధాలతో ఏఏ మూర్తులను ఆళ్వార్లు కీర్తించారో అవన్ని దివ్యదేశాలై విరాజిల్లుతున్నాయి. మనిషికి జన్మసాఫల్యాన్ని అవిప్రసాదిస్తాయి.

ఇతర ప్రాణులకంటే మనిషిని బాగు చేయడం మరీకష్టం. ఆలోచన అధికం గదా! ఇతర ప్రాణులకంటే! ప్రయోజనం లేనిదే ఏపనీ ప్రారంభించడు. మిగిలిన ప్రాణులు, ఓ అలవాటు చేస్తే అలానే ప్రవర్తిస్తాయి, యజమాని లేకున్నా సరే, ఇక మనిషి, ఎంత అలవాటైన పనైనా అధికారి అదిలిస్తూన్నంతవరకే! వాడటు తిరిగితే, వీడిటు తప్పించుకుంటాడు.

అనగా అనగా........నూనె కోసం గానుగ కెళ్ళాడో ఆసామి, ఎద్లను గానుగలో తిరుగనిచ్చి ఆహారానికి వెళ్ళాడు గానుగవాడు. ఎద్లకళ్ళకు గంతలున్నాయి. మెళ్ళోగంటలున్నాయి. తిరిగే ఎద్లమెడలో గంటలు మ్రోగుతున్నాయి. నూనె కొన వచ్చిన ఆసామికి అనుమానం వచ్చింది. కొంతసేపై యజమాని రాగానే అడిగాడు 'ఏమయ్యా! నువ్వు ఆహారానికి పోయావని తెలిసిన ఎద్లు తిరగడం మానేస్తే ఏంచేస్తావ్?' అని. 'అలాచేయవండీ!' అని సమాధానం యిచ్చాడు. తృప్తి లేని ఆసామి 'నువ్వు లేవు కదా?' రెట్టించాడు. దానికా ఆసామి 'కళ్ళకి గంతలున్నాయి కనుక నేను వెళ్ళినా తెలియదు. ఒకవేళ అలా ఆగితే తెలియడానికే గద దానిమెడలో గంట కట్టాను. ఎద్లాగితే గంట ఆగుతుంది. లోపలినుంచే అదిలిస్తా. మళ్ళీ తిరుగుతాయి. అంతే ' అని సమాధానం చెప్పాడు. ఈ ఆసామి ఆగక 'మీ ఎద్దు తిరగకుండా అలానే నిలబడి మెడ ఊపిందే అనుకో, గంటమ్రోగుతూ ఉంటుంది. నువ్వేమో తిరుగుతోందని అనుకుంటావు. అప్పుడేమి చేస్తావు?' మనిషి బుద్ధిని బయట పెట్టాడు. సహనంలేని ఆగానుగవాడు' అయ్యా! మాఎద్లకి చెప్పిన పని చేయడమే తెలుసు. మనిషికాదు గద. పండితుల వద్ద చదువుకోలేదు గద! అంచేత పనిదొంగతనం, మోసగించడం చేతకాదుమరి' అంటూ బదులిచ్చాడట.

జ్ఞానాన్ని మనిషి ఎంత వక్రంగా వినియోగిస్తాడో వివరించే చిన్న ఇతిహాసమిది. వికృత యోనుల దాటి భగవత్కృపా విశేషం విలక్షణంగా పడితే ఓ జీవుడు మనుష్యుడు కాగలుగుతాడు. అగాధంలోంచి అత్యున్నత శిఖరం చేరడం లాంటిదీజన్మ. ఈ మానవ జన్మ, జన్మ జరామరణ చక్రానికి చివరి భ్రమణం కావాలి. ఇందులోంచి పునరావృత్తి రహితమైన పరమాత్ముని ధామాన్ని పొంది, భగవత్పర్యంకగతుడై, వినమిత గాత్రుడై. పలుకైంకర్యాలు చేస్కోగల స్థితినిపొందాలి. ఈ లక్ష్యానికే సాగాలి పయనమనేది ప్రాజ్ఞుల పలుకు.

వైకుంఠ పాళీలో చివరిదాక చేరి, పెద్ద పాము నోటపడి, మొదటికి చేరినట్టు, కాలసర్పదష్టుడైన మనిషి, కర్మవివశుడై దేహేంద్రియాదులను దుర్వినియోగం చేస్కొంటూ దేమునికి దూరమౌతున్నాడు.

ఇది తలచుకొనే కరుణావరుణాలయుమైన కారణతత్త్వం, శ్రియఃపతి శ్రీమన్నారాయణుడు, ఈ మగ్న జీవుల సముద్ధరణకై ఎత్తిన అవతారం ఎత్తక ఎన్నెన్ని

జన్మలు ధరించాడో! ఎన్నిష్ట యోనియుమాయ్ పిఅన్దాయ్ అంటూ ప్రాజ్ఞులైన, ఆళ్వార్లు, స ఉశ్రేయాన్ భవతి జాయమానః! అంటూ శ్రుతి కూడా బాధపడతాయి. 'మానవజన్మవచ్చిన తర్వాత గూడ వీడింకా బాగుపడేట్టు తనని చేరడేమిటీ' అనేదే అన్ని అవతారాలలోనూ ఆ అచ్యుతుని తపన. అవి ఓ కాలానికి మాత్రమే పరిమితాలౌతున్నాయని, ఆనియమంలేనట్టు గైకొన్నరూపమే అర్చావతారం.

బంధుత్వాలన్నీ ఈ బద్ధజీవుడితో పెట్టుకొని, ప్రేమపొంగును అరికట్టలేక, వీరి శోకమే తన శోకంగా, వీరి సుఖం తన సుఖంగా, వీరి క్రూర, కఠినమైన సేవలను గూడ, అతిప్రీతితో స్వీకరించడాని కంగీకరించిన చోటు అర్చామూర్తి. అవతారాల కృషినీ, అర్చామూర్తి అనుగ్రహాన్ని అవగింజంత చేసేసి, నిస్సంకోచంగ నిర్భయంగా ఆతణ్ణి అనాదరించి బ్రతకడానికి మనమే తగునన్నట్టు జీవిస్తా మీ సంసారంలో. విసుగు చెందని రైతులా, మన హృదయ కేదారాల్లో భక్తి మందారాలు పూయించాలని, ఆశాజీవి, అర్చావతారంగ ఎంత కాలంగ అర్రులుచాస్తున్నాడో!

కృష్ణావతారం తర్వాత మరి తిరిగే అవతారాలుండవు కనుక, తనను గురించి తెలుపాలన్న ఈ బద్ధులలోంచే ఎవరినైనా తయారు చేస్కోవాలనేది వాని సంకల్పం. దాని ఫలస్వరూపమే కలి ప్రవేశించిన 41 వదినాన కారిమారుల కన్నబిడ్డ కలివైరులై అవతరించారు. వీరినే శఠరిపులు, నమ్మాళ్వార్లు, శఠారి, వకుళ భూషణభాస్కరులు ఇత్యాది పేర్లతో కీర్తిస్తారు.

"జాయమానం హి పురుషం యం పశ్యేత్ మధుసూదనః
సాత్వికః సతు విజ్ఞేయః............................................"

అన్నట్లు వీరి దివ్య పద విన్యాసమీ పుడమిపై పడేటపుడా పరంధాముడు ప్రేమగా పరికించాడు. పరమసాత్త్వికులుగా ఈనమ్మాళ్వారు పరిణితి చెందారు. తిండి, నీరు, లాంటి వేమీ ఎఱుగని వీరు 16 సం॥ యోగంలో దర్శించిన వాటిని, 16 సం॥లు పంచన చేరిన మధుర కవులవంటి మహాత్ములకు వెలువరించారు. చివరి 16 సం॥లలో ద్రావిడ భాషలో వీరు వెలువరించిన అనుభవ పరివాహ రూపాలైన పాటలే ద్రావిడవేదమైంది. మొదట నాల్గు ప్రబంధాలే వీరు పాడినా, తర్వాతి కాలంలో మిగిలిన 11 మంది ఆళ్వార్లు పాడిన మూడువేల పాటలతో కలిసి మొత్తం నాల్గు వేల పాటలనూ వీరే లోకానికి అందించారు. వేదంలో అక్కడక్కడ విస్తరించి ఉన్న విహిత పురుషార్థాలనన్నింటినీ, వీరు విశదంగా విడమర్చి పాడారు. అర్థంకాని వేదసారాన్ని కరతలామలకం చేసి కంటి ముందు నిలిపారు తమ ప్రబంధాలలో.

చిత్రవిచిత్ర లోకరీతులను, చమత్కారంగా తేటతెల్లంగా తెలపడంతో పాటు తరుణోపాయాన్ని సందేహాలకు తావులేనట్లు తీర్మానించారు.

భగవంతుడు అర్చామూర్తి గా ఉన్నాడన్న రహస్యాన్ని బహిర్గతంచేసి, భక్తి తత్త్వాన్ని నిష్కర్షించారు. వీరి ప్రబంధాలే లేకపోతే భగవత్ప్రేమ అంటే ఏమిటో తెలిసి ఉండేదే కాదు అనడం అతిశయోక్తి కానేకాదు.

అర్చామూర్తి అవతార ప్రయోజనాన్ని సార్థకపరిచింది వీరే. జగదీశ్వరుడు అర్చామూర్తిగ ఉన్నాడని నిరూపించి, తమ ప్రబంధంలో 32 ఆలయాలను కీర్తించడంతోపాటు, మిగిలిన నాలాయిరం ద్వారా 108 భగవత్ స్థానాలను ప్రకాశింపచేసారు వీరు.

వీరు దర్శించి కీర్తించిన ఆలయాలు దివ్య దేశాలైనాయి. అక్కడి భగవన్మూర్తులు దివ్య స్వరూపాలైనాయి. దానికి కారణం ఈ ఆళ్వారు దివ్యసూరులై వీరు పాడిన దివ్య ప్రబంధాలు అద్భుతమైన ప్రభావం కలవై ఉండటమే. 108 మాత్రమే కాక వీరి ప్రబంధాలు ఎక్కడెక్కడపాడితే అక్కడల్లా పరమాత్మ కళ్యాణ గుణపూర్ణుడై ప్రకాశించాడు. ప్రకాశిస్తున్నాడుగూడ. అందుకనే వీటిని గూడ దివ్యదేశాలనే అంటారు.

ఇంతకీ వీరు ప్రబంధాలను లోకానిక అందివ్వడమే విగ్రహరూపంలో ఉండి యిచ్చారనేది చరిత్ర. 8,9 శతాబ్దాలలో నాథమునులనే మహానుభావుల తపఃఫలితంగా, విగ్రహరూపంలో ఉన్న ఆ నమ్మాళ్వారే నాలాయిరాన్ని, నాథమునులకు ఉపదేశించారు. అదే నేటికీ అవిచ్ఛిన్నంగా వస్తోంది. నమ్మాళ్వార్ల విగ్రహప్రతిష్ఠ, ప్రబంధపారాయణలేని ఆలయాలు ఎంతటివైనా, వాటిని ప్రాకృతాలయాలనీ, అవికల ఆలయాలను దివ్యదేశాలనీ వర్గీకరిస్తారు.

వీరి ప్రబంధాలు, పరమార్థాన్ని మాత్రమే కాక ప్రాకృతిక ఫలాలనన్నింటినీ యిచ్చే శక్తి కలవనేది అనుభవజ్ఞులు చెప్తారు. విజయానికి ఆర్త్రియెత్త్రి, గ్రహబాధలకు 'తీఆర్వె' వంటివి అందుకు ఉదాహరణలు.

ఇంత ప్రభావం కలవారు కనుక తప్పక వీరు ఏనిత్యసూరులో, విష్వక్సేనులో, సాక్షాత్ శ్రియఃపతియో అని సంశయించడంతో పాటు, విష్వక్సేనాంశ సంభూతులేనని ఎందరో నిర్ధారణ చేసేసారు.

అయితే వీరి ప్రబంధాలను వ్యాఖ్యానించిన నంబిళ్ళై గారివంటి పూర్వాచార్యుల అభిప్రాయం ప్రకారం నమ్మాళ్వార్లు మనవంటి బద్ధజీవులే. కర్మవివశులే. భగవన్నిర్హేతుక కృప ఎంతటి బద్ధుడనైనా, విశ్వసిస్తే, ఎంత గొప్పగా తీర్చిదిద్దుతుందో వీరిద్వారా తెలుసుకోవచ్చునంటారు. వీరి పాటలు వేదాలకంటే ప్రీతికరాలు పరమాత్మకి కదా! పరమపదంలోంచి ఎవరోవచ్చి, ఇంత గొప్పగా పాడటం ఓ అద్భుతం కానేకాదు. అప్పుడు, 'అలాంటి వాళ్ళకే అదిచెల్లు మనకి అది తగదులే' అని మనుష్యులు తప్పించుకోవచ్చు. మనుష్యులలోనే ఒక రలా మారి, కీర్తించగలిగారంటే, ఎవ్వరైనా అలా దర్శించగలగవచ్చుననే ధైర్యం కల్గుతుంది.

అందులోనూ, ఎవరో అన్నీ నేర్చిన గొప్పవారట్లా కీర్తించడంకాక, అందరిలోకీ అత్యల్పు డొకడు అతిలోకగంగ పాడినాడంటే, అలా భగవత్కృప ఆతడ్ని ఉద్ధరించిందంటే కాస్త పై స్థాయిలో ఉన్నవారు అవశ్యం, బాగుపడగలరని నిరూపించవచ్చు.

**ఆళ్వారే ఒకచోట 3.3.4 లో అంటారు-**

**ఈశన్ వానవఱ్క్కు ఎన్బన్, ఎన్రాల్ అదు**

**తేశమో తిరువేంగడత్తానుక్కు**

**నీశ నేన్ నిఱై యొన్ఱు మిలేన్, ఎంకణ్**

**పాశం వైత్త పరంశుడర్ శోతిక్కు॥**

"నిత్యసూరులకు నాథుడనిపించుకోవడం కంటే, అత్యంతాల్పుడనై, ఏ యోగ్యతాలేని నాతోచేరి, నాకు ప్రభువుగా ఉండటమే, అధికంగా భావించి, నన్నుచేరి తేజరిల్లాడు తిరువేంగడనాథుడు" అంటారు.

ఈ పాశురానికి ఆళ్వార్ నైచ్యానుసంధానం చేస్కోవడంలో తాత్పర్యం కాక, నిర్హేతుకంగానే భగవత్కృప ఉత్త అయోగ్యులను కూడ ఉత్తమ గుణశీలురుగా ఉద్ధరిస్తుందనడంలో తాత్పర్యం. మిగిలిన 11 మంది ఆళ్వార్ల విషయంలో గూడ ఈ నియమం సమానమే. అందుకే బద్ధులమైన మనలనైనా, ఆళ్వార్ల కృప, అర్చామూర్తి ద్వారా అవశ్యం ఉద్ధరించగలదు అనడంలో మనకి సందేహమే అవసరం లేదు.

నమ్మాళ్వారు అవతరించి, యిప్పటికి 5100 సంవత్సరాలు నిండాయి. అయినా వారిప్పుడు అర్చావతారంలో మనతో ఉన్నారు. వారిని స్మరించుకోవడం ద్వారా వారి సంబంధాన్ని మనము పొందవచ్చు.

'కృష్ణ తృష్ణా తత్త్వం' అని వీరికొక దివ్యమైన నామం. శ్రీ కృష్ణు నిమిదితృష్ణ రూపు దాల్చితే శ్రీ నమ్మాళ్వారైనారంటారు సామాన్యులు.

శ్రీ కృష్ణునికి వీరిపై కల్గిన తృష్ణకే వీరు సాక్షాద్రూపమంటారు ధీమాన్యులు. అందుకే వీరివెంట మనముంటే భగవంతుడు మనవెంట తానుంటాడు. తరించగోరిన మనసున్నవారంతా నమ్మాళ్వార్ల శ్రీ పాదాలనే పట్టాలంటారు శ్రీమణవాళమహామునులు.

అలాంటి నమ్మాళ్వార్ల వైభవ ప్రకాశంగా, వారారాధించిన, వారికి దర్శనమిచ్చిన దివ్యదేశ పెరుమాళ్ళ వైభవంతో ఓ గ్రంథరాజాన్ని పెద్దల శ్రీ సూక్తి సుధాప్రవంతిగా వెలయించాలని ఉభయవేదాన్త సభ, పెంటపాడు కార్యదర్శి ఉ.వే.శ్రీమాన్ ఎన్‌వి‌ఎల్‌ఎన్ రామానుజాచార్యస్వామిగారు సంకల్పించడం ఎంతైనా ఉచితం. వారి ఈ సత్సంకల్పం సార్ధకమయ్యేట్టు, ఈ గ్రంథరాజము జిజ్ఞాసు జన జీవాతువు కావాలని, ఇలాంటి అనేక బృహత్కార్యాలు శ్రీమాన్ రామానుజాచార్యస్వామిగారు చేసేట్టు ఆళ్వార్లు శ్రియఃపతి వారికవకాశాన్ననుగ్రహించాలనీ ఆశిస్తూ, అనేక మంగళాశాసనాలను చేస్తున్నాం.

జై శ్రీమన్నారాయణ!!

2/11/1999

శ్రీమతే రామానుజాయ నమః

# మంగళాశాసనములు

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ
త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామి వారు
మకాం: ఏలూరు.

కలియుగారంభములో ప్రమాధినామ సంవత్సరమున శ్రీమన్నారాయణ తత్వాన్ని లోకానికందించి దిద్దుబాటు చేయుటకై అవతరించిన మహాపురుషులు శ్రీ నమ్మాళ్వార్లు. ప్రమా అనగా యథార్థ జ్ఞానము. దానిని కలిగిన ధి-బుద్ధి. దానిని కలిగి లోకమునకందించు వారలుగా సూచించుటకైయ్యే ప్రమాధి యందు వారి అవతారము. నిజముగా సకల వేద ప్రతిపాద్యుడైన శ్రియః పతి కళ్యాణ గుణములకు ఈడు పడి భిన్నభిన్న అవస్థలను పొంది వాటి ద్వారా శరణాగతిని చేసి తమ స్వరూపానురూపమైన కైంకర్యమును అత్యంత ప్రీతితో చేయదలంచి ఎన్నాళ్ యానున్నై ఇని వందు కూడువనో, కూవి కొళ్ళుమ్ కాల మిన్నమ్ కురుకాదో, అని ఆర్తిగా ప్రార్థించి ఆరావముదా మిత్యాధిగా నూతన నామములతో స్వామిని పిలచి తమకు ధారక, పోషక, భోగ్యములు అన్ని (ఉణ్ణుమ్ శోర్ పరుకు నీర్ తిణ్ణుమ్ వెత్తిలై యుమ్ ఎల్లామ్) కణ్ణన్ అని అంటూ ప్రీతి ఉప్పొంగి పొరలిపోతుండగా పరవశించి సహస్ర సంఖ్య కలిగిన తిరువాయిమొழி అను ప్రబంధముతో పాటు ఇంకను మూడు ప్రబంధములను పాడిరి.

ఈ ప్రమాధిలో నమ్మాళ్వార్ల తిరునక్షత్ర మహోత్సవమును నరసాపురంలో అత్యంత వైభవముగా జరిపి లోకోజ్జీవనకొరకని ఆళ్వార్ల శ్రీ సూక్తులను శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధ అను పేర ముద్రింపజేసి లోకమునకు ఉపకరించిన ఉ॥వే॥ శ్రీమాన్ నడాదూరు రామానుజాచార్య స్వామి వారు ధన్యులు. దీనిని ధరించి భక్తలోకము యధార్థ సంపన్నులగుదురు గాక.

**శ్రీ రా.రా. జీయర్**
మకాం: ఏలూరు



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి

శ్రీరామచంద్ర రామానుజ జీయరు స్వామి వారు



శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరంగ రామానుజ జీయర్ స్వామివారు
శ్రీమత్ అష్టాక్షరీ క్షేత్రము, జి. వేమవరము (కాకినాడ)

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయ నమః

# మంగళాశాసనములు

ప్రవచన శిరోమణి ఉ.వే. శ్రీమాన్
శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి వారు.
విశాఖపట్నం.

ఋషిం జుషామహే కృష్ణ తృష్ణా తత్త్వ మివోదితమ్ ।
సహస్ర శాఖాం యోద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మ సంహితామ్.॥

కృష్ణ తృష్ణా తత్త్వం అవతరించిన సంవత్సరం ఇది. కృష్ణ తృష్ణా తత్త్వము ప్రపన్న జనకూటస్థులైన శ్రీ పరాంకుశులు. వారు కృష్ణావతార సమాప్తి అయిన కొద్ది రోజులకే కలియుగం ప్రారంభంలో మన భారతదేశంలో అవతరించారు. వారే అవతరించి ఉండకపోతే ఈ లోకంలో సామాన్యులకు భక్తి, ప్రపత్తి అంది ఉండేది కాదు. ఎవరికో పండితులకే తప్ప మిగిలిన వారికి మరుగుపరచి ఉండే వేదాన్ని అందరికీ అందుబాటులో నుంచిన మహాపురుషులు శ్రీ పరాంకుశులు. వారు పిళ్ళ లోకాచార్యులనుగ్రహించినట్లు "పెణ్ణుక్కుం పేదైక్కుం" స్త్రీలకు అజ్ఞులకు కూడ అందేటట్లుగా సంప్రదాయాన్ని అందించారు. వారి పాశురాలు పరమ సులభంగా కనిపిస్తాయి. కాని పరమదుర్గ్రహముకి, వేదార్థ విషయీకరణలో అంతటి సమర్థమైన వాక్యాలు మరియొకటి లేవు. ఉపనిషత్తులు ఎటువంటివో అటువంటివి. ఇందులో స్వరములతో కూడిన ఉపనిషత్తు సామవేదము, గానముతో కూడిన ఉపనిషత్తు మన తిరువాయ్మొళ్ళి.

ఈ విధంగా వేదములు నాలుగు ఉంటే నాలుగు ప్రబంధాలను అవతరింపచేసి ఆ నాలుగు రహస్యాలను మనకందించటానికి అవతరించినటువంటి మహాపురుషులు, శఠకోపులు. వారే అవతరించి ఉండకపోతే ప్రపన్న కులమనేది లేకుండాపోవును. అందుచేతనే వారిని మనము ప్రపన్న జనకూటస్థులు అంటాము. ప్రపన్నులంటే భగవంతుడే ఉపాయమని విశ్వసించిన వారు.

కర్మ ఉపాయము, జ్ఞానము ఉపాయము, భక్తి ఉపాయము అని భిన్న భిన్నములైన వాదములతో కొట్టు మిట్టాడుతుంటే కాదు కాదు ఎవరికైనా జ్ఞానులకైనా, అజ్ఞులకైనా భక్తి పరవశులకైనా కావలసినది ప్రపత్తియే. దానికంటే వేరు మార్గము లేదని చాటి చెప్పేవారు. వారు మహాపండితులేకాదు. మహాభక్తులే కాదు. కేవలము

భగవానుడే తప్ప వేరు ఉపాయము లేదని విశ్వసించి చాటిచెప్పిన మహామనీషి. అటువంటివారు అవతరించిన సంవత్సరమగుటచేత ప్రమాధి సం॥ మనకు చాల ఉపకారకమైన సంవత్సరము. దీని పేరు ఇందుకే ప్రమాధి అని పెట్టారు. ఇతరమైన విషయములయందు ఉండే దోషాలను మనకంటకుండా పోగొట్టే సం॥ ప్రమాధి. ఇది మథిస్తుంది. కేవలము భగవానుడే, ఉపాయమని నిశ్చయం చేసేటటువంటి పరాంకుశావతార మూలమయినటువంటి సంవత్సరము ఈ సంవత్సరము గనుక ఈ సం॥రము చాల ఉపాదేయము. దీనిని మనమందఱము ఒక మహాపర్వదినముగా ఆదరించాలని సంకల్పించి మా రామానుజాచార్యస్వామి వారు అక్కడ పెంటపాడులో ఒక సంకల్పం చేసి దానికి కార్యరూపాన్నిచ్చి వారి సోదరులందఱితో కలిసి ఈ నరసాపురంలో ఆదికేశవ ఎంబెరుమానార్ సన్నిధిలో మహావైభవంగా 5 రోజులు ఉత్సవాలు జరిపిస్తున్నారు. ఆ ఉత్సవాలకు తప్పక హాజరు కావలసిన వ్యక్తిని నేను. నాకు దీనియందు ప్రత్యేకమైన ప్రావణ్యం ఉన్నది. కాని అశక్తుడనై వెళ్ళలేక ఇంట్లో కూర్చుంటే నన్ను కూడ వారిమధ్య ఒకడిగా చేర్చుకోవాలనే సంకల్పంతోటి వారే కోరి నాకు ఈ అవకాశాన్ని ప్రసాదించారు. నేను పెద్ద పండితుణ్ణి కానుకాని పరమ విశ్వాసం కలవాణ్ణి. నాకు భక్తి సంప్రదాయమే కాదు. ప్రపత్తి సంప్రదాయమందు కూడ పరిపూర్ణమైన విశ్వాసం ఉన్నది. మన రామానుజులు భక్తికి, ఆళ్వార్లు ప్రపత్తికి, లేకపోతే మన విశిష్టాద్వైత సిద్ధాంతమే లేదు. "భక్తి ప్రపత్తిభ్యాం ప్రసన్నః స ఏవ ఉపాయః" అని మన సిద్ధాంతము. భక్తి ప్రపత్తులచేత భగవానుడు ప్రసన్నుడౌతాడు. ఆ ప్రసన్నుడైనటువంటి వాడే ఉపాయము. ఇతరమైనదేదీ ఉపాయం కాదు అనే సిద్ధాంతాన్ని చాటిచెప్పినటువంటి మన విశిష్టాద్వైత సిద్ధాంతానికి మూలభూతమైన వారు ఆళ్వార్లు, ఎంబెరుమానార్‌లు. అటువంటి ఆళ్వార్ల యొక్క జన్మసంవత్సరము కనుక ఈ సంవత్సరమును మనమందఱము ఎంతో పర్వదినంగా భావించి సంవత్సరమూ ఆదరించాలి. ఉత్సవాలు చేసుకోవాలి. సంవత్సరమూ ఆయా విషయాల మీద ప్రసంగాలు చేయిస్తూ ఉండాలి. అది మనకు లేకపోతే మనం మనకు మూలభూతమైన విషయాలను విస్మరిస్తే కృతఘ్నులమవుతాము. అటువంటి వాళ్ళం కాకుండా ఉండాలని మన రామానుజాచార్య స్వామివారు మంచి సంకల్పం చేశారు. దానికందఱూ ప్రోత్సాహం ఇవ్వాలి. ఇస్తున్నారు. ఈ విధంగా ఉత్సవపరంపరను ఏర్పాటుచేసిన మన రామానుజాచార్య స్వామి వారు ఈ కార్యక్రమాన్ని దిగ్విజయంగా నెరవేర్చేల పెరుమాళ్ళు, ఆళ్వార్లు, ఎంబెరుమానార్ అనుగ్రహించాలని ప్రార్థిస్తూ నాను ఈ అవకాశాన్ని ప్రసాదించినందులకు అంజలి ఘటిస్తున్నాను.

శ్రీరస్తు

శ్రీమతే రామానుజాయనమః

# మున్నుడి

ప్రియ భాగవతోత్తములారా!

ఈ ప్రమాధి సంవత్సరము ప్రపన్నజనకూటస్థులైన శ్రీ నమ్మాళ్వారులు అవతరించిన సంవత్సరము నేటికి 5,100 సం॥లకు పూర్వము కలియుగ ప్రారంభమైన 40వ రోజున వైశాఖ పూర్ణిమా యుక్త విశాఖా నక్షత్రమున శ్రీనమ్మాళ్వారు తిరుక్కురుగూర్ అనే దివ్యదేశంలో అవతరించారని మన సంప్రదాయ గ్రంథములు తెలుపుచున్నవి. శ్రీ గీతాచార్యుడు బోధించిన గుహ్యాతమమైన భగవచ్ఛరణాగతిని అనుష్ఠానమున ప్రదర్శించి సత్ఫలితమును పొందిన వారిలో మొదటివారు శ్రీ నమ్మాళ్వారు. ఈ విషయమును వారే స్వయముగా తమ తిరువాయిమొழி దివ్య ప్రబంధములో **పండే పరమన్ పణిత్త పణి వగై యే, కండేన్ కమల మలర్ పాదం-కాండలుమే విండే యొழிన్ద వినై యాయన వెల్లామ్.** పూర్వము గీతాచార్యుడు అనుగ్రహించిన శ్రీ సూక్తిని (మా మేకం శరణం వ్రజ) అనుసరించి అతని సన్నిధిలో శరణాగతి చేసి అతని దివ్య చరణ కమలములను దర్శించితిని. దర్శించినంతనే నా పాపములన్నియు నశించినవి అని విశదీకరించి యున్నారు. వీరినుండియే శ్రీ వైష్ణవ సంప్రదాయము (భగవచ్ఛరణాగతి సంప్రదాయము) ప్రవృత్తమైనది. కావుననే వీరిని ఆరాధించనిదే భగవదరాధన పూర్తికాదు.

ఒక దేశ భాషలో భగవంతుని స్తుతించి మెప్పించిన మొదటి భక్త కవియు వారే కావుననే వారు ప్రపన్నజన కూటస్థులైనారు. వారి చరణారవిందములు త్రైవిద్య వృద్ధ జనమూర్ధ విభూషణములైనవి. వారి శ్రీ సూక్తులు ద్రావిడ వేదములై నిత్యానుసంధేయములైనవి.

ఇట్టి మహనీయుత గల శ్రీ నమ్మాళ్వారుల యొక్క ఈ విశిష్ట దివ్య తిరువవతారోత్సవమును మిక్కిలి వైభవముగా నిర్వహించవలయునని సంకల్పించి ఉభయ వేదాంత సభ (పెంటపాడు) వారు దాని కంగముగా వకుళామోద వాసితమైన వారి శ్రీ సూక్తి సుధను శ్రీ వైష్ణవ జనులకు పరమాచార్య ప్రసాదముగా సమర్పింప దలంచి శ్రీ శఠకోప వాఙ్మయరూప ద్రావిడ వేద సాగరమును మథించిన శ్రీ వైష్ణవాచార్య తల్లజులచే వారి నాలుగు దివ్య ప్రబంధములలోని విశేషములను సులభ శైలిలో వ్యాసముల రూపమున రచింపజేసి **శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధ** ను ప్రకటించుట మిక్కిలి ముదావహము.

పరమ పవిత్రతను అత్యంత రస్యతను సంతరించుకొనిన ఈ శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధ శ్రీ వైష్ణవ పాఠక లోకమునకు పరమ భోగ్యమై పరమానందమును చేకూర్చుగాక!

**రసో వై సః - రసగ్ హ్యేవాఽయం లబ్ధ్వానన్దీ భవతి**

**నిత్యశ్రీ ర్నిత్య మంగళమ్.**

విజ్ఞాపయితా

కె.ఎస్. రామానుజాచార్యః

అధ్యక్షులు, ఉభయవేదాంత సభ

శ్రీమతే శఠకోపాయనమః
శ్రీమతే రామానుజాయ నమః

# నమ్ర నివేదన

**పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్త సార్వజ్ఞ సంపదమ్**
**ప్రపన్న జనకూటస్థం ప్రపద్యే శ్రీ పరాంకుశమ్ ॥**

ఈ ప్రమాధి నామ సంవత్సరము భగవన్నిర్హేతుక జాయమాన కటాక్షలబ్ధ దివ్యజ్ఞాన సంపన్నులును, ఆళ్వార్లలో ప్రధానులును, ప్రపన్నజనకూటస్థులును అయిన నమ్మాళ్వార్ల అవతార సంవత్సరము అనే విషయము లోకవిదితము. వీరు అవతరించి 5,100 సం॥లు గడిచినవి. ఇదివీరి 51వ శతాబ్ది మహోత్సవమగుట ఒక ప్రత్యేకత. ఈ సందర్భముగా పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో (అభినవభూతపురి) వేంచేసియున్న శ్రీ ఆదికేశవ ఎంబెరుమానార్ స్వామి వారి సన్నిధిలో ఆళ్వార్ల అవతార సంవత్సర తిరునక్షత్ర మహోత్సవాలను జరిపించాలనేది భగవత్ సంకల్పం.

ఈ శతాబ్ది ప్రారంభమునుండి ఈ సన్నిధితో మాకు అవిచ్ఛిన్నమైన సంబంధము కలదు. ఇది మా పితృ పైతామహం ధనం. మా పితామహపాదులు పరమపదవాసులు ఉభయ వేదాంత ప్రవర్తకులు శ్రీమాన్ కిడాంబి గోపాల కృష్ణమాచార్య స్వామి వారు ఈ సన్నిధిలో భగవద్రామానుజుల దివ్యావతార మహోత్సవాలను తదీయారాధన కైంకర్యమును అమిత వైభవముగా జరిపించుటే కాక దానిని భగవద్రామానుజార్య దివ్యావతార మహోత్సవ వర్ణనమ్ అను కావ్యముగా అనుగ్రహించిరి. వారి తదనంతరము శ్రీ స్వామి వారి కుమారులు మా తండ్రిగారైన పరమపదవాసులు ఉ॥ వే॥ శ్రీమాన్ నడాదూరు వేంకట వరద కృష్ణమాచార్య స్వామి వారు తాము వేంచేసి యున్నంతవరకు పై కైంకర్యములను నిర్వహించుటే కాక ప్రతినిత్యము పెరుమాళ్ళకు మంగళా శాసనం చేసెడివారు. అంతేకాక ఈ సన్నిధిలో జరుగు శ్రీ మణవాళ మహామునుల ఉత్సవములను అధ్యయన ఉత్సవాదులను వైభవముగా జరిపించెడి వారు. నేటికిని ఆ కైంకర్యములను ఉ॥వే॥ మా పెద్దతండ్రిగారి కుమారులు ఉ॥వే॥ శ్రీమాన్ కిడాండి వేంకటాచార్యస్వామివారు నిర్వహించుచున్నారు.

గడచిన సాధారణ నామ సం॥లో శ్రీ మణవాళ మహామునుల అవతార సంవత్సర తిరునక్షత్రోత్సవాన్ని వైభవముగా జరిపించారు మా పితృపాదులు. ఆ జ్ఞాపకాలు దాసుని నేటికీ వీడలేదు. అదే విధముగా శ్రీ నమ్మాళ్వార్ల తిరునక్షత్ర మహోత్సవాలను

వైభవముగా జరిపించాలని సంకల్పం కలిగింది. ఈ సంకల్పానికి మంగళా శాసనము చేసి ముందుకు నడిపించిన వారు మా అన్నగారు ఉభయవేదాన్త **వాచస్పతి** శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్య స్వామి వారు, దాసుని యందు వారికి గల అనుగ్రహమునకు మేరలేదు.

ఇక నమ్మాళ్వార్ల వైభవమునకు తగినట్లు ఈ కార్యక్రమము జరుగవలెను. అదియు ఆదికేశవ పెరుమాళ్ళ, భగవత్ రామానుజుల దివ్య సాన్నిధ్యమున. ఈ మహోత్సవాన్ని తమ ప్రత్యక్ష పర్యవేక్షణలో జరిపించవలసినదిగా శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి చినశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారిని ప్రార్ధించితిమి. కాని అప్పటికే వారు ఆళ్వార్ తిరునగరి వేంచేయుటకు నిర్ణయింపబడుటచే మంగళాశాసనములను కృపచేసిరి. ఇట్లే శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ కలియన్ వానమామలై రామానుజ జీయర్ స్వామివారును పరమ కృపతో మంగళాశాసనమును అనుగ్రహించినారు.

శ్రీ జీయర్ స్వాముల పర్యవేక్షణలో ఈ కార్యక్రమము జరుగవలయునను సంకల్పము మాత్రము చెదరలేదు. శ్రీ భాష్యకారసిద్ధాంతపీఠ వ్యవస్థాపకులు శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామి వారిని ప్రార్ధించితిమి. వారు పరమ కృపతో అంగీకరించి తమ పర్యవేక్షణలో ఈ కార్యక్రమమును అతి వైభవముగా జరిపించిరి.

కార్యక్రమమును మూడు భాగములుగా విభజించితిమి.

1. ఆళ్వార్ల అర్చావతార కైంకర్యము.
2. ఆళ్వార్ల వైభవమును గూర్చి ఉపన్యాసములు.
3. ఆళ్వార్ల దివ్య సూక్తులను పరాంకుశ శ్రీ సూక్తిసుధ అను పేర ప్రకటించుట.

ఇందు మొదటి రెండు కార్యక్రమములకు సూత్రధారులుగా ఉండి ఆద్యంతమూ వైభవముగా జరుపుటకు సహాయపడినవారు మా అన్నగారు ఉ॥ వే॥ శ్రీమాన్ కిడాంబి వేంకటాచార్యస్వామి వారు (స్థానాచార్యులు, నర్సాపురం).

కార్యక్రమానికి రూపకల్పన అయితే జరిగింది కాని దానికి తగిన ఆర్ధిక వసతికూడా కావాలికదా! అందుకు ముందుకు వచ్చినవారు శ్రీమాన్ ఎన్. జగన్మోహనరెడ్డి గారు, ఎమ్.డి. ఆర్.సి.ఎల్. విశాఖ., శ్రీమాన్ వేదాల శ్రీనివాస్ గారు, ఆర్.సి.ఎల్. విశాఖ. ఉ॥వే॥ శ్రీమాన్ గోపాలకృష్ణమాచార్య స్వామివారు ఎస్.టి.కె.ఎస్. వీరు ముగ్గురు కీర్తి లాభ పూజనాదులతో నిమిత్తంలేకుండా భగవత్ భాగవత కైంకర్యము చేసే స్వభావాన్ని జన్మతః పొందిన అదృష్టవంతులు. వీరి కైంకర్య నిష్ఠ అనన్య సామాన్యమైనది. క్షణం తీరిక లేని కార్యభారాన్ని వహిస్తూకూడా

శ్రీమాన్ శ్రీనివాస్ గారు మూడు దినములు ఇక్కడే ఉండి ఆళ్వార్ల ఉత్సవాన్ని భాగవత తదీయారాధనను పర్యవేక్షిస్తూ చేసిన కైంకర్యము; అలాగే పలువ్యవహారాలలో తలమునకలుగా ఉన్నప్పటికి వాటిని పక్కన పెట్టి "ఈ జన్మకు ఈ ఆచార్య కైంకర్యమే పరమ పురుషార్థ" మని భావించి శ్రమకోర్చి సతీసమేతముగా వచ్చి ఈ మహోత్సవములో అన్వయించిన శ్రీ జగన్మోహనరెడ్డి గారి కైంకర్య నిష్ఠ భాగవత మంగళాశాసనములను అందుకున్నవి.

అసహాయశూర, అనపాయ సాహసా అని శ్రీరామచంద్రమూర్తిని సంబోధిస్తారు శ్రీ వేదాంతదేశికులవారు. ఆ విశేషణాలకు ప్రత్యక్ష నిదర్శనం మా ఉ॥వే॥ శ్రీమాన్ ఎస్.టి.కె.ఎస్. గోపాల కృష్ణమాచార్యస్వామివారు. ఆళ్వార్ల వైభవాన్ని ప్రకాశింపచేసే ఉపన్యాసవేదిక నిర్వహణాభారాన్ని తమ సంస్థ శ్రీ భగవత్ రామానుజ దర్శన కైంకర్యసమితి భీమవరం ద్వారా నిర్వహింపజేసారు.

దూర దేశంలో ఉండికూడా ఈ ఉత్సవ వైభవాన్ని విని ఇందులో అన్వయించాలనే ఆశతో కైంకర్యాన్ని పంపించినారు వదాన్య శేఖరులు భిషగ్వరులు శ్రీమాన్ డా॥ గునుపాటి చెల్వపిళ్ళగారు (యు.ఎస్.ఎ).

ఈ సందర్భంలో ప్రధానంగా ప్రస్తావించవలసినవారు ఉ॥వే॥ శ్రీమాన్ వేదాల శ్రీరామాచార్యులవారు. వీరి తండ్రి గారు ఉ॥వే॥ శ్రీమాన్ వేదాల కోణమాచార్యస్వామివారు. వీరు మత్స్యపురి నివాసులు. అయినప్పటికి నర్సాపురం వీరి అభిమాన స్థలం. నర్సాపురం స్వామి సన్నిధిలో జరిగే ప్రతి కైంకర్యములోనూ పాలు పంచుకునే వారు. వీరి కుమారులలో ఉ॥వే॥ శ్రీమాన్ వేదాల వేణుగోపాలాచార్యులవారు, ఉ॥వే॥ శ్రీమాన్ శ్రీరామాచార్యులవారు, ఉ॥వే॥ శ్రీమాన్ డా॥ రంగనాధ్ గారు, శ్రీమాన్ యతిరాజ సంపత్కుమారాచార్యులు గారు మాకు సుపరిచితులు. శ్రీమాన్ డా॥ రంగనాథ్ (యు.ఎస్.ఎ) గారి ధర్మపత్ని శ్రీమతి ల॥ సౌ॥ కృష్ణకుమారి గారు. ఈ దంపతుల పుత్రరత్నమే చి॥ శ్రీనివాస్. వీరిని అనుపదము ప్రోత్సహిస్తుండేవారు మా శ్రీరామాచార్యులవారు. వీరు నిరంతర భాగవత కైంకర్యనిష్ఠులు. ఈ కలియుగాన్ని కృతయుగంగా మార్చేయాలన్నంత ఆశకలవారు. ఆళ్వార్ల అవతారోత్సవాలు అని విన్నవెంటనే ప్రయాణమై వానమామలై చేరి పెరుమాళ్ళ మంగళాశాసనము శేషవస్త్రాలతో పాటు శ్రీమత్ పరమహంసేత్యాది వానమామలై జీయర్ స్వామివారి మంగళాశాసనాన్ని కూడా తీసుకుని వచ్చారు. అంతే కాక 18 దివ్య దేశములనుండి పెరుమాళ్ళ మంగళాశాసములను శేషవస్త్ర చందన తోమాలాదులను తీసుకుని వచ్చారు. మరియు విశాఖ నగరములోని భక్తుల

కైంకర్యాలను కూడా సమీకరించారు.

ఈ ఉత్సవం అపూర్వంగా జరిపించాలనే కృతనిశ్చయముతో స్వామి కైంకర్యాన్ని నిర్వహించారు సన్నిధి అర్చక స్వాములు. ప్రతి దినం ఉదయం శ్రీ ఆదికేశవ పెరుమాళ్, నమ్మాళ్వార్లు, భగవత్ రామానుజులు వీరికి అలంకార తిరుమంజనం, వేదపారాయణ, దివ్య ప్రబంధ సేవాకాలము స్తోత్ర పాఠముల పారాయణ జరిగినవి. సాయంత్రం ఆళ్వార్లకు ఉత్సవం ఊంజల్ సేవ. నాల్గవరోజు ఆళ్వార్లకు హంసవాహనోత్సవము, ఐదవ రోజు పెరుమాళ్ళకు, ఉడయవరులకు వైభవముగా తిరువీధి ఉత్సవము. శ్రీమత్ పరమహంసేత్యాది శ్రీ శ్రీ శ్రీరామచంద్ర రామాను జీయర్ స్వామి వారు; నాలాయిర అధ్యాపకులు; భజన బృందాలు విష్ణు సహస్రనామ పారాయణలు ముందు నడుస్తుండగా వెనుక వేద పారాయణ భక్త సమూహము అనుసరిస్తుండగా బాణసంచాల వెలుగులలో జరిగిన ఈ తిరువీధి ఉత్సవం తిరుమల బ్రహ్మోత్సవాన్ని తలపింపజేసినది. భక్తులు సమర్పించిన పుష్పమాలికలతో ఈ సన్నిధి మరొక పుష్పమంటపమైనది.

ఈ కార్యక్రమాన్ని గూర్చి వినగానే తమవంతు సహకారాన్ని పరిపూర్ణంగా అందించినారు దేవస్థాన పాలక వర్గమువారు ముఖ్యంగా శ్రీ పుప్పాల కృష్ణారావుగారు (మేనేజింగ్ ట్రస్టీ), శ్రీ అడబాల సత్యనారాయణగారలు (ఈ.ఒ). ఈ ఉత్సవాన్ని సేవింప వచ్చిన స్వాములకు భక్తులకు జరిగిన తదీయారాధన భారద్వాజ తదీయారాధనను మరపించినది. ఈ కార్యక్రమాన్ని సమగ్రంగా నిర్వహించారు మా సోదరులు ఉ॥వే॥ శ్రీమాన్ కె.వీ.వీ. రాఘవాచార్యులు, శ్రీమాన్ చి॥ యన్. గోవిందరాజన్ గారలు.

నర్సాపురం, పాలకొల్లు, మొదలైన సమీప ప్రాంతాల వారే కాకుండా విశాఖ, హైదరాబాద్, చీరాల ఒంగోలు వంటి దూర ప్రాంతాల వారుకూడా విచ్చేసి స్వామి వారి కైంకర్యములో యథాశక్తి పాలుపంచుకుని ధన్యులమైతిమని సంతృప్తి చెందినారు.

ఇలా ఎందరో భాగవతోత్తముల సహాయ సహకారములతో జరిగిన ఈ మహోత్సవము ఒక అపూర్వ అనుభూతిగా మిగిలిపోయినది.

## శ్రీ పరాంకుశ శ్రీసూక్తి సుధ

ఆళ్వార్ల వైభవము కొన్ని గంటల ఉపన్యాసాలతో గాని , కొన్ని వ్యాసాలతో గాని చెప్పడానికి సాధ్యమయ్యేది కాదు "యతో వాచో నివర్తంతే " అనునట్లు వాచామగోచరము. అయిననూ భక్తులందరూ ఆస్వాదించి ఆనందించాలనే ఆశయంతో శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధ రూపకల్పన జరిగింది.

ఆళ్వార్లు అనుగ్రహించిన ప్రబంధాలు నాలుగు అవి 1. తిరువిరుత్తమ్ , 2. తిరువాశిరియము, 3. పెరియ తిరువందాది, 4. తిరువాయి మొళ్రి. ఇందులో తిరువిరుత్తముపై ఉ॥వే॥ శ్రీమాన్ డా॥ యం. వరదరాజన్ గారు ఆంగ్లములోను తిరువాశిరియము పై ఉ॥ వే॥ శ్రీమాన్ తి.అ. కృష్ణమాచార్య స్వామి వారు తమిళములోను, పెరియ తిరువందాదిపై ఉ॥వే॥ శ్రీమాన్ కె.వెంకటాచార్య స్వామి వారు తెలుగులోను ప్రత్యేక వ్యాసాలను అనుగ్రహించారు.

తిరువాయి మొళ్రిలో నమ్మాళ్వార్లు మంగళాశాసనము చేసిన దివ్యదేశ దశకములు 25, వీనితో పాటు మరికొన్ని విషయాలు కూడా చేర్చడం జరిగింది. ఈ విధముగా విషయ విభజన చేసి వ్యాసములను అనుగ్రహింపవలసినదిగా పండితోత్తములను గత సంవత్సరమే ప్రార్థించితిమి. మేము ప్రార్థించగనే పరమ కృపతో మాకు వ్యాసములను కృపచేసినారు పండితులు. ఈ విధముగా సేకరించిన వ్యాసములను తిరువాయి మొళ్రిలోని దివ్యదేశ దశకముల క్రమాన్ని అనుసరించి శ్రీ పరాంకుశ శ్రీసూక్తి సుధకు రూపకల్పన చేసితిమి: ఉత్సవ సమయానికి టైటిల్ మాత్రమే తయారుకాగా శుద్ధప్రతి ఆవిష్కరింపబడినది. ఇపుడు సర్వాంగ సుందరముగా దీనిని భాగవతోత్తములకు సమర్పించుచున్నాము.

ఈ శ్రీసూక్తి సుధ ప్రచురణ విషయము విన్నంతనే తమ తండ్రిగారైన ఉ॥వే॥ శ్రీమాన్ వేదాల కోనమాచార్యస్వామివారి స్మారక నిధినుండి సహకారాన్ని అందించిన మహనీయులు శ్రీమాన్ డా॥ వేదాల రంగనాథ్ (యు.ఎస్.ఎ.) "ఇదే కాదు మీరు ఏ కార్యక్రమాన్ని తలపెట్టినా నాకు తెలియజేయండి నేనుకూడా ఆ కార్యక్రమములో అన్వయిస్తాను" అని తమ కైంకర్య నిష్ఠను చాటుకున్నారు వారు. ఈ ఉత్సవ సంరంభాన్ని , గ్రంధముద్రణను తెలియ జేయగానే ఆర్థిక సహాయాన్ని అందించారు తిరుమల తిరుపతి దేవస్థానము వారు. ఇక ముద్రణ విషయములో పరమ కృపతో శ్రమ తీసుకుని తమిళ వ్యాసాలను సరిచూసి అనుగ్రహించిన మహనీయులు ఉ॥వే॥ శ్రీమాన్ తి.అ. కృష్ణమాచార్యస్వామి వారు. ఈ విషయములో ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నవారు మన్మిత్రము ఉ॥వే॥ శ్రీమాన్ ఈ.ఎ. సింగరాచార్యస్వామి వారు.

ఆద్యంతము తమ పర్యవేక్షణలో దీనిని తీర్చిదిద్దిన వారు ఉ.వే. శ్రీమాన్ కె. ఎస్. రామానుజాచార్య స్వామి వారు ఇలా ఎందరో పెద్దలు ఆప్తులూ భక్తులు భాగవతులు అహమహమికతో ముందుకు వచ్చి ఈ కైంకర్యాన్ని అమితవైభవముగా జరిపించారు. ఇది ఒక మధురానుభూతి. అనేక జన్మార్జిత తపఃఫలము.

శ్రీ నగర్యాం మహా పుర్యాం తామ్రపర్ణ్యుత్తరీతటే ।
శ్రీ తింత్రిణీ మూలధామ్నే శఠకోపాయ మంగళమ్.॥

# కృతజ్ఞతలు

ఈ మహోత్సవానికి మంగళాశాసనములను కృపచేసిన

**శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ కలియన్ వానమామలై రామానుజ జీయర్ స్వామి వారి** సన్నిధిలోను,

**శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి చిన శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారి** సన్నిధిలోను.

**శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీ రంగ రామానుజ జీయర్ స్వామివారి** సన్నిధిలోను అనంతకోటి సాష్టాంగ ప్రణామములను సమర్పించుకొంటున్నాము.

ఈ కార్యక్రమాన్ని తమ ప్రత్యక్షపర్యవేక్షణలో మహా వైభవముగా జరిపించిన

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ త్రిదండి శ్రీరామచంద్ర రామానుజ జీయర్ స్వామి వారి పదకమలములందు సాష్టాంగ దండ ప్రణామములను సమర్పించుకుంటున్నాము.

ఈ కార్యక్రమానికి మంగళాశాసనములను కృపచేసిన ఉ॥ వే॥ శ్రీమాన్ తి. అ కృష్ణమాచార్య స్వామి వారికి

**ఉ॥ వే॥ శ్రీమాన్ పరాశర సుదర్శన భట్టర్ స్వామి వారికి**

**ఉ॥ వే॥ శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్య స్వామి వారికి**

మా ప్రణామములను సమర్పించుకొంటున్నాము.

ఈ ఉత్సవ కార్యక్రమాన్ని వైభవముగా నిర్వహింపచేసిన

**ఉ॥వే॥ శ్రీమాన్ కె.ఎస్. రామానుజాచార్య స్వామి వారికి**

**ఉ॥ వే॥ శ్రీమాన్ కె. వేంకటాచార్య స్వామి వారికి**

వినయాంజలి ఘటించుచున్నాము.

శ్రీ భగవత్ రామానుజ దర్శన కైంకర్య సమితి తరపున ఉపన్యాస వేదికను నిర్వహించిన

ఉ॥ వే॥ శ్రీమాన్ గోపాల కృష్ణమాచార్యస్వామి వారికి

తదీయారాధనకు వసతిని కల్పించిన

ఉ॥ వే॥ శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామివారికి మా నమోవాకములు.

ఉత్సవ సమయములో తమ సంపూర్ణ సహకారాన్ని అందించిన సన్నిధి అర్చక స్వాములకు పాలక వర్గానికి మా కృతజ్ఞతలు.

శ్రీ పరాంకుశ శ్రీ సూక్తి సుధకు అమూల్యములైన తమ వ్యాసములను ప్రసాదించిన పండితోత్తములందరకూ మేము కృతజ్ఞతాపూర్వక వినయాంజలి సమర్పించుకుంటున్నాము.

ఈ గ్రంథ ప్రకాశన విషయములో తమ అమూల్య సహకారమును అందించిన

**ఉ॥ వే॥ శ్రీమాన్ కె.కె. పరకాలన్ స్వామి వారికి** జనరల్‌మేనేజర్, మింట్, హైదరాబాదు.

**ఉ॥ వే॥ శ్రీమాన్ డా॥ ఎస్.బి. రఘునాథాచార్య స్వామి వారికి** రిటైర్డ్ వైస్ ఛాన్సలర్ (కేంద్రీయ విద్యాపీఠం)

**ఉ॥ వే॥ శ్రీమాన్ డా॥ యం. వరదరాజన్ స్వామి వారికి**

ప్రొఫెసర్ః శ్రీవేంకటేశ్వరా విశ్వవిద్యాలయం, తిరుపతి.

**శ్రీమాన్ డా॥ కె. సర్వోత్తమ రావు గారికి**

ప్రొఫెసర్ః శ్రీవేంకటేశ్వరా విశ్వవిద్యాలయం, తిరుపతి.

**ఉ॥ వే॥ శ్రీమాన్ డా. ఇ.ఎ సింగరాచార్య స్వామి వారికి** రీడర్. ఓరియంటల్ కళాశాల, తిరుపతి.

**ఉ॥వే॥ శ్రీమాన్ ఇ. కృష్ణమాచార్యులు** గారు, (అసిస్టెంట్ జనరల్ మేనేజర్, స్టీల్‌ప్లాంట్, విశాఖ)

మా కృతజ్ఞతాంజలి సమర్పించుకొంటున్నాము.

చివర చెప్పినా మొదట చెప్పదగినవారు అనుక్షణము నన్ను ప్రోత్సహించిన మా మాతృమూర్తి కనకవల్లి గారి పాదసన్నిధిలో ప్రణామములు సమర్పించుకొనుచున్నాను.

ఈ పరాంకుశ సూక్తి సుధను అందముగా డి.టి.పి. చేసి ఇచ్చిన శ్రీమాన్ చి॥ ఎస్. జగదీష్ గారికి శ్రీమాన్ చి॥ ఎస్. నాగేశ్వరరావు గారికి శ్రీమాన్ చి॥ పి. మురళీకృష్ణకు చి॥ సౌ॥ కె. విష్ణువందనకు , అందముగా ముద్రించిన చి॥ ఎస్. మధు, చి॥ రవి గార్లకు మా ఆశీస్సులు

ఈ ముద్రణ కార్యక్రమాన్ని పర్యవేక్షించి సకాలానికి అందించిన ఎస్. మోహన్ రెడ్డి గారికి మా కృతజ్ఞతలు.

అన్నింటా తానుగా పలు శ్రమలకోర్చి నిలచిన ఉ॥ వే॥ శ్రీమాన్ చి॥ వి. వేంకటాచార్యులు గారికి, చి॥ శేషకృష్ణ జితేంద్ర కు నా ఆశీస్సులు.

ఈ కార్యక్రమము వైభవముగా జరగడానికి సహకరించిన భక్తులందరకూ మా కృతజ్ఞతలను తెలియజేసుకొనుచున్నాము.

రామానుజాచార్యులు.



# ఆళ్వార్ల వైభవము

**యద్గోసహస్ర మపహంతి తమాంసి పుంసాం**
**నారాయణో వసతి యత్ర సశంఖ చక్రః**
**యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః**
**తస్మై నమో వకుళభూషణ భాస్కరాయ ॥**

శ్రియః పతియై, శ్రీవైకుంఠ నికేతనుడై; నిత్యముక్తులచే సేవింపబడువాడై అనాప్త సమస్త కాముడైన శ్రీమన్నారాయణుడు అనాది కర్మ వాసనాబద్ధులై, సంసార చక్రము నందు పడి తరింపలేని జీవులను చూచి జాలిపడి వారినుద్ధరించుటకై **"జ్ఞానం ప్రదీపమివ కారుణికో దదాతి"** అనునట్లు వేదరూప శాస్త్రమును ప్రసాదించినాడు. అంతేకాక తాను స్వయముగా అనేక అవతారములనెత్తి వీరిని ఉద్ధరింపదలచినాడు.

తాను శ్రీకృష్ణుడై అవతరించి తనకు బహిః ప్రాణమైన అర్జునునకు తత్త్వోపదేశము చేయుచు "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవాన్" అని చెప్పగా ఆ కృష్ణ భగవానుని మాటలను విశ్వసింపని అర్జునుడు "అపరం భవతో జన్మ పరంజన్మ వివస్వతః। కథమేతత్ విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి" అని తన సంశయాన్ని ప్రకటించాడు గదా! ఇట్టి చేతనులను వశపరచుకొనే మార్గమేది అని తలచిన శ్రీమన్నారాయణుడు మృగములను పట్టేవారు సాటి మృగాన్నే సాధనం చేసికొనే విధంగా అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరులనే భూమికి పంపి వారి ద్వారా చేతనోజ్జీవనం చేయాలని సంకల్పించాడు.

అలా భగవత్సంకల్పం వల్ల చేతనోజ్జీవనార్థం అవతరించిన మహాత్ములే ఆళ్వార్లు. వీరి అవతారములు పురాణాదులలో అనేక విధములుగా కీర్తింపబడ్డాయి. సర్వజనాదరణీయమైన శ్రీమద్భాగవతం ఏదకాశ స్కందంలో కలౌఖలు భవిష్యన్తి నారాయణ పరాయణాః। క్వచిత్ క్వచిత్ మహాభాగాః ద్రావిడేషు చ భూరిశః ॥ తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ కావేరీ చ మహాభాగా కృతమాలా వయశ్రిణీ ॥ అని ప్రస్తుతింపబడినది.

ఆ విధంగా తామ్రపర్ణీనదీ తీరంలో అవతరించిన వారే నమ్మాళ్వార్లు. వీరి అవతారమును గూర్చి వృద్ధపాద్మంలో కురుకా మహాత్మ్యంలో "తతః కలియుగస్యాదౌ

వైశాఖ్యాం విశ్వభావనః విష్ణుభక్తి ప్రతిష్ఠార్థం సేనేశో2వ తరిష్యతి" అని లక్ష్మీ సూత్రవతీ సంవాదంలో ముందుగానే తెలియచేయబడినది.

దక్షిణ భారతదేశంలో ఆళ్వార్లుగా ప్రసిద్ధులైనవారు పదిమంది. వారిలో భూతయోగి (పొయిగ్గై ఆళ్వార్), కాసారయోగి (పూదత్తాళ్వార్) మహాయోగి (పేయాళ్వార్) శ్రీభక్తిసారులు (తిరుమళిశై ఆళ్వార్) వీరు నలుగురు ద్వాపరయుగాంతము నాటివారు. వీరితర్వాత వారైన నమ్మాళ్వార్లు కలియుగము పుట్టిన (43) నలుబదిమూడవ దినమున తామ్రపర్ణీ నదీ తీరమునగల "తిరుక్కురుగూర్" (కురుకాపురి) అను క్షేత్రము నందవతరించిరి.

వీరి తండ్రిగారు "కారియార్" తాతగారు "పొఱ్ఱ్కారియార్" పొఱ్ఱ్కారియార్ తమకుమారులకు "తిరువణ్ పరిశారమ్" అనే క్షేత్రమునగల "తిరువాళ్మార్పర్" అనువారి కుమార్తె యగు "ఉడైయ నంగైయార్" (నాథనాయకి) అనువారినిచ్చి వివాహము చేసిరి.

కారియార్ తమ ధర్మపత్నియగు నాథనాయకితో కూడ "తిరుక్కురుంగుడి" క్షేత్రమునకుపోయి అచటగల స్వామిని సంతానార్థమై ప్రార్థించిరి. తిరుక్కురుంగుడి నంబియు వీరి ప్రార్థనను మన్నించి తానే వారికి కుమారులుగా అవతరింప దలచెను.

శ్రియః పతియగు శ్రీమన్నారాయణుడు కృతయుగమున బ్రాహ్మణవంశమున జమదగ్నికుమారుడు పరశురాముడుగా, త్రేతాయుగమున క్షత్రియ వంశమున దశరథుని కుమారుడు శ్రీరామచంద్రుడుగా, ద్వాపరయుగమున వైశ్యప్రాయుడైన (కృషి గోరక్షణ వాణిజ్యం వైశ్యంకర్మ స్వభావజం అనునట్లు గోరక్షణచేయు వసుదేవుని కుమారుడు) శ్రీకృష్ణుడుగా కలియుగమున చతుర్థ వర్ణమున పరమభాగవతోత్తముడైన శ్రీకాఱియార్ కుమారుడుగా అవతరింప దలచెను.

ఆ విధముగనే కారియార్ దర్మపత్ని నాథనాయకి కుమారులుగా కలియుగ ప్రారంభమైన నలుబది మూడవరోజగు ప్రమాధి నామ సం॥ర వైశాఖ శుద్ధ (వృషభశుద్ధ) చతుర్దశీ శుక్రవారము విశాఖా నక్షత్రయుక్త కర్కాటక లగ్నమందు అవతరించిరి.

వీరు అవతరించినది మొదలు స్తన్యపానము చేయక ఏడ్వక కనులు మూసికొని ధ్యాననిమగ్నులై యుండిరి. దీనికి కారణము తెలియని తల్లిదండ్రులు పన్నెండవ దినమున జాతకర్మాదులు చేసి ఆయూరిలో వేంచేసియున్న "పొలిందునిన్ఱపిరాన్" అనే పెరుమాళ్ళ సన్నిధికి తీసికొనిపోయిరి. అచట ఒక నిద్ర నెరుగని చింతచెట్టు గలదు (నిర్నిద్ర తింత్రిణి) అది ఆదిశేషుని అంశగా

అవతరించినదని చెప్పుదురు. ఆ శిశువు కనులు విప్పి పెరుమాళ్ళను సేవించి ఆ చింత చెట్టు తొఱ్ఱలో ప్రవేశించి యోగనిష్ఠలో కూర్చుండిరి. స్వామి సందర్శనము వలన వీరి స్వభావము మారుటచే వీరికి మాఱన్ అనిపేరు వచ్చినది. మన్మథుని వలె అందమైన వారు కనుక మాఱన్ అనియు చెప్పవచ్చును. అది మొదలు వీరు నిద్రాహారములు విడచి మౌనముద్రాధారులై పదునారు సంవత్సరములు ఆ చెట్టు తొఱ్ఱలోనే వేంచేసి అందరికి ఆశ్చర్యమును కల్గించిరి.

సూర్యోదయమునకు ముందు అరుణోదయమగును. అట్లే వకుళ భూషణ భాస్కరోదయమునకు ముందుగా మధురకవి అరుణోదయ మయింది. ఈ మధురకవులు పాండ్యదేశమందలి తిరుక్కోళూర్ అనే దివ్యదేశమున చైత్రపూర్ణిమ చిత్తా నక్షత్రమున కుముదగణేశుని అంశతో జన్మించారు. బాల్యమునందే సకల శాస్త్ర ప్రవీణులైన వీరు ఉత్తరదివ్యదేశయాత్ర చేయుచు అయోధ్యా నగరము చేరిరి. అచట ఒకనాటి రాత్రి దక్షిణ దిక్కున అప్రాకృత తేజః పుంజమును సేవించి ఇది ఏమి అని వితర్కించి ఆ దివ్యతేజస్సుననుసరించి బయలుదేరిరి. ఇట్లు కొన్ని దినములు రాత్రులందు నడచి ఆళ్వార్ తిరునగరి చేరిరి.

అచట షోడశకళా ప్రపూర్ణుడైన చంద్రునివలె దివ్యతేజస్సుతో ప్రకాశించుచు పద్మాసనోప విష్టులైన పరాంకుశులను సేవించిరి. కానీ వారికి బాహ్యా స్మృతి కలదో లేదో తెలియరాలేదు. వెంటనే అచటగల ఒకరాయిని పైకెత్తి క్రింద పడవేయగా ఆధ్వనికి ఆళ్వార్లు కనులు తెరచిచూచిరి. ఇకవారి జ్ఞానాధిక్యమును తెలిసికొనవలెను. "శత్తత్తిన్ వయిత్తిలే శిఱియదు పిరందాల్ ఎత్తైత్తిన్రు ఎజ్గేకిడక్కుమ్" (ప్రకృతిలో నుండు జీవుడు దేనిని అనుభవించి ఎక్కడ పడియుండును?) అని) ప్రశ్నింపగా ఆళ్వార్లు "అత్తైత్తిన్రు అజ్గేకిడక్కుమ్" (దానినేతిని అచటనే పడియుండును) అని సమాధానమొసంగిరి. అనగా అచిత్ పరిణామ రూపమైన శరీరములోగల జీవుడు సుఖ దుఃఖాదులను అనుభవించుచు ఆ శరీరమునందే యుండునని భావము.

ఆ మాటలు విని మధుర కవులు "వీరు మహానుభావులు, సర్వజ్ఞులు" అని తలచి వారికి శిష్యులై సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందు కైంకర్యముచేయుచు "తేవుమత్తఱియేన్" వేరుదైవమెరుగనని అనన్య పరులై వేంచేసియుండిరి.

నమ్మాళ్వార్లును యోగనిష్ఠులై ధారకపోషక భోగ్యాదులన్నియు శ్రీమన్నారాయణుడే అని తలంచి యుండిరి. వీరి భక్తి యోగనిష్ఠను చూచి సంతసించిన సర్వేశ్వరుడు "తాను అభిమానించి అర్చారూపమున వేంచేసియున్న దివ్య దేశములనుండి కదలివచ్చి

ఆళ్వార్లకు ప్రత్యక్షముకాగా ఆళ్వార్లు సంతుష్టాంతరంగులై ఆయామూర్తులకు మంగళాశాసనము చేసిరి.

ఈ విధముగా ఆళ్వార్ల భక్తి పరమభక్తిగా మారి భగవదనుభవము అతిశయింపగ ఆ భగవదనుభవము నాలుగు దివ్యప్రబంధములుగా అవతరించినది. అవి 1 తిరువిరుత్తము 2. తిరువాశటియము 3. పెరియ తిరువన్దాది 4. తిరువాయిమొழி

| | | | |
|---|---|---|---|
| **1.** | **తిరువిరుత్తము** | **100 పాశురములు** | **ఋుక్ వేదసారము** |
| **2.** | **తిరువాశరియము** | **7 పాశురములు** | **యజు:ర్వేదసారము** |
| **3.** | **పెరియతిరువన్దాది** | **87 పాశురములు** | **అథర్వవేదసారము** |
| **4.** | **తిరువాయిమొழி** | **1102 పాశురములు** | **సామవేద సారము** |

అజ్ఞానమును కలిగించు శఠవాయువును కోపించుటచే శఠకోపులనియు, పొగడపూల దండలను ధరించుటచే (వకుళమాలికలను) వకుళాభరణులనియు, కాటియార్ కుమారులగుటచే కాటిమాఱన్ అనియు; కురికావురి యందు అవతరించినవారగుటచే కురుకాధీశులనియు, పేరువచ్చినది. అంతేకాక సర్వేశ్వరుడు, పూర్వాచార్యులు అందరు ముక్త కంఠముతో వీరు (నమ్మైఆళ్వార్) మన ఆళ్వార్ అని స్తుతించుటచే నమ్మాళ్వార్ అనియు పేరువచ్చినది.

ఇంతటి వైభవముగల నమ్మాళ్వార్లు తమ అవతార కార్యము పూర్తియగుటచే ముప్పదియైదవ సంవత్సరముననే పరమపద మలంకరించిరి. పిమ్మట మధురకవులు ఆళ్వార్లవిషయమై 'కణ్ణినుణ్ శిఱుత్తామ్బు' అను చిన్ని ప్రబంధమును అనుగ్రహించి ఆళ్వార్ల వైభవమును ప్రకటించుటయే గాక ఆళ్వార్ తిరునగరిలో నమ్మాళ్వార్ల అర్చామూర్తిని వేంచేపుచేసి నిత్యోత్సవాదులన్నియు జరిపించుచుండిరి.

ఇట్లుండగా అసూయాగ్రస్తులైన ద్రావిడ పండితులు కొందఱు ఆళ్వార్ల దివ్యప్రబంధములను అలక్ష్యము చేయసాగిరి. అప్పుడాదేశమును పరిపాలించురాజు ఆ స్థానములో 'శజ్గప్పలకై' అను పరీక్షాఫలక మొకటి ఉండెడిది. రాజు ఆ ఫలకముపై ఆళ్వార్ల పాశురమునొకదానిని, ఆకాలమున ప్రసిద్ధ పండితుల పాశురములను ఉంచగా ఆ ఫలకము ఆళ్వార్ల పాశురమును మాత్రమే గ్రహించి మిగతావారి పాశురములను క్రిందకు పడద్రోసెను. అంత పండితులందరు ఆశ్చర్యచకితులై ఆళ్వార్లయందు భక్తిభావమును ప్రకటించిరి. తమిళభాషలో రామయాణమును రచించిన కంబమహాకవి ఆళ్వార్ల విషయమై "శఠగోపనన్దాది" అను ప్రబంధమును రచించి తన భక్తి భావమును చాటుకొనెను.

కాలక్రమమున వీరి ప్రబంధములన్నియు లుప్తములైపోయినవి. మూడువేల సంవత్సరముల తర్వాత "నాథమునులను" ఆచార్యులవతరించి ఆళ్వార్ తిరునగరిలో "కణ్ణినుణ్ శిరుత్తాంబు" ప్రబంధమును (లక్ష) పర్యాయములు జపింపగ ఆళ్వార్లు సాక్షాత్కరించి నాలాయిరదివ్య ప్రబంధములను అనుగ్రహించి అంతర్ధానము చెందిరి.

## ఆళ్వార్ల భక్తి

కర్మజ్ఞానానుగృహీతమై ఆళ్వార్ల భక్తి భగవత్ప్రాప్తికి సాధనమైన మహర్షుల భక్తి కంటె, సర్వేశ్వరుని యాచించి నిరంతర కైంకర్యమును పొందు ప్రపన్నుల శరణాగతికంటె వీరిభక్తి విలక్షణమైనది.

"బాల్యాత్ప్రభృతి సుస్నిగ్ధః" అనునట్లు అవతారమాదిగా భగవత్సంశ్లేషమునే కోరినవీరు దూతప్రేషణముచేయుట, "మడలూర్దుమే" అని మడ లెక్కబోవుట ఈ విషయమునే తెలియజేయుచున్నవి.

అట్టి వీరి భక్తిని సర్వేశ్వరుడు సంశ్లేష విశ్లేషముల ద్వారా వృద్ధి పొందించుచుండెను. సంశ్లేషమనగా ప్రత్యక్షసమానాకారమైన మానసానుభవము. విశ్లేషమనగా బాహ్యానుభవము లభింపక పోవుటచే కలిగిన మనోవైకల్యము.

విశ్లేష దశలో కలత చెందిన ఆళ్వార్లు నాయికావస్థను పొంది దూతలను పంపుట వీరి ప్రబంధములలో పలుతావుల గలదు. అనన్యార్హత్వ, అనన్య భోగ్యత్వ, అనన్య శరణత్వాదులచేత జీవునకు స్త్రీ సామ్యము శాస్త్రసిద్ధము. "సఏవ వాసుదేవో2 సాక్షాత్ పురుష ఉచ్యతే। స్త్రీప్రాయ మితర త్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్" అని ఈ విషయమునే స్పష్టము చేయుచున్నది.

ఈ నాయికావస్థలోనే తోళిమార్ అవస్థ (సఖీ భావము) తాయిమార్ అవస్థ (మాతృభావము) మకళ్ అవస్థ (దుహితృ, భావము) సిద్ధించును. ఇందులో సఖీభావము ద్వారా ప్రణవార్థమును, మాతృభావముద్వారా "నమః" పదార్థమును, దుహితృభావముచే నారాయణ పదముయొక్క అర్థమును ప్రకటితములగుచున్నవి.

ఇంతేగాక తిరువాయిమొళిలో ద్వయమంత్రార్థము, చరమశ్లోకార్థము, తత్త్వత్రయము, అర్థ పంచకము, విశదీకరింపబడినవి.

ఇంతటి వైభవముగల ఈ దివ్య ప్రబంధమును సదా చార్యులను ఆశ్రయించి వారి ద్వారా సేవించి ఆ సూక్తి రత్నములను బడయుదురుగాక అని ఆశించుచున్నాము.



## నమ్మాళ్వార్లు తిరువాయిమొழ్రిలో మంగళాశాసనము చేసిన దివ్యదేశములు

| సంఖ్య | దివ్యదేశము | తిరువాయిమొழ్రి దశకం | గమక పాశురము | ముఖ్యగుణములు |
|---|---|---|---|---|
| 1. | శ్రీరంగము (కోయిల్) | కఙ్గులుమ్ పకలుమ్ | ఇవళ్ తిఱత్తైన్ శిన్దిత్తాయ్ | వ్యూహసౌహార్దము |
| 2. | తిరువేంగడము | ఒழ్రివిల్ కాలమ్ | ఎఙ్గణ్ పాశం వైత్త | వాత్సల్యము |
| | | ఉలకముణ్డ పెరువాయా | అకలకిల్లేన్ నిత్తైయుం | శ్రియఃపతిత్వము |
| 3. | తిరుక్కురుకూర్ | ఒన్జున్దేవుమ్ | తిరుక్కురుకూరదనుళ్ | పరత్వసౌలభ్యములు |
| 4. | తిరుక్కుఱుఙ్గుడి | ఎఙ్గనేయో | నిత్తైన్దశోది వెళ్లంశూழ్న్ద | లావణ్యము |
| 5. | వానమామలై | నోత్తు నోమ్బు | ఆఱెనక్కునిన్పాదమే | ఔదార్యము |
| 6. | కుమ్భఘోణము | ఆరావముదు | ఆరావముదే | మాధుర్యము |
| 7. | తిరువల్లవాళ్ | మానేయ్‌నోక్కి | పెరుమానతుతొల్లరుళే | కారుణ్యము |
| 8. | తిరువణ్ వణ్డూర్ | వైకల్ పూఙ్గ్ழ్రి వాయ్ | ఏఱుశేవగ నాఱ్కు | స్థైర్యము |
| 9. | తిరువిణ్ణకర్ | నల్ కురవుమ్ | పల్‌పకై యుంపరన్ద | విరుద్ధవిభూతియోగము |
| 10. | తిరుత్తులై విల్లిమంగలమ్ | తువళిన్మామణి మాడమ్ | తేవపిరా నైయే తన్దైతాయ్ | విఘటనాభాందవము |
| 11. | తొలైవిల్లిమంగలమ్ | తువళిన్మామణి మాడమ్ | ఇరున్దిరున్దరవిన్దలోచన వెన్జెన్జే | విఘటనాభాంధవము |
| 12. | తిరుక్కోళూర్ | ఉణ్ణుంశోఱుమ్ | వైత్తమానితి | ఆపత్సఖత్వము |
| 13. | తెన్ తిరుప్పేర్ | వెళ్ళిచ్చురిశఙ్గొడు | శెఙ్గనివాయ్ | సౌందర్యము |
| 14. | తిరువాఱన్విళై | ఇన్బన్బయక్క | ఇన్బన్బయక్క వినితుడన్ వీన్ నిరున్దు | ఆనందవృద్ధి |
| 15. | తిరుక్కుళన్దై | నఙ్గళ్ వరివళై | పల్ వళైయార్ మున్బరిశళిన్దేన్ | దివ్యాద్భుత చేష్టితములు |

| | | | | |
|---|---|---|---|---|
| 16. | తిరువణ్బరిశారమ్ | అఙ్ఞుమిఙ్ఞుమ్ | అఙ్గియుమ్ శంగుంశుమప్పార్ తామ్ | సౌకుమార్యము |
| 17. | తిరుచ్చఙ్గున్నూర్ | వార్కడావరువి | కణ్ణైత్తకర్త్తశీర్కోళ్ | శౌర్యవీర్యాదులు |
| 18. | తిరుక్కడిత్తానమ్ | ఎల్లియుఙ్గాలైయుం | తిరుక్కడిత్తాననకరమ్తనతాయప్పతీ | కృతజ్ఞతాగంధము |
| 19. | తిరుప్పులియూర్ | కరుమాణిక్కమలై | మణిత్తడన్దామరైక్కాడుకళ్పోల్ తిరుమార్వువాయ్ | ఉత్తమనాయక లక్షణములు |
| 20. | తిరుప్పుళిఙ్గుడి | పణ్డైనాళాలే | పుళిఙ్గుడ్కి కిడన్దు | త్వర |
| 21. | వరకుణమజ | పణ్డైనాళాలే | పుళిఙ్గుడ్కి కిడన్దు | త్వర |
| 22. | శ్రీ వైకుంఠము | పణ్డైనాళాలే | పుళిఙ్గుడ్కి కిడన్దు | త్వర |
| 23. | తిరుక్కాట్కరై | ఉరుకుమాల్ | ఆరుయిర్ పట్ట తెనంతుయిర్ పట్టతు | శీలము |
| 24. | తిరుమూర్తిక్కళమ్ | ఎఙ్గానల్ | తమరోడఙ్గరై వార్ క్కు | మార్దవము |
| 25. | తిరునావాయ్ | ఆఱుక్కుంవినై | ఆవానడియానివనెన్తరుళాయ్ | ఆనృశంస్యము |
| 26. | తిరుక్కణ్ణపురమ్ | మాలైనణ్ణి | మరణమానాల్ వైకున్దం కొడుక్కుంపిరాన్ | మోక్షప్రదత్వము |
| 27. | తిరుమోకూర్ | తాళతామరై | మరతకమణిత్తడమ్ | శైత్యము |
| 28. | తిరువనందపురమ్ | కెడుమిడరాయ్ | పాతఙ్గళ్ నడమినోనమర్ కళుళ్ళీర్ | సామ్యము |
| 29. | తిరువాట్టాఱు | అరుళ్పెఱువార్ | నమతువితివకైయే | ఆశ్రితపారతంత్ర్యము |
| 30. | తిరుమాలిరుంశోలై | శెఞ్జొఱ్కవికాళ్ | నెఞ్జమయిరుముళ్ కలన్దు | ఆశ్రితవ్యామోహము |
| 31. | తిరుప్పేనకర్ | తిరుమాలిరుంశోలైమలై | తిరుమాళ్ వన్దెన్నెఞ్జనిఱైయపెకున్దాన్, | స్వామిత్వాదులు |

# తిరునక్షత్ర తనియన్

శ్లో॥ వృషభేతు విశాఖాయాం కురికాపురి కారిజమ్
పాండ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే ॥
శ్రీ విజ్ఞానదినోత్తరే హని కలౌ వర్షే ప్రమాద్యాహ్వయే
మా సేమాధవనామ్ని భార్గవదినే చర్క్షే విశాఖాభిదే ।
లగ్నే శుద్ధచతుర్దశీతిథియుతే శ్రీ మత్కురీరేపి చ
క్షిత్యాం ప్రాదురభూ త్పరాంకుశముని ర్భాగ్యోదయా న్మాదృశాన్ ॥

## నిత్యతనియన్

శ్లో॥ మాతాపితా యువతయ స్తనయా విభూతి
స్సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్యనః కులపతే ర్వకుళాభిరామం
శ్రీ మత్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

పా॥ ఏరార్ వైగాశి విశాగత్తి నేత్తత్త త్తై
ప్పారోరఱియ ప్పగర్ గిన్ఱేన్ - శీరారుమ్
వేదం తమిళ్ శైయ్ద మెయ్యాన్ ఎళిల్‌కురగై
నాదన్ అవదరిత్త నాళ్.

పా॥ ఉణ్డో వై గాశి విశాగత్తుక్కు ఒప్పొరునాళ్?
ఉణ్డో శడగోపర్‌క్కు ఒప్పొరువర్ - ఉణ్డో
తిరువాయిమొళిక్కొప్పు? తెన్ కురుగైక్కు ఉణ్డో
ఒరుపార్ దన్ని లొక్కుమూర్?

## వాళితిరునామ్గళ్

తిరుక్కురుకై ప్పెరుమాళ్ తన్ తిరుత్తాళ్‌కళ్ వాళియే,
తిరువాన తిరుముకత్తు చ్చెవియెన్ఱుమ్ వాళియే,
ఇరుక్కుమొళి యెన్నెఞ్జిల్ తేక్కినాన్ వాళియే,
ఎన్దై యెతిరాశర్ క్కిఱైయవనార్ వాళియే,
కరుక్కుయిల్ పుకావణ్ణమ్ కాత్తరుళ్వోన్ వాళియే,
కాశినియిల్ ఆరియనాయ్ క్కాట్టినాన్ వాళియే
వరుత్త మఱవెనన్ఱై వాళ విత్తాన్ వాళియే
మతురకవి తమ్బిరాన్ వాళి వాళి వాళి యే,

ఆన తిరువిరుత్తం నూఱు మఱుళినాన్ వాళ్ళియే
ఆశిరియ మేఱ్ఱు పాట్టు అళిత్త పిరాన్ వాళ్ళియే
ఈ నమఱ వన్దాది యెణ్బత్తేళ్ళీన్దాన్ వాళ్ళియే
ఇలగు తిరువాయిమొళ్ళి యాయిరత్తారు నూత్తిరణ్డురైత్తాన్ వాళ్ళి
వానణియుమ్ మామాడక్కురుగై మన్నన్ వాళ్ళియే
వై గాశి విశాగత్తిల్ వన్దుదిత్తాన్ వాళ్ళియే
శేనై యర్కో నవతారం శెయ్దవళ్ళల్ వాళ్ళియే
తిరుక్కురుగై చ్చడగోపర్ తిరుపడిగళ్ వాళ్ళియే

మేదినియిల్ వై యాశి విశాగత్తోన్ వాళ్ళియే
వేదత్తై శెన్దమిళ్ళా విరిత్తురైత్తాన్ వాళ్ళియే
ఆదిగురువాయ్ ప్పువియిల్ అవదరిత్తాన్ వాళ్ళియే
అనవరతమ్ శేనై యర్కోన్ అడితొళ్ళువోన్ వాళ్ళియే
నాదనుక్కు నాలాయిరం ఉరైత్తాన్ వాళ్ళియే
నన్ మదురకవి వణఙ్గుమ్ నావీరన్ వాళ్ళియే
మాదవన్ పొఱ్పాదుకైయాయ్ వళర్న్దరుళ్వోన్ వాళ్ళియే
మగిమాఱన్ శడగోపన్ వై యగత్తిల్ వాళ్ళియే

**శ్రీ నగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరీతటే ।**
**శ్రీతింత్రిణీ మూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥**





శ్రీరస్తు

శ్రీమతే శఠకోపాయనమః

# శ్రీ శఠకోపబంధః




వర వారణరక్షార రతశ్రీపాదుకాయత

శరణ్య రక్షరమ్యార రయేశఠరిపోశ్రయే

కె.ఎస్. రామానుజాచార్య :

ఆళ్వార్గళ్ వాళ్గి అరుళి చ్చెయల్ వాళ్గి
తాళ్వాదుమిల్ కురవర్ దామ్ వాళ్గి , ఏళ్గ్ పారు
ముయ్యవర్గళురైత్త వైగళ్ దామ్ వాళ్గి ,
శెయ్యమత్రై దన్నుడనే శేర్న్దు.
సకల చేతనులను ఉద్ధరించుటకు అవతరించిన ఆళ్వారులును వారు అనుగ్రహించిన దివ్య ప్రబంధములును పూర్వాచార్యులును వారు ప్రసాదించిన వ్యాఖ్యానములును సకల వేదములతో కూడా అభివృద్ధి చెందుగాక.

శ్రీరస్తు
శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# తిరుమాలిరుం శోలై మలై

ఉభయ వేదాంత వాచస్పతి ఉ॥ వే॥ శ్రీమాన్.కె.ఎస్.రామానుజాచార్యస్వామి
నెల్లూరు

ప్రపన్న జన కూటస్థులైన శ్రీశఠకోప మునీన్ద్రులు అనుగ్రహించిన "తిరువాయ్మొழி' ' అను సామవేద సారమైన దివ్య ప్రబన్ధమునందు ముప్పది రెండు దివ్య క్షేత్రములలో వేంచేసియుండు ఎంబెరుమాన్లను కీర్తించినారు. వాటిలో మొట్టమొదటగా కీర్తింపబడిన దివ్యక్షేత్రము "తిరుమాలిరుంశోలై మలై" అనునది. ఈ క్షేత్రము పాండ్యమండలము నందలి "దక్షిణ మధురై' ' అను నగరమునకు సమీపమున గలదు. దీనికి 'శోలైమలై' వనాద్రి' ఇత్యాది నామాన్తరములు గలవు. నేడు భారతదేశము నందు సుప్రసిద్ధ శ్రీవైష్ణవ క్షేత్రములలో 'తిరుమల' (తిరుపతి) క్షేత్రము ప్రథమ పరిగణనీయమైయున్నది గదా. ఈ దివ్యక్షేత్రమును 'వడక్కు త్తిరుమలై' (ఉత్తర తిరుమల) అనియు, తిరుమాలిరుంశోలై మలైను "తెఱ్కుత్తిరుమలై (దక్షిణ తిరుమల) అనియు సంప్రదాయజ్ఞులు వ్యవహరింతురు. ఈ రెండు పర్వతములును భూదేవికి వక్షోజ ప్రాయములని పెద్దలు ఉత్ప్రేక్షింతురు- సర్వేశ్వరునకు ప్రియమైనవి గదా.

ఈ క్షేత్రమును 1. పూదత్తాళ్వార్ 2. పేయాళ్వార్ 3. నమ్మాళ్వార్ 4. పెరియాళ్వార్ 5. ఆణ్డాళ్ 6. తిరుమంగైయాళ్వారులు కీర్తించినారు. నాలాయిర దివ్య ప్రబన్ధములో సుమారు 117 పాశురములు ఈ స్వామిని కీర్తించునవిగా నున్నవి. ఈ క్షేత్రము నందు "అழగర్' లేక 'సుందర బాహుప్పెరుమాళ్ " అను దివ్యనామముగల స్వామి వేంచేసియున్నారు. ఆణ్డాళ్ "స్వామీ నేను నీకు నూరు గంగాళముల వెన్నను, నూరు గంగాళముల పాయసాన్నమును సమర్పింతును - ఆరగింపవా" అంటూ ప్రార్థించారు. ఆణ్డాళ్ తల్లియొక్క ఈ కోర్కెను భగవద్రామానుజులు నెరవేర్చినారుట. ఈ విషయం గోదాదేవికి విన్నవించుటకై శ్రీమద్రామానుజులు శ్రీవిల్లిపుత్తూరు వేంచేయగా వారిని దూరమునుండి కటాక్షించి 'నం' కోయిలణ్ణన్ వన్దార్" అంటూ గోదాదేవి అర్చాసమాధిని మీరి గర్భ గృహమునుండి ముఖమండపమునకు వేంచేసినారుట- ఇప్పటికిని ఆండాళ్ (ఉత్సవమూర్తి) ముఖ మండపమున వేంచేసియున్నారు.

శ్రీమద్రామానుజ మునీన్ద్రులు 'తిరునారాయణపురము"న వేంచేసియున్న కాలమున వారికి అత్యన్త ప్రీతిపాత్రులైన 'కూరత్తాళ్వాన్' శ్రీసున్దరబాహు స్వామిని గూర్చి "శ్రీసున్దరబాహుస్తవః అను సోత్రమును అనుగ్రహించినారు. ఇందు నూట ముప్పదిరెండు శ్లోకములు గలవు. ఈ స్తోత్రము చివర వీరు

శ్లో॥ విజ్ఞాపనాం వనగిరీశ్వర సత్యరూపాం
అంగీకురుష్వ కరుణార్ణవ మామకీనామ్ ।
శ్రీరంగధామని యథా పుర మేవసోఽహం
రామనుజార్య వశగః పరివర్తి షీయ ॥

వనాద్రినాథా, నా ప్రార్థనను ఆలకింపుము. దయాసముద్రా, శ్రీరంగమునందు నేను పూర్వమువలె మా ఆచార్యులైన శ్రీరామానుజులతో కలసి వారి ఆజ్ఞానువర్తినై ఆనన్దముతో కాలము గడుపునట్లు అనుగ్రహింపుము- ఇట్లే.

"తద్భోగ్యా మనిశం కురుష్వ భగవన్ శ్రీరంగధామశ్రియమ్"

"దయానిధీ సత్య సంకల్పా! వనాద్రినాథా! శ్రీరంగక్షేత్రమున దుర్జనాక్రమణమును తొలగించి భక్తులు గావించిన అపచారములున్నచో వానిని క్షమించి శ్రీరంగవాస సంపదను శ్రీవైష్ణవులకు అనుగ్రహింపుము' అని ప్రార్థించినారు. వీరిట్లు ప్రార్థించిన కొలది కాలమునకే భగవద్రామానుజ మునీంద్రులు క్రిమికంఠుని బాధ తొలుగుటతో శ్రీరంగమునకు సపరివారముగా వేంచేసి శ్రీకూ్రరేశమిశ్రులను అనుగ్రహించినారుట- శ్రీశ్రీశ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజజీయర్ స్వామివారు (పెద్దజీయర్ స్వామివారు) కూడా నూరు గంగాళముల పాయసమును ఈ స్వామికి సమర్పించిన విషయం అందరు ఎఱింగినదే గదా.

ఈ క్షేత్రమున నొకప్పుడొక మాంత్రికుడు తన అంజన ప్రభావముచే ఎవ్వరికిని కనపడక ఈ సన్నిధిలో ప్రవేశించి స్వామిదివ్య కళలను ఆకర్షించుటను గమనించిన అర్చకస్వాములు శ్రీకూరేశమిశ్రులకు నివేదించినారుట. శ్రీకూరేశమిశ్రులు తమ శిష్యులైన శ్రీకూరనారయణముని అను మాంత్రికోత్తములను ఆ దుష్ట మాంత్రికుని నిగ్రహింప నియమించినారుట. శ్రీసుదర్శనమంత్రోపాసకులైన శ్రీకూరనారాయణముని ఆ మాంత్రికుని నిగ్రహించి శ్రీసుదర్శన భగవానుని విషయముగా "సుదర్శన శతక" మను స్తోత్రమును కృపజేసినారుట.

ఈ పర్వతరాజమున రుద్ర శిరస్పర్శలేని "శిలమ్బాఱు" లేక "నూపురగంగ" అను దివ్యనది ప్రవహించుచున్నది. చతుర్ముఖ బ్రహ్మ త్రివిక్రముని శ్రీపాదమును శోధించునపుడు, దాని అందె నుండి చిందిన బిన్దువులతో ఈ నది ఏర్పడినదట. ఇది అర్థితఫలప్రదమట. దేవతాన్తర స్పర్శ నెరుగని ఈ పర్వతమున కిన్నరీమణులు శ్రీనమ్మాళ్వారుల శ్రీసూక్తులను గానము చేయుచుండగా అచటి శిలలు సైతము ద్రవించుచుండునట. అచటి సెలయేళ్ళు దీని వలన నేర్పడినవే కాబోలును.

శ్రీనమ్మాళ్వారులు "ఎమ్మావీడ" అనే దశకమునందు - తమకు పరమపదము సైతము అవసరములేదని సర్వేశ్వరుని శ్రీపాదములే చాలును అని ప్రాప్య స్వరూపమును నిర్ణయించినారు.

"కిళరొళి ఇళమై" (2-10) అను ఈ దశకమునందు అట్టి ప్రాప్యమును సేవించుటకు 'తిరుమాలిరుం శోలైమలై' అను పర్వతరాజమును ఆశ్రయించుచున్నారు. అని శ్రీ ఆళవన్దార్ అనుగ్రహించినారుట. ఎంబెరుమానార్లవారు దీనికి సంగతిని మరియొక విధముగా సాయించినారుట. ప్రాప్య నిష్కర్ష గావించిన ఆళ్వార్లు ఆ ప్రాప్యమును పొందుటకు త్వరపడుచు "కాలక్కృ(గ్రి)వు శెయ్యేల్" ఆలస్యము చేయకు అనియు "ఎన్నై ఉన్ పొన్నడి చ్చేర్త్తాల్లై"- నన్ను వెంటనే నీ శ్రీపాదముల జేర్చుము అనియు ప్రార్థింపగా - సర్వేశ్వరుడు ఈ సంసార మండలమున ఈ శరీరముతోనే వీరు తనను సేవింప దలంచుచున్నారని భావించి, ఈ ఆళ్వార్ల సేవలనుగైకొనుటకు ఈ భూమండలమున ఏకాన్త ప్రదేశమును వెదకివెదకి చివరికి "తిరుమాలిరుం శోలైమలై" - ఇందుకు అనుకూలమైనదని గుర్తించి ఇచట వేంచేసియున్నట్లు ఆళ్వార్లకు సేవసాయింపగా ఆళ్వార్లు పరమానన్ద భరితులై- సర్వేశ్వరునితో బాటు అతడు వేంచేసియుండు దివ్యక్షేత్రము సైతము ప్రాప్యమే గదా అని భావించి ఈ దశకమును సాయించుచున్నారు. అని

"తిరుమాలిరుంశోలై" అను పర్వతమునగల తోటలలోని వృక్ష లతా గుల్మాదులు దినదిన ప్రవర్థమానములగుచు నిత్యనూతనములై మైమరపించుచుండును. చన్ద్రుడు ఆ పర్వత శిఖరముల మీదికి మెల్లమెల్లగ నెగబ్రాగుచు సానపట్టినట్లుండును. కూరేశమిశ్రులును శ్రీసున్దరబాహుస్తవమున "శశధర రింఖణాఢ్య శిఖమ్" అని ఈ విధముగనే వర్ణించియున్నారు. వర్షాకాలపు మేఘములు ఆ పర్వతమును మెల్లమెల్లగా గర్భిణులు ఎక్కురీతిని అధిరోహించుచుండును. శ్రీవాల్మీకి మహర్షి శ్రీమద్రామాయణమునందు

శ్లో॥ **సముద్వహన్త స్సలిలాతిభారం**
**బలాకినో వారిధరా నదన్తః ।**
**మహత్సు శృంగేషు మహీధరాణాం**
**విశ్రమ్య విశ్రమ్య పునః ప్రయాన్తి ॥** అని ఇట్లే వర్ణించినారు. ఈ పర్వతమున గల సరస్సులు ఆళ్వార్ల మనస్సువలె నిర్మలములు దర్శనీయములునై తీర్థసమృద్ధి గలిగియుండును. తమ తమ పిల్లలతో కూడి లేళ్ళు మందలు మందలుగా ఇందు సంచరించుచుండును. నిత్యసూరులును ఈ లోకమునకు వచ్చి ఈ పర్వతమునకు ప్రదక్షిణము చేయుచుందురు. ఏనుగు గున్నలు జంటలు జంటలుగా ఇచట సంచరించుచుండును. ఈ పర్వతమున వేంచేసియందు స్వామి "తెన్నానై" దక్షిణపు గజరాజము గదా. ఒక ఏనుగు ఉన్నచోటికి పది ఏనుగులు వచ్చుట సహజమే. ఇట్లే ఇచట నెమళ్ళు తమ ప్రియురాండ్రతో కలసి విహరించు చుండును.

ఇట్టి ఈ పర్వతముయొక్క శిఖరభాగమున సుందరబాహుస్వామి సర్వాంగ సున్దరుడై

వెలుగొందుచున్నాడు. అతడు నీలమేఘ శ్యామలుడు, శంఖచక్రములను ధరించియున్నాడు. తన చిటికెన వ్రేలితో గోవర్ధన పర్వతము నెత్తి ఆశ్రితులను రక్షించిన ఆ వెన్న దొంగయే ప్రళయ సముద్రమున మునిగియున్న భూమండలమును వరాహమూర్తియై ఉద్ధరించినాడు. ఆతని దివ్యచేష్టితములు అత్యాశ్చర్యకరములైనవి. అతడు శైశవముననే తనకు విషస్తన్యము నీయవచ్చిన పూతనను సంహరించినాడు. చతుర్ముఖునికి వేదములను, అర్జునునకు గీతను ఉపదేశించినవాడును ఆతడే. అట్టి ఆ స్వామి వేంచేసియుండు తిరుమాలిరుంశోలై అను ఆ పర్వతమును దర్శించుట మనకు కర్తవ్యము.

చేతనులారా, మీ యౌవనమును వృధాచేసికొనకుడు. యువతుల మాయలో పడకుడు. ద్రవ్యార్జనకు సులభమార్గమని తలంచి దొంగతనము జూదము మొదలైన చెడుపనులను చేయకుడు. నిరుపయోగములగు కార్యములను గావింపకుడు. మీ కర్మలు నశించి మీరు ఉజ్జీవింపవలయునన్నచో తిరుమాలిరుంశోలైకు బయలుదేరుడు. అదియే మన కర్తవ్యము. అదియే మనకు శ్రేయస్కరము- ఆ పర్వతమును దర్శింప వలయునని తలంచినను, మీరు ఉన్న ప్రదేశము నుండియే ఆ పర్వతమునకు నమస్కరించినను మీ అభీష్టములు నెఱవేరును- అని "కిళరొళి ఇళమై" అను ఈ దశకమునందు నమ్మాళ్వారులు ప్రవచించి భక్తి శ్రద్ధలతో ఈ దశకమును అనుసన్ధించువారు శరీరావసానమున పరమ దయాళువగు ఆ స్వామి శ్రీపాదములను చేరగలరని ఫలశ్రుతిని తెలిపినారు.

ఈ దశకమునందలి కరుమ వన్ పాశం కళ్రిత్తుయ్యవే" (2-10.4) అను పాశుర ఖండమునకు మనము కర్మబన్ధములను తొలగించుకొని ఉజ్జీవించుటకు తిరుమాలిరుంశోలై పర్వతము నాశ్రయించుట తప్ప మరియొక మార్గము లేదను అర్థమును తెలిపినారుట ఆళ్వాన్- భగవద్రామానుజులు "మన కర్మబన్ధములను తొలగించుకొనుటకును, మనము ఉజ్జీవించుటకును, ఈ పర్వతము నాశ్రయింప వలసినదే అను అర్థమును అనుగ్రహించినారుట- ఇట్లే "వలం శెయ్‌దు నాళుం" (2-10-8) అను పాశుర ఖండమును వివరించుచు నంజీయర్ అను మహనీయులు - "భక్తులారా, ఒకనాడు పిళ్లై తిరునఱైయూరఱైయర్ అనువారును శ్రీపరాశర భట్టారకులును సన్నిధికి ప్రదక్షిణముగావించు సమయమున నేను వారి వెనుకనే నడచుచు వారిని సేవించుచుంటిని. ఆ సమయమున ఎందరో సేవార్థులు తొందర తొందరగా ప్రదక్షిణము గావించుచుండిరి. కాని మా ఆచార్యులైన పరాశరభట్టరువారు మెల్లమెల్లగా అడుగులిడుచు ఆ ప్రాకారములను గోపురములను వాటిపైని శిల్పములను తన్మయతతో సేవించుచు ప్రదక్షిణము గావించుచుండిరి. ఇట్లు గదా సన్నిధి ప్రదక్షిణము గావింపవలయును- అని ప్రస్తుతించినారుట.

ఈ రీతిగా తిరుమాలిరుంశోలైమలై వైశిష్ట్యమును వర్ణించిన నమ్మాళ్వారులు "ముడిచ్చోదియాయ్" అను (3-1) దశకము నందు సున్దర బాహు స్వామియొక్క సౌందర్యాతి

శయమును వర్ణించుచున్నారు. స్వామీ, నీ ముఖమండల కాన్తిపైకి ప్రసరించుచు కిరీటముగా విస్తరించినదా? లేక నీ కిరీట కాన్తి ముఖకాన్తిగా పరిణమించినదా? నీ చరణయుగళ శోభ నీవు నిలుచున్న తామర పుష్పముగా ప్రసరించినదా? లేక ఆ తామరస కాన్తి నీ చరణశోభగా పరిఢ విల్లినదా? ఇట్లే నీ కటి శోభ పీతాంబరముగను ఆభరణములుగను రూపొందినదా? శ్రియఃపతీ నా సంశయమును తీర్పవూ, పద్మములు, నీ నేత్రములకును నీ శ్రీపాదములకును శ్రీహస్తము ములకును సాటి రాజాలవు. ఇట్లే పరిశుద్ధమైన మేలి బంగారము సైతము నీ దేహకాన్తికి సాటికాజాలదు. పరంజ్యోతీ! నీకు సాటి రాగలవారు ఎవ్వరును లేరు. నిన్ను ఏమని వర్ణింతును? త్రికాలములయందును నీవు ఈ ప్రపంచమును రక్షించుచుందువు. తులసీమాలా ధారణమునీకు ప్రియమైనది. లక్ష్మీదేవి నీ వక్షస్థలమున నిత్యావాసము గావించు చున్నది. నాభీకమలమున చతుర్ముఖ బ్రహ్మను సృజించి జగత్సృష్టి గావింపుమని ఆదేశించితివి. అతనిచే సృజింపబడి జ్ఞానాధికులైన రుద్రాది దేవతలు నిన్ను సదా కీర్తించుచుందురు. గజేంద్రుని రక్షించిన చక్రధారీ, గరుడవాహనా, నీవు వేదవేద్యుడవు- నీచే సృజింపబడిన బ్రహ్మరుద్రేంద్రాదులు నిన్ను స్తుతించుటలో ఆశ్చర్యమేమున్నది- అని ఆ స్వామిని ప్రస్తుతించి ఈ దశకమును అనుసన్ధించు వారికి పునర్జన్మ యుండదని ఫలశ్రుతిని తెలిపినారు.

ఇట్లే "శెంజొఱ్ఱ్కవిగాళ్ (10.7) అనుదశకమునందును- తిరుమాలిరుం శోలైలో వేంచేసియుండు స్వామి మహామాయావి. ఆతడు ఎవ్వరికి తెలియని విధముగా నా హృదయమున ప్రవేశించి నాకు తనకు భేదములేని దశను కల్పించి తనను తానే స్తుతించుకొన్నాడు. అతడు నాకు పరమభోగ్యుడు. అతనికి దాసుడనైన నేను అతనిని ఇక విశ్లేషింప గలనా? అతడు దక్షిణ దిక్కునకు అలంకారమైయున్న తిరుమాలిరుంశోలై పర్వతమును నన్ను విడువజాలడు. అతడు నాకు స్వామి. బ్రహ్మరుద్రాదులును దర్శింపజాలని తనను నాకు దర్శింపజేసి నన్ను అనుగ్రహించినాడు. అతడు వేంచేసియుండు ఆ పర్వత రాజము అతిమనోహరమైనది. బ్రహ్మ రుద్రేంద్రాదులును మహర్షులును ఆ పర్వతమును నుండు స్వామిని వేనోళ్ళ స్తుతించుచుందురు. అది మన పాపములను తొలగించును. తిరుమలై, తిరుమాలిరుం శోలైమలై, క్షీరాబ్ధి, శ్రీవైకుంఠములయందు వలె నా శరీరమునను, నా సర్వావయముల యందును, త్రికరణములయందును పరమాదరముతో వేంచేసియున్నాడు. ఓ మనస్సా, నీవు ఆ స్వామిని విడువకుము. అతని అనుగ్రహముతో చతుర్వింశతి తత్త్వాత్మకమైన ఈ ప్రకృతి బన్ధమును తొలగించుకొనుము అనుచు తిరుమాలిరుంశోలై పర్వతమును, అందు వేంచేసియుండు సుందర బాహుస్వామిని నోరార కీర్తించినారు- ఆ తరువాతి దశక ప్రారంభమున- "తిరుమాలిరుంశోలైమలై' '- అని అన్నాను. అంతే శ్రియఃపతి నా మనస్సున పరిపూర్ణముగ ప్రవేశించి కటాక్షించినాడు, అనుచు ఆతని నిర్హేతుక కృపను కొనియాడినారు.

ఈ విధముగా శ్రీనమ్మాళ్వార్లు సుందర బాహుస్వామిని, ఆ స్వామి వేంచేసియుండు పర్వతరాజమును, ఆ స్వామిని ఆ పర్వత రాజమును సేవించినందువలన కలుగు పరమ ప్రయోజనమును, మనము ఉజ్జీవించుటకై పరమ కృపతో మూడు దశకములలో ఉపదేశించినారు- ప్రపన్నులు తప్పక తిరుమాలిరుం శోలైను సేవించ ప్రార్థన.

ఈ దశకములను గూర్చి మణవాళమామునులు ఇట్లు అభివర్ణించి యున్నారు.

కిళరొళి శేర్కీழ்రై రైత్త పేఱు కిడైక్క
వళరొళిమాల్ శోలైమలైక్కే - తళర్వఱవే
నెంజై వైత్తు చ్చేరుమెనుం నీడుపుగழ் మాఱన్‌తాళ్
మున్ శెలుత్తువోం ఎమ్ముడి.

పురుషార్థ సిద్ధికై సర్వేశ్వరుడు వేంచేసియున్న తిరుమాలిరుంశోలై పర్వతమును నా హృదయమునందు ఉంచి ఆశ్రయింపుడు అని అనుగ్రహించిన నమ్మాళ్వార్ల శ్రీపాదకమలములను మా శిరస్సున ధరింతుము.

ముడియార్ తిరుమలైయిల్ మూణ్డు నిన్రమాఱన్
అడివారన్దన్నిల్ అழగర్ - వడివழగై
పఱ్ఱి ముడియుం అడియుం పడికలనుమ్
ముఱ్ఱుం అనుబవిత్తాన్ మున్.

తిరుమలయందు వ్యామోహముగల నమ్మాళ్వార్లు సుందర బాహుస్వామియొక్క రూప సౌందర్యాదులను కిరీట నూపురాది సమస్త ఆభరణములను అనుభవించిరి.

శెంజొల్పరన్ తనదు శీరారుం మేనిదనిల్
వంజిత్తు చ్చెయ్‌గిన్ర వాంఛైదనిన్ - వింజుదలై
క్కణ్డవనై క్కాల్కట్టి క్కైవిడువిత్తుక్కొణ్డ
తిణ్తిరల్ మాఱన్ నం తిరు.

తిరువాయి మొழிచే ప్రతిపాదింపబడు సర్వేశ్వరుడు పరమ విలక్షణమైన ఆళ్వార్లయొక్క శరీరమందు అత్యాదరము కలిగి శరీరముతోనే పరమపదమునకు తీసుకొనిపోవుటకు కరగ్రహణము చేయగా ఆళ్వార్లు స్వామి దివ్యపాదారవిందములను పట్టుకొని చేతిని విడిపించుకొనిరి. అట్టి దృఢమైన శక్తిగల నమ్మాళ్వార్లే మనకు స్థిరమైన సంపద.

ఆళ్వార్ తిరువడి గళే శరణమ్.

శ్రీరస్తు
శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# తిరువేఙ్గడమ్

నిత్యకైంకర్య ప్రార్థన.

**ఉ.వే.శ్రీమాన్. ఎన్.వి.ఎల్.ఎన్.రామానుజాచార్యస్వామి**

**నరసాపురం**

ప్రపన్నజన కూటస్థులైన నమ్మాళ్వార్లు తాము అనుగ్రహించిన తిరువాయిమొళ్ళి లో రెండు దశకములలో ప్రస్తుతిచేసిన దివ్య దేశము శ్రీవేంకటాచలము. ఒక్క తొండరడి ప్పొడియాళ్వార్లు తప్ప తక్కిన తొమ్మిదిమంది ఆళ్వార్లు గోదాదేవి మంగళాశాసనము చేసిన వైభవము ఈ క్షేత్రమునకు కలదు. అణ్డర్ కోన్ అణియరంగన్ ఎన్నముదినై కణ్డకణ్గళ్ మత్తొన్నినై క్కాణావే! (బ్రహ్మాండాధిపతియగు శ్రీరంగనాథుడను అపర్యాప్తామృతమును సేవించిన నానేత్రములు వేరొక దానిని సేవింపవు. అని పలికిన తిరుప్పాణియాళ్వార్లుకూడ తామను గ్రహించిన అమలనాదిపిరాన్ దివ్య ప్రబంధములో 'విణ్ణవర్కోన్ విరైయార్పొళ్ళిల్వేఙ్గడవన్'' అని ప్రస్తుతించినారు.

మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్
స్వామి పుష్కరిణీ తీరే రమయాసహ మోదతే॥

అన్నట్లుగా శ్రీ వైకుంఠమును వీడి ఈ లోకమున అర్చారూపమున వేంచేయ దలచిన స్వామికి మొదటి మజిలీ శ్రీవేంకటాచలము. కావుననే "వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తి కించన। వేంకటేశ సమోదేవో నభూతో న భవిష్యతి" వేంకటాచలముతో సమానమైన క్షేత్రముగాని వేంకటేశ్వరునితో సమానమైన దైవముగాని లేదు. ఇంతకుముందే కాదు - ఇకపై నుండబోదు అని ప్రశస్తి చెందినది.

ప్రసన్నులు ప్రతినిత్యము స్మరించి మంగళాశాసనము చేయు దివ్య దేశములలో తిరుమల రెండవది. ఈ క్షేత్రము పుష్పమంటముగా ప్రసిద్ధి చెందినది. చరమశ్లోకార్థ ప్రకాశకమైనదీ క్షేత్రము. తిరుమఙ్గై ఆళ్వార్లు ఈ స్వామిని 'వడవానై' ఉత్తర దిశాదిగ్గజముగా కీర్తించినారు.

నమ్మాళ్వార్లు ఈ క్షేత్రమును ''మణ్ణోర్ విణ్ణోర్ వైప్పు'' (భూలోకవాసులకు పరమపదవాసులకును సమానుడు) గా కీర్తించినారు. ఆళ్వార్లు ఆచార్యులు సర్వులు అభిమానించి సేవించిన క్షేత్రము ఈ వేంకటాచలము. ఈ వేంకటాచలముపై వేంచేసి యున్న శ్రీనివాసుని పాదారవిందములయందు సర్వ దేశ సర్వకాల సర్వావస్థల యందును కైంకర్యము చేయుటయే పరమ పురుషార్థమని ప్రవచించినవారు నమ్మాళ్వార్లు.

'నిలైప్పెత్తెన్నెంజం పెత్తదు నీడుయిరే' (నామనస్సు స్థిరపడినది ఆత్మ నిత్యత పొందినది) అనునట్లు ఆళ్వార్లు సర్వేశ్వరుని సమీపించి తమస్వరూపమును పొందగనే స్వరూపాను రూపమైన కైంకర్యము జ్ఞప్తికివచ్చి ఆ కైంకర్య ప్రార్థనను చేయుచున్నారు ''ఒళ్ళివిల్ కాలమెల్లామ్' అనుదశకమున.

ఇట్లు నిత్య కైంకర్యము చేయుటకు విరోధులైన ప్రకృతి సంబంధముచే కల్గిన కరణ సంకోచమును తలచి దానిని నివర్తింపచేయుమని సర్వేశ్వరుని ప్రార్ధించిరి. "అపుడు స్వామి ఆళ్వారే! మేము మీ కోసమే గదా! ఈ తిరుమలలో వేంచేసియున్నాము. మీరీ శరీరముతోనే మమ్ము సేవింప వచ్చునే! మీరు దేహాంతరముతో దేశాంతరమునకు పోయి సేవింపవలసిన దానిని ఇచటనే మీకనుగ్రహించినాము కదా! నిత్య సూరులు సైతము పరమపదమునుండి మమ్ము సేవింప వత్తురే! కావున మీరు మీ యీ దేహముతోనే మీకభిమతమైన కైంకర్యమును చేయుడు!'' అని తిరుమలలోని తమ అర్చామూర్తిని ప్రకాశింపచేసి ఆళ్వార్లను సమాధానపరచిరి.

ధర్మియొక్కటే అగుటచే విషయమంతయు పూర్ణమై యుండగా పరపదమునకుపోయి చేయదగిన కైంకర్యములన్నియు యీ తిరుమలయందే చేయుటకు తగియుండగా, మన శరీరము కైంకర్యము చేయుటకు అనుకూలమై యుండగా వైకుంఠములో మాత్రమేమి యున్నది. "సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చితా" అనునట్లు గుణానుభవమే గదా! చేయదగినది. ఇట్టి శీలాది గుణములను ఈ లోకమునందే ప్రకాశింప చేయుచుండగా, పరమ పదవాసులు కూడ ఇచటికే వచ్చి కైంకర్యములు చేయుచుండగా మనమును ఈ తిరుమలనే చేరి కైంకర్యమును చేయుదమని తలచిరి ఆళ్వార్లు.

నిరతిశయ సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత కల్యాణ గుణవిశిష్టుడై తిరుమలయందు వేంచేసియున్న శ్రీనివాసుని సేవించిన నమ్మాళ్వార్లు అందుకు సహకరించిన తమమనస్సును, తమవలె భగవదేక భోగ్యులై యుండువారిని కూడ నిత్యకైంకర్యమునకై ఆహ్వానించు చున్నారు.

ఆ తిరుమల సెలయేళ్ల ధ్వనులతో అలరారుచున్నది. ఆ స్వామి శ్రీనివాసుడు. శ్రీదేవి వక్ష స్థలమున వేంచేసియుండుటచే "అప్రమేయంహి తత్తేజః అనునట్లు ఆయన దేదీప్యమానముగా వెలుగొందును. ఆతడు మా కులనాథుడు. ఆ స్వామికి నిరవచ్ఛిన్నముగా సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు "అహంసర్వం కరిష్యామి" అనునట్లు త్రికరణశుద్ధిగా మనము కైంకర్యము చేయవలెను.

ఆళ్వార్ల ఈ శ్రీసూక్తిని ఉపన్యసించుచు భగవద్రామానుజులు "ఆళ్వార్లు కోరినట్లుగా తిరుమలలో స్వామికి నిత్య కైంకర్యము చేయువారెవరైన మీలో గలరా! యని శిష్యులను ప్రశ్నించిరట. అందుకు వారందరు ముక్త కంఠముతో చలివణికించు తిరుమలపై నివసింపజాలమని పలుకుచుండగా అనంతాళ్వాన్ అను వారు తాము ఆ కైంకర్యమును చేయుటకు అనుమతిమ్మని ప్రార్ధించిరట. అందుకు సంతోషించిన భగవద్రామానుజులు నీ ఒక్కడివే ఆణ్పిళ్లై అని ప్రశంసించిరట. అది మొదలు వారికి "ఆనంతాణ్పిళ్లై'' అని పేరు వచ్చినది. ఆణ్పిళ్లై అనగా మగవాడని అర్థము.

భగవంతుని కల్యాణగుణములు పరమపదమునకంటె తిరుమలలోనే మిక్కిలిగా ప్రకాశించును. కావుననే సేనముదలాళ్వార్లు మొ॥ నిత్యసూరులు వేంకటాచలమునకు వచ్చి స్వామికి పుష్పకైంకర్యము చేతురు. వారి శ్రీహస్తములనుండి రాలిన పుష్పములతో తిరుమల పుష్పమండపమయ్యెను. ఆ స్వామి మా కులనాథుడు.

ఇటనొకవిశేషము: జీవాత్మ లక్షణమగు శేషత్వమును చెప్పునపుడు "అడియారడియార్ తమ్మడియార్ అడియార్ తమక్కడియార్ అడియార్ తమ్ అడియార్' అని అవరోహణక్రమముగను, పరమాత్మ లక్షణమగు శేషిత్వమును చెప్పునపుడు "ఎన్దై తన్దై తన్దై తన్దై తన్దైక్కుమ్ మున్దై" అని ఆరోహణక్రమముతోను చెప్పుట ఆళ్వార్లకు ప్రియమైనదని పూర్వాచార్యోక్తము.

ఆస్వామి ఎఱ్ఱ తామరల వంటి కన్నులు గలవాడు; బింబాధరోష్ఠము; ఇంద్రనీలమువంటి తిరుమేని గలవాడు. ఆ కొండపై సెలయేళ్లు ప్రవహించును. ఆ స్వామి అసంఖ్యేయ నిత్య కల్యాణ గుణాకరుడు. నిత్యసూరులకు నాథుడు. మనకు స్వామి ఆశ్చర్య చేష్టితములుగలవాడు. ఏ విధమైన యోగ్యతలేని నాకు ఆశను కలిగించుటయే కాదు నన్ను ఆశపడిన ఆ నిరవధికతేజో మూర్తిని నిత్యసూరి నాయకుడని పొగుడుట ఒక గొప్పతనమా!

సకల వేదములందును అమృతమువలె పరమభోగ్యుడుగా ప్రతిపాదింపబడువాడును అఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణగణ సంపన్నుడును అగు వేంకటాచలపతిని జ్యోతి స్వరూపుడనియు, సకలలోకారాధ్యుడనియు, సకలజగత్కారణ భూతుడనియు సర్వేశ్వరుడనియు చెప్పినచో అది ఒక గొప్పతనమగునా! (నన్ను దయచూచుటే కాదు నాకంటే తక్కువైన వారిని చూడగోరి తిరుమలపై నిలచున్నాడా స్వామి)

తిరుమలలో నిత్యనివాసము చేయు స్వామిని సేవించి "నమో వేఙ్కటేశాయ" అని చెప్పినవారి పూర్వాఘములును, ఉత్తరాఘములును నశించును. ఛాందోగ్యోపనిషత్‌లో తద్ యథా ఇషీక తూలమ్ .......... సర్వేపాప్మనః ప్రధూయన్తే అని చెప్పినట్లు సమస్త పాపములు నశించును స్వరూపాను రూపమైన కైంకర్య ప్రాప్తియు కలుగును. (శరణాగతి సర్వపాపములను పోగొట్టునని భట్టరు వారు చెప్పుదురు).

దేవతలు దేవతానాయకుడు పుష్పములను తీర్థమును దీపమును ధూపమును తెచ్చి అనన్య ప్రయోజనులై స్వామికి సమర్పించి మ్రొక్కి తరించిన చోటు ఈ వేంకటాచలము. మనకు పరమసామ్యాపత్తి రూపమైన ("నిరంజనః పరమం సామ్యముపైతి" అను విధమున) మోక్షమును ప్రసాదించునదియు ఈ క్షేత్రమే.

గోవర్ధన పర్వతము నెత్తి అతిశీతలమైన వర్షమును నిలువరించినవాడును; పూర్వము ముల్లోకాలను కొలచినవాడును; పరాత్పరుడును అగు స్వామివేంచేసినదీ తిరుమలక్షేత్రము, ఈక్షేత్రము నారాధించితిమేని మన పాపములన్నియు నశించును. వేంకటాద్రీశుని పద్మములవంటి శ్రీచరణములను కీర్తించిన వారికి స్మరించిన వారికి వార్ధక్యము జనన మరణములు వ్యాధులును తొలగిపోవును.

భక్తులారా! మీ ఆయువు ముగియకముందే శక్తి నశింపక ముందే వేంకటాచలమును సేవింపుడు. ఆ స్వామికి శేషశయనము కంటే తిరుమలవాసమే ప్రియతమము.

ముల్లోకములను తన శ్రీచరణములచే కొలచిన త్రివిక్రముని (తన శ్రీచరణములే రక్షకములని చూపుచున్న) స్తుతించుచు ఆళ్వార్లు కీర్తించిన వేయి పాశురములలో యీ పది పాశురములను అనుసంధించువారు లోకులందరు కొనియాడు విధముగ సకలాభ్యుదయములను పొందుదురు.

ఈ విధముగా శ్రీవేంకటాచలపతి సన్నిధిలో నిత్య కైంకర్య ప్రార్ధన చేసిన ఆళ్వార్లు శ్రీవైకుంఠమునకు వినబడునట్లుగా "కూవిక్కొళ్లుం కాలమ్ ఇన్నమ్ కుఱుగాదో! (నన్ను పిలిపించుకొను సమయము దగ్గరగునట్లు చేయరాదా!) అని మొరపెట్టినను స్వామి సేవ సాదించక పోవుటచే శ్రీనివాసుని సన్నిధిలో శరణాగతి చేయుచున్నారు.

శరణాగతి చేయుటకు ఈ దేశము ఆ దేశము అను భేదము కానీ; ఈ సమయము ఆ సమయమను భేదముగాని; ఈ విధముగనే చేయవలెను లేక ఆ విధముగనే చేయవలెను అనిగాని "ఇట్టివారే చేయవలెను మిగిలినవారు చేయరాదని కానీ, ఈ ఫలమునకే చేయవలెను వేరు ఫలములను కోరి చేయరాదని కాని నియమములేదు. అనగా శరణాగతికి దేశ కాల ప్రకార అధికారి ఫల నియమము లేవు. ఒక్క విషయ నియమము మాత్రమే కలదు. గుణపూర్తి కలది మాత్రమే శరణాగతి చేయుటకు విషయము. ఆ గుణపూర్తి "ఇదంపూర్ణం మదఃపూర్ణం పూర్ణత్ పూర్ణముద్రిచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే" అనునట్లు అర్చావతారమందే కలదు. సాధుపరిత్రాణమునకై రామకృష్ణాదులుగా అవతరించిన సర్వేశ్వరుడు "పిన్నానార్ వణఙ్గుంశోది" అనునట్లు అనంతరకాలమువారు సేవించి శరణాగతి చేసి తరించుటకు వీలుగా తిరుమల శిఖరమున శ్రీనివాసుడై అర్చామూర్తిగా వేంచేసియున్నాడు. ఈ అర్చామూర్తిని సేవించి పిరాట్టి పురుషకారముగా తమ అనన్య గతిత్వమును విన్నవించుచున్నారు ఆళ్వార్లు.

సకల జగద్రక్షకుడవై అనంత కల్యాణ గుణప్రపూర్ణుడవై; అప్రాకృత తేజోమయ దివ్య మంగళ విగ్రహ సమంచితుడవై; దేవాధిదేవుడవై; నాకు ప్రాణభూతుడవై భూలోకమునకు తిలకాయమానమైన తిరుమల యందు నిత్య నివాసము చేయుచున్న స్వామీ! శ్రీనివాసా! నేను కుల పరంపరాగతముగా నీ దాసుడను. నేను నీ శ్రీపాదములను పొందు ఉపాయమును నాకను గ్రహింపుము.

సకల భగవద్విరోధి వర్గమును నిర్జించి భస్మము చేసినను మండిపడు స్వభావముగల శ్రీసుదర్శనమును కుడి చేతియందు ధరించిన స్వామీ! నిత్య సూరినాథా! వేంకటాచలపతీ! నీ పాదములను ఆశ్రయించు విధమును నాకనుగ్రహింపుము.

మూర్తీభవించిన దయాస్వరూపా! మేఘవర్ణా! ఆశ్చర్యగుణాకరా! దేవాధిదేవా! నా హృదయమున ప్రవేశించిన అమృతప్రాయుడా! మణులను, బంగారమును తెచ్చి సమర్పించు ప్రసన్నములైన వాగులుకల వేంకటాచలపతీ! నీ శ్రీపాదముల నాశ్రయించునట్లుగా దాసుని అయ్యో! అని దయచూడుమా!

దయారహితులై లోకకంటకులైన అసురులను తెగనార్చుటకై నిప్పులుగ్రక్కు బాణములను వర్షించిన శార్ఙ్గము కలవాడా! లక్ష్మీవల్లభా! బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు; సనకసనందనాది

శ్రీరస్తు
శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# తిరువేజ్గడమ్

నిత్యకైంకర్య ప్రార్థన.

**ఉ.వే.శ్రీమాన్. ఎన్.వి.ఎల్.ఎన్.రామానుజాచార్యస్వామి**

**నరసాపురం**

ప్రపన్నజన కూటస్థులైన నమ్మాళ్వార్లు తాము అనుగ్రహించిన తిరువాయిమొళ్రి లో రెండు దశకములలో ప్రస్తుతిచేసిన దివ్య దేశము శ్రీవేంకటాచలము. ఒక్క తొండరడి ప్పొడియాళ్వార్లు తప్ప తక్కిన తొమ్మిదిమంది ఆళ్వార్లు గోదాదేవి మంగళాశాసనము చేసిన వైభవము ఈ క్షేత్రమునకు కలదు. అణ్డర్ కోన్ అణియరంగన్ ఎన్నముదినై కణ్డకణ్గళ్ మత్తొన్రినై క్కాణావే! (బ్రహ్మాండాధిపతియగు శ్రీరంగనాథుడను అపర్యాప్తామృతమును సేవించిన నానేత్రములు వేరొక దానిని సేవింపవు. అని పలికిన తిరుప్పాణియాళ్వార్లుకూడ తామను గ్రహించిన అమలనాదిపిరాన్ దివ్య ప్రబంధములో 'విణ్ణవర్కోన్ విరైయార్పొ[illegible]వేజ్గడవన్" అని ప్రస్తుతించినారు.

మాయావీ పరమానందం త్యక్త్వా వైకుంఠ ముత్తమమ్
స్వామి పుష్కరిణీ తీరే రమయాసహ మోదతే॥

అన్నట్లుగా శ్రీ వైకుంఠమును వీడి ఈ లోకమున అర్చారూపమున వేంచేయ దలచిన స్వామికి మొదటి మజిలీ శ్రీవేంకటాచలము. కావుననే "వేంకటాద్రి సమంస్థానం బ్రహ్మాండే నాస్తి కించన। వేంకటేశ సమోదేవో నభూతో న భవిష్యతి" వేంకటాచలముతో సమానమైన క్షేత్రముగాని వేంకటేశ్వరునితో సమానమైన దైవముగాని లేదు. ఇంతకుముందే కాదు - ఇకపై నుండబోదు అని ప్రశస్తి చెందినది.

ప్రసన్నులు ప్రతినిత్యము స్మరించి మంగళాశాసనము చేయు దివ్య దేశములలో తిరుమల రెండవది. ఈ క్షేత్రము పుష్పమంటముగా ప్రసిద్ధి చెందినది. చరమశ్లోకార్థ ప్రకాశకమైనదీ క్షేత్రము. తిరుమఙ్గై ఆళ్వార్లు ఈ స్వామిని 'వడవానై' ఉత్తర దిశాదిగ్గజముగా కీర్తించినారు.

నమ్మాళ్వార్లు ఈ క్షేత్రమును "మణ్ణోర్ విణ్ణోర్ వైప్పు" (భూలోకవాసులకు పరమపదవాసులకును సమానుడు) గా కీర్తించినారు. ఆళ్వార్లు ఆచార్యులు సర్వులు అభిమానించి సేవించిన క్షేత్రము ఈ వేంకటాచలము. ఈ వేంకటాచలముపై వేంచేసి యున్న శ్రీనివాసుని పాదారవిందములయందు సర్వ దేశ సర్వకాల సర్వావస్థల యందును కైంకర్యము చేయుటయే పరమ పురుషార్థమని ప్రవచించినవారు నమ్మాళ్వార్లు.

'నిలైప్పెత్తెన్నెంజం పెత్తదు నీడుయిర్' (నామనస్సు స్థిరపడినది ఆత్మ నిత్యత పొందినది) అనునట్లు ఆళ్వార్లు సర్వేశ్వరుని సమీపించి తమస్వరూపమును పొందగనే స్వరూపాను రూపమైన కైంకర్యము జ్ఞప్తికివచ్చి ఆ కైంకర్య ప్రార్థనను చేయుచున్నారు "ఒళ్రివిల్ కాలమెల్లామ్' అనుదశకమున.

ఇట్లు నిత్య కైంకర్యము చేయుటకు విరోధులైన ప్రకృతి సంబంధముచే కల్గిన కరణ సంకోచమును తలచి దానిని నివర్తింపచేయుమని సర్వేశ్వరుని ప్రార్థించిరి. "అపుడు స్వామి ఆళ్వారే! మేము మీ కోసమే గదా! ఈ తిరుమలలో వేంచేసియున్నాము. మీరీ శరీరముతోనే మమ్ము సేవింప వచ్చునే! మీరు దేహాంతరముతో దేశాంతరమునకు పోయి సేవింపవలసిన దానిని ఇచటనే మీకనుగ్రహించినాము కదా! నిత్య సూరులు సైతము పరమపదమునుండి మమ్ము సేవింప వత్తురే! కావున మీరు మీ యీ దేహముతోనే మీకభిమతమైన కైంకర్యమును చేయుడు!" అని తిరుమలలోని తమ అర్చామూర్తిని ప్రకాశింపచేసి ఆళ్వార్లను సమాధానపరచిరి.

ధర్మియొక్కటే అగుటచే విషయమంతయు పూర్ణమై యుండగా పరపదమునకుపోయి చేయదగిన కైంకర్యములన్నియు యీ తిరుమలయందే చేయుటకు తగియుండగా, మన శరీరము కైంకర్యము చేయుటకు అనుకూలమై యుండగా వైకుంఠములో మాత్రమేమి యున్నది. "సోశ్నుతే సర్వాన్ కామాన్ సహ, బ్రహ్మణా విపశ్చితా" అనునట్లు గుణానుభవమే గదా! చేయదగినది. ఇట్టి శీలాది గుణములను ఈ లోకమునందే ప్రకాశింప చేయుచుండగా, పరమ పదవాసులు కూడ ఇచటికే వచ్చి కైంకర్యములు చేయుచుండగా మనమును ఈ తిరుమలనే చేరి కైంకర్యమును చేయుదమని తలచిరి ఆళ్వార్లు.

నిరతిశయ సౌందర్య సౌకుమార్య లావణ్య యౌవనాద్యనంత కల్యాణ గుణవిశిష్టుడై తిరుమలయందు వేంచేసియున్న శ్రీనివాసుని సేవించిన నమ్మాళ్వార్లు అందుకు సహకరించిన తమమనస్సును, తమవలె భగవదేక భోగ్యులై యుండువారిని కూడ నిత్య కైంకర్యమునకై ఆహ్వానించు చున్నారు.

ఆ తిరుమల సెలయేళ్ల ధ్వనులతో అలరారుచున్నది. ఆ స్వామి శ్రీనివాసుడు. శ్రీదేవి వక్ష స్థలమున వేంచేసియుండుటచే "అప్రమేయంహి తత్తేజః అనునట్లు ఆయన దేదీప్యమానముగా వెలుగొందును. ఆతడు మా కులనాథుడు. ఆ స్వామికి నిరవచ్ఛిన్నముగా సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందు "అహంసర్వం కరిష్యామి" అనునట్లు త్రికరణశుద్ధిగా మనము కైంకర్యము చేయవలెను.

ఆళ్వార్ల ఈ శ్రీసూక్తిని ఉపన్యసించుచు భగవద్రామానుజులు "ఆళ్వార్లు కోరినట్లుగా తిరుమలలో స్వామికి నిత్య కైంకర్యము చేయువారెవరైన మీలో గలరా! యని శిష్యులను ప్రశ్నించిరట. అందుకు వారందరు ముక్త కంఠముతో చలివణికించు తిరుమలపై నివసింపజాలమని పలుకుచుండగా అనంతాళ్వాన్ అను వారు తాము ఆ కైంకర్యమును చేయుటకు అనుమతిమ్మని ప్రార్థించిరట. అందుకు సంతోషించిన భగవద్రామానుజులు నీ ఒక్కడివే ఆణ్పిళ్లై అని ప్రశంసించిరట. అది మొదలు వారికి "అనంతాణ్పిళ్లై" అని పేరు వచ్చినది. ఆణ్పిళ్లై అనగా మగవాడని అర్థము.

భగవంతుని కల్యాణగుణములు పరమపదమునకంటె తిరుమలలోనే మిక్కిలిగా ప్రకాశించును. కావుననే సేనముదలాళ్వార్లు మొ॥ నిత్యసూరులు వేంకటాచలమునకు వచ్చి స్వామికి పుష్పకైంకర్యము చేతురు. వారి శ్రీహస్తములనుండి రాలిన పుష్పములతో తిరుమల పుష్పమండపమయ్యెను. ఆ స్వామి మా కులనాథుడు.

ఇటనొకవిశేషము: జీవాత్మ లక్షణమగు శేషత్వమును చెప్పునపుడు "అడియారడియార్ తమ్మడియార్ అడియార్ తమక్కడియార్ అడియార్ తమ్ అడియార్' అని అవరోహణక్రమముగను, పరమాత్మ లక్షణమగు శేషిత్వమును చెప్పునపుడు "ఎన్దై తన్దై తన్దై తన్దై తన్దైక్కుమ్ మున్దై" అని ఆరోహణక్రమముతోను చెప్పుట ఆళ్వార్లకు ప్రియమైనదని పూర్వాచార్యోక్తము.

ఆస్వామి ఎఱ్ఱ తామరల వంటి కన్నులు గలవాడు; బింబాధరోష్ఠము; ఇంద్రనీలమువంటి తిరుమేని గలవాడు. ఆ కొండపై సెలయేళ్లు ప్రవహించును. ఆ స్వామి అసంఖ్యేయ నిత్య కల్యాణ గుణాకరుడు. నిత్యసూరులకు నాథుడు. మనకు స్వామి ఆశ్చర్య చేష్టితములుగలవాడు. ఏ విధమైన యోగ్యతలేని నాకు ఆశను కలిగించుటయే కాదు నన్ను ఆశపడిన ఆ నిరవధికతేజో మూర్తిని నిత్యసూరి నాయకుడని పొగుడుట ఒక గొప్పతనమా!

సకల వేదములందును అమృతమువలె పరమభోగ్యుడుగా ప్రతిపాదింపబడువాడును అఖిల హేయ ప్రత్యనీక కల్యాణ గుణగణ సంపన్నుడును అగు వేంకటాచలపతిని జ్యోతి స్వరూపుడనియు, సకలలోకారాధ్యుడనియు, సకలజగత్కారణ భూతుడనియు సర్వేశ్వరుడనియు చెప్పినచో అది ఒక గొప్పతనమగునా! (నన్ను దయచూచుటే కాదు నాకంటే తక్కువైన వారిని చూడగోరి తిరుమలపై నిలచున్నాడా స్వామి)

తిరుమలలో నిత్యనివాసము చేయు స్వామిని సేవించి "నమో వేఙ్కటేశాయ" అని చెప్పినవారి పూర్వాఘములును, ఉత్తరాఘములును నశించును. ఛాందోగ్యోపనిషత్‌లో తద్ యథా ఇషీక తూలమ్ .......... సర్వేపాప్మనః ప్రధూయన్తే అని చెప్పినట్లు సమస్త పాపములు నశించును స్వరూపాను రూపమైన కైంకర్య ప్రాప్తియు కలుగును. (శరణాగతి సర్వపాపములను పోగొట్టునని భట్టరు వారు చెప్పుదురు).

దేవతలు దేవతానాయకుడు పుష్పములను తీర్థమును దీపమును ధూపమును తెచ్చి అనన్య ప్రయోజనులై స్వామికి సమర్పించి మ్రొక్కి తరించిన చోటు ఈ వేంకటాచలము. మనకు పరమసామ్యాపత్తి రూపమైన ("నిరంజనః పరమం సామ్యముపైతి" అను విధమున) మోక్షమును ప్రసాదించునదియు ఈ క్షేత్రమే.

గోవర్ధన పర్వతము నెత్తి అతిశీతలమైన వర్షమును నిలువరించినవాడును; పూర్వము ముల్లోకాలను కొలచినవాడును; పరాత్పరుడును అగు స్వామివేంచేసినదీ తిరుమలక్షేత్రము, ఈక్షేత్రము నారాధించితిమేని మన పాపములన్నియు నశించును. వేంకటాద్రీశుని పద్మములవంటి శ్రీచరణములను కీర్తించిన వారికి స్మరించిన వారికి వార్ధక్యము జనన మరణములు వ్యాధులును తొలగిపోవును.

భక్తులారా! మీ ఆయువు ముగియకముందే శక్తి నశింపక ముందే వేంకటాచలమును సేవింపుడు. ఆ స్వామికి శేషశయనము కంటే తిరుమలవాసమే ప్రియతమము.

ముల్లోకములను తన శ్రీచరణములచే కొలచిన త్రివిక్రముని (తన శ్రీచరణములే రక్షకములని చూపుచున్న) స్తుతించుచు ఆళ్వార్లు కీర్తించిన వేయి పాశురములలో యీ పది పాశురములను అనుసంధించువారు లోకులందరు కొనియాడు విధముగ సకలాభ్యుదయములను పొందుదురు.

# శరణాగతి

ఈ విధముగా శ్రీవేంకటాచలపతి సన్నిధిలో నిత్య కైంకర్య ప్రార్ధన చేసిన ఆళ్వార్లు శ్రీవైకుంఠమునకు వినబడునట్లుగా "కూవిక్కొళ్లుం కాలమ్ ఇన్నమ్ కుఱుగాదో! (నన్ను పిలిపించుకొను సమయము దగ్గరగునట్లు చేయరాదా!) అని మొరపెట్టినను స్వామి సేవ సాదించక పోవుటచే శ్రీనివాసుని సన్నిధిలో శరణాగతి చేయుచున్నారు.

శరణాగతి చేయుటకు ఈ దేశము ఆ దేశము అను భేదము కానీ; ఈ సమయము ఆ సమయమను భేదముగాని; ఈ విధముగనే చేయవలెను లేక ఆ విధముగనే చేయవలెను అనిగాని "ఇట్టివారే చేయవలెను మిగిలినవారు చేయరాదని కానీ, ఈ ఫలమునకే చేయవలెను వేరు ఫలములను కోరి చేయరాదని కాని నియమములేదు. అనగా శరణాగతికి దేశ కాల ప్రకార అధికారి ఫల నియమము లేవు. ఒక్క విషయ నియమము మాత్రమే కలదు. గుణపూర్తి కలది మాత్రమే శరణాగతి చేయుటకు విషయము. ఆ గుణపూర్తి "ఇదంపూర్ణం మదఃపూర్ణం పూర్ణత్ పూర్ణముద్రిచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావ శిష్యతే" అనునట్లు అర్చావతారమందే కలదు. సాధుపరిత్రాణమునకై రామకృష్ణాదులుగా అవతరించిన సర్వేశ్వరుడు "పిన్నానార్ వణఙ్గుంశోది" అనునట్లు అనంతరకాలమువారు సేవించి శరణాగతి చేసి తరించుటకు వీలుగా తిరుమల శిఖరమున శ్రీనివాసుడై అర్చామూర్తిగా వేంచేసియున్నాడు. ఈ అర్చామూర్తిని సేవించి పిరాట్టి పురుషకారముగా తమ అనన్య గతిత్వమును విన్నవించుచున్నారు ఆళ్వార్లు.

సకల జగద్రక్షకుడవై అనంత కల్యాణ గుణప్రపూర్ణుడవై; అప్రాకృత తేజోమయ దివ్య మంగళ విగ్రహ సమంచితుడవై; దేవాధిదేవుడవై; నాకు ప్రాణభూతుడవై భూలోకమునకు తిలకాయమానమైన తిరుమల యందు నిత్య నివాసము చేయుచున్న స్వామీ! శ్రీనివాసా! నేను కుల పరంపరాగతముగా నీ దాసుడను. నేను నీ శ్రీపాదములను పొందు ఉపాయమును నాకను గ్రహింపుము.

సకల భగవద్విరోధి వర్గమును నిర్జించి భస్మము చేసినను మండిపడు స్వభావముగల శ్రీసుదర్శనమును కుడి చేతియందు ధరించిన స్వామీ! నిత్య సూరినాథా! వేంకటాచలపతీ! నీ పాదములను ఆశ్రయించు విధమును నాకనుగ్రహింపుము.

మూర్తీభవించిన దయాస్వరూపా! మేఘవర్ణా! ఆశ్చర్యగుణాకరా! దేవాధిదేవా! నా హృదయమున ప్రవేశించిన అమృతప్రాయుడా! మణులను, బంగారమును తెచ్చి సమర్పించు ప్రసన్నములైన వాగులుకల వేంకటాచలపతీ! నీ శ్రీపాదముల నాశ్రయించునట్లుగా దాసుని అయ్యో! అని దయచూడుమా!

దయారహితులై లోకకంటకులైన అసురులను తెగనార్చుటకై నిప్పులుగ్రక్కు బాణములను వర్షించిన శార్ఙ్గము కలవాడా! లక్ష్మీవల్లభా! బ్రహ్మరుద్రేంద్రాది దేవతలు; సనకసనందనాది

మునులు సేవింపనాశపడు వేంకటాచలముపై వేంచేసియున్న స్వామీ! మహాపాపినైన నేను పుష్పాంచితమైన నీ శ్రీచరణములను పొందు ఉపాయమును అనుగ్రహింపుము.

వి శే:- శ్రీ వేంకటాచలపతి శ్రీపాదములను పూవార్ కళ్గల్ అనియు

శ్రీరంగనాథుని శ్రీపాదములకు తిరుప్పోలిన్ద శేవడి అనియు

వరదరాజస్వామి శ్రీపాదములకు 'తుయరఱుశుడరడి' అనియు సంప్రదాయ వ్యవహారము.

రామావతారకాలమున సప్తసాలవృక్షములను ఖండించిన జగదేకధనుర్ధరా! కృష్ణావతార కాలమున మద్దిచెట్లనడుమ దోగాడి వానిని కూల్చిన(యమళార్జునభంజనము) జగన్మోలమా! మేఘములవంటి యేనుగులు ఏనుగులవంటి మేఘములు తిరుగాడు వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! శార్ఙ్గపాణీ! నేను నీ శ్రీపాదములను ఆశ్రయించుట ఎన్నడో కదా!

ఈ లీలావిభూతిలో నున్న వారు నిత్య విభూతి యగు పరమపదమున కేగి సర్వేశ్వరుని పరత్వమును సేవించి నిత్య కైంకర్యము చేయగోరినట్లుగా పరమపదములోనున్న నిత్యసూరులు సర్వేశ్వరుని సౌలభ్య సౌశీల్యాది గుణములను సేవించుటకై శ్రీవేంకటాచలమును చేరి స్తుతించి త్రికరణములచేతను కైంకర్యమును చేయుదురు. అట్టి తిరుమలపై వేంచేసియున్న స్వామీ! దాసుడనైన నేను ముల్లోకములను కొలచిన నీ దివ్య పాదారవిందములను చేరుట ఎన్నడో కదా!

విశే:- భగవద్రామానుజులవారును "లోకవిక్రాన్త చరణౌ శరణం తే వ్రజంవిభో" అని తామనుగ్రహించిన శరణాగతి గద్యలో శరణాగతిచేయదగినవి లోకవిక్రాన్త చరణములనియే ప్రస్తుతించిరి.

దాసులకు అమృతమువలె భోగ్యమైనవాడా! దేవాధిదేవా! గరుడధ్వజా! బింబఫలాధరోష్ఠా! స్వామీ! నా పాపములనే వృక్షములను నశింపచేయు ఔషధమా! వేంకటనాయకా! నీ దివ్య పాదారవిందములను సేవించుటకై ఏ నోమును నోచియుండలేదు (నీవే సిద్ధోపాయమని నమ్మియుంటిని) క్షణకాలమైనను నీ విశ్లేషమును సహించి యుండజాలను.

సర్వజ్ఞుడగు నీలకంఠుడు; జ్ఞానశక్తి పూర్ణుడగు చతుర్ముఖుడు దేవేంద్రుడు మొదలగు వారు సాధనానుష్ఠానములేవియు లేకనే నిన్ను సేవింపక యుండజాలక భార్యా సమేతులై వేంకటాచలమును చేరి నిన్ను భజింతురు. అట్టి వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! కృష్ణునిగా అవతరించి వ్యామోహపరచినవాడా! వసుదేవాదులను కటాక్షింప వేంచేసినట్లుగా నీదాసుడనగు నన్నును కటాక్షింప వేంచేయుమా!

వి.శౌ:- బ్రహ్మరుద్రేంద్రాదులు రజ స్తమో గుణ ప్రచురులగుటచే మేమే సర్వేశ్వరులమని భ్రమింతురు. వారిలో సత్త్వగుణము వర్ధిల్లినపుడు సర్వేశ్వరునకు దాసులమని సేవింపవత్తురు అని నంబిళ్లైగారు చెప్పుదురు.

చింతామణి వెలుగుచే రాత్రిగూడ పగలుగా ప్రకాశించు వేంకటాద్రిపై నుండు స్వామీ! మానసానుభూతిచే బాహ్యసంశ్లేషము లభించినట్లు భ్రమింపజేతువు. అట్లని చేయిచాచి

పట్టకొందమన్నచో అందవు. నీవు అందనివాడవని తలచి నిరాశ చేసికొన్నచో నిరంకుశస్వాతంత్ర్యము కలవాడవు కనుక చేతికందునట్లు వేంచేయుదువు. నీ నేత్రారవిందములు భవతాపహరములు. ఆ అధరము బింబఫలము. నీ చతుర్భుజములు పురుషార్థప్రదములు. కావుననే నీవు అమృతమువలె పరమభోగ్యుడవు. నాకు ప్రాణసమానుడవు. స్వామీ! నీ పాదారవిందములను విడచి క్షణకాలమైనను జీవింపజాలను.

పద్మవాసినియగు శ్రీదేవి పద్మవాసముకంటే భోగ్యమైన స్వామి వక్షస్థలమును నిత్యనివాసముగా చేసికొనెను. కావుననే స్వామి శ్రీనివాసుడయ్యెను. శ్రియఃపతిత్వము సర్వేశ్వరుని స్వరూపనిరూపకము. ఆమెపురుషకారభూతురాలు ఈమె పురుషకారము వలన స్వామి సాటిలేని కీర్తివంతుడగును (దోషోయద్యపి తస్యస్యాత్ అని ఆశ్రయించినవారి నందరిని అనుగ్రహించుటచేత) అట్టి కీర్తిగల సర్వలోకేశ్వరా! నాస్వామీ! దేవతలు మునిగణములు కోరి సేవించు వేంకటాచలముపై వెలసిన దేవా! వేరుగతిలేని నేను నీ శ్రీపాదముల క్రింద ఒదిగియుంటిని.

విశే:। 1. వాత్సల్యము 2.స్వామిత్వము 3. సౌశీల్యము 4. సౌలభ్యము. ఇవి ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములు.

1. వాత్సల్యము: అనగా దోషభోగ్యత్వము. ఆశ్రయింపవచ్చినవాడు తనదోషములను తలచి భయపడి యుండగా ఆ భయమును పోగొట్టి 'దోషోయద్యపి'' దోషములున్నను పరవాలేదు రమ్మ అని చేరదీయు గుణము.

2. స్వామిత్వమనగా:- తాను స్వామి యగుట చేతను "మనమాతని సొమ్మగుటచేతను తనసొత్తైన మనలను స్వామియగు ఆతడే రక్షించుకొనును '' అని నమ్మికను కలిగించు గుణము.

3. సౌశీల్యము:- ఆయన ఉభయవిభూతినాయకుడు. నేను అత్యల్పుడను అనిభావించి మనము ఆతనిని విడచిపెట్టకుండ చేయునది ఆయన సౌశీల్యం.

4.సౌలభ్యము:- సర్వేశ్వరుని మన చేతికందునట్లు చేయునది ఆయన సౌలభ్యము. నమ్మాళ్వార్లు నిగరిల్ పుగళాయ్ (సాటిలేని కీర్తిగలవాడా!) అనుటచే స్వామియొక్క వాత్సల్యమును; "ఉలగంమున్డుడైయాయ్" (ముల్లోకాధిపతీ!) అనుటచే స్వామిత్వమును, ఎన్నైఆళ్వానే (నన్నేలుకొనువాడా! అనుటచే సౌశీల్యమును; నిగరిల్ అమరర్ మునిక్కణజ్గళ్ విరుమ్బుమ్ తిరువేజ్గడత్తానే! (సాటిలేని మునిగణములు దేవతాగణములు సేవించు వేంకటాచలపతీ!) అనుటచే సౌలభ్యము ప్రకాశింపజేసిరి.

ఇందు "అమరర్" అనుటచే కైంకర్య నిష్ఠులు, మునిక్కణజ్గళ్ అనుటచే గుణానుభవనిష్ఠులు చెప్పబడుదురు.

పుగళ్ ఒన్రు ఇల్లా! (వేరుగతిలేని) అనుటచే శరణాగతునకుండవలసిన ఆకించన్యము; అనన్య గతిత్వము చెప్పబడినవి. ఈ విధముగా ఈ "అగలిగిల్లేన్" అనుపాశురమున ద్వయమందలి పూర్వఖండము వివరింపబడినది (విస్తరభీతిచే సంక్షేపముగా విన్నవించబడినది)

"భక్తులారా! నా శ్రీపాదములనాశ్రయించి తరింపుడని" ("యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి") తన పాదారవిందములను చూపువాడును; నిస్సమాభ్యధికుడునగు శ్రీవేంకటాచలపతిని గూర్చి నమ్మాళ్వార్లు అనుగ్రహించిన యీ పది పాశురములను అనుసంధానము చేయువారు పరమపదమును తప్పక పొందుదురు అని చెప్పి ఆళ్వార్లు ముగించుచున్నారు.

• విశే:- "ఈ విధముగా నమ్మాళ్వార్లు శ్రీవేంకటాచలపతి పాదారవిందములయందు చేసిన శరణాగతియే మనకును రక్షకము. మనము వేరుగ ప్రపత్తిచేయు నవసరములేదు. "సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే! నివేదయత మాంక్షిప్రమ్" అని ప్రార్థింపగా శ్రీరామచంద్రమూర్తి విభీషణునితోపాటు ఆతని మంత్రులను కూడ అనుగ్రహించినట్లే శ్రీనివాసుడు నమ్మాళ్వార్లతో పాటు మనలను అనుగ్రహింతురు" అని నంబిళ్ళైగారు చెప్పుదురు.

కావున నమ్మాళ్వార్ల శ్రీపాదముల నాశ్రయించి వారి సంబంధులమని పెరుమాళ్ల సన్నిధిలో విన్నవించుటే మన కర్తవ్యము.

ఈ క్షేత్రమునుగూర్చి మణవాళమహామునులు తిరువాయిమొழிనూత్తందాదిలో ఇట్లభివర్ణించియున్నారు.

ఒழிవిలా క్కాలం ఉడనాగి మన్ని
వழுవిలా అట్చెయ్య మాలుక్కు - ఎழுశిగర
వేఙ్గడత్తు ప్పారిత్త మిక్కనలం శేర్ మాఱన్
పూఙ్కழలై నేంజే! పుకழ்.

ఓ! మనసా! సర్వేశ్వరునితో ఎల్లపుడు కలసియుండి మనము సర్వవిధ కైంకర్యములు చేయవలయును అని తిరుమల విషయమై ఆనందించిన నమ్మాళ్వార్ల శ్రీపాదములను స్తుతింపుమా!

ఉలగుయ్యమాల్ నిన్ఱ ఉయర్ వేఙ్గడత్తే
అలర్మగళై మున్నిట్టు అవన్దన్ - మలరడియే
వన్ శరణాయ్ చ్చేర్న్ద మగిழ் మాఱన్ తాళిణైయే
ఉన్ శరణాయ్ నెఞ్జమే! ఉళ్.

ఓ! మనసా! లోకమును జ్జీవింపచేయుటకై తిరుమలలో వేంచేసియున్న సర్వేశ్వరుని అలర్ మేల్మంగ తాయార్ల పురుషకారముతో ఆశ్రయించి ఆ స్వామి శ్రీపాదములే రక్షకములుగా నమ్మిన వకుళాభరణులైన నమ్మాళ్వార్ల దివ్యపాదారవిందములే నీకు ప్రాప్యమని తలంపుము.

ఆళ్వార్ దివ్య తిరువడిగళే శరణమ్.

# ఆదినాథస్వామి

సంగీత సాహిత్య కళానిధి, హరికథా చూడామణి
ఉ.వే.శ్రీమాన్. నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యస్వామి
విజయవాడ

శ్లో॥ తాత్కాలికీం స్థితి మవేక్ష్య జడాత్మకానాం
దేవాంతర ప్రణయినా మవనాయ తేషామ్
నారాయణస్య జగదాది నిదానతాదీన్
యో2జిజ్ఞప చ్ఛఠరిపుం తమహం ప్రపద్యే

మానవుడు తన కర్మానుసారముగా పుట్టుచున్నాడు గిట్టుచున్నాడు. దు:ఖముల ననుభవించుచున్నాడు. మరి యీ చక్రమున కంతులేదా? శాశ్వతముగా నీజీవుడా నందమునే అనుభవించు ఉపాయము లేదా? లేకేమి? ఉన్నది. దానిని వేదమే ఆదేశించినది. వేదోపబృంహణములగు ఇతిహాస పురాణములును చెప్పినవి. మరియు "కారణంతు ధ్యేయ:"= ఓ జీవుడా! నీవు శాశ్వతానంద రూపమగు మోక్షమును పొందవలెనంటే జగత్తులకు దేవాది సమస్తజీవులకును మూలకారణమయిన వస్తువును ధ్యానింపవలెను." అని వేదాను శాసనము. "నారాయణాద్బ్రహ్మాజాయతే" ఇత్యాది వేదవాక్యములు నారాయణుని వలననే బ్రహ్మరుద్రాది దేవతలు జన్మించిరి'' అని ఘంటాపథముగా చెప్పినవి. కనుక సర్వకారణమగు వస్తువు నారాయణుడు. "తమేవం విద్వా నమృత ఇహ భవతి. నాన్య: పంథా విద్యతే2యనాయ" ఇత్యాది వేద వాక్యములు నారాయణుని ఉపాసనమే మోక్షకారణము అని చెప్పినవి.

కృత త్రేతాయుగములలో ప్రాచీన మహర్షులు మొదలగువారు నారాయణుని మాత్రముపాసించి తరించిరి. నారాయణునే పరుడని నమ్మిరి. ద్వాపరము వచ్చినది. ఇది ఈ యుగమునకు పేరు. ఈ పేరు ఎట్లు వచ్చినది? ద్వాపర మనగా సందేహము అని నిఘంటువు చెప్పిన అర్థము. అనగా ఏ ఒక్క విషయము మీద నిశ్చయజ్ఞానము లేక రెండిటి మధ్య నూగులాడుట. ఇది ఉపాసింప దగిన దేవత విషయమున కూడ ఏర్పడినది. కొందరు నారాయణుడు పరుడు(సర్వాధికుడు) అన్నారు. కొందరు రుద్రుడు పరుడన్నారు. కొందరిద్దరును పరులే అన్నారు. అందుచేతనే ఈ యుగము ద్వాపరమైనది. (ఇద్దరు పరులనిన యుగము).

ఇట్టి క్లిష్ట సమయమున వ్యాస పరాశరులు శ్రీశుకుడును నడుము కట్టిరి. విష్ణువే పరదైవము అని చెప్పు విష్ణుపురాణమును పరాశరుడు రచించినాడు. వ్యాసుడు బ్రహ్మసూత్రములను భాగవతమును రచించినాడు. బ్రహ్మసూత్రములు లక్షణము భాగవతము లక్ష్యము. శ్రీశుకుడు నారాయణ కథాశ్రవణమే మోక్షహేతువని పరీక్షిత్తుకు ప్రవచించినాడు.

మునులు సేవింపనాశపడు వేంకటాచలముపై వేంచేసియున్న స్వామీ! మహాపాపినైన నేను పుష్పాంచితమైన నీ శ్రీచరణములను పొందు ఉపాయమును అనుగ్రహింపుము.

వి శే:- శ్రీ వేంకటాచలపతి శ్రీపాదములను పూవార్ కళ్గల్ అనియు

శ్రీరంగనాథుని శ్రీపాదములకు తిరుప్పోలిన్ద శేవడి అనియు

వరదరాజస్వామి శ్రీపాదములకు 'తుయరఱుశుడరడి' అనియు సంప్రదాయ వ్యవహారము.

రామావతారకాలమున సప్తసాలవృక్షములను ఖండించిన జగదేకధనుర్ధరా! కృష్ణావతార కాలమున మద్దిచెట్లనడుమ దోగాడి వానిని కూల్చిన(యమళార్జునభంజనము) జగన్మోలమా! మేఘములవంటి యేనుగులు ఏనుగులవంటి మేఘములు తిరుగాడు వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! శార్ఙ్గపాణీ! నేను నీ శ్రీపాదములను ఆశ్రయించుట ఎన్నడో కదా!

ఈ లీలావిభూతిలో నున్న వారు నిత్య విభూతి యగు పరమపదమున కేగి సర్వేశ్వరుని పరత్వమును సేవించి నిత్య కైంకర్యము చేయగోరినట్లుగా పరమపదములోనున్న నిత్యసూరులు సర్వేశ్వరుని సౌలభ్య సౌశీల్యాది గుణములను సేవించుటకై శ్రీవేంకటాచలమును చేరి స్తుతించి త్రికరణములచేతను కైంకర్యమును చేయుదురు. అట్టి తిరుమలపై వేంచేసియున్న స్వామీ! దాసుడనైన నేను ముల్లోకములను కొలచిన నీ దివ్య పాదారవిందములను చేరుట ఎన్నడో కదా!

విశే:- భగవద్రామానుజులవారును "లోకవిక్రాన్త చరణౌ శరణం తే వ్రజంవిభో" అని తామనుగ్రహించిన శరణాగతి గద్యలో శరణాగతిచేయదగినవి లోకవిక్రాన్త చరణములనియే ప్రస్తుతించిరి.

దాసులకు అమృతమువలె భోగ్యమైనవాడా! దేవాధిదేవా! గరుడధ్వజా! బింబఫలాధరోష్ఠా! స్వామీ! నా పాపములనే వృక్షములను నశింపచేయు ఔషధమా! వేంకటనాయకా! నీ దివ్య పాదారవిందములను సేవించుటకై ఏ నోమును నోచియుండలేదు (నీవే సిద్ధోపాయమని నమ్మియుంటిని) క్షణకాలమైనను నీ విశ్లేషమును సహించి యుండజాలను.

సర్వజ్ఞుడగు నీలకంఠుడు; జ్ఞానశక్తి పూర్ణుడగు చతుర్ముఖుడు దేవేంద్రుడు మొదలగు వారు సాధనానుష్ఠానములేవియు లేకనే నిన్ను సేవింపక యుండజాలక భార్యా సమేతులై వేంకటాచలమును చేరి నిన్ను భజింతురు. అట్టి వేంకటాచలమున వేంచేసియున్న స్వామీ! కృష్ణునిగా అవతరించి వ్యామోహపరచినవాడా! వసుదేవాదులను కటాక్షింప వేంచేసినట్లుగా నీదాసుడనగు నన్నును కటాక్షింప వేంచేయుమా!

వి.శౌ:- బ్రహ్మరుద్రేంద్రాదులు రజ స్తమో గుణ ప్రచురులగుటచే మేమే సర్వేశ్వరులమని భ్రమింతురు. వారిలో సత్త్వగుణము వర్ధిల్లినపుడు సర్వేశ్వరునకు దాసులమని సేవింపవత్తురు అని నంబిళ్లైగారు చెప్పుదురు.

చింతామణి వెలుగుచే రాత్రిగూడ పగలుగా ప్రకాశించు వేంకటాద్రిపై నుండు స్వామీ! మానసానుభూతిచే బాహ్యసంశ్లేషము లభించినట్లు భ్రమింపజేతువు. అట్లని చేయిచాచి

పట్టకొందమన్నచో అందవు. నీవు అందనివాడవని తలచి నిరాశ చేసికొన్నచో నిరంకుశస్వాతంత్ర్యము కలవాడవు కనుక చేతికందునట్లు వేంచేయుదువు. నీ నేత్రారవిందములు భవతాపహరములు. ఆ అధరము బింబఫలము. నీ చతుర్భుజములు పురుషార్థప్రదములు. కావుననే నీవు అమృతమువలె పరమభోగ్యుడవు. నాకు ప్రాణసమానుడవు. స్వామీ! నీ పాదారవిందములను విడచి క్షణకాలమైనను జీవింపజాలను.

పద్మవాసినియగు శ్రీదేవి పద్మవాసముకంటే భోగ్యమైన స్వామి వక్షస్థలమును నిత్యనివాసముగా చేసికొనెను. కావుననే స్వామి శ్రీనివాసుడయ్యెను. శ్రియఃపతిత్వము సర్వేశ్వరుని స్వరూపనిరూపకము. ఆమెపురుషకారభూతురాలు ఈమె పురుషకారము వలన స్వామి సాటిలేని కీర్తివంతుడగును (దోషోయద్యపి తస్యస్యాత్ అని ఆశ్రయించినవారి నందరిని అనుగ్రహించుటచేత) అట్టి కీర్తిగల సర్వలోకేశ్వరా! నాస్వామీ! దేవతలు మునిగణములు కోరి సేవించు వేంకటాచలముపై వెలసిన దేవా! వేరుగతిలేని నేను నీ శ్రీపాదముల క్రింద ఒదిగియుంటిని.

విశే: 1. వాత్సల్యము 2.స్వామిత్వము 3. సౌశీల్యము 4. సౌలభ్యము. ఇవి ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములు.

1. వాత్సల్యము: అనగా దోషభోగ్యత్వము. ఆశ్రయింపవచ్చినవాడు తనదోషములను తలచి భయపడి యుండగా ఆ భయమును పోగొట్టి 'దోషోయద్యపి'' దోషములున్నను పరవాలేదు రమ్మని అని చేరదీయు గుణము.

2. స్వామిత్వమనగా:- తాను స్వామి యగుట చేతను "మనమాతని సొమ్మగుటచేతను తనసొత్తైన మనలను స్వామియగు ఆతడే రక్షించుకొనును '' అని నమ్మికను కలిగించు గుణము.

3. సౌశీల్యము:- ఆయన ఉభయవిభూతినాయకుడు. నేను అత్యల్పుడను అనిభావించి మనము ఆతనిని విడచిపెట్టకుండ చేయునది ఆయన సౌశీల్యం.

4.సౌలభ్యము:- సర్వేశ్వరుని మన చేతికందునట్లు చేయునది ఆయన సౌలభ్యము. నమ్మాళ్వార్లు నిగరిల్ పుగళ్గాయ్ (సాటిలేని కీర్తిగలవాడా!) అనుటచే స్వామియొక్క వాత్సల్యమును; "ఉలగంమున్డుడైయాయ్" (ముల్లోకాధిపతీ!) అనుటచే స్వామిత్వమును, ఎన్నైఆళ్వానే (నన్నేలుకొనువాడా! అనుటచే సౌశీల్యమును; నిగరిల్ అమరర్ మునిక్కణజ్గళ్ విరుమ్బుమ్ తిరువేజ్గడత్తానే! (సాటిలేని మునిగణములు దేవతాగణములు సేవించు వేంకటాచలపతీ!) అనుటచే సౌలభ్యము ప్రకాశింపజేసిరి.

ఇందు "అమరర్" అనుటచే కైంకర్య నిష్ఠులు, మునిక్కణజ్గళ్ అనుటచే గుణానుభవనిష్ఠులు చెప్పబడుదురు.

పుగళ్ ఒన్రు ఇల్లా! (వేరుగతిలేని) అనుటచే శరణాగతునకుండవలసిన ఆకించన్యము; అనన్య గతిత్వము చెప్పబడినవి. ఈ విధముగా ఈ "అగలిగిల్లేన్" అనుపాశురమున ద్వయమందలి పూర్వఖండము వివరింపబడినది (విస్తరభీతిచే సంక్షేపముగా విన్నవించబడినది)

"భక్తులారా! నా శ్రీపాదములనాశ్రయించి తరింపుడని" ("యౌ దర్శితౌ స్వచరణౌ శరణం వ్రజేతి") తన పాదారవిందములను చూపువాడును; నిస్సమాభ్యధికుడునగు శ్రీవేంకటాచలపతిని గూర్చి నమ్మాళ్వార్లు అనుగ్రహించిన యీ పది పాశురములను అనుసంధానము చేయువారు పరమపదమును తప్పక పొందుదురు అని చెప్పి ఆళ్వార్లు ముగించుచున్నారు.

• విశే:- "ఈ విధముగా నమ్మాళ్వార్లు శ్రీవేంకటాచలపతి పాదారవిందములయందు చేసిన శరణాగతియే మనకును రక్షకము. మనము వేరుగ ప్రపత్తిచేయ నవసరములేదు. "సర్వలోకశరణ్యాయ రాఘవాయ మహాత్మనే! నివేదయత మాంక్షిప్రమ్" అని ప్రార్థింపగా శ్రీరామచంద్రమూర్తి విభీషణునితోపాటు ఆతని మంత్రులను కూడ అనుగ్రహించినట్లే శ్రీనివాసుడు నమ్మాళ్వార్లతో పాటు మనలను అనుగ్రహింతురు" అని నంబిళ్ళైగారు చెప్పుదురు.

కావున నమ్మాళ్వార్ల శ్రీపాదముల నాశ్రయించి వారి సంబంధులమని పెరుమాళ్ల సన్నిధిలో విన్నవించుటే మన కర్తవ్యము.

ఈ క్షేత్రమునుగూర్చి మణవాళమహామునులు తిరువాయిమొళ్రినూత్తందాదిలో ఇట్లభివర్ణించియున్నారు.

ఒళ్ళివిలా క్కాలం ఉడనాగి మన్ని
వళ్ళువిలా ఆట్చెయ్య మాలుక్కు - ఎళ్ళుశిగర
వేఙ్గడత్తు ప్పారిత్త మిక్కనలం శేర్ మాఱన్
పూఙ్కళలై నేంజే! పుకళ్.

ఓ! మనసా! సర్వేశ్వరునితో ఎల్లపుడు కలసియుండి మనము సర్వవిధ కైంకర్యములు చేయవలయును అని తిరుమల విషయమై ఆనందించిన నమ్మాళ్వార్ల శ్రీపాదములను స్తుతింపుమా!

ఉలగుయ్యమాల్ నిన్ద ఉయర్ వేఙ్గడత్తే
అలర్మగళై మున్నిట్టు అవన్దన్ - మలరడియే
వన్ శరణాయ్ చ్చేర్న్ద మగిళ్ మాఱన్ తాళినైయే
ఉన్ శరణాయ్ నెఞ్జమే! ఉళ్.

ఓ! మనసా! లోకమును జీవింపచేయుటకై తిరుమలలో వేంచేసియున్న సర్వేశ్వరుని అలర్ మేల్మంగ తాయార్ల పురుషకారముతో ఆశ్రయించి ఆ స్వామి శ్రీపాదములే రక్షకములుగా నమ్మిన వకుళాభరణులైన నమ్మాళ్వార్ల దివ్యపాదారవిందములే నీకు ప్రాప్యమని తలంపుము.

ఆళ్వార్ దివ్య తిరువడిగళే శరణమ్.

శ్రీమతే రామానుజాయనమః

# ఆదినాథస్వామి

సంగీత సాహిత్య కళానిధి, హరికథా చూడామణి
ఉ.వే.శ్రీమాన్. నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యస్వామి
విజయవాడ

శ్లో॥ తాత్కాలికీం స్థితి మవేక్ష్య జడాత్మకానాం
దేవాంతర ప్రణయినా మవనాయ తేషామ్
నారాయణస్య జగదాది నిదానతాదీన్
యో2జిజ్ఞప చ్ఛఠరిపుం తమహం ప్రపద్యే

మానవుడు తన కర్మానుసారముగా పుట్టుచున్నాడు గిట్టుచున్నాడు. దుఃఖముల ననుభవించుచున్నాడు. మరి యీ చక్రమున కంతులేదా? శాశ్వతముగా నీజీవుడా నందమునే అనుభవించు ఉపాయము లేదా? లేకేమి? ఉన్నది. దానిని వేదమే ఆదేశించినది. వేదోపబృంహణములగు ఇతిహాస పురాణములును చెప్పినవి. మరియు "కారణంతు ధ్యేయః"= ఓ జీవుడా! నీవు శాశ్వతానంద రూపమగు మోక్షమును పొందవలెనంటే జగత్తులకు దేవాది సమస్తజీవులకును మూలకారణమయిన వస్తువును ధ్యానింపవలెను." అని వేదాను శాసనము. "నారాయణాద్బ్రహ్మాజాయతే" ఇత్యాది వేదవాక్యములు నారాయణుని వలననే బ్రహ్మరుద్రాది దేవతలు జన్మించిరి" అని ఘంటాపథముగా చెప్పినవి. కనుక సర్వకారణమగు వస్తువు నారాయణుడు. "తమేవం విద్వా నమృత ఇహ భవతి. నాన్యః పంథా విద్యతే2యనాయ" ఇత్యాది వేద వాక్యములు నారాయణుని ఉపాసనమే మోక్షకారణము అని చెప్పినవి.

కృత త్రేతాయుగములలో ప్రాచీన మహర్షులు మొదలగువారు నారాయణుని మాత్రముపాసించి తరించిరి. నారాయణునే పరుడని నమ్మిరి. ద్వాపరము వచ్చినది. ఇది ఈ యుగమునకు పేరు. ఈ పేరు ఎట్లు వచ్చినది? ద్వాపర మనగా సందేహము అని నిఘంటువు చెప్పిన అర్థము. అనగా ఏ ఒక్క విషయము మీద నిశ్చయజ్ఞానము లేక రెండిటి మధ్య నూగులాడుట. ఇది ఉపాసింప దగిన దేవత విషయమున కూడ ఏర్పడినది. కొందరు నారాయణుడు పరుడు(సర్వాధికుడు) అన్నారు. కొందరు రుద్రుడు పరుడన్నారు. కొందరిద్దరును పరులే అన్నారు. అందుచేతనే ఈ యుగము ద్వాపరమైనది. (ఇద్దరు పరులనిన యుగము).

ఇట్టి క్లిష్ట సమయమున వ్యాస పరాశరులు శ్రీశుకుడును నడుము కట్టిరి. విష్ణువే పరదైవము అని చెప్పు విష్ణుపురాణమును పరాశరుడు రచించినాడు. వ్యాసుడు బ్రహ్మసూత్రములను భాగవతమును రచించినాడు. బ్రహ్మసూత్రములు లక్షణము భాగవతము లక్ష్యము. శ్రీశుకుడు నారాయణ కథాశ్రవణమే మోక్షహేతువని పరీక్షిత్తుకు ప్రవచించినాడు.

ద్వాపరాంత మయినది. కాని అంకురించిన శివపరత్వ భావము నిలచి సాగుచున్నది. ఈ సమయమున నమ్మాళ్వార్లు అవతరించిరి. నారాయణుని సేవింపక ఇతర దేవతలను పూజించి జన్మలకు లోనై బాధపడువా రధికముగా వారికి కనబడిరి. నమ్మాళ్వార్లు దయామయులు. మధురకవి చెప్పినట్లు "పొంగల్ల రాగిలుం శెయల్ నన్టాగ త్తిరుత్తిప్పణి కొళ్వాన్ = భగవద్విముఖుల ఆచారమును సరిదిద్ది అనుగ్రహించు దయామయులు. కనుక జనులకు సదుపదేశము చేయ బూనినారు. ఆ ఉపదేశమే తిరువాయ్మొళ్రిలోని నాలుగవ పదిలోని చివరి దశకము.

అవైష్ణవ సంసర్గము అవాంఛనీయము. అనివారిని వదలినచో వారుఅధోగతి పాలగుదురు. కనుక ఉపదేశము ద్వారా వారిని ఆళ్వారు సరిదిద్ద దలచినారు. సన్నిహితులగు కురుకాపురి ఆదినాధప్పెరుమాళ్లనే ప్రాప్యముగా గ్రహించినారు. ఆపాశురార్ధములు క్రమముగా వివరింప బడుచున్నవి.

(1) లోకములు, లోకస్థులు, లోకేశులు, మరి ఎవ్వరూలేని అనాది కాలమున తానొక్కడే ఉండి క్రమముగా బ్రహ్మాది దేవతలను స్వర్గాదిలోకములను, ప్రాణులను సృష్టించిన నారాయణుడుండగా క్షుద్రులగు ఇతర దేవతలను వెదకుచున్నారే?? అయ్యో!!

(2) ఈ పైఅర్ధమునకు ప్రమాణ వేదవాక్యములు కోకొల్లలుగా నున్నవి. ఓ చేతనులారా! మీ రడియాసతో వెదకుచున్న దేవతలను, మిమ్మును సృజించిన నారాయణుడు ఈ కురుకాపురమందు వేంచేసి యున్నాడు. ఈ స్వామిని సేవించి, స్తుతించి, పాడి, ఆడి తరించండి.

(3) లోకములను సృజించి ప్రళయమున తనలో నిముడ్చుకొని మరల కల్పాదియందు బహిర్గతము చేసిన స్వామి ఈ తిరునగరిలో వేంచేసి యున్నాడు. దేవతల కందరికిని అంతర్యామియై నియమించు చున్నాడు. వారందరును ఈ స్వామికే మ్రొక్కుచున్నారు. ఇప్పుడు చెప్పుడు ఎవరి నాశ్రయింపవలెనో?

(4) మీరు పరదేవతలను కొనుచున్న బ్రహ్మరుద్రులకును నారాయణుడే రక్షకుడు. బ్రహ్మకపాలము చేతి నంటి వదలక బాధపడుచున్న రుద్రుని రక్షించినది నారాయణుడే. కనుక లింగమునేల ధరించెదరు? ఫలితమేమి పొందగలరు?

(5) తామస లింగపురాణమును, అవైదికములైన శ్రమణ, శాక్య, జైనమతములను నమ్మకండి. సర్వదేవతలకు అంతర్యామియై కురుకాపురమున వేంచేసిన నారాయణుని నమ్మండి. నేను చెప్పుచున్నది. వేదాక్షరములు. కురుకా నాథుడైన నారాయణుని ఆశ్రయించి స్తుతించండి.

(6) అవైదిక మతములను సృష్టించి కొందరిని దేవతాంతరపరులుగా చేసినదియు నారాయణుడే(తక్కిన లోకములు శూన్యములు కాకుండుట కిది) ఇట్టి భగవన్మాయను తెలియక వ్యామోహముతో వాటిలో చేరి జనన మరణాది దు:ఖము లనుభవించుచున్నారు. మీరు దీనినెరిగి భగవత్ప్రపత్తి నవలంబించి తరించండి.

గమనార్హము = ఒక కాలమున తన లోకము శూన్యము కాగా యముడు హరిని వేడుకొనెను. మరియు తొల్లి నముచిదంభాది రాక్షసులు నారాయణ ప్రపన్నులై జయింపరానివారై

దేవలోకము నాక్రమించిరి. ఇంద్రుడు ప్రార్థింపగా నారాయణుడు మతాంతరములను కల్పిం రాక్షసులను వ్యామోహపరచి వాళ్లను పెడమతము పట్టించెను. దాని వలన ఇంద్రుడు రాక్షసులన సులభముగా జయించెను. యమలోకము కూడ నిలచినది. ఇది పురాణ ప్రసిద్ధ విషయము మీరీ భగవన్మాయనెరిగి వ్యామోహకర మతములను జేరక నారాయణ పూజకులై తరించండి అని.

(7) ఓ చేతనులారా! మీరింతకు ముందు పలుజన్మలెత్తి పలుదేవతల నాశ్రయించి కష్టము లనుభవించినట్లు ఎరిగియే యున్నారు. ఇక జాగుచేయక, నిత్యసూరులు వచ్చి సేవించు కురుకా పురవాసి ఆదినాథ ప్పెరుమాళ్లు యొక్క కైంకర్యములో ప్రవేశించండి.

(8) తన దాస్యమందు ప్రవేశించి తనను నిత్యమును సేవించుచున్న మార్కండేయుని, మరియు రుద్రుని తరింపజేసినది నారాయణుని కృపయే. ఇట్లుండగా వేరుదేవతల కాశపడెదరేల?

గమనార్హము = తాత్కాలిక మృత్యువు నుండి మార్కండేయుని తప్పించినది శివుడే. కాని ప్రళయముందు శివుడూ ఉండడు, కైలాసమూ ఉండదు. బ్రహ్మలోకము వరకును ఉన్నలోకములన్నియు పునరావృత్తిలోకములే అని గీతావాక్యము. కాని మార్కండేయుడు నారాయణ దాస్యము చేతనే శాశ్వతుడై నారాయణుని సేవించుచున్నాడు. ఇది నారాయణుని కృపా ఫలమేకదా!

(9) ఆరు శాస్త్రములు చదివినా, ఆరు మతాలలో చేరినా భగవానుని పొందుట దుర్లభము. అట్టి దుర్లభుడైన స్వామి అందమయిన కురుకాపురిలో ఆదిప్పిరాన్ అనే పేరుతో వెలసి ఉన్నాడు. ఈయనను సేవించి తరించండి.

(10) సమస్త దేవతలు, లోకములు నారాయణుని శరీరములే. అయినను ఆ శరీరముల దోష మంటక వాటి కాత్మయై తన మహిమను వీడక వామనావతార మెత్తి కుంభనృత్య ప్రియుడై కురుకాపురముననున్న ఆదిప్పిరాన్ యొక్క దాస్యము చేయండి.

(11) ఆదిప్పిరాన్ యొక్క దాస్యము చేయుటకు కురుకాపురి ప్రవేశించి ఆ స్వామి ప్రసాదించిన పొగడపూలమాలను ధరించిన శఠగోపులు చెప్పిన ఈ పదిపాశురముల నధ్యయనము జేసిన వారికి వైకుంఠము కరతలామలక మగును.

ఈ విధముగా నమ్మాళ్వార్లు వేద ప్రతిపాదితమయిన పరమార్థము నుపదేశించుట చేత వారు ప్రసాదించిన ప్రబంధములకు ద్రావిడ వేదములనే వ్యవహారము భగవానుడను గ్రహించినదే. పదుగురాళ్వారులలో నమ్మాళ్వారులు ముఖస్థానీయులు. తక్కిన ఆళ్వారులు వారి కవయవభూతులు అని పూర్వాచార్యుల సంప్రదాయము.

తే॥ ఎండమావుల జూచి పర్వెత్తి పోయి
దప్పి తీరని నష్టచేతనుల జూచి
హరిసరస్సును జూపు దయాళువైన
రమ్య శఠగోపసూరియే రక్షమాకు.

శ్రీమతే రామానుజాయనమః
శ్రీమతే శఠ గోపాయనమః

# భగవానుని దివ్య మంగళ విగ్రహ సౌందర్యము

**ఉ.వే.శ్రీమాన్ వంగల వేంకటాచార్యులుస్వామి**
**నర్సాపురం**

శ్రీమన్నమ్మాళ్వార్లు పరమాత్మయొక్క కల్యాణ గుణములను తామను గ్రహించిన తిరువాయ్‌మొళ్ళి అనే దివ్యప్రబంధంలో అద్భుతంగా వేదమాతకు కూడా సాధ్యంకాని రీతిలో అనుసంధానం చేసారు. పరమాత్మ యొక్క వాత్సల్య, సౌశీల్య, పరత్వ, సౌలభ్యాది గుణాల అనుసంధానం చేసిన ఆళ్వార్లు అలాంటి కల్యాణ గుణములు కల స్వామిని మానసికంగా కాక ప్రత్యక్షంగా దర్శించాలనుకున్నారు. పరాత్పరుడైన స్వామి నాకు ప్రత్యక్ష దర్శనమివ్వాలంటే ఏంచేయాలని ఆలోచించగ ఆళ్వార్లు స్వామితో తమకుగల సంబంధాన్ని తెలియజేసారు. తమ (ఆత్మ) స్వరూపం స్వామి (పర) స్వరూపం తెలిసిన ఆళ్వార్లు తమను ఒక స్త్రీగా భావన చేసారు. పురుష సూక్త ప్రతిపాద్యుడైన స్వామి నారాయణుడే పురుషుడు. మిగిలిన ఆత్మలన్నీ స్త్రీప్రాయములు అని శాస్త్రం తెలియజేయడం చేత ఆళ్వార్లు తమను ఒక నాయికగా భావించుకొనినారు. పరమాత్మకు జీవాత్మకు కల సంబంధములలో భర్త భార్యా సంబంధమొకటి.

ఆళ్వార్ నాయికను స్వామి వచ్చి ప్రేమించి పాణిగ్రహణం చేసికొని ఆమెను వదలి తమఊరైన పరమ పదం వెళ్ళినారుట, ఆళ్వార్‌నాయిక స్వామి విశ్లేషాన్ని సహించలేక స్వామి తిరునామాన్ని (పేరు), సౌందర్యాన్ని, గుణాలను అనుసంధానం చేస్తూ ఆయా దివ్య దేశాలలో వేంచేసియున్న పెరుమాళ్ళను సేవించి, ఆ పెరుమాళ్ళ, గుణాలను, సౌందర్యలావణ్యాలను, ఆయుధ అవయవ శోభను వర్ణిస్తూ కొన్ని దశకాలను అనుగ్రహించారు.

అలా అవతరించిన దశకయే ఈ 'ఎజ్ఞనేయో' అనేదశకం. ఈ దశకంలో "తిరుక్కురుంఙ్గుడి" అనేదివ్యదేశంలో వేంచేసియున్న నమ్బి అనే పెరుమాళ్ళ యొక్క గుణ, సౌందర్య, ఆయుధశోభలను వర్ణించారు. "నమ్బి" అంటే పరిపూర్ణుడు అని అర్థం. ఈ దివ్యదేశంలో వేంచేసిన స్వామి పూర్ణుడుట. పూర్ణుడంటే పూర్తి కల్గినవాడు. ఈ దివ్యదేశమునకు "వైష్ణవ వామనక్షేత్ర"మని సిద్ధాశ్రమమని తిరునామములు కలవు. ఈ స్వామికి వైష్ణవ నమ్బి అని తిరునామము. ఇక్కడి పెరుమాళ్ళకు వైష్ణవత్వం పూర్తిగా ఉందిట అందుకే ఈ క్షేత్రం వైష్ణవ వామన క్షేత్రమని, ఈ స్వామిని "వైష్ణవ నమ్బి" అని వ్యవహరిస్తారు. స్వామి త్రివిక్రమావతారం ఎత్తి బలిని పాతాళానికి అణగద్రొక్కిన అనన్తరం. ఇక్కడ వామనుడిగా తపస్సు చేసుకున్నాడుట. ఇదే వామనుని సిద్ధాశ్రమం.

"కురియవన్కుడి'' అన్నారు మన పెద్దలు అనగా (పొట్టివాడైన వామనుని ఇల్లు) కురంగుడి అని అర్థం. వామన స్వామి వైష్ణవత్వం పూర్తిగా కల్గినవాడుట. వైష్ణవత్వం అంటే ఏమిటి అని ఒకసారి నంజీయరనే పెద్దలను ఎంబార్లు అనేవారు ప్రశ్నించారుట. దానికి వారు ఎదుటి వాడి కష్టాన్ని చూచి సహించలేని వాడు ఎవడో వాడే వైష్ణవుడు అని అనుగ్రహించారుట. దేవతల కష్టం చూచి సహించలేక పరాత్పరుడైన స్వామి తన గొప్పతనాన్ని తగ్గించుకొని పొట్టివాడుగా యాచకుడుగా మారి బలివద్ద యాచన చేసి బలి గర్వమణిచాడు. అందుచేతనే ఆయన వైష్ణవుడయ్యాడు. అంతేకాక భగవద్రామానుజ సంబంధం కలవారే వైష్ణవులు అని మన పూర్వాచార్యుల నిర్వాహకం. వైష్ణవనమ్బి భగవద్రామానుజుల నాశ్రయించి వారినుండి మంత్రోపదేశం పొంది సకల వేదాన్తార్థములను గ్రహించి "నాముమ్ నమ్మిరామానుశ ముడయోమ్" అని మేము భగవద్రామానుజుల శిష్యులమైతిమి ధన్యోస్మి అని ఆనందంతో ప్రకటించారుట. కావుననే ఈ స్వామికి వైష్ణవనమ్బి అనితిరునామం, ఈక్షేత్రానికి వైష్ణవ వామన క్షేత్రమనే తిరునామం ప్రసిద్ధమయ్యెనని భగవద్రామానుజ చరిత్రలో ప్రసిద్ధ ఐతిహ్యం. దీనికి గుర్తుగానే ఈ క్షేత్రంలో భగవద్రామనుజులు తిరుమలలోవలె జ్ఞానముద్రతో వేంచేసియుంటారు.

ఈ క్షేత్రంలో స్వామి వైష్ణవనమ్బి, (వైష్ణవవృత్తి కలవారు) మలైయేల్ (కొండపైన వేంచేసినవారు) నమ్బి నిన్తనమ్బి, ఇరుందనమ్బి, కిడన్దనమ్బి అను పంచ రూపములతో వేంచేసియుంటారుట. భక్తులననుగ్రహించడం కోసం స్వామి అనేక రూపాలతో పడే పాట్లను (భక్తవాత్సల్యాన్ని) తెలిపేవే ఈ పంచా కృతులు.

ఈ దివ్య దేశము మిక్కిలి ప్రభావకరమైనది. ఈ దివ్యదేశములో వేంచేసియున్న స్వామి సంతానప్రదుడు. ఈ స్వామిని ప్రార్థించియే నమ్మాళ్వార్ల జననీ జనకులు ఆళ్వార్లను సన్తానముగా పొందినారని ప్రసిద్ధమైన ఐతిహ్యము.

ఆచార్య హృదయకారులు ఈ దివ్యదేశం గురించి అనుగ్రహిస్తూ "వైష్ణవ వామనత్తిల్ నిఱైన్ద నీలమేనియిన్ రుచి జనక విభవలావణ్యాపూర్ణమ్" అని అనుగ్రహించారు. అంటే వైష్ణవ వామన క్షేత్రమనబడే తిరుక్కురుఙ్గుడి అనే దివ్యదేశము నందు ఆసక్తి కల్గించే విభవావతార లావణ్యంతో నిండియున్న నీలమేనిచ్ఛాయతో నిండియున్న స్వామి అని అర్థం. ఈ దివ్య దేశంలో స్వామి విభవావతారంలో అంటే రామకృష్ణాది అవతారములలో వలె సౌందర్య లావణ్యములు పూర్తిగా కల్గినవాడట. "శ్రీమన్తౌ రూప సంపన్నౌ" గొప్పకాంతితో కూడిన రూప సంపన్నుడు "శోభయన్ దండకారణ్యం" రామప్రవేశంతో దండకారణ్యం శోభించింది "రూప సంహననమ్ లక్ష్మీం సౌకుమార్యం

సువేషతామ్। దదృశుః విస్మితాకారాః రామస్యవనవాసినః" వనవాసులు రామచంద్రుని యొక్క కాంతి సౌకుమార్య సువేష రూపములను దర్శించి విస్మితాకారులయ్యారుట అన్నట్లు అలాంటి విభవావతార సౌందర్యము ఈ దివ్యదేశంలో ఉందట.

ఈ స్వామి సౌందర్యము ఎలాంటిది అంటే రామ వియోగంతో అశోకవనంలోయున్న సీతమ్మకు ఎలాగైతే అక్కడి రాక్షస స్త్రీలు, పుష్పఫలాలతో నిండియున్న చెట్లుగాని కనపడక మనస్సులో రామచంద్రునే పెట్టుకుని రామునే సేవిస్తున్నది అన్నట్లుగా. ఆళ్వార్నాయికకు కూడా కేవలం ఈ తిరుక్కురుంగుడిలో స్వామి తప్ప ఆమెకు వేరే వస్తువులు గాని వ్యక్తులుగాని కనపడటం లేదట. కేవలం స్వామి, ఆ స్వామియొక్క ఆయుధ ఆభరణములు మాత్రమే దర్శనమవుతున్నాయిట.

గొప్ప సౌందర్యం కల్గిన ఈ స్వామిని సేవించకుండా ఆళ్వార్నాయిక వంశంలో వారెవరూ ఉండరుట. అలాంటి స్వామిని ఆళ్వార్నాయికచే సేవింపజేసారు ఆమె తల్లితండ్రులు. అంతే అప్పటి నుంచి ఆళ్వార్నాయిక సర్వకాల సర్వావస్థలయందు ఆ స్వామియొక్క నామ, రూప, గుణాను సంధానం చేస్తూ ఉండేది. అలాంటి ఆమెను చూచిన తల్లి బంధులు ఆమెను అమ్మా మరీ ఇలా ప్రవర్తించడం నీకు తగదు అలాగే స్వామి స్థితికి కూడా తగదు లోకులు నిందిస్తారు. అని హితవచనాలు చెప్పి ఆళ్వార్నాయికను ఈ స్వామి విషయంలోంచి మరలించడానికి ప్రయత్నం చేసారుట. దానికి ఆళ్వార్నాయిక ఓ తల్లీ బంధువులారా మీకు అర్చావతారం యొక్క గొప్పదనం అర్చాస్థలం గొప్పదనం తెలియదు. "నిఱైన్దశోదివెళ్ళమ్ శూழ్న్ద నీణ్డ పొన్మేనియోడు" కాంతి ప్రవాహంతో నిండియున్న స్పృహణీయమైన నీలదేహంతో వేంచేసియున్నవాడు "నఙ్గళ్ కోల తిరుక్కురంఙ్గుడి నమ్బియై" మన అందమైన తిరుక్కురుఙ్గుడి యందు వేంచేసియున్న నమ్బిని, "తెన్నన్‌శోలై తిరుక్కురుఙ్గుడి నమ్బియై" దక్షిణమువైపునున్న శ్లాఘ్యమైన తోటలతో నిండియున్న తిరుక్కురుఙ్గుడి నమ్బిని, "కున్ఱమాడ తిరుక్కురుఙ్గుడి నమ్బియై" పర్వతములవలెనున్న పెద్దమేడలు కల తిరుక్కురుఙ్గుడి నమ్బిని, "తేన్గొళ్‌శోలై తిరుక్కురుఙ్గుడి నమ్బియై" తేనెగల తోటలతో నిండియున్న తిరుక్కురుంగుడి నమ్బిని, "నాన్‌కణ్డపిన్" నేను సేవించిన తర్వాత మీ మాటలు చెవికెక్కవు నాకు ఆస్వామి యొక్క దివ్యసౌందర్యమే కన్నుల ముందు దర్శనమౌతోంది.

ఆ స్వామి ఎలాంటివాడో తెలుసా ఓ తల్లులరా చేతిలో చక్రాయుధము, పాంచజన్యము, విల్లు, గద, ఖడ్గము మొదలైన పంచాయుధములు ఆభరణముగా కలవాడు. నీలమేఘచ్ఛాయగల శరీరం కలవాడు, చతుర్భుజములు కలవాడు అందమైన తీగవంటి నాసిక కలవాడు, తామరలవంటి నేత్రములు కలవాడు, దొండపండు వంటి అధరము కలవాడు, పొడుగైన కేశపాశములు కలవాడు, దీర్ఘమైన రత్నమయ కిరీటము కలవాడు,

అసంఖ్యేయములైన తిరువాభరణములు కలవాడు. ప్రకాశించే యజ్ఞోపవీతము కలవాడు, కాంతిని వెదజల్లే మకరకుండలములు కలవాడు తేజస్సుతో చుట్టబడినవాడు బంగారము వంటి దివ్య దేహచ్ఛాయ కలవాడు, చెఱుకుపాకము, పాలు, అమృతము వలె నిరతిశయ భోగ్యతగల తిరుక్కురుఙ్గుడి స్వామి సౌందర్యాన్ని సేవించిన నన్ను మీరు ఎట్లు మరలించగలరు. నన్ను సర్వకాల సర్వావస్థల యందు ఆ స్వామి యొక్క రూప లావణ్య సౌందర్యాదులు నిలవనీయడం లేదు నన్ను అనేక రూపాలుగా బాధిస్తున్నాయి నామనస్సును పిండేస్తున్నాయి.

ఓ తల్లులారా! మీరు నాకు హితం చెబుతున్నారు కాని ఏదైనా ఒక వ్యాధిని నివారించాలంటే దీనికి కారణం తెల్సుకుని నివారించాలి కదా! కావున మీరు నిందించవలసినది నన్ను కాదు. నాకు ఈ వ్యామోహాన్ని కల్గించిన నమ్బియొక్క సౌందర్యాన్ని మీరు నిందించాలి. అయినా మీరే ఆస్వామిని వదలకుండా సేవిస్తూ కీర్తిస్తున్నారు. అలాంటి మీరు నన్ను ఎట్లు నిందిస్తారు? నేను పరమ పురుషుని నామాను సంధానం చేసే పెద్దలను ఒక క్షణం కూడా విడచి వుండలేక ఎప్పుడూ వారి సేవచేసే వారి యొక్క వంశంలో జన్మించిన దానిని. ఈ వంశాచారం నేను తప్పి ప్రవర్తించితే కదా మీరు నన్ను నిందించవలసినది. మీరు ఎన్ని చెప్పినా ఆ స్వామి సౌందర్యం నన్ను పరవశురాలుని చేసింది. నీరు వెళ్ళిన తరువాత ఆనకట్ట కట్టినట్లుగా నేను స్వామిని సేవించకముందు మీరు జాగ్రత్త పడాలిగాని సేవించిన తర్వాత నన్ను మరలించ గలరా! సాధ్యమేనా! అంటూ స్వామి దివ్యసౌందర్యాన్ని వర్ణించారు.

తామరతో వికాస, సౌకుమార్య, శైత్యాదులతో పోటీపడే తిరునేత్రములు కలవాడు పగడము వంటి మందస్మితంతో అందర్నీ తనవారిగా చేసుకునే చిరునవ్వు కలవాడు. మన కష్టాలను మరపింప జేసేదే స్వామి చిరునవ్వు. అన్ని వస్తువులలోను స్వామి వ్యాపించి ఉంటే నా మనస్సు స్వామియొక్క ఒక్కొక్క అవయవ సౌందర్యంలో నిమగ్నమై ఉన్నది. నా మనస్సు స్వామి సౌందర్యాన్ని పరిపూర్ణంగా దర్శించినది కావున ఓ తల్లులారా! నన్ను నమ్బి నామానుసంధానం చేయనివ్వండి అంటూ తిరుక్కురుఙ్గుడి నమ్బి సౌందర్యాన్ని నమ్మాళ్వార్లు ఎఙ్గనేయో అనే దశకంలో వర్ణించారు. ఈ సౌందర్యం విభవావతార సౌందర్యాన్నే మించినది అన్నారు ఆళ్వార్లు.

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ఈ "ఎఙ్గనేయో" అనే 5వ తిరువాయిమొழிలో 5వ దశకం అనుసంధానం చేసినవారు "ఆళ్కడల్ జ్ఞానతుళ్ళే వైష్ణవర్" సముద్రముచే చుట్టబడిన ఈ భూమిపైనే వైష్ణవశ్రీని పొందుతారు అంటే ఈ భూమిపై నున్నప్పటికీ పరమపదంలో ఉండే నిత్యసూరులతో సమానులగుతున్నారు. వైకుంఠం వాసంకన్నా ఈ దివ్యదేశ వాసం గొప్పది అని నమ్మాళ్వార్లు ఫలశ్రుతిగా అనుగ్రహించినారు.

శ్రీరంగనాథ పరబ్రహ్మణే నమః
శ్రీమతే శఠకోపాయనమః - శ్రీమతే రామానుజాయనమః
శ్రీమద్వరవర యోగినే నమః - శ్రీవానాచల మహాయోగినే నమః

# వానమామలై

**విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ కె.టి.రామానుజాచార్యస్వామి**
ఎమ్.ఎ. నెల్లూరు.

శ్లో॥ పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్తసార్వజ్ఞ్య సంపదమ్ ।
ప్రపన్నజన కూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశమ్ ॥

ఆళ్వార్లచే మంగళా శాసనము గావింపబడిన నూటఎనిమిది దివ్యదేశములలో శ్రీవానమామలై క్షేత్రము ఒకటి. అష్టస్వయం వ్యక్త క్షేత్రములలో ఈ క్షేత్రము ఒకటిగా ప్రసిద్ధి నొందియున్నది. ఈ దివ్య దేశ వైభవము బ్రహ్మాండ పురాణములో విస్తృతముగ గలదు. ఈ క్షేత్రమునకు తోతాద్రి, వానమామలై, శిరీవరమంగలనగర్ (శ్రీవల్లీ -నగరము), నాంగునేరి అనుపేర్లు గలవు. శిరీవరమంగల నగర్, వానమామలై అను దివ్యనామములను ఆళ్వార్లు పేర్కొనియున్నారు. ఈ క్షేత్రము పాండ్యనాడులో నున్నది. ఈ క్షేత్రమున వేంచేసియున్న స్వామి పేరు దైవనాయకన్. వీరికి వానమామలై తోతాద్రి పెరుమాళ్ అనియు వ్యవహారము కలదు. "దైవనాయకన్ నారణన్" అనియు, "వానమామలైయే అడియేన్ తొழுవందరుళే" అనియు పై దివ్యనామములను ఆళ్వార్లు కీర్తించియున్నారు. "శ్రీవరమంగై" అని తాయార్ల (అమ్మవారి)పేరు. వీరి పేరుతోనే ఈ దివ్యక్షేత్రమేర్పడినది. ఇచట "శేత్తుత్తామరై" అను పుణ్యతీర్థము కలదు. "శేత్తుత్తామరై శెన్నలూడమలర్" అని ఆళ్వార్లు ఈ పుణ్యతీర్థమునకు మంగళాశాసనము చేసియున్నారు. ఈ క్షేత్రమున తియ్యమామిడి తోపులు అధికము. "తేనె మాంబొழிల్ తణ్ శిరీవరమంగలత్తవర్" అని ఈ మామిడి తోపుల సమృద్ధి ఆళ్వార్లచే కొనియాడబడినది. అత్యున్నత సౌధములతోను చక్కని పంటపొలములతోను జలసమృద్ధితోను అలరారు ఈ క్షేత్రము వేదవేదాంతవిదులగు శ్రీవైష్ణవ భక్తాగ్రేసరులకు వాసయోగ్యమైనది. దైవనాయకప్పెరుమాళ్ళను భూమి నుండి పైకి వేంచేపింప చేయునపుడు వారి తిరుమేనికి గాయమైనదట. దాని ఉపశాంతికై ఇచట ప్రతి నిత్యము స్వామివారికి తైలాభిషేకము జరుగను. ఈ నూనెను ఔషధముగ వాడుచుందురు. శ్రీభగవద్రామానుజ సిద్ధాంత ప్రవర్తకులును, శ్రీమణవాళమహామునుల అష్టదిగ్గజములలో ప్రముఖులునగు శ్రీవానమామలై జీయర్‌స్వామివారి ప్రధాన మఠము ఈ క్షేత్రముననే కలదు. ఈ సన్నిధి ధర్మకర్తృత్వము వీరి అధీనముననే ఉన్నది. ఈ పెరుమాళ్ళ విషయముగ నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొழி 5వ పదిలో 7వ దశకమునను గ్రహించిరి. ఆళ్వార్లు ఈ పెరుమాళ్ సన్నిధిలోనే ప్రథమ శరణాగతిని గావించిరి.

ఈ క్షేత్రములో వేంచేసియున్న స్వామిలో ఔదార్యగుణము అత్యధికముగ

ప్రకాశించు చున్నదని'' రుచివివశర్కుప్పాదమే శరణాక్కుం ఔదార్యగుణము వానమామలైలో ప్రకాశించుచున్నదని'' అళగియ మణవాళనాయనార్' అను ఆచార్యవర్యులు తమ ఆచార్య హృదయమున పేర్కొనియున్నారు.

1. "కడల్ ఞాలమ్" అను 5.6. దశకమున నమ్మాళ్వార్లు భగవంతుని గుణవిభూతి ఐశ్వర్యములను అనుకరించి యయినను ఆత్మధారణము చేయదలచినారు. అయినను వారి మనోరథము సఫలము కానందున తమను సర్వేశ్వరుడు ఇట్లుపేక్షించుటకు గల కారణమేమియై యుండునా అని చింతించిరి. తమలో భగవత్ప్రాప్తి సాధనములగు కర్మజ్ఞాన భక్త్యాదులు ఇసుమంతయైనను లేవు. ఇవి లేకున్నను భగవంతుని వీడి ఒక్క క్షణమైనను ఉండలేని ఆర్తిమాత్రము మిక్కుటముగ తమకున్నందున "దేవాధిదేవ! నిన్ను వీడి ఉండలేని నా ఆర్తిని జూచి నన్ననుగ్రహింపుము. నన్ను కరుణించుటకే కదా నీవు ఈ వానమామలై క్షేత్రములో నిత్యవాసము చేయుచున్నావు. నీకు శేషభూతమగు ఈ వస్తువును ఉపేక్షించినచో తప్పునాదే అగును సుమా! నన్ను త్యజింపకుము. తప్పక నన్ను కరుణింపుము'' అనిప్రార్థించి వానాచల ప్రియుని శ్రీపాదములలో శరణాగతి చేయుచున్నారు. తిరువాయ్మొళ్ళి దివ్యప్రబంధమున ఆళ్వార్లు అయిదు దశకములలో భగవంతుని చరణారవిందములలో శరణాగతిని కావించినారు.

1. "నోత్తనోన్బిలేన్"- 5.7. వానమామలై క్షేత్రము. అర్చావతారమున శరణాగతి "ఆఱెనక్కునిన్ పాదమే శరణాగత్తన్దొళిందాయ్'' 5.7.10.

2. ఆరావముదే 5.8. తిరుక్కుడందై (కుంభకోణక్షేత్రము) విభవావతారమున (శ్రీకృష్ణావతారము) శరణాగతి. "ఉళలైయెన్బిల్ పేయ్చ్చిములై యూడు అవళైయు యిరుండాన్! కళల్ కళవైయే శరణాకక్కొండ. 5.8.11

3. "మానేయ్ నోక్కు" 5.9 తిరువల్లవాళ్ దివ్యదేశము. పరత్వమున శరణాగతి. "నామంగళాయిర ముడైయ నంబెరుమా నడిమేల్" 5.9.11.

4. "పిఱందవారుమ్" 5.10 క్షీరాబ్ధిలోని వ్యూహామూర్తి విషయమున శరణాగతి. నాగణమిశై నంబిరాన్ శరణే శరణ్ 5.10.11.

5. "ఉలగముండ పెరువాయా" 6.10. శ్రీ వేంకటాచలపతి సన్నిధిలో మహాలక్ష్మిని మున్నిడుకొని చేసిన పూర్ణశరణాగతి. "అగలగిల్లేన్..... ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే" 6.10.9.

శరణ్య లక్షణములు శరణాగతుని లక్షణములు "నోత్తనోన్బిలేన్" అనుదశకమున వివరింపబడినవి. శరణ్య లక్షణములు 10.

1. ఆశ్రితులను సంశ్లేషించు స్వభావమును కల్గియుండుట.
2. అనిష్టనివృత్తి గావించుట
3. పరత్వమును ప్రకాశింపజేయు అసాధారణ లక్షణములను కల్గియుండుట.
4. ఆశ్రితులను సంరక్షించు క్రమము.
5. ఆశ్రిత విరోధి నిరసనము.

6. ఆశ్రితులకు ఉపకరించినందున తిరుమేనిలో కలుగు ఔజ్జ్వల్యము.
7. అఖిల జీవకోటికి సత్తాకారకుడుగ నుండుట.
8. ఆశ్రిత విరోధులగు ఇంద్రియములను తన అధీనమున నుంచుకొని యుండుట.
9. విరోధి నిరసనము చేసినందున ఆతనిలో కల్గు ఔజ్జ్వల్యము.
10. విరోధి నివర్తన పూర్వకముగ ఉపాయభూతుడగుట.

శరణాగతుని లక్షణములు 3.

1. ఆకించన్యము 2. అనన్య గతిత్వము 3. అశరణ్యత్వము.

"నోత్తనోన్బిలేన్" అనినందున భగవత్ప్రాప్తి సాధనమగు కర్మయోగము లేదనుట. "నుణ్ణరువిలేన్" అనినందున ఉపాయ భూత జ్ఞానయోగము లేదనుట. పైరెండును లేవనినందున వీని వలన కలుగు భక్తి యోగము సైతము లేదనుట. ఈ విధముగ ఈ పాశురమున శరణాగతునికి ఉండవలసిన ఆకించన్యము అనన్య గతిత్వము అనన్య శరణత్వము అనులక్షణములు పేర్కొనబడినవి. భగవత్ప్రాప్తికి సాధనము భగవంతుని నిర్హేతుక కృపయే గాని మనమాచరించు కర్మయోగాదులు కావు. ప్రపన్నుడు కర్మయోగాదులను మోక్షోపాయ బుద్ధ్యాగాక స్వరూపానురూప కైంకర్యబుద్ధ్యా మాత్రమే ఆచరించును. శ్రీవిభీషణుడు సముద్రతీరమున శ్రీరామచంద్రుని శ్రీపాదసన్నిధిలో రామ! నేను దుర్మార్గుడగు రావణుని సోదరుడను అని విన్నవించుకొనెను. విభీషణుడు శ్రీరామచంద్రుని కటాక్షమునకు పాత్రుడగుటకు ఆతని ఈ నైచ్యాను సంధానమే కారణమైనది. అటులనే ఆళ్వార్లు "నోత్తనోన్బిలేన్ నుణ్ణరి విలేన్" అని తమ ఉపాయ శూన్యతను భగవత్సన్నిధిలో విన్నవించుకొని" ఆకిలుం ఇనియున్నైవిట్టు ఒన్నుమ్ ఆత్తకిల్కిన్నిలేన్" అయినను నన్నువీడి ఒక్క క్షణమైనను ఉండలేక పోవుచున్నాను. అని తమకుగల ఆర్త్యతిశయమును తెల్పియున్నారు. ఆళ్వార్లకుగల ఈ ఆర్తి సాధన కోటిలో చేరక కాలక్షేపమునకు మాత్రమే కారణమైయున్నది. భగవత్ప్రాప్తి సాధనము లేవియు తమయొద్ద లేవనియు తమకుగల ఆర్తి కేవలము భగవత్కృపామూలముగ గల్గినదనియు ఇందు విన్నవించుకొనుచున్నారు. ఆళ్వార్లకు ఈ జన్మలో కర్మజ్ఞానాదులు లేకున్నను పూర్వజన్మల యందలి కర్మజ్ఞానాదుల వలన ప్రస్తుత జన్మలో వారికి భక్తి కల్గవచ్చును కదా? అనిన అవియేవియును కూడ లేవని విజ్ఞాపనము చేయుచున్నారు. 'భక్తిశ్చ జ్ఞానవిశేషః' భక్తియును జ్ఞానవిశేషమే అని పేర్కొని యున్నందున అట్టి జ్ఞానము సాధనము కావచ్చును గదా? అనిన అటువంటి భక్తియు తమకు లేదనిరి. పోనీ....... స్నేహ పూర్వమనుధ్యానం భక్తిః "స్నేహ పూర్వకముగ చేయుధ్యానము భక్తి అనియున్నందున అట్టి భక్తి కలదు కదా? అనిన తమకు కల్గిన ఈ భక్తి సాధనము కాదని తెల్పిరి. కర్మజ్ఞాన భక్త్యాదులలో ఒకదానిని ప్రధానముగను మిగిలిన రెంటిని దానికి అంగముగ చేసికొనిన భక్తాగ్రేసరులు పురాణములలో పలువురు కానవత్తురు.

జ్ఞాన భక్త్యన్వితం కర్మ జనకాదిషు దృశ్యతే ।

కర్మ భక్త్యన్వితం జ్ఞానం ప్రాయేణ భరతాదిషు ।
కర్మ జ్ఞానాన్వితా భక్తిః ప్రహ్లాద ప్రముఖాశ్రయా ॥

జనక చక్రవర్తి జ్ఞానభక్తులతో కూడిన కర్మానుష్ఠానము కావించిన కర్మరుడు. భరతుడు కర్మ భక్తులతో కూడిన జ్ఞాని. ప్రహ్లాదుడు జ్ఞానకర్మములతో కూడిన భక్తికలవాడు. ఆళ్వార్లు వీరివలె దేనినీ ఉపాయముగ చేసికొనినవారు కారు.

1. స్వామీ! నీవు పరమపదము నుండి ఈ వానాచల క్షేత్రమునకు వేంచేసినది ఆశ్రిత సంరక్షణార్థమే కదా? కావున నీ ఆశ్రిత వర్గములోని నన్ను నీవు రక్షింపక తప్పదని మొదటి పాశురములో ప్రార్థించిరి. "శిరీవరమంగలనగర్ వీత్తిరున్ద వెన్దాయ్" శిరీవరమంగల నగర్‌లో (వానమామలైలో) వేంచేసియున్న పరమోపకారకుడా! అని పేర్కొని యున్నందున భగవంతునిలోని ఆశ్రిత సంశ్లేషైక స్వభావము తెలుపబడినది.

2. ఉపాసకులు 1 ఆరబ్ధయోగులు 2. ఆరూఢయోగులు అని ఇరువర్గములుగా నుందురు. భగవత్ప్రాప్తికై సాధనానుష్ఠానమును ఆరంభించినవారు ఆరబ్ధయోగులు. సాధనముల ననుష్ఠించి ఫలానుభవమునకై నిరీక్షించువారు ఆరూఢయోగులు. ఈ రెండవ పాశురమున "అంగుత్తేనల్లేన్" పరమపదమున నున్నవాడను కాను. అనినందున ఆరూఢ యోగలకోటికి చెందినవాడను కాను"ఇంగుత్తేనల్లేన్" సంసారులతో చేరియుండు వాడనుకాను. అనినందున ఆరబ్దయోగుల కోటికి చెందినవాడను కాను అని అనుటచేత ఆళ్వార్లు మొదటి పాశురములో ననుగ్రహించిన ఉపాయ శూన్యతను భంగ్యంతరమున ఇందు తెల్పినారు. లంకా విధ్వంసనము చేసిన స్వామీ! నేను నీ చరణారవిందములను ఆశ్రయించిన వాడను కాను. నిన్ను పొందుటకు తగిన ఉపాయములను అనుష్ఠించిన వాడను కాను. నిన్ను సందర్శించవలెనను ప్రేమసాగర నిమగ్నుడనైన నేను ఇక ఏ ఉపాయములనూ అనుష్ఠించలేను. నిన్ను చేరుటలోగల ప్రతిబంధకములనన్నింటినీ నీవే పోగొట్టి, నన్నేలుకొనుమా "ఇలంగైశెత్తవమ్మానే" లంకా నగరమును ధ్వంసము చేసిన స్వామీ! అనినందున సర్వేశ్వరునిలోని అనిష్టనివర్తకత్వమను గుణము ప్రతిపాదింపబడినది.

3. పరత్వ ప్రకాశక చక్రధారీ! గరుడధ్వజా! నీలమేఘవర్ణా! అచిత్ర్వాయడనగు నన్ను నిర్హేతుక కృపతో నీ కైంకర్యోపయుక్తునిగా చేసితివి. దీనికి నేను చేయగల ప్రత్యుపకారము ఏదియును కానరాదు. "కరుళప్పుట్కొడి శక్కరప్పడై వాననాడ వెఙ్కార్ ముగిల్‌వణ్ణా!" గరుత్మంతుని ధ్వజముగను, శ్రీ సుదర్శనమును ఆయుధముగను పరమపదమును నివాస స్థానముగను గల నీలమేఘవర్ణా! అని సంబోధించినందున పరత్వమును ప్రకాశింపజేయు అసాధారణ లక్షణములను తెల్పినట్లైనది.

4. ఆశ్రిత సంరక్షణకై స్వభావుడగు శ్రీమన్నారాయణుని ఏ సాధనానుష్ఠానముతో పొందగలమని నాల్గవ పాశురమున ఆళ్వార్లు ప్రశ్నించుచున్నారు. "మాఱుశేర్ పడైనూత్తవర్ మంగ వోరైవర్కాయ్ అన్ను మాయప్పోర్ పణ్ణి నీఱు శెయ్‌ద వెందాయ్ నిలం కీండవమ్మానే'

పాండవ పక్షపాతివై అసహాయ శూరుడవై కపట యుద్ధముజేసి దుర్యోధనాదులను నూర్గురిని భస్మముచేసిన స్వామీ! ప్రళయార్ణవము నుండి భూమిని ఉద్ధరించిన మహోపకారకా! అని నందున భగవంతునిలోని ఆశ్రిత సంరక్షకత్వము అనుగుణము వర్ణింపబడినది.

5. స్వామీ! ఆశ్రిత విరోధులగు అసురులలో నాస్తిక భావమును కల్గించి వారిని మట్టుపెట్టిన నీవు నీ భక్తుల కొఱకు శ్రీవానమామలై క్షేత్రమున వేంచేసియుండుటను సేవించితిని. ఇట్టి నిన్ను పొందుటకు నేను స్వప్రయత్నములు గావించుట మన ఉభయులకు అనురూపము కాదు" అని వేడుకొనుచున్నారు. "కైతవంగళ్ శెయ్యుమ్ కరిమేని యమ్మానే" "అసురులలో నాస్తిక భావములను ప్రచారముచేయు నల్లనయ్యా' అనుటచేత ఇది **అతని** కళ్యాణ గుణముల లోనిదే అగుచున్నది.

6. భగవంతుడు తన శ్రీపాదములనాశ్రయించినవారికుపకరించి ఆ ఆనందముతో మిక్కిలి ప్రకాశించుచుండును. అతడు భూమ్యుద్ధరణము చేసిన మహోపకారకుడు. అటువంటి స్వామిని తామున్న తావునకు వచ్చి తమకు దర్శన మహాభాగ్యమును కల్గించమని ప్రార్థించుచున్నారు. "ఏనమాయ్ నిలంకీండ ఎన్నప్పనే కణ్ణా వెన్ను మైన్నెయాళుడై! వాన నాయకనే మణి మాణిక్కచ్చుడరే" వరాహరూపియై భూమ్యుద్ధరణము గావించిన నా స్వామీ! శ్రీకృష్ణా! నన్ను దాసునిగ చేసికొనిన స్వామీ! శ్రీవైకుంఠనాథా! శ్లాఘ్యమగు నీలమణి వలె ప్రకాశించువాడా! అని పేర్కొనినందున భగవంతునిలోని భక్తులకుపకరించి ప్రకాశించుగుణము విశదీకరించబడినది.

7. సకల పదార్థములకు సత్తను కలిగించునటువంటి స్వామీ! నాకు నీతో విశ్లేషము కల్గించి నా అస్తిత్వమునకే భంగము కల్గింపకుమా! అని ఈ పాశురములో ఆళ్వార్లు ప్రార్థించుచున్నారు. "ఉలగుక్కోర్ ముందైత్తాయ్ తందైయే ముఝవేఝలకు ముండాయ్" లోకములకు తండ్రియైనవాడా! ప్రళయ కాలమున జగములను ఆరగించినవాడా! అని అనుసంధించి నందున భగవంతుని అఖిలసత్తా హేతుత్వము ఇందు ప్రతిపాదితము. ఒక మారు శ్రీభట్టరువారు నంజీయర్ వారిని "వన్దరుళి ఎన్నింజిడం కొండు" అను ఈ పాశురమును గానము చేయమనిరట. నంజీయర్ గానముచేయగా విని భట్టర్వారు యమనియమాదులను అభ్యసించి పెరుమాళ్ళనే ధ్యానించినను ద్రవింపక శిలవలె కఠినములుగ నుండు హృదయములు సైతము ద్రవించునట్లు నమ్మాళ్వార్లు ఈ పాశురమును అనుగ్రహించిరి కదా! అని ఈ పాశురమును కొనియాడిరట.

8. ప్రతికూలురు నిన్ను చేరకుండుటకై సృజించిన ఈ సంసారములో నన్ను పడియుండనీయక నా పాపములను నశింపజేయుము స్వామీ! అని ఆళ్వార్లు ఈ పాశురములో ప్రార్థించుచున్నారు. "అకత్త నీవైత్త మాయ వల్లైంబులన్గళ్" భక్తిలేనివారిని దూరముగ విడచుటకై నీవు ఏర్పరచిన పంచేంద్రియములు" అనినందున ఆశ్రిత విరోధములు సైతము భగవదధీనములే అను విషయము నిరూపితమగుచున్నది.

9. విరోధి నిరసనముచే అత్యుజ్జ్వలముగ ప్రకాశించు వానాచలాధీశ! నేను

జీవించునట్లు అనుగ్రహింపుమా! "పుళ్ళిన్ వాయ్ పిళందాయ్ మరుతిడైపోయినాయ్ విరుతేర్ద్రదర్త వెన్గళ్ళుమాయవనే కరుమాణిక్కచ్చుడరే" బకాసురుని నోటిని చీల్చినవాడా! మద్దె వృక్షముల నడుమ వెళ్ళినవాడా! సప్తవృషభ భంజనము సల్పినవాడా! నీలమణివలె దివ్యతేజో విరాజితుడా! అని పేర్కొనినందున భగవంతునిలో విరోధినిరసనముచే కలుగు ఔజ్జ్వల్యము ఇందు తెల్పబడినది.

10. ప్రాప్య, ప్రాపకములురెండును నీ చరణారవిందములే అను అధ్యవసాయమును నాకు కృపచేసిన మహోపకారకుడా! దేవాధిదేవా! నీకు నేను చేయు ప్రత్యుపకారము ఏదియును లేదు అని ఈ పాశురమున ఆళ్వార్లు అనుసంధించు చున్నారు. "ఆతెనక్కునిన్ పాదమే శరణాకత్తన్దొళిన్దాయ్" నిన్ను పొందుటకు నీ చరణారవిందములే ఉపాయమని తెల్పితివి అని నందున భగవంతుని "ఉపాయప్రకాశకత్వము'' అను దివ్యగుణము ఇందు ప్రతిపాదించబడినది.

11. వానమామలై దివ్యదేశ విషయముగ ఆళ్వార్లు అనుగ్రహించిన పాశురములు అమృతధారలవలె భోగ్యములైనవి. వీనిని అను సంధించు వారు సైతము నిత్యసూరులకు అమృతమువలె భోగ్యభూతులగుదురు. అని ఫలశ్రుతిని తెలిపిరి.

"వాననాడ వెంకార్ ముగిల్ వణ్ణా", పరమపదవాసా, ''వాననాయకనే'' పరమపదనాథా! అనినందున పరత్వము, "అరవిణైయమ్మానే" శేషశాయి అనినందున వ్యూహమును, "ఇలంగైశెత్తవమానే" లంకా విధ్వంసకా! "నిలంకీండవమ్మానే" భూమ్యుద్ధరణ గావించినవాడా! ఇత్యాదుల వలన విభవావతారమును "వందరుళి యెన్నెంజిడం కొండవనే" అనినందున అంతర్యామిత్వము, శిరీవరమంగై వాణనే" శ్రీవానాచలవాసా అనినందున అర్చావతారమును ఇట్లు భగవంతుని పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారరూప పంచప్రకారములను ఆళ్వార్లు ఈ దశకమున ప్రస్తుతించియున్నారు. శ్రీవరాహ, శ్రీరామ, శ్రీకృష్ణ, బుద్ధావతారములను ఈ దశకమున ప్రస్తావించియున్నారు.

ఈ దశకసారమును అళకియమణవాళజీయర్ ఇట్లనుగ్రహించియున్నారు.

శ్లో॥ ఏవంచ సోఽనధిగతాఽభిమత స్తదాప్తౌ
నారాయణాదితర సాధన శూన్యతాం స్వామ్ ।
తస్మై నివేద్య తదుపాయ ధియైవ కించి -
దాశ్వస్తవాన థ ముని: కిల సప్తమేన ॥

(ద్రమిడోపనిషత్సంగతి)

ఆళ్వార్లు సర్వేశ్వరుని లీలలను అనుకరించిన పిదపకూడా సర్వేశ్వరుడు వారికి సాక్షాత్కరించలేదు. ఆళ్వార్ల మనోరథము నెఱవేరలేదు. కర్మజ్ఞాన భక్త్యాద్యుపాయ శూన్యతచే తమ అనన్యగతికత్వమును భగవచ్చరణారవిందములలో విన్నవించుకొనిరి.

ద్రమిడో పనిషత్తాత్పర్య రత్నావళిలో శ్రీవేదాంత దేశికులవారి శ్లోకమిట్లున్నది.

శ్లో॥ సర్వాధీశే శయత్వా దరిదరభరణా త్సానుకమ్ప్యత్వ యోగా
త్సత్సాహాయ్యా దశేషాన్తర నిలయతయా భూసముద్ధృత్యుదన్తైః ।
సర్వేషాం తాతభావా దితరజన దురాధర్షతాదే శ్శరణ్యం
దీనానాం ప్రాహ విష్ణు శఠజనమథనో దేవతా సార్వభౌమమ్ ॥

సర్వేశ్వరుడు శేషశాయి. శంఖ చక్రధరుడు. దయామయుడు. సత్పురుషులకుపకారకుడు. సర్వాంతర్యామి. శ్రీవరాహావతారమెత్తి భూమ్యుద్ధరణ గావించినవాడు. సమస్త ప్రాణులకు ఆప్తబంధువు. భక్తి శూన్యులకు దరిచేరరానివాడు. అటువంటి శ్రియః పతియే అకించనులకు రక్షకుడని ఈ తిరువాయ్ మొழిలో ననుగ్రహించుచున్నారు.

తిరువాయ్మొழినూత్తందాదిలో మణవాళ మహామునులు ఈ దశక సారమును ఇట్లు తెల్పుచున్నారు.

"నోత్త నోన్బాదియిలేన్ ఉన్దనై విట్టాత్తకిల్లేన్
పేత్తుక్కుపాయం ఉన్దన్ పేరరుళే । శాత్తుగిన్రేన్
ఇంగెన్నిలై యెన్డ్రుం ఎழిల్ మారన్ శొల్ వల్లార్
అంగమరర్కు ఆరావముదు.

హేభగవన్! ఉపాయ శూన్యుడనగు నేను కేవలము నీ అనుగ్రహమునే ఉపాయముగ నమ్మితిని. నీ విశ్లేషము నిక క్షణమైనను సహింపలేను. అని ఆళ్వార్లు తమ ఆకించన్యతను భగవత్సన్నిధిలో విజ్ఞాపనము చేసిరి. ఈ దశకమును అనుసంధానము చేసినవారు వైకుంఠమున నిత్యసూరులకు అమృతమువలె భోగ్యభూతులుగ నుందురు.

ఆళ్వార్లు తమను తాము సమాధాన పరచుకొనిన విధము ఈ దశకమని అழకియ మణవాళ జీయర్ అనుగ్రహించగ స్వామి వేదాంత దేశికులు అకించనులకు రక్షకుడు సర్వేశ్వరుడే అను విషయము ఈ దశకమున ప్రతిపాదింపబడినదనిరి. ఆళ్వార్లు తమ ఆకించన్యతను భగవత్సన్నిధిలో విజ్ఞాపనము చేసికొనిరని శ్రీమణవాళ మహామునులను గ్రహించిరి.

"తస్మై నమో వకుళభూషణ భాస్కరాయ"

శ్రీమతే శఠకోపాయ నమః

# తిరువల్లవాழ்

ఉ.వే. శ్రీమాన్ తి:పు. కోనప్పాచార్యస్వామి,
రాజమహేంద్రవరం.

ఆళ్వార్లు తిరుక్కుడంద్తై వేంచేసిననూ తమ అభీష్టము నెరవేరనందున తిరువల్లవాழ் వేంచేయ దలంచిరి. ఈ ప్రయత్నములో అభిమత సిద్ధి లేకపోవుటయే గాక ఆ దివ్య దేశమునకు చేరుటకు కూడ అశక్తులై ఈ ప్రయత్నములో తమకు కలిగిన బలహానిని సర్వేశ్వరునితో ఒకప్పుడు సంశ్లేషించి ప్రస్తుతము విశ్లేషించిన ఒక నాయిక వలె తిరువల్లవాళ్‌కు దగ్గరగా నున్న గ్రామమును చేరి తమకు ఆంతరంగికులైన చెలికత్తెలతో చెప్పుచున్నారు.

మాశరుశోది అను తిరువాయిమొழிలో ఆళ్వార్లు మడల్ వ్యాపారము ఆచరించుటకు ఉద్యుక్తులైననూ అది సర్వేశ్వరుని నిరుపాధిక రక్షకత్వమునకు హాని కల్గించునని స్వప్రవృత్తిరూపమైన ఆ ప్రయత్నమును విరమించి స్వసత్తాలాభమునకై కనబడిన దివ్యదేశము నెల్లా సేవించుకొన ఉద్యమించుచు సంశ్లేషము దుర్లభమైననూ అంతరంగ కైంకర్య మైననూ లభించునాయని ఆశపడుచున్నారు. ఒకప్పుడు స్వామితో సంశ్లేషము తరువాత విశ్లేషము అనుభవించుచున్న ఆళ్వారు నాయిక తమ అభిజాత్యాదులను గ్రహింపక తిరువల్లవాళ్ దివ్యదేశమునకు పోవుటకై ఉద్యమించగా ఈ విషయమును గమనించిన సఖురాండ్రు "ఇది మీ వంటి వార్కి తగదు" అని వారింపగా మీమాటలను వినినందు వల్ల నాకు ప్రయోజనమేమి? తిరువల్లవాళ్‌లో ఉద్యానవనములలో అచటి పుష్ప పరిమళములు తీసుకుని వచ్చుచున్న మలయ మారుతము, అచటి తేనెలు త్రాగి మత్తిల్లి గొంతెత్తి పాడుచున్న తుమ్మెదల అవ్యక్త మధుర గానములు, అచటి వైదికుల వైదిక క్రియా సంభ్రమములు నగరములోని జన సంచార కోలాహలము నన్ను రమ్ము, రమ్మని పిలుచు చున్నట్లున్నది. మీ మాటలను విని నేను వెనుకకు మరలిన ఏమి లాభము? అని చెలికత్తెలతో చెప్పి తన బలహీనతచే తిరువల్లవాళ్ చేరలేక పోతినని, స్వామిని సేవించ లేకపోతినని తమ వేదనను చెలికత్తెలతో చెప్పుచున్నారు.

ఇచట ఒక ఐతిహ్యాము గుర్తుకు వచ్చుచున్నది. నంజీయరు, శ్రీపరాశర భట్టరు చరణార విందములను ఆశ్రయించిన తరువాత ఒకప్పుడు పశ్చిమ దేశమునకు వేంచేసి తరువాత కొంతకాలమునకు పెరుమాళ్ళ మహోత్సవము సేవించు కొనవలెనను తలంపుతో తొందరగా శ్రీరంగమునకు వేంచేయు చుండగా, వారు కరంబన్‌తుర్రై వరకూ వేంచేయునప్పటికి కావేరీనది ఉద్ధృతముగా పొంగిపొరలు చున్నది. దాటుట శక్యము కాకపోయినది. రాత్రి ఉత్సవము జరుగుతుండగా సన్నిధిలోని మంగళ వాద్యముల ధ్వని వేదఘోషము చెవిని పడుచున్నవి. కానీ ఆ ఉత్సవములో అన్వయించు భాగ్యము మాత్రము వారికి లభించలేదు. వారిని ఆ పరిస్థితి మిక్కిలి బాధించినది.

బ్రహ్మపుత్రులైన ఏకత, ద్విత, త్రిత నామకులు శ్వేత ద్వీపమును పోయి లోపల ప్రవేశించుటకు వీలుగాక బయటనే ఉండి అచట కైంకర్య పరుల సంభ్రమములు చూచి, విని మాత్రమే ఆనందించినట్లు ఆళ్వార్ల నాయికయూ తిరువల్లవాళ్‌లో స్వామిని సేవించుకొను భాగ్యము లభింపక తమ ఆశలు తీరక అచటి మలయమారుతమును మధుపాన మత్తములైన, మధుకరముల మధుర గానమును వినుచూ ఖేదపడుచున్నారు. తమ సఖురాండ్రుతో తిరువల్లవాళ్‌లో వేంచేసి యున్న స్వామిని చేరుట ఎపుడో అనుచున్నారు. మృగేక్షణలైన సఖియలారా! నేను తిరువల్లవాళ్ చేరునట్లు దయార్ద్రములై, ప్రసన్నములైన మీ నేత్రములతో నన్ను కటాక్షించుచు విశ్లేషమును సహించలేక దుఃఖపడుచున్నారు. ఇచట వన సౌందర్యమును ఆకాశమంటుచున్నట్లు పెరిగి ఉన్న పోక వృక్షములు, తేనెలు కార్చుచు పరిమళములు వెదజిమ్ముతున్న మల్లెలు కలిగి తేనెలు కురియుచున్న తోటలుతో చుట్టబడియున్న ఆ తిరువల్లవాళ్‌లోని స్వామిని సేవించు కొనుట ఎప్పటికో! తిరువల్లవాళ్ స్వామిని సేవించిన ఆళ్వార్ నాయిక ఒకవేళ మూర్ఛపడినచో, అపుడు కర్తవ్యమేమి? అని వెనుక ముందులు చూచుచు ఆలోచించు చున్న సఖురాండ్ర నేత్రములలో గోచరించు చున్న తారళ్యమును కాంచుచూ ఓ మృగేక్షణలారా! అని ఆళ్వార్ల నాయిక సంబోధించు చున్నారు. విషయాంతరమున ఆసక్తులైన వారి స్థితి వేరు. కాలము గడచిన కొలది వారి ప్రేమయూ తగ్గుచుండును. సర్వేశ్వరుని విషయమున ఆసక్తులయిన వారి ప్రేమ అట్టిది కాదు. శ్రవణ, మనన, ధ్యాన దశలను గడచి ప్రత్యక్ష సమానాకారమై శరీర విశ్లేషము కలిగిన తరువాత భగవత్ ప్రాప్తి పూర్వకముగా స్వస్వరూపావిర్భావము కలిగించును. ఆళ్వారు నాయికయూ ఇట్టిదశనే వాంఛించు చున్నారు. సఖులారా! దీర్ఘకాలము భగవత్ విశ్లేషమును అనుభవించుటకు కారణము ఏదో మహాపాపము నేను చేసియున్నాను. ఒకనాటి విశ్లేషమును కూడ సహించలేని ఆళ్వారు నాయిక సుదీర్ఘకాలము విశ్లేష దుఃఖమును అనుభవించు చున్నారు. లంకలో శ్రీరామ విశ్లేష దుఃఖమును అనుభవించుచున్న పిరాట్టి దుఃఖమును చూచుచున్న శిరియ తిరువడి (ఆంజనేయ స్వామి) కఠిన హృదయము కూడ పరితాపము నొందినది. తిరువల్ల వాళ్‌లో వేంచేసి యున్న పరమచేతనుడగు స్వామికి, అచేతనములైన స్థావరాదులకు భగవత్ ప్రేమగల వ్యక్తులను పీడించుటలో భేదమేమి? విశ్లేషము కలిగించి పరమ చేతనుడు పీడించును. విరహమును ఉద్దేపింపజేసి వృక్షలతాదులు పీడించును. విరహోద్దీపకములైన, అత్యున్నతములైన పోక చెట్లనూ, తేనెలు కురిపించుచూ, మధుర పరిమళములు విరజిమ్ముతున్న ఈ మల్లెలు కలిగి తేనెల సోనల జాలు వార్చుచున్న తోటలతో చుట్టబడిన తిరువల్ల వాళ్‌లో నిత్యనివాసము చేయుచున్న శ్రియఃపతి చరణారవిందములను నేను సేవించుట ఎప్పటికో కదా! విరహదశలో బాధకములైన ఇవి అన్నియూ భోగజనకములై యుండునట్టి శుభాసమయము ఎప్పటికి వచ్చునో అనుచున్నారు ఆళ్వార్ల నాయిక.

చెలియలారా! తిరువల్లవాళ్‌కు వెళ్ళకుండా నన్ను మీరు వారించు చున్నారేల?

నా స్వభావము మీ అందరకూ తెలిసినదే కదా! స్వామిని సేవించు కొనకుండ ఉండలేను. భగవద్విరహము కలిగి దుఃఖపడుచున్న నాకు సాంత్వన వచనములు పలికి దుఃఖోపశమనమును కలిగింపక మరింత దుఃఖజనకములైన మాటలను పలుకుచున్నారు. ఇది మీకు తగునా? ఇచట వీచుచున్న మలయ మారుతము పచ్చని కింజల్కములు కలిగిన పొన్న పుష్పములు, పొగడ పుష్పములను అప్పుడే వికసించిన మొల్లపువ్వులను స్పృశించు భాగ్యము లేకుండినవూ స్వామి శరీర స్పర్శ కలిగిన మలయ మారుతమైననూ నన్ను స్పృశించు చున్నది. ఆ భాగ్యము కూడ లేకుండ చేయదలంచిరా! "వాహి వాతయత: కాన్తా" అంటూ శ్రీరామచంద్రమూర్తి ఓ మలయ మారుతమా! సీతాశరీరమును స్పృశించి నన్ను స్పృశింపుము. అందువలన సాక్షాత్తుగా సీతా స్పర్శ లభింపకున్ననూ నీద్వారా అయిననూ అట్టి స్పర్శానుభవము కలుగవచ్చు. బరతాళ్వార్లు కూడ యావన్ న చరణౌ భ్రాతుః పార్థివ వ్యంజనాన్వితౌ: శిరసా ధారయిష్యామి, నమే శాంతిర్ భవిష్యతి. రాజలక్షణోపేతమైన శ్రీరామచంద్రుని చరణార విందములను శిరసున ధరించనిదే నాకునూ శాంతి లేదు. పుష్పాలంకృతమైన శిరోజములు గల చెలియలారా! భగవత్ విశ్లేషముచే దు!ఖపడుచున్న నన్ను చూచి మీరందరూ దుఃఖించుచున్నారు. అట్టి మిమ్ములను చూచి నేను మరింత దుఃఖిత నగుచున్నాను. లోపల విషాదమును కనబడనీయకుండా శిరోజములను పుష్పములచే అలంకరించు కొని వచ్చినారా! నా విరహవ్యధ తగ్గునా! తిరువల్లవాళ్ స్వామి సన్నిధిలో సామ, వేద ధ్వనులు సముద్ర తరంగ ధ్వనుల వలె నిరంతరముగ సాగుచున్నవి. పవిత్రమైన హోమధూమము ఆకాశావకాశమున వ్యాపించి పరిమళములను వెదజల్లుచున్నవి. చల్లని శ్రమహరమైన తిరువల్లవాళ్‌లో నిరంతరముగ వేంచేసియున్న స్వామిని సేవించు కొనకుండుట సాధ్యమా?

**4వ పాశురము:**

దట్టమైన తోటలతో అత్యున్నతములైన మేడలతో కూడియున్న తిరువల్లవాళ్‌లో ఆశ్రితులతో నిత్యవాసము చేయుచున్న పరమోపకారకుడగు స్వామియందు ప్రావణ్యము కలిగి ఉన్న నన్ను వారించి బాధించుట మీకు తగునా? అనుచున్నారు.

నాయందు మిక్కిలి ప్రీతి కలిగియున్న చెలియలారా! పచ్చని ఆకులు కలిగి పొడవైన పోకచెట్లను, పచ్చని ఆకులతో కళ,కళ లాడుచూ పనసచెట్ల తోడనూ, కొబ్బరి తోటల తోడను, కదరీ వనములతోడను ఆవృతమై మేడలతో నిండియున్న తిరువల్లవాళ్‌లో శేషశయనముపై వేంచేసియున్న స్వామికి నా పవిత్రమైన ఆత్మస్వాధీనమై యున్నది. సర్వేశ్వరుని కృపా విశేషముచే నా ఆత్మ అనంతుని వలె నిరంతర కైంకర్య నిర్వహణమున ఆసక్తమై యుండగా మీరు నా శరీర క్షేమము మాత్రమే కోరుచుండుట న్యాయ్యమా! అనుచున్నారు.

5వ పాశురము:

నాకు తోచిన రీతిగ నేను ప్రవర్తించు చున్నాను. సర్వేశ్వరుని సేవించు కొనవలెనని నా నేత్రములకు కలిగిన దప్పిక తీరునది ఎప్పటికో అనుచున్నారు ఈ పాశురమున.

ఆళ్వారు నాయిక, మంచి చెలికత్తెలారా! అని తమ సఖురాండ్రను సంబోధించుచున్నారు. మీప్రయోజనమును ఉపేక్షించి నా ప్రయోజనమే ముఖ్యమని ప్రవర్తించుచున్నారు కదా మీరు. మా అమ్మగారు ఏమని నిందింతురో అని నన్ను అనువర్తించక అన్యధా వర్తించుట తగునా మీకు? సీతా పిరాట్టి "వానరాణాం నరాణాంచ కథమాసీ త్సమాగమః" అనుచు తిర్యగ్జాతియైన వానరులకు వశిష్ఠ శిష్యులు అయిన శ్రీరామచంద్రమూర్తికి స్నేహము ఎట్లైనది. అని ప్రశ్నింపగా ఇళయ పెరుమాళ్ళకు కూడ దుర్లభమయిన అంతఃపురస్త్రీకై సందేశమునందజేయు భాగ్యశాలిగా నన్ను చేయగల ఉన్నత స్థాయిలో జరిగినదమ్మా అని అన్నారు తిరువడి. ఇళయ పెరుమాళ్ళు చేయు కైంకర్యమునకు కూడ తంతు సంధానము చేసి అవిఛ్ఛిన్నత కలిగించినది తిరువడి స్నేహమే కదా! మీరునూ నాయందు అట్టి స్నేహమునే కలిగి వర్తించుచు తిరువల్లవాళ్ స్వామిని నా నేత్రములు తనివి తీర సేవించు కొనుటకై సహాయము అందజేయండి. నేను కోరిన దానిని పూర్తిచేసి అనుగ్రహించు స్వభావము గలవారు కదా మీరు. ఇచట తిరువల్లవాళ్‌లో అనన్య ప్రయోజనులైన బ్రాహ్మణులు భగవదారాధన రూపమున యజ్ఞముల నాచరించు చున్నారు. ఆయాగ ధూమములు నల్లగా మీదికి నెగసి ఆకాశమంతయూ వ్యాపించుచున్నవి. క్షణిక సుఖముల నాశించి స్వర్గాది లోకములకు పోవుచున్న వారి ముఖములు కనబడకుండ చేయుచున్నవి. తిరువల్ల వాళ్‌లో వేంచేసి యున్నవాడు, నీరస పదార్థములు చేరని చెఱకు రసపు గడ్డ వంటి వాడు, చక్కగ పండిన పండు వంటివాడు, ఉప్పుసారమైన దేవతల అమృతము వలె గాక అత్యాస్వామృతముగా భక్తకోటిచే సేవింపబడువాడు, నాయొక్క ఆభిజాత్యాభిమానమును, సౌందర్యాభిమానము మున్నగు దురభిమానములను తొలగించి ప్రకాశమానుడైన సర్వేశ్వరుని సేవించుకొని నా నేత్రములు తృప్తి చెందునది ఎప్పుడో. నాపాట్లు నేను పడతాను నాబిడ్డ బ్రతికేటట్లు చూడండి అన్నట్లు ఆళ్వార్లు నాయిక తాను సుఖపడినా, పడకపోయినా తమ నేత్రములు తృప్తిపడి, సుఖపడునది ఎప్పటికో అనుచున్నారు. సంతానము సుఖముగ జీవించిన కన్నవారు సంతోషింతురు కదా!

6వ పాశురము:

ఈ 6వ పాశురమున తిరువల్లవాళ్‌లో వేంచేసియున్న వామన స్వామి యొక్క పరమ భోగ్యములైన తిరువడిగళ్ళను ఎప్పుడు సేవింతునో అనుచున్నారు. పిల్లల ఆకలి తీరిన తరువాతనే పెద్దలు తమ ఆకలి తీర్చుకొనుటకు ప్రయత్నించునట్లు స్వామిని సేవించుకొని తమ నేత్రముల దప్పిక తీరిన తరువాతనే ఆళ్వార్లు స్వామిని సేవించుకొన తలంచుచున్నారు.

తుమ్మెదలు చక్కగా ఝుంకారము చేయుచున్నవి. వాని కంఠమునుండి వెలువడిన శబ్దమెల్ల కమ్మని గానముగ పరిణమించు చున్నది. మంద మలయ మారుతము చల్లగ వీచుచున్నది. సుందరమైన, ఉన్నతములైన కొమ్మలతో గుబురుగ పెరిగియున్న చెట్లతో నిండియున్న సముద్ర తీరము తిరువల్లవాళ్‌కు శోభను చేకూర్చుచున్నది. అట్టి తిరువల్ల వాళ్‌లో బ్రహ్మచారి వామనుడు దర్శనీయమైన రూపముతో వేంచేసి యున్నాడు. ప్రజల పుణ్యాపాపములచే తారతమ్య వివక్ష చేయక అందరకూ తన చరణారవింద స్పర్శను కృపచేసిన మహోపకారకుడును అయిన ఆస్వామి చరణారవిందములను సేవించుకొనునది ఎప్పటికో కదా! నేను కృతార్థురాలును అయినపుడు నా ధవ్యతను మెచ్చి ప్రస్తుతము పాండుచ్ఛాయతో ఉన్న మీ అధరము సహజమైన అరుణకాంతులను ధరించి విరాశిల్లునది ఎప్పటికో! నేను చిన్న పాపమును గాక మహాపాతకము ఏదో చేసియుందును. ఆకారణముననే తిరువల్లవాళ్‌లో స్వామిని సేవించుకొన లేకపోతిని. ఒకపాటి పాపమైతే దయాళులైన స్వామియొక్క దర్శనమునకు ప్రతిబంధము కాదు. స్వామి నిరుపాధిక కృపచే ఆ పాపము తొలగిపోవును.

7వ పాశురము:

తిరువల్లవాళి స్వామి చరణార విందములను నిత్యము పుష్పములతో పూజ చేయు భాగ్యము ఎప్పటికో అనుచున్నారు. ఈ పాశురమున. తిరువల్లవాళ్‌కు పోదలంచిన ఆళ్వారు నాయికను ఒకప్పుడు వారించిననూ ఇప్పుడు వారించ కుండుటచే ప్రసన్నులైన ఆళ్వారు నాయిక తమ సఖురాండ్రను ఉత్తమ నారీ రత్నములారా! అనుచున్నారు. సముద్రము వలె సువిశాలమై గంభీరములైన తటాకములలో పెరిగి చక్కగ పూచి ఉన్న తామర పూవులు తిరువల్లవాళ్‌లో స్త్రీల ముఖములను పోలి ఉన్నవి. కలువ పూలు అచ్చటి స్త్రీల నేత్రములను పోలి ఉన్నవి. ఇట్టి తిరువల్లవాళ్‌లో వేంచేసియున్న స్వామి చరణార విందములను పూవులతో పూజించునది ఎప్పటికో కదా! అని పరితపించు చున్నారు.

8వ పాశురము:

సర్వ సులభుడైన స్వామి చరణార విందములను అవిచ్ఛిన్నముగ ఎల్లకాలము సేవచేయు భాగ్యము ఎప్పటికి చేకూరునో అనుచున్నారు. పక్షమున కొకసారి ఆచరించ వలసిన దర్శపూర్ణ మాసాదుల వలె గాక సాయంప్రాతఃకాలము లందు మాత్రమే ఆచరించ వలసిన అగ్నిహవనాదుల వలెగాక స్వామి చరణారవింద కైంకర్యము నిరంతరము చేయ తగినదిగా ప్రాప్తమగునది ఎప్పటికో? మీరు స్వామి సన్నిధిలో నమస్కరించు నపుడు ఆ దివ్య దేశమందలి పరాగము అంటి మీ లలాటములకు వినూతన శోభను చేకూర్చునప్పుడు ఆ శోభను సేవించుకొను భాగ్యము ఎప్పటికో. చక్కగ పెరిగి పండియున్న చెరకు తోటలతో, విరగ పండియున్న ఎర్రధాన్యపు వరి చేలతో, చక్కగ తామరలు, కలువలు పూచియున్న చెరువులతో నిండియున్న తిరువల్లవాళ్‌లో ఉళగళంద పెరుమాళ్ళు

నిత్య నివాసము చేయుచున్నారు. అట్టిస్వామి చరణార వింద సన్నిధిలో నిర్విఘ్నముగ నిరంతరము ...ము వొనరించు అదృష్టము ఎప్పటికో? సుందరమైన, చల్లనైన ఈ తిరువల్లవాళ్‌లో సర్వేశ్వరుడు పరమ పదమును కూడ మరచి వేంచేసి యున్నాడు.

9వ పాశురము:

స్వామి విరహము చేతనైన కార్శ్యముచే నాచేతినుండి కంకణములు జారుచున్నవి. స్వామిని సేవించి ప్రణామ మొనరించి నంతనే ధన్యతనొంది అవి తిరిగి హస్తములందు ధృతములు కాగలవు. అట్టి భాగ్యము స్వామి అనుగ్రహ విశేషముచే ఎప్పటికి లభించునో! సకియలారా! చల్లని చిక్కని తోటలలో ప్రవేశించి మకరంద పానము చేసి మురళీ ధ్వనిని వీణా ధ్వనిని తలపింప చేయుచు మనోహరముగ తుమ్మెదలు గానము చేయు చున్నవి. ఇట్టి సుందర వాతావరణము కలిగిన తిరువల్లవాళ్‌లో ప్రతికూల నిరసనమునకై సంభ్రమించుచున్న సుదర్శనమును చేత ధరించి ఉన్న స్వామిని కంకణాలంకృతములైన హస్తములతో సేవించు భాగ్యము ఎప్పటికి కలుగునో.

10వ పాశురము:

స్వామి యొక్క నిరుపాధిక కటాక్షముచే సేవలభించి ఆ స్వామి తిరునామమును నోరూరు నట్లుగ ఎప్పటికి పలుకుదునో! ఆర్ద్రత లేని నోటితో పలుకుట పాప ఫలము. ఆర్ద్రమైన నోటితో తిరునామము పలుకుట పుణ్యఫలము. స్వాభావికమైన భగవదనుగ్రహమును లీలా విభూతి యందలి వారు, పరమపదమందలి వారు కూడ సేవించి అనుభవించుటకు వీలుగ పరమ పవిత్రమైన తిరువల్లవాళ్‌లో పురుషోత్తముడు వేంచేసియున్నాడు. సర్వేశ్వరుని కృపావిశేషమును గమనించి దయావంతులైన భాగవతోత్తములు ఎందరో నిరంతరము స్వామికి మంగళాశాసనములు చేయుచున్నారు. అట్టి స్వామి యొక్క కళ్యాణగుణములకు వాచకములైన తిరునామములను నోరార కీర్తించు భాగ్యమును ఇచ్చి స్వామి నన్ను అనుగ్రహింతురా!

11వ పాశురము:

ఈ పాశురములో ఈ తిరువాయ్‌మొழிని అభ్యసించు వారు ఈ లీలా విభూతిలో వేంచేసి యుండగనే భగవద్గుణానుభవమున అందరి కంటే శ్రేష్టులై యుందురు అనుచున్నారు.

“దేవోనామ సహస్రవాన్” అనునట్లు గుణ చేష్టితములకు నిరూపకములైన సహస్ర నామములతో శ్లాఘింప బడుచున్న మనస్వామి అనాదిగ వచ్చుచున్న ప్రతిబంధకములెల్ల విడిచి సర్వేశ్వరుని చరణారవిందములనే తమకు ఉత్తారకములుగ ఆశ్రయించిన నమ్మాళ్వారు భగవత్ గుణములకు ప్రఖ్యాపకముగ సాయించిన ఈ పది పాశురములను అనుసంధించువారు ఈ ప్రాకృత దేహముతో నున్నను ఉత్కృష్టులగుదురు.

ఆళ్వార్ తిరువడిగళే శరణం

శ్రీరస్తు
శ్రీమతేశఠకోపాయ నమః

# తిరువణ్ వండూరు

**ఉ.వే.శ్రీమాన్. వంగల వేంకటాచార్యస్వామి**
**నరసాపురం**

ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు తాము అనుగ్రహించిన తిరువాయిమొழிలో భగవంతుని ఉద్దేశించి సందేశము పంపిన దశకములు నాలుగు 1. అఞ్జిఱైయ మడనారాయ్ (1-4) 2. వైకల్ పూఙ్గழிవాయ్ (6-1) 3 పొన్నులగాళీరో 4. ఎఙ్గానలగమ్ కళివాయ్.

శ్రియః పతి పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చారూపమున వేంచేసియున్నట్లు ఈ నాల్గు సందేశములు ఈ పరత్వాది విషయకములుగానున్నవి. ఎట్లనగా "అంజిరైయ మడనారాయ్'' వ్యూహామూర్తి విషయముగను 2. వైకల్ పూఙ్గొழி వాయ్ విభవమూర్తి విషయముగ 3 పొన్నులగాళీరో పరత్వ అంతర్యామి విషయముగా 4. ఎఙ్గానలగమ్కళివాయ్ అర్చావతారవిషయముగా సందేశములు పంపబడినవి.

అంతేకాక ఒక్కొక్క సందేశము ఒక్కొక్క గుణమును ప్రకాశింపచేసినది. మొదటి దానిలో క్షమాగుణము, రెండవ దానిలో ఆర్తరక్షణము, మూడవదానిలో సౌశీల్యము, నాల్గవదానిలో సౌందర్యము అనుగుణములను ప్రకాశింపచేసిరి.

ఈ విషయమునే ఆచార్య హృదయములో "తమ్పిళయియుమ్..... నాలుక్కు విషయమ్ అని విశదీకరించిరి.

ఆழ்వార్లు "నోత్తనోన్బిలేన్'' అనుదశకమున అడిమైకొణ్డాయ్ అడియేన్ తొழுవన్దరుళే, ఆతెనక్కునిన్పాదమే శరణాక, అడియేనైఅకత్తేనే అని శరణాగతిచేసినను ఫలము లభింపలేదు. ఆழ்వార్లు భగవత్ప్రాప్తికి సాధనముగా స్వీకరించినది శరణాగతి. అది తిరుగులేనిదే కాక శీఘ్ర ఫల ప్రదమైనది. కానీ ఆళ్వార్ల మనోరథము తీరలేదు. ఇట్లగుటకు కారణమేమిటో అని ఆలోచింప వలసియున్నది. "సర్వేశ్వరుడు సర్వభూత సుహృత్తు'' "సుహృదం సర్వభూతానాం'' అని ఆయనే చాటుకొన్నాడు గదా! కావుననే ఆళ్వార్ల హితమును కోరినట్లే లోకహితమును కూడ కోరువాడు. వీరికి వెంటనే పరమపదమునను గ్రహించినచో లోకము గతియేమి? లోకమును దిద్దుబాటు చేయువారెవరు? అనునదే సర్వేశ్వరుని ఆలోచన.

తాను రామకృష్ణాద్యవతారములలో కూడ సాధింపలేని పని ఆళ్వార్ల ద్వారా సాధింపదలచినాడు. వీరిని మరి కొంతకాలము ఈ లోకమునందే ఉంచి వారి ఉపదేశముల ద్వారా లోకమును దిద్దుబాటు చేయవలయును అని ఆతని సంకల్పము.

కావుననే ఆళ్వార్లు అనేక దివ్యదేశములు స్తుతించినను ఫలము లభింపలేదు.

ఇదికాదని అవతారములను ప్రస్తుతించినారు. అవి కాలాంతర మందగుటచే అచటను ఫలించలేదు. అంతేకాదు ఆ విభవావతార సౌందర్యము మరింత బాధనే కలిగించెను. కాలుచేయి ఆడనట్లు చేసినది ఆ సౌందర్యము. ఇక ఏమి చేయుదురు. సమీపమునందుగల "తిరువణ్ వండూరు క్షేత్రమే చాలువని తలంచిరి. ఈ క్షేత్రము తమకు ముఖపరిచయము కలిగినది. ఇచట స్వామి పాంబణై యప్పన్ కమలవల్లిత్తాయార్లతో పాపనాశ పుష్కరిణీ తీరమున వేదాలయ విమానమున పశ్చిమ ముఖముగా నిలచి సేవ సాయించుచున్నాడు. ఆ స్వామి నామానుసంధానమే చాలునని తలంచినారు. తలచుటే కాదు. "కణ్ణన్ నామమే కుఱ్ఱరకొణ్ణీర్" అనునట్లు ఆ నామానుసంధానమే పరవశమును కలిగించినది. ఆ పరవశత్వము స్వామి సన్నిధికి నడచిపోకుండ చేసినది. ఏమి చేయవలెనో పాలుపోలేదు. స్వామివద్దకు దూతను పంపుటకు నిశ్చయించినారు. దూతలను ఎవరివద్దకు పంపవలెను? తన విరహవ్యథ తీరునట్లు కటాక్షించుటకు సమీపముననే వేంచేసియున్న తిరువణ్ వండూరు పాంబణై అప్పన్‌స్వామియే తగినవాడని ఆయనవద్దకేదూతలను పంపుచున్నారు.

మహర్షుల భక్తి కర్మజ్ఞానానుగృహీతమైనది. కానీ ఆళ్వార్ల భక్తి సర్వేశ్వరుని కటాక్షము వలన కలిగినది. సాధ్యోపాయనిష్ఠులగువారు (తమ ప్రయత్నముచే భగవంతుని అనుగ్రహము లభించునని తలంచువారు) తమ కార్యాంతమున పురుషార్థము లభించునని ఎదురుచూతురు. కానీ ఆళ్వార్లు సిద్ధోపాయనిష్ఠులు (అనగా భగవంతుడే ఉపాయమని నమ్మినవారు)

కావుననే ఆలస్యమును సహింప లేక పోవుచున్నారు. శరణాగతి చేసితిమి గదా! ఆతడే అనుగ్రహించునని నెమ్మదిగా నుండు స్వభావము కలవారును కాదు. "నజీవేయం క్షణమపి" (క్షణకాలముకూడా జీవింపజాలను") అనునట్లున్నది వీరి పరిస్థితి.

బ్రహ్మాస్త్రము వంటి శరణాగతియే ఫలింపకపోగా ఇట్లు దూతలను పంపుట జ్ఞాన కార్యమా! లేక చాపల్యమా! అని సందేహింపవలసియున్నది. "యతోవాచోనివర్తన్తే"అని శ్రుతికి కూడ గోచరముకాని భగవద్విషయమును వెల్లడించిన వీరికి జ్ఞానము లేదని చెప్పుటకు వీలులేదు. జ్ఞానములేని పక్షులను దూతలుగా ప్రార్థించుటచే జ్ఞానము కలవారనియు చెప్పలేము. మరేమనగా ఇది జ్ఞానకార్యమైన చాపల్యము. ఇతర విషయ వైరాగ్యమే జ్ఞానమున్నందుకు ఫలము. వీరి ఈ చాపల్యము అజ్ఞానఫలమే! వీరు "అజ్ఞానాం జ్ఞాన జనకమ్" అనునట్లు వీరు జ్ఞానవైరాగ్య రాశికదా!

ఈ దూతప్రేషణ విషయములో వీరు సీతాదేవి కంటె అతిశయము గలవారనియే చెప్పవలెను. సీతాదేవి "నాన్నృగ్వేదవినీతస్య" ఇత్యాదిగా శ్రీరామచంద్రునిచే స్తుతింపబడిన శబ్దోచ్చారణ పటువైన హనుమంతుని పంపగా వీరు పక్షులను పంపుచున్నారు. ఆమె శ్రీరామచంద్రుని సంశ్లేషమును మాత్రమేకోరి దూతలను పంపగా వీరు లక్ష్మీనారాయణుల సన్నిధినికోరి దూతలను పంపుట విశేషము. ఆమెకున్నట్లుగా వీరికి రావణ భయమును లేదు. కావుననే స్వామిసన్నిధి నుండి వచ్చిన (హనుమంతుని వంటి) వారినేగాక తమకంటికి కనిపించిన వారిని దూతగా పంపుచున్నారు.

ఆళ్వార్లు ఈ దశకమును నాయికా భావనతో అనుగ్రహించినారు. స్వామిని విశ్లేషించిన నాయిక, ఆ విశ్లేషాన్ని సహించలేక స్వామికొరకు కొంతమందిని దూతలుగా పంపుచున్నారు. విశ్లేషించినవారు దుఃఖపడేది సముద్రతీరంలోనట. తిరువణ్ వణ్డూర్ కూడా నదీతీర ప్రాంత్రమే. భగవంతుడు మంచి రూపము గుణాదులు కలవాడైన ఆళ్వార్లకు ఎందుకు దర్శనము ఈయలేదంటే ఆళ్వార్ల లాంటి వారు అనేకమంది ఆయన రక్ష్యవర్గం (రక్షింపదగినవారు)లో ఉండటంచేత, వారి రక్షణలో తాను తనమునకలై ఉండటం వలన స్వామి రావడంలేదని, తమ ఆర్తిని తెలియజేసిన తప్పక వస్తాడని ఆళ్వార్నాయిక తలచినారు. తమ ఆర్తి తెలుపుటకు అశక్తులగుటచే తాము స్వయంగా తెలియజేయలేకపోయారు. పోనీ వీరి బంధులను పంపవచ్చు కదా అంటే, బంధువర్గమంతా ఆళ్వార్లకన్నా ముందరే ఆళ్వార్ల దశనుచూచి దుఃఖసాగర నిమగ్నులై యున్నారుట.

ఈ ఆళ్వార్నాయిక ఆర్తిని తెలియజేయడానికి మనుష్యులే కరువయ్యారుట. ఇక దూతలుగా పంపదగిన వారెవరు అని ఆళ్వార్నాయిక వెతకగా తమ పరిసరంలో సంచరించే కొన్ని పక్షులు కనబడ్డాయిట. ఆ పక్షులను స్వామి వద్దకు దూతలుగా పంపుచున్నారు ఆళ్వార్లు ఈ దశకంలో.

ఆళ్వార్లు స్వామి తిరువణ్ వణ్డూర్ క్షేత్ర సౌందర్యంలో నిమగ్నుడై తమను మరచినాడని నిశ్చయించినారు. ఎఱ్ఱ ధాన్యములతో నిండిన చేలు కల తిరువణ్ వణ్డూర్‌లో నిత్యవాసం చేసేవాడు. చేతిలో సుదర్శనము కలవాడు. దొండపండువంటి అధరము కలవాడు అయిన స్వామికి తమ దశను చేతులు జోడించి తెలుపమని ఉప్పు కాలువయందు గుంపులుగా మేయుచున్న సారస పక్షులను ప్రార్థించుచున్నారు.

పిన్నైయాట్టియేన్ తమను(ప్రాపియగు) సంబోధించుటకు కారణమేమి? స్వామికటాక్షము నాయందు పడలేదు అందుకే నాకీదుర్దశ. అదే పాపము కావున నీ కటాక్షానికి పాత్రంకాని ఈ దీనురాలి రక్షణ భారం నీదే అని స్వామికి వినయంగా విన్నవించమని సారసములను ప్రార్థించు చున్నారు.

అంజలి జోడించి విన్నవించ మనడానికి కారణమేమనగా. అంజలి స్వామిని మనకు స్వాధీనం చేసే ఆయుధం. "అంజలిః పరమాముద్రాక్షిప్రం దేవ ప్రసాదినీ "పరమాత్మ కటాక్షం తక్షణం ప్రసరింపజేసేది అంజలి ముద్ర అందువలన "అంజలయతి ఇతి అంజలిః" అన్నారు సర్వేశ్వరుడైన స్వామిని కూడా కరిగింపజేసేది అంజలి. కాబట్టి స్వామికి అంజలి జోడించి నాదశను విన్నవించండి సారసములారా అంటున్నారు.

ఈ సందర్భములో పరాశర భట్టర్‌స్వామివారు ఈ దశకం ప్రణయరోషంతో అనుగ్రహిస్తున్నారు అని రస్యంగా సాయించారు. ఓ స్వామీ భక్త సంరక్షకుడివి అనే పేరు

మోసావు నీ కోదాసోహం ఒకనైనా ఈమెను రక్షించు. నీకు మాన్యులు తప్ప సామాన్యులు కనపడరు సర్వేశ్వరుడివి కదా! ఈ ఆఖ్రాగ్వార్నాయిక గుర్తుండదులే అని ప్రణయరోషంతో స్వామికి దూత్యం పంపారుట ఆఖ్రాగ్వార్లు.

స్వామి ఆర్త రక్షణ దీక్షితుడు. ఆయనకు నాదుఃఖ వ్యసనము తెల్పుమని సారసపక్షిని ప్రార్థిస్తున్నారు. ఓ సారసమా నీవు శుద్ధ స్వభావురాలివి స్వామి శ్యామవర్ణం కలవాడు చల్లనివాడు. అందుచే వారికి నా దశ తెల్పిన "న జీవేయంక్షణమపి" అనే స్వభావుడు కావున నన్ను తనవద్దకు తీసుకుని వెళ్తాడు. వేదఘోషతో అలరారేతిరువణ్ వణ్డూరులో వేంచేసియున్న స్వామికి నాదశ తెలుపుము అంటున్నారు.

"శిరన్ద శెల్వంమల్గు తిరువణ్ వణ్డూర్" సంపదలతో నిండియున్నదట తిరువణ్ వణ్డూర్. ఆ సంపద చూచి స్వామి అక్కడే స్థావర ప్రతిష్ఠగా స్థిరపడ్డాడు. అలాంటి స్వామిని ఓ స్వామీ! ఈ తిరువణ్ వణ్డూరే కాదు ఉభయ విభూతులూ నీ ఆస్తే అని, ఈ సంసారంలో ఉండి స్వామి దర్శనం కాక దుఃఖపడుచున్న నా దుఃఖాన్ని తెలపండి అని పక్షి సంఘాలను ప్రార్థిస్తున్నారు ఆఖ్రాగ్వార్లు.

ఈ పక్షులు సంవిశ్లేష సుఖం తప్ప విశ్లేష దుఃఖమే ఎరగవుట. ఎప్పుడూ జంటలుగానే ఉంటాయిట. అందుచే ఆశ్రిత సౌలభ్యం, ఉపకార గుణంకల స్వామికి ఇక్కడ "ఒకతె" (ఆళ్వార్నాయిక) నీవిశ్లేషాన్ని సహించలేక శరీరం శిథిలమై కరుగుచున్నది అని తెలపండి పక్షులారా అని ప్రార్థించుచున్నారు.

మరల హంసలు దర్శనమయ్యాయి ఆఖ్రాగ్వార్లకు అందమైన తులసిమాలలు ధరించిన మన స్వామిని సేవించి చేతులు జోడించి "అడియేనుక్కుం పోత్తుమినే" దాసురాలి తరపున కూడా మీరే మంగళాశాసనం చేయండి" అని హంసలను ప్రార్థించుచున్నారు. ఇదే ఆఖ్రాగ్వార్ల గొప్పగుణము. తాను శిథిలమై విరహ వ్యథననుభవించు చున్నను స్వామి మంగళంగా ఉండాలని మంగళాశాసనం చేయుచున్నారు. జటాయు మహారాజు రామచంద్రుని విషయంలో తాను మరణశయ్యపై నుండి కూడా "ఆయుష్మాన్" అని మంగళాశాసనం చేశారు.

"అడియేనుక్కుం పోత్తుమినే" అనే ఈ మాట చాలా విలువైనది. పెద్దలెవరైనా దివ్యదేశ సేవకు వేంచేయునపుడు వారితో మనం "అడియేనుక్కుం పోత్తుమినే" అని విజ్ఞాపన చేయాలట. దాసుని తరపున కూడా మీరు వేంచేయ దివ్యదేశం పేరుమాళ్ళకు మంగళా శాసనం చేయండి అని ప్రార్థించాలి.

స్వామి సర్వరక్షకుడు కదా ఆయనకు ఒకటి రక్షింపదగినది, ఇంకొకటి రక్షింపదగనిది అని ఉండునా! సాటిలేనివాడైన రావణుని కోటను భస్మీకరించిన తిరువణ్ వణ్డూర్ స్వామికి నీ రక్ష్య కోటిలో ఈ ఆఖ్రాగ్వార్నాయిక కూడా ఉన్నది అని విన్నవించమని అక్కడి తుమ్మెదలను

ప్రార్థించుచున్నారు. స్వామికి నారాయణుడు అని తిరునామం. నారాయణుడనగా నారములకు (జీవులకు) ఆధారమైనవాడు. అన్ని జీవులకు ఆయనే ఆధారుడు. అలాంటి జీవకోటిలో ఒక్క జీవి లేకపోయినా ఆ నామం సార్థకమవనట్లే. స్వామిరక్షకత్వం నిలవాలంటే ఆరక్ష్యకోటిలో నేనూ ఉండాలి గదా, లేనిచో ఆయన రక్షకత్వం పోతుంది. ఆయన రక్ష్యకోటిలో నేనూ ఉన్నానని స్వామికి జ్ఞప్తి చేయండి అని తుమ్మెదలను ప్రార్థించుచున్నారు.

ప్రతీజీవి పరమాత్మ రక్షణలో ఒదిగి ఉండాలి. స్వరక్షణ పనికిరాదు అని ఈ దశకంలో ఆళ్వార్లు అనుగ్రహించినారు.

కాన్తితో నిండియున్న యజ్ఞోపవీతము గలవాడు, వామనుడై భూమిని స్వీకరించినవాడు అయిన సర్వేశ్వరుని శ్రీపాదములపై కురుకాపురాధీశులైన నమ్మాళ్వార్ల నుగ్రహించిన ఈ దశకము నభ్యసించువారు మెరుపువంటి ప్రకాశముగల స్త్రీలకు మన్మథునివలె శ్రీవైష్ణవులకు భోగ్య భూతులగుదురని ఫలశ్రుతి ననుగ్రహించినారు.

ఈ సందర్భములో పక్షులనగా ఆచార్యులు. పక్షికి ఎలాగైతే రెండు రెక్కలుంటాయో. ఒక రెక్క లేకపోయినా పక్షి ఎగురలేనట్లే. ఆచార్యులకు కూడా జ్ఞానము, అనుష్ఠానము అను రెండు రెక్కలుంటాయిట. జ్ఞానానుష్ఠానములలో ఏ ఒక్కటి లేకపోయినా వారు పరమాత్మ కటాక్షము పొందలేరు. జ్ఞానానుష్ఠానములు కల్గిన ఆచార్యుల ద్వారా పరమాత్మకు మన దశను తెలిపి శరణాగతి చేయాలని ఈ దశక సారము.

ఈ దశక సారమును మణవాళమామునులు తామనుగ్రహించిన తిరువాయ్మొళ్ళి నూత్తందాదిలో ఇలా అనుగ్రహించిరి.

వైగల్ తిరువణ్ వణ్డూర్ వైగుం ఇరామనుక్కు ఎన్
శెయ్గైదనై ప్పుళ్ళినజ్గాళ్! శెప్పుమెన - కైగళ్ళిన్ద
కాదలుడన్ తూదువిడుం కారిమాఱన్ కళ్ళలే
మేదినియీర్! నీర్ వణజ్గుమిన్.

తా॥ ఓ లోకులారా! 'తిరువణ్ వండూర్' అను దివ్యదేశమందు నిత్యవాసము చేయుచున్న చక్రవర్తి తిరుమగన్ (శ్రీరామచంద్రమూర్తి)కు "పక్షులారా! నాదశను విన్నవింపుడు" అని యత్యాశతో పక్షులను దూతలునుగా పంపిన శ్రీఆళ్వార్ల దివ్యచరణారవిందములకే నమస్కరింపుడు.

శ్రీమతే రామానుజాయనమః

# విరుద్ధ విభూతి కత్వము

మదురవాక్ శిఖామణి, భాగవతామృతవర్షి
ఉ.వే. శ్రీమాన్ సాతులూరి గోపాల కృష్ణమాచార్య స్వామి,
సింహాచలం.

సంస్కృత వేదమును తొలుదొల్త భగవానుని వలన తాను పొంది ఈ లోకమునకు అందించిన ప్రథమ ప్రవక్తకుడు బ్రహ్మదేవుడు. ఆయనకు గల నాలుగు ముఖములు స్వరసాంకర్యము లేకుండగ నాలుగు వేదములను ఉచ్చరించుటకే భగవానునిచేత ఒసగబడినవేమో. అట్టి సంస్కృత వేదమునందు సాత్విక ప్రకృతి గలవారలకై తెలుపబడిన సారతమ ప్రమేయమును "పెణ్ణుక్కుమ్ పేదైక్కుమ్" అనినటుల సంస్కృత వేదమును అధ్యమనము చేయుటకు తగిన యోగ్యత సామర్ధ్యము లేనివారలకు కూడ తెలియజేయుటకై ఆవిర్భవించినవే ద్రావిడ వేదమనబడు దివ్య ప్రబన్ధములు. ఈ ప్రబంధములన నుగ్రహించిన ఇతరాళ్వార్ల నందరనూ తమకు అవయవభూతులుగ కలిగిన అవయవిని శ్రీనమ్మాళ్వార్. వీరే నాలుగు వేదముల సారతమార్ధమును నాలుగు ప్రబన్ధముల రూపమున ద్రావిడభాషలో అందించిన ఉదారులు.

సంస్కృత వేద ప్రవర్తకుడగు బ్రహ్మదేవునివలెనే ద్రావిడ వేదప్రవక్తకులైన నమ్మాళ్వార్లను కూడ చతుర్ముఖులుగా అభివర్ణించినారు పూర్వాచార్యులు. "చతుర్ముఖసమాఖ్యాపి శఠకోప ము నేస్థితా। స్వవాచా మాతృ దుహితృ సఖీ వాచా చ వర్ణనాత్" అనగా తాముగా పలుకుట, చెలికత్తెగా, నాయిక తల్లిగా, నాయికగా పలుకుట అను నాల్గురకముల కీర్తించుట వలన ద్రావిడ బ్రహ్మ దర్శియగు నమ్మాళ్వార్లు కూడ చతుర్ముఖులే అనదగియున్నారు.

భగవానుడు తమకు చేసిన ఉపకార పరంపరను, అందులకు నిదానమగు ఆయన కల్యాణ గుణములను అనుసంధించిన ఆళ్వార్ల ఆనందాశ్చర్యములకు మేరలేదు. నిత్యసంసారియైన తమకు భక్తి రూపాపన్నజ్ఞానమును అజ్ఞానమంతయూ నశించునట్లొ సంగిన భగవానుని దివ్యవైభవమును తెలుసుకొనిన తరువాత, తమవంటి వారు సమీపించి సేవించుట వలన ఆభగవానుని వైభవమునకు ఎక్కడగ్లాని కలుగునో అనుభయముతో వెఱచి, ఆళ్వార్లు భగవానునితో కలియుటకు సమ్మతించకపోగా, ఆళ్వార్ల విశ్లేషమును సహించలేని తన దివ్య స్వభావమును కనబరిచి, ఆళ్వార్లను సమ్మతింపజేసి తన అనుభవమును ప్రసాదించిన భగవానుని సౌశీల్య స్వభావము మనసున కందని దని తలంచుకొని ఆనంద సముద్రాంతర్నిమగ్నులైరి ఆళ్వార్లు.

ప్రేమదశలో తామొక నాయికాభావమును పొంది ప్రియతముడగు భగవానుని ఆగమనము కొలది ఆలస్యమైనందున అలకవహించి ప్రణయరోషముతో ఆళ్వార్లు తమను దగ్గరించిన భగవానుని "పోకునంబీ" (నన్నోక్కతేనే గాక పదహారువేల మంది దేవిమార్లను కూడ కలిగిన పూర్తిగలవాడా!

నీ అసన్నిధిచే బాధపడువారల వద్దకే నీవు పోమ్ము) అనియు, "కఴ్రకమేతేల్‌నమ్బి" (పరిపూర్ణమైన పరత్వమును గల నీవు మాసన్నిధిలోనికి ప్రవేశించకుము) అనియు, నిషేధించినారు. అయిననూ స్వామి ఆళ్వార్ల సన్నిధిని వీడక తన సౌశీల్యమును ప్రకాశపఱచి, ఆళ్వార్లకు తన సంశ్లేషము నొసంగినాడు. ఇట్టిభగవానుని యొక్క పరత్వమును" నల్కుఱవుమ్ అను ప్రకృత తిరువాయ్‌మొఴ్రియందు ఆళ్వార్లు అనుభవించుచున్నారు.

ఇంతకుమునుపు మొదటి శతకమునందలి మొదటి దశకము అగు "ఉయర్వఱ" యందు భగవానుని పర్వత్త్వమును అనుభవించిన ఆళ్వార్లు మూడోవ దశకము అగు "పత్తుడై యడియవర్" నందు అత్యంత సౌలభ్యమును అనుభవించి విద్ధులై మూర్ఛనందినారు.

ఇచట ఆఱవ శతకము నందలి రెండవదశకమగు మిన్నిడై యందు భగవానుని సౌలభ్యమును అనుభవించిన ఆళ్వార్లు అంతసౌలభ్యమును చూపిన భగవానుని పరత్వమును ఈ నల్కుఱవుమ్ అను దశకమందనుభవించి ఆశ్చర్య చకితులగుచున్నారు.

ఈ తిరువాయ్ మొఴ్రిని గూర్చి భట్టర్ అనుగ్రహించిన నిర్వాహమేమనగా "భగవంతునితో చేరము అను తమఅభిప్రాయమును తోలగించి తనతో చేరునట్లుగా చేసిన భగవత్స్వభావమును తలంచి ఆళ్వార్లు అత్యంతాశ్చర్యమును పొందుట ఈ తిరువాయ్‌మొఴ్రిలో తెలుపబడినది" అనుట.

ఈ దశకమందు పరత్త్వమునేల భావన చేయుచున్నారన, తమ గోష్టిలో ఇంతకు మునుపు అత్యంత సౌశీల్యమును కనబఱచిన భగవానుడే సామాన్యుడు కాడనియు సమస్త జగములను తనవిభూతిగాగల పరాత్పరుడనియు వర్ణించుటచే వెనుక అనుభూతమైన సౌశీల్యమునకు వన్నె పెరుగుచున్నది. ఏలనన గొప్పవాడు చూపిన తక్కువదనమునకే కదా సౌశీల్యమని పేరు. వెనుక భగవానునితో కూడము అను తమను తనదాస్యమునందు ఈడు పడజేసిన భగవానుని దివ్య స్వభావమును, అఘటితఘటనాసామర్ధ్యమును తలంచి ఆశ్చర్యచకితులైన ఆళ్వార్లకు "ఈ మాత్రమునకే ఎంత ఆశ్చర్యపోవుచున్నారే! లోకములో ఒకదానితో నొకదానికెంత మాత్రమూ పొత్తుకుదరని, పరస్పర విరుద్ధ స్వభావము గల పదార్థములనన్నిటినీ నావిభూతిగ ధరించుచూ తిరువిణ్ణగర్ నందు కేంచేసియున్న మా దివ్యమంగళ విగ్రహమును తిలకించిన ఏమగుదురు! అనుచూ తాను తిరు విణ్ణగర్ నందు వేంచేసియున్న విధానమును కనబరచగా దర్శించి. భగవానుని విరుద్ధవిభూతి కత్వమును ఆశ్చర్యముతో అభివర్ణించుచున్నారీ తిరువాయ్‌మొఴ్రి యందు భగవత్కవి యగు శఠకోపముని.

ఇందు భగవద్విభూతిని అనుభవించు ఆళ్వార్లు సమస్తమును తనదిగాకల సవిశేష భగవత్స్వరూపమును వర్ణించుచున్నారు. అయితే "విశేషణానాం వ్యావర్తకత్వమ్" అను వాక్యానుసారము, విశేషణము స్వవిశేష్యమును ఇతర విశేష్యములకంటె వేరుచేసి చూపవలెను. కాని ఇచట ఇతర విశేష్యపదార్థ ములన్నియు కూడ భగవానునియందు విశేషణములుగనే అన్వయించి

యుండుటవలన అన్యయోగ వ్యవచ్ఛేదము చేయుటక వకాశములేదు కావున అయోగ వ్యవచ్ఛేదపరముననే అన్వయించును.

అయితే, ఇట్లు పరస్పర విరుద్ధస్వభావములను కలిగిన వాటిని విశేషణములుగా ఆళ్వార్లు అభివర్ణించవలసిన ఆవశ్యకమేమికలదు? అనిన, భగవానుని యధార్థ స్వభావమును. స్వరూపమును అభివర్ణించుటయే ప్రయోజనము. ఒక వస్తువుకు ఉన్నరూపును వర్ణించిననేకదా దాని యధార్థ స్వరూపమును వర్ణించినట్లగును. అట్లే భగవానుని యధార్థ స్వరూపమును అభివర్ణించవలెననిన. సమస్తమును తన విభూతిగాగల స్వభావమును వర్ణించియే తీరవలేను కదా! రాజపుత్రునికి తన తండ్రియొక్క సంపదలను స్మరించపలసివచ్చి నపుడు తన తండ్రి సామ్రాజ్యమందలి సభా భవనాది సంపదలతో పాటుగ చెఱసాల వంటివికూడ స్వాదీనముచేసుకొని పరిపాలించుకొనవలసి వచ్చును కదా! అట్లే భగవానుని విభూతిగా ఈ సమస్త జగము ఆళ్వార్లచే అనుభవింపబడుచున్నది. ముక్తిని పొందిన ముక్త పురుషుడు "నోపజనం స్మరన్నిదం శరీరమ్" అనినటుల కర్మనిబన్ధన రూపముతో ఈలోకమును స్మరించకపోయినా, భగవద్విభూతిరూపముగ స్మరించును కదా! అట్లే ఆళ్వార్లకు కూడ భగవానుడు ఈ లోకమున నుండగనే అజ్ఞానము నశించునట్లు భక్తి రూపాపన్న జ్ఞానమును ముక్త పురుషులతో సమముగ కలుగజేయుటవలన, తదీయత్వాకారము తప్పవేరొక రూపము తెలియని భావనతో ఆళ్వార్లు ఈ జగమును భావనజేయుచూ భగవానుని విరుద్ధవిభూతి కత్వమును అందు వలన సిద్ధించు సర్వాతిశాయి పరత్వమును అత్యాశ్చర్యముతో అనుభవించుచూ వర్ణించుచున్నారు.

ఆళ్వార్లకు పృధివిని దాని స్వరూపముతో చూచినపుడు అది అత్యంత హేయమై తోచుట వలన దానిని విడచిపెట్టి తీరవలెనను భావన కలిగి, భగవానుని "ఇన్నిన్దనీర్మై ఇని యామురామై" అని జ్ఞానాజ్ఞానములకు ఆ స్పదశమగు ఈ స్థితిని విడిచిపెట్టి అట్టి జ్ఞానాజ్ఞాన సంభావనలేని దేశమునకు తనను కొనిపొమ్మని ప్రార్థింతురు. అట్లుకాక ఈ పృధివిని భగవదీయమను సంబంధముతో చూచినపుడు ఈ జగమంతా ఆదరణీయమై తోచును.

ఈ తిరువాయ్మొళ్గిని అనుసంధించినవారు నిత్యసూరులకు కూడ ఆదరణీయు లగుదురని, "వానవర్క్కు వాయ్త్త కురవర్" అనునది శ్రీమణవాళమామునుల దివ్య వాక్కు.

ఇక తిరువాయ్మొళ్గి సారార్థమును సంగ్రహముగ అనుభవిద్దాం. భగవానుని దివ్య విభూతి అతివిస్తృతము. భగవానుడింతటి వాడే భగవద్గీతలో తనవిభూతిని గూర్చి అర్జునునకు విశదముగ ఉపదేశించుచు నాస్త్యన్తో విస్తరస్యమే అని అంటారు అట్లాంటి విభూతిని సువిశడముగ దర్శించిన ఆళ్వార్లు అతివిస్తరముగ ఈదశకమునందు అనుభవించినారు.

దరిద్రము, దానికి విరుద్ధమగు ఐశ్వర్యము, దుఃఖమునకే ఆస్పదమగు నరకము, దానికి విరుద్ధమగు సుఖమునకే ఆస్పదమగుస్వర్గమున్నూ, ఎదిరిని చంపియే తీరవలెనను పగయు, దానికివిరుద్ధమగు అనురాగమున్నూ, చంపియే తీరునదగు విషము, పోయిన ప్రాణమును కూడ తిరిగి తీసుకొని రాదగిన అమృతమున్నూ మున్నగువాటిని తన విభూతిగాకలవాడు పరమాత్మ.

అనుచున్నారాళ్వార్లు.

పంచేంద్రియములతో అనుభవించు పరిచ్ఛిన్నమైన సుఖము, అట్టిదే అయి నాను భేదమును మాత్రము కలిగిన దుఃఖమున్నూ, ఇతర విషయములను పొందలేకపోవుటవలన కలుగు కలత, వాటి లాభమువలన కలుగు ప్రశాంతతయున్నూ, కోపము, ప్రసాదమున్నూ, వేడిమిని కలుగజేయు అగ్నిహోత్రము, చలువదనమును కలుగజేయు నీడయున్నూ మున్నగు వాటినన్నిటినీ తన విభూతిగా కలిగిన వాడు తిరువిణ్ణగర్ దివ్య దేశమునందుకల పరమాత్మ అనుచూ "తిరువిణ్ణగర్"ను "నన్నగర్" అనగా చాల గొప్పనగరమని ప్రశంసించుచున్నారు. ఏమి ఈ నగరమునకు ప్రశస్తి అనిన ఇది శ్రీ వైకుంఠమువంటిదని ఆళ్వార్ల భావనము. ఏలనన, శ్రీవైకుంఠమునకు విరజానది వలె స్వామి సన్నిధికివచ్చు భక్తులకు గ్లానిని, వారి పాపరాశిని విశ్శేషముగ పోగొట్టి దివ్యనది ఈ దివ్య దేశమున కలదు. వైకుంఠుడు ఉన్న చోటే కదా వైకుంఠము. అంతియే కాక అందరికీ దర్శనమొసగుటనునది పరమపదనాధునికంటె తిరువిణ్ణగర్ పెరుమాళ్ళకు గల ఆధిక్యము. భోగప్రధానులై సుఖించుచుండ నగరములోని వారు, కర్షకులై తమ జీవనయాత్ర సాగించుచుండ పల్లెలలోని వారున్నూ, పదార్థ స్వభావమును ఉన్నరీతిగా గ్రహించగలుగు జ్ఞానము; దానికి విరుద్ధ పదార్థ స్వభావమును భావనచేయు అజ్ఞానమున్నూ; రూపముగల భూమి, రూపములేని ఆకాశమున్నూ, మున్నగు వాటిని తన విభూతిగా కలవాడే తిరువిణ్ణగర్‌లో వేంచేసి యున్న భగవానుడు అనుచున్నారు.

సుఖసాధనమైన పుణ్యము; దుఃఖసాధనమైన పాపమున్నూ , పుణ్యఫలమైన సంశ్లేషము, పాపఫలమైన విశ్లేషమున్నూ, అభిమతవిషయమందు స్మృతి, అనభిమత విషయమందు విస్మృతియున్నూ, చేతనములు, అచేతనములున్నూ, అన్నియును తిరువిణ్ణగర్ దివ్యదేశమునందు నిత్యావాసము చేయుచున్న భగవానుని దివ్యానుగ్రహముచే కలిగినవి. అయితే, పాపము కూడ స్వామి అనుగ్రహముచేతనే కలిగినదా అని సందేహము కలుగవచ్చును. అవును చేతనుని అతడి పూర్వ కర్మానుగుణముగా ప్రవర్తింపజేయుట వలన అది కూడ ఆయనయొక్క కృపచేతనే యగును.

ఆర్జవము, అనార్జవము, అనగా కరణత్రయముల కేకరూపత కలిగియుండుట, అట్లు లేకుండుట యున్నూ, నలుపు, తెలుపుయున్నూ సత్యము, అసత్యమున్నూ, బాల్యము, వార్ధకమున్నూ, ఈనాటిది, పురాతనమైనవియున్నూ, మున్నగునవన్నియూ తిరువిణ్ణగర్ స్వామి వైచిన తోటల వంటివి. ఉద్యానవనము తనకు కావలసిన రక్షణమును తాను తెలియజేయజాలదు కదా! ఉన్నచోటనే ఉండి వాడిపోయి కనబడును. అపుడాతోటను వైచినవాడే దానికి కావలసిన రక్షణమును చేయవలసివచ్చును. అట్లే వీటినన్నిటినీ కలుగజేసి వీటి రక్షణభారమును కూడ వహించువాడు పరమాత్మ అనునది ఆళ్వార్ల భావము.

"ఉపరితన లోకములకు నిర్వాహకుడై, అంతవరకే కాక నిత్యవిభూతికి కూడ నిర్వాహకుడైయున్ను; అనుగ్రహము కూడ తానై యుండియు; శ్రీ మరియు అశ్రీయున్ను

తానైయుండియు; శ్రీకటాక్ష ఫలమగు కీర్తి; అశ్రీ కటాక్షమగు అకీర్తియును దానై; వీటిని తన విభూతిగా కల భగవానుడు నామనసు నందు వసించుచున్న ఉదారుడు. అట్లు వసించుటయు నాకు ఉపకారము అను తలంపుతో గాక తనకే ఉపకారము అని తలంచుట అయన మహోదారత!" అని విదులగు చున్నారు.

ఎంతటి వారికైనను భగవంతుడే దిక్కు తప్ప వేరు దిక్కు లేదనుచున్నారు. "శుద్ధ సత్త్వమయమైన అసాధారణమగు అప్రాకృత దివ్య మంగళవిగ్రహము కలవాడై యుండియు, గుణత్రయ వశ్యమైన ఈ జగత్తు సమస్తమును తన శరీరముగా ధరించి యున్నాడు. వీటన్నిటికి అంతరాత్మగా యుండి తాను దివ్య మంగళ విగ్రహముతో ఈ లోకమునకు కానవచ్చు నట్లు రామకృష్ణాది రూపేణ అవతరించి పదునొకండ వేలేండ్లు నూరేండ్లు వసించి ఆశ్రితులకు తనవైభవము ఎఱుక పడునట్లు, అనాశ్రితులగు శిశుపాలాదులకు తన వైభవము వ్యక్తము కాకుండునట్లును ధరించిన భగవానుడు తిరువిణ్ణగర్ యందు వేంచేసి యున్న స్వామి. అట్టి భగవంతుని పాదారవిందములు తప్ప వేరుగతి లేదు!" అనుచున్నారు ఎంతటి ఉన్నతులకైనను తక్కువ వారికైనను స్వామి పాదారవిందములే శరణమని భావము.

"దేవతలకు దృఢమైన రక్షకుడై, అసురులకు క్రూరమృత్యువైన వాడు స్వామి. అనుకూలురైన అర్జునాదులను తన పాదచ్ఛాయలోనికి తీసికొని, అట్టి బంధుత్వమే కలిగినా ఆసుర ప్రకృతులగు దుర్యోధనాదులను దూరముగా త్రోసివేసిన భగవానుడు దక్షిణ దిక్కుకు ఆశ్రయమైన తిరువిణ్ణగర్ దివ్యదేశమందు మాకు శరణ్యమై భవ్యుడై నా దాస్యమును స్వీకరించుటకు వేంచేసియున్నాడు!" అని ఆనంద సాగరాంత ర్నిమగ్నులగుచున్నారు ఆళ్వార్లు.

ఛాయాతపాదుల వలె ప్రియహితపరులైన మాతాపితృ సంబంధమును గల భగవానుడు ఈ లోకములోని వారినందరినీ తరింప చేయదలచి తన పాదారవిందములతో ఈ జనుల శిరస్సులను పావనము చేయుదలంచినాడు. కానీ అహంకారులైన పాపులు ఈ భాగ్యమును అంగీకరించి పొందుదురా అను ఆలోచనతో స్వామి నేనొక వింతను చేస్తాను మీరందరు చూడుడని ఒక ప్రదర్శనమును చేయువానివలె చిన్న రూపముతో వామనుడుగానున్న తాను త్రివిక్రముడుగా పెరిగి లోకముల నాక్రమించుచు అందరి శిరస్సులను తన పాదకమలములతో స్పృశించి జగత్త్రయమును పవిత్రమొనరించిన ఉదారశీలుడైన భగవానుని యొక్క దివ్యమైన విరుద్ధ విభూతికత్వమును దర్శించి విద్ధులై అనుభవించిన ఆళ్వార్లు భగవానుని సర్వ నియంతృత్వమును అభివర్ణించిన ఈ తిరువాయిమొழிని అనుభవించి అనుసంధించిన వారు పరమపదములోని వారికి కూడ పరమ పూజ్యులగుదురు" అని ఫలము తెలియజేయబడినది.

శ్రీమతే శఠకో

శ్రీమతేరామానుజాయనమః

# తులవిల్లి మఙ్గలము

ఉ.వే.శ్రీమాన్. వంగలవేంకటాచార్యస్వామి,
నరసాపురం.

దివ్యే శ్రీతొలవిల్లి మఙ్గళపురే శ్రీ తామ్రపర్ణీతటే
ప్రాప్తే వారుణ తీర్థకం శఠరిపు స్తుత్య స్సురేశాననః ।
నాయక్యా మరవింద లోచనవిభుః రక్తః కరుంకణ్ణితి
ప్రాప్యేంధే కుముదం విమానమనిల స్త్రీర్దేశ శక్రే క్షితః॥

ఈ క్షేత్రమునకు "ఇరెట్టై తిరుపతి" అని పేరు. నమ్మాళ్వార్లు "అవ్వూర్" అను విలక్షణ మైన తిరునామం కృపచేసిరి. ఇది రెండు క్షేత్రములు అయినను ఒకే క్షేత్రముగా కీర్తింపబడుచున్నది. ఇచట స్వామి "తేవపిరాన్" అరవిందలోచనుడు. కరున్దడం కణ్ణితాయారుతో తామ్ర పర్ణీనదీ తీరమందలి వరుణ తీర్థమున కుముదవిమానమున తూర్పు ముఖముగా సేవ సాయించు చున్నారు. నమ్మాళ్వార్లు సఖీభావనలో చెప్పిన దశకములు మూడు 1) తీర్వారయామిని 2) తువళిల్ మామణిమాడం 3) కరుమాణిక్కమలైమేల్.

ఆళ్వార్లు ఈ క్షేత్రమును "తువళిల్ మామణిమాడం" అను దశకమున ప్రస్తుతించి యున్నారు. తిరువిరుత్తమునందలి మొదటి పాశురం "పొయ్నిన్ద జ్ఞానం" అను పాశురం మొదలు ఇంత వరకును ఈ దశకమునకు పైనను సర్వేశ్వరుని కీర్తించిన ఆళ్వార్లు ఈ దశకములో భగవద్విషయమందు తమకు గల ప్రావణ్యాతిశయమును అన్యాపదేశముగా తెలుపుచున్నారు. ఈ దశకము ఆళ్వార్ల స్వభావమును చక్కగా తెలియ జేయుచున్నదని మన పెద్దలందరూ మిక్కిలి ఆదరమును ప్రదర్శింతురు. "యతోవాచోనివర్తన్తే అప్రాప్య మనసాసహ" అను నట్లు వాచామగోచరమైన విషయమును కూలంకషముగా నిరూపింపగల వీరే తమ స్థితిని తెలుపవలెనుగాని మరి యొకరు తెలుపగలరా!

సీతాదేవి జన్మించిన సమయమందు జనక మహారాజు జోతిష్కులను పిలచి ఈమె జాతకమును వ్రాయమనికోరగా వారు ఈమె మహాభాగ్యసంపన్నురాలై ఒక సార్వభౌమునకు పత్నిఅగునని తర్వాత కొంతకాలమునకు అరణ్యావాస క్లేశమును అనుభవించుననియు వ్రాసినారు. అట్లే ఈ ఆళ్వార్నాయిక అవతరించినపుడు ఈమె తల్లిగారు జన్మ పత్రికను వ్రాయమని కోరగా జోతిష్కులు ఈమెకు అంతయు బాగుగా నేయున్నది కాని ఒక అపమృత్యు భయమున్నది అది తొలగిపోయినచో చిరకాలము జీవించునని చెప్పినారుట. ఆ అపమృత్యువు ఏదనగా మీరీమెను తులవిల్లి మఙ్గల క్షేత్రమునకు తీసుకొనిపోరాదు అట్లైన ఈమె మీకు దక్కను అని చెప్పిరట.

ఈమె జీవింపక పోయినను బాధ లేదు కాని తులవిల్లి మఙ్గలక్షేత్రమును సేవింపక ఉండలేని

వంశమున పుట్టిన ఈమె మరణమునకైన సిద్ధమే అని పల్కిరట. సీతాదేవికి వనవాసక్లేశము తప్పనట్లే ఈమెకు తులవిల్లి మజ్గలక్షేత్ర సందర్శనము తప్పనిది. ఇచట సేతువును నిర్మించిన నలునిమాట స్మరింపదగినది.

నలుడు వారధికట్టుచుండగా కొందరు వానరులు రాళ్ళతో సముద్రమును నిరోధించుట సంభావితమా అని ప్రశ్నింపగా నలుడు పెరుమాళ్ళు అరణ్యమునకు పోవుట, సీతాదేవిని రావణు డపహరించుట, పెరుమాళ్ళు కోపించుట సంభావితమా అని ప్రశ్నించెనట.

దేహాత్మాభిమానం కలవారికి ఎంత జ్ఞానమున్నను నేను స్థూలముగానున్నాను, చిక్కియున్నాను. ఇత్యాది భావములు తప్పనట్లే ఆళ్వార్లును సంసారమునందు ఎన్ని దోషములను చూచినను దివ్యదేశ విషయాసక్తిని విడచిపెట్టరు. క్షుద్రవిషయాసక్తులు ఇది అధర్మము నిందావహము నరక ప్రదము అని తెలిసినను ఆయా విషయాసక్తిని విడువనట్లే, భగవద్విషయాసక్తులు భగవిద్విషయమున లోపములను ఎంచుట కవకాశములేక గణాధిక్యతనే అభివర్ణింతురు. అది మరింత ప్రావణ్యాతి శయమును కల్గించును.

ఇట్లు పరాంకుశ నాయిక తులవిల్లి మజ్గళ క్షేత్ర స్వామి విషయమై మిక్కిలి ప్రావణ్యమును కల్గియున్నది. దానిని మరలింపవలెనని ఆమె తల్లిగారి ఆలోచన. దీనికి కారణ మేమనగా వయస్సు రాకముందే మనమాట విననంత ప్రావణ్యాతిశయము ఈమెకు కల్గినది. ఈ అతిశయము ఈమెను చెడగొట్టునేమోయని తల్లిగారి భయము. అంతేకాక సాధనానుష్ఠాన పరులగువారియందు కూడా ఈ ప్రావణ్యాతిశయమునే ఒక సాధనముగా గ్రహించునేమోయని భయము. ఈ ప్రావణ్యము స్వరూపముకంటే వేరైనప్పుడే సాధనము నందన్వయించును. స్వరూపబేధము నొప్పుకున్నప్పుడు. స్వరూపమునకు తగిన కార్యములను కూడా ఒప్పుకొనవలెను కదా అని ఈ నాయిక అభిప్రాయము. శేషికి ఉపాయభావము స్వరూపాను బంధి అయినపుడు శేషభూతునకు ప్రావణ్యము స్వరూపాను బంధి అగుచున్నది.

క్రిందటి దశకములో అనుభవించిన కృపగుణానుభవము మానసిక మగుటచే బాహ్య సంశ్లేషాపేక్ష కల్గినది. అది సిద్ధింపక పోవుటచే కల్గిన మనో వేదనను ఈ దశకమున అన్యోపదేశముగా చెప్పుచున్నారు. తల్లిగారు ఈ నాయిక స్వభావాన్ని తెలిసినవారై తువిల్లి మజ్గళ క్షేత్రమునకు తీసుకొనిపోయిరి. అచట పరత్వ సౌలభ్యములకు ఆలవాలమై వేంచేసి యున్న అరవిందలోచనన్ "తేవపిరాన్" అను ఆ స్వామి తిరునామములనే పలవరించుచున్నది. ఈస్థితికి చూచి భయపడిన తల్లిగారు ఆమె సఖులతో ఈమె స్థితి ఇట్లున్నది. దీని నుండి మరలించు ఉపాయమును చెప్పుడనికోరిరి. ఆ మాటలువిన్న సఖి అమ్మా మీరు ముందుగా ఈమెను ఈ క్షేత్రమునకు తీసుకుని వచ్చి ఇట్టిప్రావణ్యాతిశయమును కలుగునట్లుచేసి ఇప్పుడు మరలింప ప్రయత్నించిన సాధ్యమగునా! కావున ఈమెపై మీరు ఆశవదలుకొనుడు అని చెలికత్తెలు ఆళ్వార్ల తల్లిగారికి

నివేదించుచున్నట్లుగా ఈ దశకముసాగినది.

దశక సారాంశము:

అమ్మలారా! ఏ దోషములులేని మణులతో నిర్మింపబడిన సౌధములు గల యీ తులవిల్లిమంగళ క్షేత్రమును భజించు ఈ పరాంకుశ నాయికపై ఆశవదలుకోండి. ఆమె భగవంతుని తెల్లని శంఖమును, చక్రమును పద్మవిశాల నేత్రములను పలవరించుచు కన్నుల నీరునింపుకొనుచు మనస్సులోని భావమును చెప్పజాలక బాధ పడుచున్నది.

ఉత్సవకోలాహలము గల ఈక్షేత్రమునకు మధురవాణియగు ఈ పరాంకుశ నాయికను తీసుకొని వచ్చి మీ కాశలేకుండ చేసికొంటిరి. (తిరువాయి మొళ్లి మధురమైన "తొణ్డర్క ముదుణ్ణ అని గదా!" ఆ తిరువాయి మొళ్లిని అనుగ్రహించిన పరాంకుశులు మధురవాణి) భగమంతుని దివ్యనామములను విన్నంత మాత్రముననే మాటలుడిగి కన్నుల నీరు ఉప్పొంగగ కృశించిపోవుచున్నది.

మీరు ఈమెకు తామ్రపర్ణినదీ తీరమున కల జలసంపన్న క్షేత్రములను చూపించిరి. మీకు ఆశలేకుండగ చేసికొనిరి. ఈమె సర్వేశ్వరుని క్షీరాబ్ధి శయనము; త్రివిక్రమావతారము; గోబృందములను మేపు సౌలభ్యమును పలవరించుచు కన్నుల నీరు నిండించు కొనుచున్నది.

అమ్మలారా! ఈ తులవిల్లిమంగళక్షేత్రము వేదవిద్యాధికులు సుఖవాసము చేయు ప్రదేశము. ఈ క్షేత్రమును సేవించిన పిమ్మట ఈ పరాంకుశ నాయిక అణకువలేనిదై తాను నేర్చిన విద్యఅంతయు సముద్ర వర్ణుడగు శ్రీకృష్ణుని గూర్చినదిగా చేసికొని అమందానందమును పొందుచున్నది.

అమ్మలారా! భగవద్గుణానుభవముచే ప్రకాశించు మోముగల ఈమెను తులవిల్లిమంగళ క్షేత్రమునకు తీసికొనిపోయి; తిరువాభరణముల కాంతి గలవాడును; పుండరీకాయతాక్షుడును అగు స్వామి వేంచేసి యున్న విధమును చూపించితిరి. నాడు మొదలు ఈమె బాష్పపూరిత లోచనయైనది. మైకము కమ్మినది. మనస్సు స్వామిపై లగ్నముకాగా ఆదిశగా తిరిగి అంజలి ఘటించుచున్నది.

అమ్మలారా! ఈ తులవిల్లి మంగళ క్షేత్రము తామ్రపర్ణికి ఉత్తర దిక్కున కలదు. అచట ఏవైపు చూచినను చెఱకు తోటలు; ఎఱ్ఱని వరిపైరు, ఎఱ్ఱతామరలు వికసించిన సరస్సులు దర్శనమిచ్చును. అట్టి ఈక్షేత్రమును సేవించినది మొదలు ఈమె వేరొక వైపు చూడదు. నోరు తెరచి పలికినచో నీలరత్న నిభుడగు భగవంతుని దివ్యనామములనే పలకరించును.

అమ్మలారా! నెమలిపింఛము వంటి కుంతలములు; లేడి చూపుల వంటి చూపులుగల ఈమె మన చేతిని వదలి పెట్టినది. తులవిల్లి మంగళ క్షేత్ర ప్రస్తావన తప్ప వేరే మాటను వినగోరుట లేదు. ఇదిమన పూర్వజన్మ సుకృతమా! కాక నీలమేఘశ్యాముని సంకల్పమా! ఆ భగవంతుని

సివ్య లక్షణములు; దివ్యనామములు; ఈమెనోటినుండి అపూర్వసంస్కారముతో వెలువడుచున్నవి.

ఈ క్షేత్రము వేదములతో; వేదోక్త కర్మలతో వెలుగొందుచున్నది. నల్లని విశాలనేత్రములుగల యీ పరాంకుశనాయిక ఈ క్షేత్రమును సేవించినది మెదలు నేటివరకు మోహమును పొందియే యున్నది. పుండరీకాక్షా! యనిమధ్యమధ్య కలవరించుచూ కరిగిపోవుచున్నది.

కేశియను దానవుని సంహరించిన స్వామి వేంచేసియున్న యీ దివ్య క్షేత్రమును సేవింపచేసినది మొదలు ఈమె సదా ఆశ్రియః పతి దివ్యనామములనే పలకరించుచు వృక్షములు సైతము కరగునట్లుగా ఆర్తితో ఓ! ఇంద్రనీలవర్ణా! అని కూయిడుచున్నది. ఆ క్షేత్రము వైపు తిరిగి అంజలి ఘటించుచున్నది.

విశే:- 'మరజ్గళుమ్ ఇరజ్గుమ్ వగై' చెట్లు కరగునట్లుగా అనిన సందర్భంలో చెట్లు కరగునా అని ప్రశ్నించారట. దీనికి ఎంబార్ "ఈ కాలమున తిరువాయిమొழ్రిని సేవించిన రాతిగుండెకలవారే కరగుచుండగా అనాడు స్థాణువులైన వృక్షములు కరిగి యుండవా! అని సమాధానము చెప్పిరట.

ఈ పరాంకుశనాయిక అభినివేశమును చూడగా ఈమె నీళాదేవియా! లేక గోదాదేవియా! లేక సాక్షాత్ లక్ష్మీ దేవియే ఇట్లవతరించెనా! అనిపించును. అదేమో కానీ సర్వేశ్వరా! యనియే సదావలవరించును. ఇతరులు కూడ ఆ దివ్యక్షేత్రమును గూర్చి పలుకవలెనని పలవరించును.

మనోవాక్కాయముల సర్వేశ్వరుడే సకలవిధ బంధువుగా అధ్యవసాయముగల నమ్మాళ్వార్లు కురుకాపురాధీశులు. వారనుగ్రహించిన తిరువాయి మొழ్రి లోని యీ పదిపాశురములను అభ్యసించువారు పరమపదమునుపొంది అచట నిత్య కైంకర్యమును చేయగలరు.

శ్రీ సింహాద్రి నాథాయ నమః
శ్రీ లక్ష్మీ హయవదన పరబ్రహ్మణే నమః





శ్రీమతే రామానుజాయ నమః శ్రీమతే శఠకోపాయ నమః

# ఆపత్ సఖుడు వైత్తమానిధి

ఉ.వే.ప్ర.శ్రీమాన్ కె.ఇ.టి.రామానుజాచార్యస్వామి

- బాపట్ల

ఉణ్ణుంశోఱు = భుజించునట్టి అన్నము, పరుకునీర్ = త్రాగునీరు, తిన్నుం వెత్తిలైయుం = నమలబడు తాంబూలము, ఎల్లాంకణ్ణన్ = అంతయు కృష్ణుడే. దేహమును నిలుపునట్టిది ధారకమనబడు పోషకమునబడును - అది నీరు. దానికి సహకరించి భోగముగా భావింపబడునది భోగ్యమనబడును. అది తాంబూలము. ఇది మానవులకు సహజము. ఎప్పుడును భగవదనుభవము చేయుచు తన్మయులగు ఆళ్వారులకు ఈ మూడును శ్రీ కృష్ణుడే. భగవంతుడు స్వతంత్రుడు. భర్త. జీవుడు భగవంతునికి పరతంత్రుడు. భార్య. నారాయణుని విడచి యుండనిది శ్రీదేవి. పరమాత్మను విడచి యుండజాలని పరిశుద్ధ జీవుడైన ఆళ్వారు ఆ శ్రీదేవితో సమానము. అ పురుషోత్తమునికి జీవకోటి అంతయు స్త్రీ ప్రాయమే గదా! ఆస్వామి నిర్హేతుక కటాక్షము చేత ఆళ్వారుకు స్త్రీభావము మనస్సునందావరించినది. స్వామి తన సంశ్లేషము చేతను విశ్లేషము చేతను ఆళ్వారుకు గల జ్ఞానభక్తులను పెంచినాడు. సంశ్లేషము అనగా ప్రత్యక్షముగా అనుభవించుటతో సమానమైన మనస్సున పొందెడి అనుభవము. విశ్లేషము అనగా బాహ్యాముగా అనుభవము లేనప్పుడు కలత చెందిన అంత:కరణములోని శిథిలావస్థ. ఈ స్త్రీ భావమును పుట్టింపజేసినది "స్వామియే నాకు ఉపాయము" అను భావనతో గూడిన జ్ఞానము కాబట్టి ఈ అధ్యవసాయ జ్ఞానమే ఈ ఆళ్వారు అనెడి నాయకికి తల్లి అనబడినది. తల్లికి, తన కూతురు యొక్క బాగోగులను బట్టిన సంతోషము గాని విచారము గాని ఎట్లు అవసరమో, అట్లే ఈ నాయకికి గల్గు సంఘటనలను బట్టి ఈ తల్లి యొక్క అనుభవము కూడ ఉండును గదా! ఈ పదిపాశురములందును తల్లి తన కూతురు చేసిన పనికై పరితపించుటయే చెప్పబడినది. కాన ఇదంతయు "తాయ్ప్పేచ్చు - తల్లివాక్కు" అనబడుచున్నది. ఇందు పక్షులను సంబోధించుట ఉండును. ఆ పక్షులెవరు? జ్ఞానము-అనుష్ఠానము, అనెడి రెండు ఱెక్కలు గల ఆచార్యులు, భాగవతోత్తములు, వారే, ఈ చేతనుని పరమాత్మను గూర్చి తెల్పి ఆ పరమాత్మ సన్నిధికి చేర్చువారు. మనస్సునకు ఊఱటను గలిగింపగలవారు.

అది 'తిరుక్కోళూర్' అనెడి శ్రీవైష్ణవ దివ్యక్షేత్రము. పాండ్యనాడులోని 18 తిరుపతులందును ఒకటి. "తిరుక్కుఱుగూరు" మొదలైన నవ తిరుపతులలోను ఒకటి. నవ నిధులు గల కుబేరునకు ప్రత్యక్షమైన మహానిధి అచటి శ్రియః పతి. ఆ స్వామికి వైత్తమానిధి" అని తిరునామము. ఆచార్య నిష్ఠాగరిష్ఠులైన మధురకవి యాళ్వారుకును అవతారస్థలము అయూరు.

నమ్మాళ్వారును, నాయకి భావనలో ఉన్నప్పుడు "పరాంకుశనాయకి'' అనుట, ిరుమంగైయాళ్వారును నాయిక భావనలో ఉన్నప్పుడు "కళ్వన్‌గొక పిరాట్టి" అనుట సంప్రదాయము. ంరాంకుశ నాయకి, శ్రీకృష్ణుని వలచినది. ఆమెకు శ్రీకృష్ణునితో బాహ్యానుభవము కలుగలేదు. ునస్సు వ్యాకులమైనది. ఈ వియోగము వలన ఆమె మోహదశలో చిక్కుకొన్నది. ఆమె వియోగ ంరితాపమును ఉపశమింపజేయుటకై ఆమె తల్లి ఆ కూతురు చేరువయందే పరుండి ుగవన్నామములను ఆలపించుచుండినది. "ఆశ్రిత వ్యామోహము గలవాడా! త్రివిక్రమా! అందమై ాడవైన కిరీటమందు సొగసై చల్లనైన తులసీమాలను దాల్చిన వాడా!'' అని పాదాది కిరీటాంతముగా ర్ణించుచు చెప్పిన ఆ తల్లి పలుకులను కూతురు ఉత్కంఠతో ఆలకించుచుండినది. తల్లి, ఆ ్వామి తిరునామ వైభవములో మగ్నయై పరవశించి నిద్రించినది. పరాంకుశ నాయకి పరమోత్కంఠ ాలదగుట వలన మృత సంజీవనియైన శ్రీకృష్ణుని నామములను వినుచు నిలుపోపక ిరుక్కోళూరుకు పయనమై వెళ్లినది.

పిదప తల్లి యధాలాపముగా మేల్కొని చూచుసరికి కూతురు కన్పడలేదు. పడుకను ెడవి చూచినది. ఎలుగెత్తి పిలచినది. ఫలితము లేకపోయినది. ఏవేవో ఊహలు చేయసాగినది. ెనకు 'వైత్తమానిధి' పైనను 'తిరుక్కోళూరు' పైనను భక్తి ఎక్కువ. తన గర్భవాసమున పుట్టుటవలన ెన బిడ్డకును ఆయూరి పెరుమాళ్ల మీదనే ఆశ కల్గియుండవచ్చును. చాల దూరముగా వెళ్లజాలని ృదుస్వభావము గలది గాబట్టి తిరుక్కోళూరికే వెళ్లియుండవచ్చును. మనకు దేహపోషణముకు ెన్నపానాదులు అవసరము. ఆమెకు అన్నపానాదులన్నీ శ్రీకృష్ణుడే కదా! అందుకే తనకు ెవసరములేని యాభోజ్యపదార్థములన్నిటిని వదలి ఆ తిరుక్కోళూరుకే వెళ్లియుండుట నిశ్చయము. ఆస్వామి జగన్మోహనుడు. పుంసాంమోహనుడు. మన్మథ మన్మథుడు. నాకు ఆ బిడ్డను ఎడబాసిన ుఃఖము ఒకవైపు బాధించుచుండగా ఇపుడు 'ఈమె ఒంటిగా వెళ్లినదే?' అనుదిగులు దాపురించినది.

ఇన్నాళ్లదాక "భగవద్గోష్ఠితో ఏ మాత్రము ఈమె పనికి రాదు,' అనుకొనే విధముగా ్రవర్తించినది. ఇప్పుడు 'ఈ సంసారులలో ఎంత మాత్రము ఇముడలేదు,'' అనుకొనే రీతిలో ుదా మసలుచున్నది! శబ్దాది విషయములు హేయములు, నరకప్రదములు, అని భావించినదే. ోకులు ఏమైన నిందింతురేమో? అను జంకు కొంకు లేదే! గుణాధికుడైన అస్వామికై వెళ్లినదని ెవరు భావింతురు?

నాకు సొమ్ము నా బిడ్డయే. ఆమెను విడచినేనిక్కడ ఉండగలనా! గృహమును ెలంకారహీనముగా చేసి వెళ్లినదే! తాను తప్పక వెళ్లదలచినచో తనతో నన్ను కూడ పిలచుకొని ెళ్ల వచ్చుగదా! ఒంటరిగా వెళ్లుట యెందుకు? నేను అక్కఱలేదు అనుకున్నదా? అట్లైన అతనితో ూడ వెళ్లవచ్చు. కన్పడిన వారి నందఱిని ఆయూరెక్కడ? అని అడుగుచు, కండ్లనిండ నీరు ొణకుచుండగా భగవన్నామములను పల్కుచు లోకులందఱిని ఉజ్జీవింపచేయుచు వెళ్లుచుండ

వచ్చును. దారిలో అగుపడినవారు ఏమి కొండెములు చెప్పుదురో! ఆ యూరికి ఎట్లు చేరునో? చేరి అచటి తోటలను తటాకములను చూచి, ఆస్వామి గుణగణములను తలచుకొని ఆనందించునో? లేక కలత చెందునో? ఇంతకు ఈమె ఆయూరికి చేరుకోవలెను గదా! తనను ఉపేక్షించి మమ్ములను వదలి ఈ భోగభాగ్యములనంతయు నడుసంద్రములో ముంచి వెళ్లినదే! ఎంతపని చేసినది!

ఉన్మస్తకానుభవమును వెదకికొనుచు అక్కడకు వెళ్లియుండును. అవును ఇక్కడ ఈ అన్నపానాదులే ధారకాదులు. అక్కడ ఆస్వామియే యిదంతయును గదా! నిత్యసూరులకు పరమపదములో "అహమన్నం.... అహమన్నాద:" - నేను నీకు భోగ్యమైనవాడను. ఇట్టి నన్ను భోగ్యముగా గల నిన్ను భోగ్యముగా అనుభవించువాడను నేను" అట్టి అనుభవము సిద్ధించునని శ్రుతి చెప్పుచున్నది. ఆ యనుభవము ఇక్కడనే లభించునెడల పరమపదము దాక పోవుటెందుకు? అని వెళ్లియుండును.

చిలుకలారా! ఊరివారిని తన దేశస్థులను లోకములోని వారిని గూడ తన వలెనే ఆస్వామి కల్యాణ గుణములను, చిహ్నములను, నామములను ఆలాపించునట్లు చేసి వెళ్లిన నాబిడ్డ, తిరిగి వచ్చునా? లీలాశుకములను గోరువంకలను చూడగనే స్వామి నామములను పల్కించుచు వర్షధారా సమానమైన కన్నీటితో ఏమి చేయుచున్నదో! సన్నని నడుము అసియాడ లేడి పిల్లవంటి నాబిడ్డ, పరమైశ్వర్యవంతుడైన యాతడు పవ్వళించియున్న ఆస్వామి యూరికి వెళ్లుట చూచినవారు, ఈమెను గుణహీనురాలందురా? గుణాధిక అందురా? అచట తోటలను తటాకములను కోవెలను దర్శింపగనే ప్రాణాధారమైన ఈమె హృదయము చల్లబడుట నిజము. ఈనాడే ఈమెకు సుప్రభాతము.

ఆచార్యులు ఉపేక్షించినమ్లేచ్ఛ భూమి దక్షిణ దిక్కు కాంతిని ప్రసాదించునట్టి ఆభరణములకును ఆభరణము వలె "తిరుక్కోళూరు దక్షిణ దిశకే తిలకమైయున్నది. ఈ బిడ్డ, వంగి వంగి యాడి యాడి శిథిలాంత:కరణమై మెల్లమెల్లగా నడచి ఆ యూరిని యెట్లు చేరుకోగలదో గదా? ఈమెకు తోడు ఎవరు? మనస్సు లోని ఆర్ద్రతయే! చందనమేది? పూవులేవి? అన్నియు ఈమెకు భవ్యుడైన కృష్ణునికే యనుకొనును. ఆయన కొఱకే దివ్యాభరణభూషితయైనది. ఆయన కొఱకే సంకల్పించిన ఈ సర్వమును త్యజించినది. ఆ అరవిందలోచనుని క్షణమైనను విడువదు. తాను ఆయూరికి ఒంటరిగా వెళ్లుట తన వంశమునకే అపవాదము, అని అనుకొనక నిర్లక్ష్యము చేసినదే, అని పలువిధముల హాపోవుట చూడగా మార్గస్థులను ఉజ్జీవింపచేసి అస్వామిని గూడ ఉజ్జీవింపజేసినది. తానును ఉజ్జీవించినది - అనునట్లు ఈ గమనము వలన స్పష్టమగును.

ఈ ఘట్టములకు తగిన రసవంతములైన ఐతిహ్యములు కొన్నిగలవు. శ్రీయామునాచార్యులు, తమ గోష్ఠిలో'ఇందలి 'పరాంకుశనాయకి' వెళ్లుటను గూర్చి భయపడవలెనా? పెరియతిరుమొఝిలోని "కళ్వాన్ గొల్ పిరాట్టి" వెళ్లుటను గూర్చి భయపడవలెనా?" అని అడిగిరి.

దానిని విన్న భక్తులు "ఇద్దఱుగా వెళ్లినప్పుడు భయమెందుకు? ఒంటరిగా వెళ్లిన యామెను గూర్చి కదా భయపడవలెను!" అనిరట. అంత శ్రీయామునులు, "అటుల కాదు ఇద్దఱి కోసము భయపడవలసినదే. కళ్వాన్‌గొవ్ పిరాట్టియు, తిరువాలి తిరునగరి స్వామియైన, వయలాలి మణవాళన్" ఇరువురును అన్యోన్య వైలక్షణ్యము గలవారు. కోపమును నడకను లక్ష్యపెట్టనివారు, భ్రాంతి గలవారు, ఆ యిద్దఱు ఎట్లు సురక్షితముగా చేరుకోగలరో! అని భయము. ఏకాకినిగా వెళ్లిన పరాంకుశ నాయకికొఱకేమి భయము? అని వాక్రుచ్చిరట.

ఈ యంశములో నంబిళ్ల అభిప్రాయము శ్రోతల అభిప్రాయమే. ఎక్కడకు వెళ్లినను ఇర్వురును కలిసి యున్నప్పుడు భయపడుటెందుకు - ఒంటరిగా వెళ్లిన యీనాయకి విషయమే భయపడవలసినదనిరట.

భక్షించు అన్నము - త్రాగునీరు - నమలబడు తాంబూలము, అనుచోట! భక్షించు, త్రాగు, నమలబడు, అను విశేషణములన్నవి. 'తిరుక్కుఱళ్, అను గ్రంథములో 111 అధికారము 5లో "వేట్ట పొలినదిల్ అవై అవైపోలుమే, తోట్టాక కదుప్పిపాళ్ తోళ్" ఆశించిన వేళయందు ఆయా వస్తువులు భోగ్యములైనట్లుగా పూవులతోడి ముంగురులతో కర్ణాభరణములతో సొగసైన చెక్కిళ్లుగల ప్రియురాలి సంశ్లేషము భోగ్యమగును. అన్నట్లు ఒక్కొక్క అవస్థలో ఏవి యిష్టములు కావో, అవియే వేఱొక వేళలో ఇష్టములగును. అట్లే యీ నాయకికి శ్రీకృష్ణుడే భక్షించు ధారకము - పోషకము - భోగ్యముగా అయినవి, అను అభిప్రాయము ఆ మూడు విశేషణముల వలన తెలిసికొనవలెనని వ్యాఖ్యాత అనుగ్రహించిరి. ధారకాదులన్నియు సర్వేశ్వరుడే అనుటకు ఒక ఐతిహ్యము. చోళకులాంతకము, అను గ్రామములో ఒక శ్రీవైష్ణవుడు వ్యవసాయముతో జీవించుచుండెను. అతనిని చూచిన అనన్తాళ్వాను, "మీ యూరు ఏది?' అని అడిగిరి. ఆయన ' మాయూరు తిరుక్కోళూరు అనెను. ఐనచో ఆ యూరిని వదలి ఇక్కడకు ఎందుకు వచ్చితివి? అని అడిగెను. దేహ పోషణము జరుగక వచ్చితిని. అని ఆయన చెప్పెను. అప్పుడు అనన్తాళ్వాను, ఆ యూరిలో "ఎవరి గాడిదెనైనో మేపి బ్రతుక వచ్చు గదా! స్థిర జీవనమైన స్వామిని (వైత్తమానిధిని) విడచి వచ్చితివే!" అని బాధపడిరట. దేహపోషణ కంటెను ఆత్మ పోషణము ముఖ్యమని దీని భావము.

దేహముగల ప్రతిజీవుడును భగవంతుని అనుభవించునపుడు కన్నులు ఆనంద బాష్పములతో తొణకవలెను. ఒంటిపై పులకాంకురము లేర్పడ వలెను. భగవంతుని సదా దర్శనము సంభవింపవలెను. ఇదియే పురుషార్థము. ఈ యనుభవమునకై పరమపదమునకే పోవనక్కఱలేదు. నంజీయరు, పిళ్లై తిరునఱైయూరరయరుతో "మూడు తిరువాయ్ మొழிలను విన్నాను. నాకొక మార్పును తోచలేదు. ఈ ఒక్కఘట్టమును ప్రస్తావింపగనే ఆచార్యులు తమకంట తడిపెట్టుట గుర్తుకు వచ్చుచున్నది." అనిరట. పరాంకుశ నాయకికి గల కృష్ణుని మీది తృష్ణ కృష్ణానుభవము తోనే కదా శమించునది!

సంసారులు ఆశపడు ఊరు ఆళ్వారుకు నిప్పువలె సహింపరానిది. ప్రణయధారా విదగ్ధుడైన ఆస్వామి తానుగా కోరి విచ్చేసిన యీయూరు వీరికి ఆనంద దాయకము. మరణించిన వెనుక వచ్చు పరమపదము కంటే ముందు ఈ యూరే అభిలషణీయము. "ఊరు ఇంకెంత దూరము? అని ప్రశ్నింపగనే "ఇంక ఇంత దూరమే" అనెడి ఎదురుగా వచ్చు వారి బదులుమాటయే వీరికి పాథేయము. (బాటలో ఆకలి దీర్చు తిండి) ఆయూరిలోనికి చేరుకోవలెనన్న ఆశయే అందఱికి కలుగును. కాని బయటకు వెళ్లి పోదమనే బుద్ధి పుట్టదు. శ్రీరామానుజులు దక్షిణ యాత్ర చేయుచు ఈ యూరి వద్దకు చేరిరి. ఎదురుగా వచ్చు ఒక యువతిని చూచి "ఎక్కడ నుండి" అని అడిగిరి. ఆమె 'తిరుక్కోళూరు నుండి" అన్నది. "అయూరిలో చేరిన స్త్రీలును దానిని వదలి రాగల వారున్నారా?'' అని కృపజేసిరట. ఆయూరిలో పిల్లలు ఇంటిలో కన్పింపనిచో కోవెలలోనే ఉందురని వెదకి చూతురట.

భట్టరు, పిళ్లతిరునఱై యూరరయరును, కోవెలలో ప్రదక్షిణించుచు ఆ విశేషములపైని దృష్టిని మఱల్పలేక కనుదోయితో సౌందర్యామృతమును జుఱ్ఱుకొనుచు వీక్షించు చుండిరి. వారి ననుసరించుచు నేను ఆసన్నివేశమును అనుభవించినాను, అని నంజీయరు కృపజేసిరి. అంత ఆకర్షణ అక్కడ గలదన్నమాట.

ఆచ్చాన్, ఆండాన్, ఇద్దఱును కుంభఘోణ క్షేత్రమునకు వెళ్లుచు మధ్యలో "తిరుప్పేర్' ' క్షేత్రమును చేరి కుంభఘోణమునకు సాగలేక లోనికి వెళ్లి సేవింపను లేక కోవెలనే సేవించుచు నిలబడిరట - అట్లు సేవించుటయే పురుషార్థము. అట్లే యీనాయిక తిరుక్కోళూరు కోయిలనే సేవించుట పురషార్థముగా భావించినదని భావము.

భట్టరు, "ఆవియుళ్ కుళిర = హృదయము చల్లబడునట్లు" అని సామాన్యముగా కృపచేయుచుండిరి. వారి సోదరులు శ్రీరామప్పిళ్ల, 'స్వామీ! గోవిందభట్టరు ఈతావున ఆ చల్లదనమును అనుభవమగ్నులై వాఖ్రుచ్చుటను మీరు ఆలకింపలేదా! అని జ్ఞాపకము చేసిరి - అనగా బీటవాఱిన ప్రదేశమంతయు చివఱి దాక తడియునట్లు చల్లబడవలెనని భావము.

"నడందాళ్ = నడచినది" వెళ్లినది, అనక "తిరుక్కోళూరుకు నడచినది, అనుట గౌరవ సూచకము. తాను కన్న వారినిగాని, శిష్యులను గాని భగవత్సంబంధమును బట్టి గౌరవించుట సంప్రదాయము. ఒకనాడు నంబీయరు, నంబిళ్లను(శిష్యుని) శ్లాఘించిరి. 'నా శిష్యుని నేనే కొనియాడినాను' అని తప్పుగా భావింపకుడు, తిరుక్కణ్ణపురమును చేతులెత్తి సేవించుచున్న పిల్లవానిని చిన్నవాడు అని తలప వచ్చునా? గౌరవింపవలెను! అని వచించిన తిరుమంగై యాళ్వారును మునుపున్నారు గదా? అని అనుగ్రహించినారు.

అమ్మంగియాళ్వార్, తన శిష్యునికి నమస్కరించుచుండిరి - 'ఇటుల పెద్దవారు చిన్నవారికి నమస్కరించుట తప్పుగదా?' అని ప్రక్కనున్న వారడిగిరి. "శ్రీవైష్ణవు లెట్టివారో వారి

నడవడిని బట్టి కదా తెలిసికొనవలెను! ఈ శిష్యుడు నేనెఱిగిన వైష్ణవ లక్షణము గల్గియుండుట వలన నేను నమస్కరించు చున్నాను." అని వారికి అప్పుడు సమాధానమొసంగిరి. కాబట్టి భగవంతుని భక్తులు వయస్సులో చిన్నవారైనను గౌరవింపవలెను కనుక తల్లి, కూతురిని గౌరవముగా 'నడన్దాళ్ - నడచినది' అనినారు.

ఇట్లు అందఱను ఉజ్జీవింపజేయుచు 'వైత్తమానిధి'ని వెదకుచు నడచిన (పరాంకుశ నాయకి) నమాళ్వారుకు మహానిధి ఆస్వామి శ్రీపాదములు. ఆనమ్మాళ్వారు శ్రీచరణములు చిత్తమునందు భావించిన వారికి పరమపదము లభించును. అని ఫలము చెప్పబడినది.

ఆచార్య హృదయములో "కైమ్ముదల్ ఇనిన్దార్ ఉణ్ణుమ్ నిదియన్ ఆపత్ సఖత్వమ్ పుకుమూరితా ప్రసిద్ధమ్ 13 - 169 ఫలము లభింపనందున ఆర్తి కల్గును. అది పారవశ్యమును గల్గించును. అపుడు లోకములో ఉపాయముగాను ఫలముగాను పైకి కన్పించున వన్నియు యధార్థమైనవి కావు, అని తెలియును. అందువలన భగవంతుని లభించుటకు తమ వద్ద సాధనములు లేవని తెలిసికొందురు. అప్పటికి ధారకముగాని పోషకము గాని భోగ్యము గాని సర్వేశ్వరుడే అని అనుభవింతురు. ఆపదలో సేకరించి యుంచిన మహానిధియే రక్షకము గదా! ఫలమందు రుచిగల ఆళ్వారుకు ప్రవేశింపదగిన తిరుక్కోళూరులో ఆపదలో చెలికాడైన ఆస్వామి, రక్షించుటయే సంపదగా తలచును. ఆ నిరతిశయ మహానిధి రక్షింపదగినవారికై వచ్చి యిచట శయనించుయున్నారు. ఆయనయే ఆపత్సఖుడు. వైత్తమానిధిప్పెరుమాళ్.



వానమామలై పెరుమాళ్

శ్రీమతే శఠకోపాయ నమః

# "కంగులుం పగలుమ్"

భగవద్విషయరసాభిజ్ఞః ఉ.వే.శ్రీమాన్ శ్రీపరాశర సుదర్శన భట్టర్‌స్వామి.

శ్రీరంగం మకాం: కోరుకొండ

భగవన్నిర్హేతుక కటాక్షముచే లభ్యమయిన భక్తి రూపాపన్న జ్ఞానము కల ఆళ్వార్లు పదిమందిలో నమ్మాళ్వారను వారు ప్రధానులు. వీరు అవయవి. మిగిలిన ఆళ్వార్లు వీరికి అవయవ భూతులు. అటులనే వీరు పాయించిన ప్రబంధములు నాల్గింటికి, మిగిలిన ఆళ్వార్లు పాయించిన ప్రబంధములు అంగ ప్రబంధములు. ఈ నమ్మాళ్వార్ పాయించిన ప్రబంధములు నాల్గింటిలో చరమ ప్రబంధమైన "తిరువాయ్‌మొళ్ళి" సాటిలేని ప్రబంధము. భక్తులకు అమృతము వంటిది. వేదముల సారము. సంసారి చేతనోజ్జీవనమునకు కారణమైనది. 100 దశకములతోను 10 శతకములతోను వెయ్యి పాశురములతోను కూడినది.

'తిరువాయ్‌మొళ్ళి' యను ప్రబంధములో సర్వేశ్వరుని స్వరూప, రూప, గుణ, చేష్టితములను, ఉభయ విభూతులను ఆళ్వార్లు అనుభవించినారు. సకల శాస్త్ర సారమగు "అర్థపంచక"మును పాయించినారు. ఆళ్వార్ల యొక్క భక్తి నిరతిశయమైనది. పరమాభక్తి వారిది. సర్వేశ్వరుని సాక్షాత్కరించి, వారితో ఆలాపాదులను అనుభవించ వలయునని వారి మనోరథము. గాని ఆళ్వార్లకు ప్రత్యక్ష సమానాకారమైన మానసిక సాక్షాత్కారమే అయినది. ప్రత్యక్ష సాక్షాత్కారము కాలేదు. అటువంటి మానసిక సాక్షాత్కారమునే 'సంశ్లేష' అని అంటారు. ప్రత్యక్షము కానప్పుడు దానిని 'విశ్లేష' అని అంటారు.

ప్రత్యక్ష సమానాకారమగు మానసిక సాక్షాత్కారములో సర్వేశ్వరుని స్వరూన, రూప, గుణ చేష్టితములను అనుభవించి, అవి ప్రత్యక్షము కాలేదని ఆళ్వార్లు మిక్కిలి బాధను పొందినారు. సీతాదేవి శ్రీరామచంద్రుని విశ్లేషించి లంకలో అశోకవనములో వున్నప్పుడు, ఎంత బాధపడినదో ఆ విధముగా బాధ పడినారు. రాసక్రీడలో గోపికలు శ్రీకృష్ణుని చేరి, అమితమైన ఆనందమును అనుభవిస్తుండగా శ్రీకృష్ణుడు అంతర్ధానం కాగానే గోపికలు శ్రీకృష్ణుని ఎడబాటును సహించలేక ఎంత బాధను అనుభవించినారో అటువంటి బాధలనే ఆళ్వార్లు అనుభవించినారు.

విశ్లేష దశలో స్త్రీత్వ భావనను పొంది, అతిమాత్ర ప్రావణ్యముతో విలపించినారు. స్త్రీత్వ భావనలో మూడు విధములగు భావనలతో అనుభవించినారు. అనగా, చెలికెత్తె భావనతో కొన్ని దశకములను, తల్లి భావనతో కొన్ని దశకములను, నాయికా భావనతో కొన్ని దశకములను

సాయించినారు. స్త్రీత్వ భావన అంటే పారతంత్ర్యము అని అర్థం. జీవులకు పారతంత్ర్యమే గదా సహజమైన స్వరూపము. జీవులు స్వాతంత్ర్యమును ఆరోపించుకొనుచున్నారు. సర్వేశ్వరుడైన శ్రీమన్నారాయణుడు మాత్రమే స్వతంత్రుడు. మిగిలిన జీవులందరు ఆ పరమాత్మకు విధేయులై, అతనికే అన్ని విధముల వినియోగపడవలసిన వారు. ఈ జ్ఞానం అందరికి కలుగదు గదా! శాస్త్రమెరిగిన వారికి కలుగుతుంది. స్త్రీత్వ భావనలో చెలికత్తె భావన ఈనగా తిరుమంత్రమనే అష్టాక్షరీ మహామంత్రములో మొదటి పదమైన ప్రణవం వలన కలిగే అనన్యార్హ శేషత్వమనే జ్ఞానం. అనగా ఆకారవాచ్యుడైన శ్రీమన్నారాయణునికే దాసభూతుడను అనే జ్ఞానం. అదియే చెలికత్తె భావన. 2. తల్లి భావన అనగా తిరుమంత్రములో 2-వ పదమైన 'నమః' పదముచే కలిచే జ్ఞానం. అనగా అధ్యవసాయ జ్ఞానం. 'నమః' పదముచే చెప్పబడునది "అనన్య శరణత్వం". సర్వేశ్వరుడే ఉపాయముగాని మరియొకటి ఉపాయము కాదు అనే జ్ఞానం. ఇదే తల్లి అను భావన.

3. నాయికా భావన అనగా త్వర. పరమాత్మను పొందవలెననే త్వర. దానినే "అనన్య భోగ్యత్వ' ' మంటారు. సర్వేశ్వరుడు తప్ప మరియొకటి భోగ్యముగా వుండకూడదని అర్థం. ఈ విధమైన 3 విధములగు జ్ఞానం ఆళ్వార్లకు ఎప్పుడు (సదా) వుండును. ఉదాహరణ:- మనకు సత్వ, రజస్తమో గుణములనే మూడు గుణములు సదా వున్నప్పటికి ఒకప్పుడు సత్వ గుణం అభివృద్ధి అయి వున్నప్పుడు దానికి తగినట్లుగా నడవడిక వుంటుంది. ఒకప్పుడు రజోగుణం హెచ్చయినప్పుడు దానికి అనుగుణమైన నడవడి, తమోగుణం హెచ్చయినప్పుడు దానికి అనుగుణమైన నడవడి వున్నట్లుగా ఆళ్వార్లకు మూడు విధములైన జ్ఞానం సదా వుంటూ అనన్యార్హత్వ జ్ఞానం హెచ్చుగా వున్నప్పుడు చెలికెత్తగా అనుభవం. చెలికత్తె ఏ విధముగా నాయకురాలికి అనుకూలముగా వుండునో ఆ విధముగానే ఉండుట.

"కంగులంపగలు" అనే ఈ దశకములో తల్లిగా శ్రీరంగనాధునికి ఆళ్వార్ నాయకి యొక్క దశను విన్నపము చేయుచున్నారు. ఈ దశకములో అనగా పదిపాశురములలో ఆళ్వార్ల యొక్క ప్రేమతో కూడిన దశలను వివరిస్తున్నారు. రాత్రింపగళ్లు నిద్ర లేకుండుట, ప్రలాపించుట, మోహించుట, మొదలైన స్థితిని, అనగా అతిమాత్ర ప్రావణ్యముతో యీామె యున్నది, ఈమెను ఈమె విషయములో ఏమి చేయదలచినావని శ్రీరంగనాథుని గట్టిగా అడుగుచున్నారు. అనగా ఈ అమ్మాయిని బ్రతికించ దలచితివా? లేక వినాశము చేయ దలచితివా? అని. అలాగున అడుగుటకు గల కారణమేమనగా?

ఆళ్వార్ తిరువాయ్ మొళ్రి 6-వ పది ఆఖరి దశకమగు "ఉలగముండ పెరువాయా' ' అను దానిలో తిరువేంగడముడైయాన్(శ్రీనివాసుని) విషయములో పరిపూర్ణమైన శరణాగతి చేసినారు. పిరాట్టి పురుషకారముతో, ఆకించన్య, అనన్యగతిత్వములతో సర్వేశ్వరుని వాత్సల్య సౌశీల్యాది గుణములను అనుసంధించి శరణుజొచ్చినారు.

ఇది ద్వయ మంత్రములోని పూర్వఖండార్థమును తెలుపుచున్నది. అనగా "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే" అను వాక్యము యొక్క అర్థముననుసరించి అనగా శ్రీయ: పతిత్వ, కల్యాణగుణాకరత్వ, దివ్య మంగళ విశిష్టత్వములతో కూడిన స్వామిని తనయొక్క అనిష్టనివారణకు, ఇష్టప్రాప్తికి ఉపాయముగా వరించినారు. శాస్త్రములలో చెప్పబడిన మోక్షసాధనలన్నిటికంటే శ్రేష్ఠమైన సాధనం శరణాగతి, విలంబమును(ఆలస్యమును) సహించనిది. తప్పక ఫలము నిచ్చునది. స్వరూపాను రూపమైనది. అత్యన్త సులభమైనది. అందరు అనుష్ఠించ తగినది. ఎందరో మహానుభావులు ఈ శరణాగతిని అనుష్ఠించి ఫలమును పొందియున్నారు. మరియు ఇది శీఘ్ర పలప్రదము. అట్టి సాధనమును అనుష్ఠించియు ఆళ్వార్ల మనోరథం ఈడేరలేదు.అనగా వెంటనే మోక్షప్రాప్తి కలుగలేదు అది గదా ఆళ్వార్ల మనోరథం. బ్రహ్మాస్త్రంవంటి సాధనం ఫలించక పోవడంతో ఆళ్వార్లకు సంశయం కలిగినది. సర్వేశ్వరుడు నన్ను ఇంకను సంసారములో వుంచి బాధ పెట్టదలచినాడనే భావముతో భయాందోళన జెంది 7-వ పది మొదటి దశకము "ఉణ్ణిలావియ ఐవరాల్" అనే దశకములో ఇంకను నన్ను బాధపెట్టదలచితివా? యని సర్వేశ్వరుని అడిగినారు 'ఇంకను' అనే మాటలో చాలా అర్థములున్నవి. అనగా నాకు ఇంకా వైరాగ్యం కలుగ లేదనియా, పిరాట్టి పురుషకారముతో శరణుజొచ్చినప్పటికి నన్ను బాధపెట్టడం తగునా? అని ప్రశ్నించినారు? ఈ దశకములో "ఉణ్ణిలావియ" అను దశకములో ఆళ్వార్లకు వున్నవైరాగ్యం చెప్పబడుతున్నది, పరమాత్మయందు ప్రేమ మాత్రం వుంటే చాలదు గదా! ఇతర విషయ వైరాగ్యము కూడ వుండవలెను గదా! ఇతర విషయ వైరాగ్యము లేని భగవద్భక్తి ఉపయోగకరము కాదు. అందువలన 7-వ పది 1-వ దశకములో తమ వైరాగ్యమును తెలియజేసిరి. 7-వ పత్తు 2-వ దశకములో శ్రీరంగనాథుని నీ అభిప్రాయమేమని అడుగుట చేత, మనకు జ్ఞాన భక్తి వైరాగ్యమున్నను, సర్వేశ్వరుడు స్వతంత్రుడుగాన, అతని దయ కలిగే వరకు వేచియుండవలెను. అట్లుండగా ఆళ్వార్ త్వరపడవచ్చునా? అంటే ఆలస్యమును సహించని స్వభావము గల వారగుట చేత త్వరపడుచున్నారు. తిరుమలలో శరణాగతి ఫలించకపోతే అక్కడే అడుగక, శ్రీరంగనాథుని అడగనేల? యను సందేహము కలుగ వచ్చును. కాని, తిరుమలలో నిలబడి సేవసాయిస్తున్న వారే శ్రీరంగములో శయనించి యున్నారనే విశ్వాసము. ఎక్కడెక్కడ ఏ రూపముతో వున్నను స్వరూపం ఒక్కటే గదా? (దర్శి ఒక్కడే గదా!) అందువల్ల అడుగుచున్నారు. ఫలించకపోతే మరియొక ప్రయత్నం చేయకూడదా? అంటే మరియొక ప్రయత్నం చేయరు, మరియొకరిని వెళ్లి అడుగరు. సర్వేశ్వరుడే అన్ని విధములైన బంధువు ఆయనే రక్షకుడనే ధృఢ విశ్వాసము గలవారు గనుక, ఆయననే అడుగుచున్నారు. ఉదాహరణ:- భట్టరు వారికి వివాహము చేయుటకు తగిన వయస్సు వచ్చుట చేత తల్లిగారైన ఆండాళమ్మ గారు తన భర్తగారైన కూరత్తాళ్వానును, వివాహ

ప్రయత్నం చేయమని కోరగా వారు "సర్వేశ్వరుని కుటుంబమునకు మనమేల ప్రయత్నిం వలయును, అతడే ప్రయత్నిస్తాడని సమాధానం చెప్పినారట. అయినను ఆండాళమ్మ గార నిర్భంధించగా, శ్రీరంగనాథుని దగ్గిరకు వెళ్లి సేవించియుండగా, సర్వాంతర్యామిగనుక, ఆళ్వా యొక్క మనోరథమును తెలుసుకొని, "ఆళ్వాన్! నా కుమారుని విషయములో నేను ప్రయత్నం చేయనా? మీకెందుకు విచారం? అని చెప్పి, ఆ రాత్రి పెరియనంబి గారి వంశములో ఒకరి యుక్త వయుస్సులో ఒక అమ్మాయి వున్నందువల్ల వారికి స్వప్నంలో కనబడి, మీ అమ్మాయిని పరాశర భట్టరునకు ఇచ్చి వివాహం చేయండి" అని శెలవిచ్చినారట. ఆ ప్రకారముగా వారు కూడ చేసినారట. ఈ ఐతిహ్యమును వ్యాఖ్యాతలు వ్యాఖ్యానములో ఉదాహరించి యున్నారు.

ఈ "కంగులుం పగలుం" లనే దశకములో ఆళ్వార్ల త్వర కనబడుచున్నది. గాని సర్వేశ్వరుడు అటు వంటి త్వర గలవారికి వెంటనే ఎందుకు మోక్షమును కలుగజేయడు అన సందేహం కలుగవచ్చును. దీనికి కారణం, సర్వేశ్వరుని స్వార్థపరత. అనగా ఆళ్వార్ యొక్క దివ్య ప్రబంధమును పూర్తి చేయించి తరువాత వారి మనోరథమును సఫలం చేయ వచ్చునా భావన. ఆళ్వారులను అవతరింపజేసినది ఎందుకొఱకు? తాను అవతరించి చేయలేని చేతనోద్ధరణ ఆళ్వార్లచేత చేయించవలెనని గదా! అది, నెరవేరక మునుపే ఆళ్వార్లకు మోక్షమునిస్తే చేతనోద్ధరణ ఎలా నెరవేరుతుంది? అందువల్లనే అళ్వాన్ ప్రార్థించగానే మోక్షము నివ్వలేదు. అది ఆళ్వార్లక తెలియ లేదని అనుకొవచ్చును. ఒకవేళ తెలిసినను, ఇక్కడ సంసారులతో వుండలేని శక్తిలేని వారిచే, ప్రబంధమును రచింపజేయుట ఎందుకు? ప్రకృతి మండలంలో సంసారుల మధ్య వుండగల పొయ్‌గై ఆళ్వార్ మొదలైన వారిచేత ఆ పని చేయించ కూడదా? అని ఆళ్వార్ల అభిప్రాయం సంసారి మధ్యలో వుండలేని, అత్యంత భక్తి, ఆర్తిగల ఆళ్వార్ల చేతనే, చేతనోద్ధరణ చేయించవలయునని ఈ ఆళ్వార్‌నకు నేను ఏమి లోటు చేసితిని, ఇక్కడ వున్నను పరమ పదములో వున్నను నాగుణానుభవమే గదా కావలసినది, అది ఇక్కడే లభిస్తుండగా ఆళ్వార్ పరితపించడం దేనికి అని సర్వేశ్వరుని అభిప్రాయం. ఆళ్వారులకు సమానమైనవారుపరమపదంలోను లేరు ఇక్కడనులేరు, అక్కడ విశ్లేషమే యుండదు. మరియు, భక్తి లేనివారు వుండరు. ఇక్కడన విషయాంతరలోలురుగా వుంటారు. కాన, అక్కడ వుండే నిత్యముక్తులతోను, ఇక్కడ వున్న సంసారి చేతనులతోను సమానులు కారు ఆళ్వార్. వీరు పరమ విలక్షణులు.

ఈ "కంగులుం పగలుం" కాలక్షేపం చేసేటప్పుడు పరాశరభట్టరువారు" ఆళ్వార మనోభావమును, తెలియని నేను ఏమి చెప్పగలను" అని సాయించినారట. పరాశరభట్టరు వార అటుల సాయించినప్పుడు అల్పమతి గల నేను ఈ పదికమును గురించి ఏమి చెప్పగలను' నాకు తోచిన రెండు మాటలు వ్రాసినాను. ఈ వ్యాసము లో ఏదైనను దోషమున్న యెడల అది దాసునిదిగా భావించి, గుణమున్న యెడల అది దాసుని ఆచార్యులదిగా భావించమని పెద్దలన కోరుతున్నాము.

# తెన్‌తిరుప్పేరై

ఉ.వే. శ్రీమాన్ డా. తె.కం.వెం. అయ్యంగార్ స్వామి,
వరంగల్

నమ్మాళ్వారులు "తిరువాయి మొళ్లి" ప్రబంధంలో తమను తాము భగవద్విశ్లేషమును సహించలేని విరహిణి అయిన నాయికనుగా భావించుకుంటారు. ఈ స్థితిలో వీరిని "ఆళ్వారు నాయిక" అంటాము. మరికొన్ని సార్లు అట్టి నాయికకు తమను తాము తల్లినిగా భావించుకుంటారు. నాయికను ఓదార్చుతున్నట్లూ, నాయిక చెలికత్తెలతో, నాయిక యొక్క మనస్సుమార్చి స్వస్థతకై ప్రయత్నించమన్నట్లూ, ఈ మాతృ భావనతో కొన్ని సార్లు మాటలాడతారు. మరికొన్నిసార్లు నాయికకు తామే చెలికత్తెలుగా మారిపోయి, సఖీ భావనతో కొన్ని మాటలు అనుగ్రహిస్తారు. ఈ మూడు భావనలు అనుభవించు ఆళ్వారుల అవస్థలను నాయికావస్థ, తాయిమార్ అవస్థ, తోళ్లిమార్ అవస్థ అని సంప్రదాయంలో వ్యవహరిస్తారు.

ఆళ్వారు నాయిక భగవంతుని విశ్లేషాన్ని సహించ లేక మూర్ఛ పోయారు. ఈమె స్థితికి మిగిలినవారు మోహం గతులయ్యారు. ఒక్క తల్లి మాత్రము ఈమె రక్షణ కోసం మేలుకొని వున్నారు. ఆళ్వారుల వంశస్థులు భగవంతుని పై అచంచలమగు విశ్వాసముకలవారు. ఆళ్వారునాయిక తల్లి గారు తమ కుమార్తెను శ్రీరంగనాథ స్వామి పాదములపై పడవేశారు. నిలచిన చోట నిలవలేక దుర్భరమైన వేదనను అనుభవిస్తున్న ఈమెను నీవు ఏమి చేయదలచావు అని నిలదీశారు. ఇంత వేదనతో ఆర్తితో చిక్కి, శల్యమై నిన్ను మోహిస్తున్న ఈమెను నీవు కటాక్షించక పోవడము నీ దోషమూకాదు, ఈమె దోషమూకాదు, అది నా పాపమే! అని మొత్తుకున్నది ఈ తల్లి.

ఈ తల్లి భావనతో నమ్మాళ్వారులు భగవానుని అశరణ్య శరణ్యత్వాది గుణాలను, ఎన్నో కళ్యాణ గుణాలను వర్ణించారు. ఆ స్వామిని సేవించడానికి కాలనియమము గాని; దేశ నియమముగాని, అధికారిని యమముగాని లేదు. అందరూ అన్ని వేళలా ఆశ్రయించ వచ్చు అని ఆ స్వామి వైభవాన్ని వర్ణించారు.

తిరగుమరగుగా ఉన్న దశలో ఆళ్వారు నాయిక, ఈ భగవద్గుణాలను విని మూర్ఛ నుండి బయట పడి, "భగవానుడు వేంచేశాడా" అని తత్తరపాటుతో లేచి చూచి ఆయన పాదాలను పట్టుకుందామని ప్రయత్నించి, (తమకు ఆయన వచ్చినట్లు మానసికానుభవమే కదా!) అవి లభించకపోవుటచే తిరిగి నాయికా భావాన్ని పొందారు. ఆయనను ప్రత్యక్షంగా దర్శించి, ప్రత్యక్షానుభవం పొందక ఉండలేననే స్థితిలో ఉన్నారు నాయిక భావనతో ఉన్న నమ్మాళ్వారులు. ఇంతకు ముందు అవయవాలలో శైథిల్యాన్ని పొంది ఏ మాత్రమూ కదలలేని స్థితిలో ఉన్న వీరు, ఇప్పుడు లేచి కూర్చుని, నడచి వెళ్ళి స్వామిని చేరే శక్తితో ఉన్నారు ఈ నాయిక. దీనికి కారణం

తల్లిగారు వినిపించిన భోగ్యమైన కళ్యాణగుణములే! "ఇతోపి మృతసంజీవనం" మృత సంజీవన మగు రామవృత్తాంతాన్ని, హనుమంతుడు (శిరియ తిరువడి) వినిపించగా మరణించబోవు అవస్థలోని సీతాదేవి తన ప్రాణాలను పొందడమే కాక స్వామిని కూడా చేరింది కదా! "తత్తస్య సదృశం భావేత్" అని సీతా దేవిలా ఎదురు చూడదలచలేదీ ఆళ్వారు నాయిక. నాయకుడొకడు నాయిక వున్న పరిసరప్రాంతాల లోనికి వచ్చి తన విలాసమును వైభవాదులను ప్రకటించునట్లు ఏ వేట అనే నెపంతోనో - వాహ్యాళికో వచ్చి విడిది చేసినట్లు, ఆ సర్వేశ్వరుడు ఈ ఆళ్వారు నాయికకు సమీపముగా "తిరుప్పేరై" అను దివ్య దేశంలో విడిది చేశాడు. అక్కడి స్వామిని వెళ్ళి సేవించు కుంటాను అని అభినివేశంతో బయలుదేరారు ఆళ్వారులు. తల్లిగారు, చుట్టు ఉన్న చెలికత్తెలు అడ్డు పడ్డారు. వెళ్ళ వద్దన్నారు. "ఇట్లా బరితెగించుట మన కులానికి తగినది కాదు. ఇంతచిన్న పిల్లవు – ఈ వయస్సులో ఇంత ప్రావణ్యము తగదు" అని చెలికత్తెలు ఆళ్వారు నాయికను విరోధించారు. ఆ దివ్య దేశంలో స్వామికి పేరు "మకర నెడుఙ్కుళైక్కాదన్" –"మకరాయిత కర్ణపాశుడు" –సుందరమైన మూర్తి. ఆదివ్య దేశం లోని స్వామికి నిత్యోత్సవాలు, పక్షోత్సవాలు, మాసోత్సవాలు..... ఇలా ఉత్సవ పరం పర! ఆ దివ్య దేశంలో వేద పారాయణఘోషలు. శ్రీ వైష్ణవ స్వాములు గుంపులు గుంపులుగా జేరి సామగానాలు చేస్తారు చిన్న చిన్న పిల్లలు స్వామి సన్నిధిలో ఆ స్వామి కథలనే అను సంధించు కుంటూ ఆటలాడు కుంటూంటారు. ఏమిటీగొడవ అని ఎవరైనా వాళ్ళని మందలించినా – ఆ స్వామి ఆ భోగ్యతను దర్శించాలని ఉబలాట పడతాడు. ఆ పిల్లలను చూచి ఆనందిస్తూంటాడు. సులభుడైనవాడు ఆస్వామి. చెలికత్తెలమాటలను, తల్లి మాటలను లక్ష్య పెట్టనంటారు ఆళ్వారునాయిక. తిరుప్పేరై వెళ్ళి ఆ స్వామిని సేవించితీరతాను అంటారు! నేను వెళ్ళక మానను అని బయలు దేరారు!

తల్లి, చెలికత్తెల మందలింపులు, అడ్డు మాటలు విని, వాటిని కాదంటూ, నాయిక తాను తిరప్పేరై దివ్య దేశానికి వెళ్ళి పోతున్నాను అంటూ చెప్పే మాటలు "వెళ్ళైచ్చురి శఙ్గు" అను సప్తమ శతకంలోని తృతీయదశకం. అన్ని దశకాలలో లాగే ఇక్కడ కూడా పదిపాశురములు, ఆపైన ఫలశ్రుతి మరొక పాశురమూ, మొత్తం పదకొండు పాశురాలుంటాయి. ఇంతకు ముందరి "కఙ్గులుం పగలుం" అనే దశకంలో మాతృవాచా విరహిణి అయిన నాయిక యొక్క అత్యన్త దయనీయస్థితిని వర్ణించిన నమ్మాళ్వారులు, ఈదశకంలో నాయికా భావనతో, ఆ నాయిక యొక్క దృఢ సంకల్పాన్ని, స్వామిని చేరి తీరాలనే ఆ నాయిక యొక్క అభినివేశాన్ని ఆవిష్కరిస్తున్నారు.

సంగ్రహంగా ఈ దశక సారాంశమును ఆస్వాదిద్దాము. తిరుప్పేరై దివ్య దేశానికి వెళ్ళి తీరతానని నాయిక ఉద్యమిస్తూంటే తల్లిగారు అడ్డగించారు. మీరు నిషేధించినా నేను వెళ్ళితీరతాను అంటున్నారు ఆళ్వారు నాయిక.

"ఓ తల్లులారా! తెల్లనై, సుడిగల పాఞ్చజన్యమును, శ్రీ సుదర్శనమును ధరించి

శవాహనా రూఢుడై నామనసులో నిలచి యున్న ఆ పద్మనేత్రుని మీరు సేవించలేదు. సేవించి
సమును అనుభవించిన వారు మీరు కారు కనుక నన్ను ఇలా నిషేధిస్తున్నారు. ఆ స్వామి
ర్యాన్ని ఏమని వర్ణించను! తిరుప్పేరైలో తన మహిమ ప్రకాశించునట్లు అవతరించాడు.
ఘోష, నిత్యోత్సవముల ఘోష, బాలుర క్రీడల ఘోష! ఈ త్రివేణీ సంగమస్థాన మగు దివ్య
ికి నేను వెడతాను."

ఇలా తల్లి గారితో నాయిక మాటలాడుతోంటే ఈ నాయిక సుఖ దుఃఖాలు తమవిగా
ంచే చెలికత్తెలు, ఇరుగుపొరుగువారు – ఇలా కాదమ్మా అంటూ హితం చెప్పబోయారు.
తో నాయిక –

"ఓ తల్లులారా! పరిమళ భరితములైన నల్లని కేశపాశములుగల సఖియలారా ! (ఈ
ళములు ఆ స్వామి పరిమళాన్ని స్మరింపజేస్తున్నాయి నాయికను). నేను నామనస్సును
ంచలేను. సంపత్సమృద్ధ మైనది ఆదేశం! తుమ్మెదలు స్వేచ్ఛగా విహరించే దేశమది. అందమైన
కోటలు చుట్టూ చల్లని జల ప్రదేశాలు. అత్యంత స్పృహణీయమైనది ఈ ప్రదేశం. ఆ పరమ
లో ఎంతటి మహిమో, ఇక్కడా ఆ స్వామి మహిమ అంతే ! తన మహిమను ప్రకాశింప
డానికే ఇక్కడ వేంచేశాడు స్వామి. రత్నమువంటి కాంతి గల ఆ శ్రీకృష్ణ స్వామి యొక్క
పండువంటి అధరము నందు లగ్నమయినది నామనస్సు.

వేరువిషయాలపైకి నామనస్సు ప్రసరించట్లేదు. ఆయన ధరించిన కిరీట శోభ, భోగ్యమగు
సౌందర్యము, ఆయుధాలుగానూ, భూషణాలుగానూ శోభించే ఆ సుదర్శన పాంచజన్యశోభ,
్వామి దివ్య మంగళ విగ్రహ సౌందర్యము, వీటి అన్నింటా నా మనస్సు లగ్నమై పోయింది. నా
స్సు నా స్వాధీనంలో లేదు. నేను దానిని నిషేధించలేను. ఇదీ నాస్థితి!

సర్వేశ్వరుడు అపహరించుకుని పోయాడు నా సౌందర్యాన్ని! (వెనుకటి దశకం లో కష్టలుం
ం అనుభవించాలి) "నీ సౌందర్యాన్ని నీకు తెచ్చి ఇస్తాను" అని వెళ్ళిన నామనస్సు అక్కడ
మరలక ఆయన వద్దనే నిలచి పోయింది. నన్ను విడవక నాకు సహాయంగా ఉండే ఆ ఒక్క
స్సు కూడా దూరమైంది నాకు. అలలతో వర్ధిల్లు సముద్ర ఘోషలా సామవేద ఘోషల మధ్య
ిన ఆ సర్వేశ్వరుని ఆశ్చర్య చేష్టితములలో తగులుకొని పోయింది నా మనస్సు. నేను
ముందే మునిగిపోయాను. నన్ను కోపగించి ఏమి ప్రయోజనము?

కంసుడు పంపిన పూతన శకటాసురాది అసురులను చంపిన ఆ స్వామి దివ్య చేష్టితములను
ించి లజ్జ మొదలగు స్త్రీ తన గుణములను విడచి నేనా స్వామి యందు లగ్న చిత్త
. లాభంలేదు. నన్ను తీసుకొనిపోయి అక్కడ విడవండి.

"అతోస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః" అన్నది ఆ స్వామి సూక్తి కదా! ఆయన
మును దర్శించిననేను స్త్రీత్వాది అభిమానాదులను పోగొట్టుకున్నాను.

ఓ అమ్మలారా! ఈ అమ్మాయిని అక్కడకి తీసుకుని పోదామా వద్దా అని విశ్లేషించే దశ

ంటిపోయింది. నేనింక ఇక్కడ ఆయన లేక జీవించలేను. నన్ను వెంటనే ఆ దివ్య దేశానికి తీసుకొని ోయి ఆ స్వామిని సేవింప జేయండి!

ఆ స్వామి నాముందే వేంచేసి ఉన్నట్లు కనిపిస్తున్నాడు. కానీ నాతో మాటలాడడు. తికందడు. నాకు ఆయనపై ఆశ పెరిగిపోతోంది. నన్ను శీఘ్రంగా తీసుకొనిపోయి ఆ స్వామి న్నిధికి చేర్చండి.

నా మనస్సెప్పుడో తిరుప్పేరై చేరిపోయింది. ఆ మనస్సు తిరిగివచ్చే అవకాశమూ లేదు. ఃఆ సర్వేశ్వరుడంటారా! ఆయన కనిపించటల్లేదు. అచ్చటికి పోయిన నా మనస్సును తిరిగి ుచుకుని వచ్చేవారు ఎవ్వరూ కనిపించటల్లేదు. నా మనస్సే లేక నేను ఏమి చెయ్యగలనూ! హూ అక్కడికే వెళ్ళిపోతాను.

"నేను ఆయన యందు మిక్కిలి వ్యామోహంతో వున్నాను" అని అది ఏదో దోషం ునట్లు చేసే మీ ప్రచారం వల్ల నా పట్టుదల పెరుగుతోంది! సప్తసముద్రాల కన్నా పెద్దగా నా ెపెరుగుతోంది. "ఇట్లా సాహసం చెయ్యడం, ఒక్క దానివీ పోతానని బయలుదేరడం నీ శ్వలక్షణానికి తగదు, ఈ ప్రయత్నం మానుకో" అని అంటారా? మీరు నాకు ఏమీ చెప్పవద్దు. స్వభావమును ఎరిగిన మీరు ఇల్లామాట్లాడడం, ఇప్పటి స్థితికి తగనిది. మీ మాటలు ఎవరికి ్న్నారు. మనస్సు ఉంటే కదా గ్రహించ వచ్చు ! ఆ మనస్సు ఎప్పుడో దూరమైంది నాకు!

"ఇక్కడి వారు అంతానిన్ను నిందిస్తున్నారమ్మా! ఏమిటి నీ మొండి తనమూ" అని టారా? నన్ను అలా నిందించేవారే కావాలినాకు. నా మనస్సును అపహరించుకొని పోయిన ఆ మిని అనేక కాలములలో వేంచేసి యున్న ఆ స్వామిని పట్టణముల, పల్లెల, దేశ దేశముల తటా వెదకుతాను. నాకు సిగ్గులేదు. ఆ మకరాయిత కర్ణపాశుని వెదకుతాను. ఆయన దివ్య తో ఆశ్రిత రక్షణార్థమై ఆ తిరుప్పేరై క్షేత్రంలో అవతరించిన స్వామిని చేరుతాను.

అని తమ అభినివేశాన్ని తెలుపుకుంటారు పది పాశురములలో ఆళ్వారు నాయిక.

ప్రతియుగంలోనూ వేరువేరు నామ రూపాలను వ్యాపారాలను స్వీకరించి జగద్రక్షణ కార్యము హిస్తున్న – ఆ తెన్ తిరుప్పేరై దివ్య దేశంలో వేంచేసి యున్న ఆ మకర నేడు జ్కుళై క్కాదన్ తిరునామముగల స్వామిని గూర్చి నమ్మాళ్వారు ప్రసాదించిన ఈ దశకమును, ాశురములను అనుసంధించువారు, భగవత్కైంకర్యములో మిక్కిలి ప్రీతిగల వారవుతారు. ఫలమును తెలుపుతూ ఈ దశకాన్ని ముగిస్తారు నమ్మాళ్వారులు. ఈ దశకానికి వ్యాఖ్యానంలో ్యచార్యులు ఎన్నో ఎన్నెన్నో మధురమైన భావాలను ఆవిష్కరిస్తారు.

శ్రీమతే రామానుజాయ నమః

గోపాలదేశిక మహం శరణం ప్రపద్యే
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవ ముపాస్మహే.

# తిరుచ్చెజ్ఞన్నూర్

**ఉ.వే.శ్రీమాన్ తె.కం.రంగరామానుజాచార్యస్వామి**
**రాజమండ్రి**

శ్లో॥ చెంకున్నూర్‌నగరే తు శంఖసరసీ హ్రస్వాపగాసంయుతే ।
వైమానం సమధిశ్రితస్థితి లసత్ దివ్యం జగజ్జ్యోతిషమ్ ।
నాయక్యా నిమిషః ప్రభుర్విజయతే పశ్చాన్ముఖాంభోరుహే ।
యుక్త శ్శంగమలాభిధా సహితయా శ్రీమచ్ఛఠారిస్తుతః ॥

శ్లో॥ భస్మాసురనిమిత్తేన । శశిభూషణ వీక్షితః ।
భక్తబృంద పరిత్రాణ - కాముక స్సతతం హరిః ॥

వివరణము - ఇమయవరప్పన్ - శెంగమలవల్లి - శంఖపుష్కరిణి - హ్రస్వాపగానది - (దీనికే తిరుచ్చిత్తార్ అని పేరు) - జగజ్జ్యోతి విమానం - పశ్చిమ ముఖము - నిలుచున్న సేవ - భస్మాసుర నిమిత్తమై పరమశివునకు ప్రత్యక్షము - నమ్మాళ్వారు కీర్తించినది.

(ఉభయ వేదాన్త సభ - పెంటపాడు వారు ప్రకాశపరచిన 'దివ్యదేశవైభవప్రకాశికా' పుట.81)

నమ్మాళ్వార్లు క్రిందటి తిరువాయ్‌మొழிలో నిట్లు సాయించిరి.

అవతారిక । సర్వేశ్వరుడు "పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతాం" (సజ్జన రక్షణకు, దుష్ట శిక్షణకు) అన్నట్లు సంసారుల కోరికనే ఆలంబనముగా గొని యీ భూలోకమున నవతరించి యొంటరిగా తిరుగుచుండును. సంసారు లీతనినుండి తమ కోరికల సిద్ధింపజేసికొనుటకై యీతని నాశ్రయింతురే గాని యీతని సౌందర్య, సౌకుమార్యాది వైలక్షణ్యము ననుసంధించి ప్రేమించువారు లేరు, స్వామి కేమి యాపద సంభవించునో" యని - అళ్వార్లు భయపడగా సర్వేశ్వరుడు వీరి భయము తీరునట్లు "నన్ను ప్రేమించువారును కలరు. వేరొకరు నన్ను రక్షించనక్కర లేనట్లు బలమును నాకు కలదు" అని తన అతిమానుషచేష్టల జూపి వారి భయమును తీర్పగా అళ్వారులు స్వస్థులై యుండిరి. కాని వీరికి భగవంతుని విషయమున సముద్రమును మించిన ప్రేమ కలదు. దానిని సర్వేశ్వరుడును పెంచినాడు. ("కాతల్ కడల్ పురైయ విళైవిత్త") "అతి స్నేహః పాప శఙ్కీ' ' (ఎక్కువైన స్నేహము కీడును శంకించును) అనునట్లు వీరికి మరల సర్వేశ్వరుని విషయమై భయము కలిగినది. భగవంతునకు సదా మంగళమును కాంక్షించు ముక్తులు, నిత్యులు నీ భూలోకమున లేరు. సనకాది ముముక్షువు లన్ననో ప్రపత్తిని, మననధ్యానములను విడువరు. దేవతలు తమ కమృతము లభించుటకై యీతనిచే క్షీరసముద్రమును మథింపజేసి యమృతము

చేజిక్కగనే వెడలిపోయిరే తప్ప యీతని సౌకుమార్యమునకు మంగళా శాసనము నైనను చేయలేదు. ఇక నీతని ప్రేమించి రక్షించువారెవరు? "అని భయపడుచున్న వీరి భయమును తీర్చుటకై సర్వేశ్వరుడు ఈ తిరువాయ్‌మొழிలో తన పరాక్రమమును, సృష్టిస్థిత్యాది అద్భుత వ్యాపారములను, ఎదిరించిన శత్రువుల సమూలముగ నశింప జేయగల శక్తిని చూపించెను. ఇంకను దీనిని మించి అధికమగు జ్ఞానశక్తులు కలవారై తనకు రక్షకులై యుండు మూడు వేల మంది శ్రీవైష్ణవులును, ఉన్నతములగు ప్రాకారములును తిరుచ్చెజ్ఞన్నూరిలో నుండుటను సేవింపజేయగా సేవించి కృతార్థులై ఆతని సౌందర్యము నందును, శౌర్యము నందును మనస్సు లగ్నము కాగా తృప్తులగుచున్నారు.

శ్రీవిభీషణుడు "రాఘవం శరణం గతః" (శ్రీరామచంద్రుని శరణుజొచ్చితిని) అని వచ్చి నిలచినపుడు సుగ్రీవుడు శ్రీరామ చంద్రుని యందలి ప్రేమచే కలవరపడి "స్వామీ! యీతడు రావణుని సోదరుడు. రాక్షస జాతివాడు, మన గోష్ఠిలోనికి రాదగడు' అని తొందరపడి చెప్పెను. అంత శ్రీరామచంద్రుడు "మాయందలి ప్రేమచే నీతడిట్లు చెప్పుచున్నాడు. నా పరాక్రమమును జూపి యీతని భయమును తీర్తు" నని తలంచి, 'నేను కోరినచో పిశాచములను గాని, దానవులను గాని, యక్షులను గాని, భూమిలోని రాక్షసులను గాని అంగుళియొక్క కొనతో చంపగలను'' అని తన పరాక్రమమును గూర్చి తెల్పెను. దానిచే సుగ్రీవుడు తృప్తుడయ్యెను. ఇట్లు శ్రీరామచంద్రుడు తన ఉక్తి మాత్రముచే సుగ్రీవుని భయమును పోగొట్టెను.

బలరామకృష్ణులు చాణూర ముష్టికులతో మల్లయుద్ధమునకు తలపడగా మధురాపురవాసులు "న సమం యుద్ధ మిత్యాహుః" (బాలుర కిట్టి మల్లురతో యుద్ధము తగదు' ' అని భయపడుచుండగా, వారు చూచుచుండగనే శ్రీకృష్ణుడు మల్లుర వధియించి తన యనుష్ఠానముచే వారి భయమును తీర్చెను.

ఇట్లే సర్వేశ్వరుడు తమ భయమును పోగొట్టగా, దానిచే కృతార్థులైన యాళ్వార్లు "మాకు శ్రీకృష్ణుని కంటే ధారక, పోషక భోగ్య పదార్థములు వేరుగ లేవు'' అని సంతోషించి, పూర్వ మాతని సౌందర్యమును జూచి యీతని కేమి యాపద కలుగునో యని భయపడినవారు ఇపుడా భయము తీరగా ఆ సౌందర్యమునందు తమ మనస్సు లగ్నము కాగా అనుభవించి కృతార్థులగు చున్నారు.

1) ఇందు మొదటి పాశురమున సర్వేశ్వరుడు శ్రీకృష్ణుడై కువలయా పీడమను ఏనుగును, మావటి వానిని, చాణూరముష్టికులను, కంసుని నశింపజేసిన పరాక్రమము గల 'శిత్తాయన్' అను స్వామి వేంచేసియున్న తిరుచ్చెజ్ఞన్నూరి యందలి తిరుచ్చిత్తారు మాకు నిర్భయమైన రక్షకము అని పాయించుచున్నారు.

కంసుడు పూతనాది రాక్షసులను పంపి శ్రీకృష్ణున కాపద కలిగింప దలంచినాడు, కాని ఆ ప్రయత్నము ఫలింపలేదు. ఇక తన స్థానబలిమితో తన నగరముననే యీతనికి కీడుచేయ దలంచినాడు. అక్రూరుని బంపి తాను గావించు ధనుర్యాగమును చూచుటకై బలరామ కృష్ణుల

మధురకు పిలిపించినాడు. వారు తన నగరమును ప్రవేశించునప్పటికి కువలయా పీడమను ఏనుగును మాదకద్రవ్యముల తినిపించి నగరద్వారమున నిలిపినాడు. శ్రీకృష్ణునకు కీడు సంభవించుచో "ప్రమాదవశమున జరిగిన"దని మేనమామగా 'మొసలి కన్నీరు' కార్చ దలంచినాడు. కాని శ్రీకృష్ణుడు కొండకాలువల వలె మద జలమును స్రవించుచున్న ఆ యేనుగును పట్టి అనాయాసముగ రెండు దంతములను విరచినాడు. దానిని కాలితో తన్ని దొర్లించినాడు. దాని మావటివాడు, చనిపోయిన యేనుగును కూడ ప్రాణముతో నున్న పదార్థమును వలె నడిపింప సమర్థుడు. వానిని చంపిన గాని యేనుగు చావనట్లే యని తలంచినాడు కాబోలు శ్రీకృష్ణుడు వానిని కూడ చంపినాడు. 'ఏనుగు తిర్యక్కగుటచే శ్రీకృష్ణుని నశింపజేయు ఉపాయము గానక చచ్చినది. అది పోయిన నేమాయె! చాణూర ముష్టికులచే నశింపజేతు'నని తలంచి కంసుడు వారిని నియోగించినాడు. మధురావాసులు"అయ్యో! బాలురకు మల్లురతో యుద్ధమా?" అని భయపడుచుండగనే మల్లుర జంపి వారి భయమును తీర్చినాడు. ఎత్తైన ఆసనముపై కూర్చొనియున్న కంసుని, అంత యెత్తునకు నెగిరి, క్రింద పడగొట్టి యాతని కిరీటమును పడదన్ని జుట్టు పట్టి యీడ్చి చంపినాడు. పరువము నిండకనే వీరశ్రీతో నిండిన యా స్వామియే, పులియున్న పొదవలె శత్రువులకు భయమును గొల్పునట్లున్న తిరుచ్చెఙ్గన్నూరిలో 'తిరుచ్చిత్తారు' అను హ్రస్వాపగానదీ తీరమున వేంచేసి యున్నాడు. ఈ స్థానము, భగవంతున కెపుడేమి యాపద సంభవించనో యని యెల్లప్పుడును భయపడుచుండు సుగ్రీవుడు, పెరియాళ్వార్లు, విదురులు, పిళ్లైయురంగావిల్లిదాసర్, తాము - మొదలగు భగవత్ప్రేమికులకు నిర్భయమైన ప్రాప్యస్థానము అని ఆళ్వార్లు తలంచుచున్నారు.

2) "తిరుచ్చెఙ్గన్నూరిలో వేంచేసియున్న స్వామియే జగత్సృష్టిస్థితి సంహార కారకుడు. ఆయన తప్ప మనకు వేరొక రక్షకుడు లేడు. ఆయన రక్షకుడు మాత్రమే కాదు. మనకు అమృతమైనవాడు. నిత్య సూరులచే సేవల నందునట్లే నాచేతను సేవలనందు నా స్వామి యాతడు. కర్మజ్ఞాన భక్తులలో దేనికిని లోపము లేనివారి స్థితికి హేతువైనట్లే, అందే యొక్కటియును లేని నాస్థితికిని కారణమైన వాడాస్వామి. బ్రహ్మకు అంతర్యామియై సృష్టిని, రుద్రున కంతర్యామియై సంహారమును, తన రూపముతోనే యుండి రక్షణ వ్యాపారమును చేయువాడు. సమస్త ప్రాణుల వ్యాపారము లన్నియు. నాతని సంకల్పాధీనములై యుండ, ఆతని వ్యాపారము మాత్రము ఇతరుల సంకల్పాధీనము కాదు. ఇట్టి స్థితిని జూపి నా భయమును దీర్చి నన్ను నిల్పినాడు. జల సమృద్ధమైన తిరుచ్చెఙ్గన్నూరిలో వేంచేసియుండి, తన సంతానమునకు సమీపమున నిల్చి దానిని కాపాడు తల్లి వలె నన్ను రక్షించుచున్నా" డని తలంచి ఆళ్వార్లు సంతసించుచున్నారు.

3) "ఇంతియేనా ఆయన శౌర్యగుణము! ప్రళయ కాలమున జలమున మునిగిన భూమిని "ఉద్ధృతాసి వరాహేణ" అనినట్లు తన కోరలపై నిలిపి నీటినుండి విడదీసిన స్వామియే

తిరుచ్చెఙ్గన్నూరిలో తిరుచ్చిత్తార్ సమీపమున వేంచేసి యున్నాడు. ఆ స్వామి కంటె నాకు రక్షకులెవ్వరు?'' అని యాళ్వార్లు నిర్భరులగుచున్నారు.

4) "నిత్యసూరులైనను ఆయనను ప్రేమించి మంగళాశాసన మొనర్పరే" యని ఆళ్వార్లు భయపడు చుండగా నిత్యసూరు లాతని ప్రేమించు విషయమును జూపి ఆళ్వార్ల భయమును బాపి వారి శేషత్వమును నిల్పినాడట యా స్వామి.

నమ్మాళ్వార్లు సర్వేశ్వరుని శౌర్యగుణమును, సౌందర్యమును ఇంకను ఆస్వాదించుచున్నారు. బలి చక్రవర్తి ధార్మికుడు. అయినను ఇంద్రుని నుండి త్రిలోకాధిపత్యమును బలాత్కారముగ నపహరించినాడు. ఆతనిని జయింప దలచిన స్వామి వామనుడైనాడు. బలిని మూడడుగుల స్థలమును యాచించినాడు. ఆ వామనుని సౌందర్యము, అర్థిత్వము బలి నాకర్షించినవి. "చిట్టిపాపని త్రోసిపుచ్చగ చిత్త మొల్లదు సత్తమా" అనిపించినది. మూడడుగుల భూమిని దానమొసంగినాడు. తన కార్యము సఫలమైనదను సంతోషాతిశయముతో స్వామి ఆకాశపర్యంతము పెరిగినాడు. ఆ మూర్తిని గాంచిన ఆళ్వార్ల భయము తీరినవి. ఇంకను స్వామి సురాసురులతో జేరి అమృతసిద్ధికై పాలసముద్రమును చిలికినాడు. అనర్ఘమైన రత్నము వంటి శరీరకాంతితో సముద్రమును చిలికినాడు. ఆ తిరుమేని కాంతి, ఆ సామర్థ్యము ఆళ్వారుల భయమును తీర్చినది. ఆ స్వామి కంటె వేరు రక్షకులు లేరని నాల్గవ పాశురమున సాయించుచున్నారు. ఈ క్షేత్రమున స్వామి "ఆత్మానం మానుషం మన్యే" (నన్ను మనుష్యునిగనే తలంచు చున్నాను) అన్న శ్రీరామచంద్రుని వలె, "అహంవో బాన్ధవో జాతః" (నేను మీకు బంధువునైతిని) అన్న శ్రీకృష్ణుని వలెను తన పరత్వమును మరగుపరచుకొనక "ఇతడే సర్వేశ్వరు"డనునట్లు వేంచేసియున్నాడు. అతడు తప్ప వేరు రక్షకులెవ్వరు?

5) సర్వేశ్వరుని శౌర్యగుణమే కాదు. తిరుచ్చెఙ్గన్నూరిలోని తిరుచ్చిత్తారు సమీపమున వేంచేసియున్న శ్రీవైష్ణవశ్రీ సైతము నిర్భయ స్థానమే యని నమ్మాళ్వార్లు సాయించుచున్నారు. (శ్రీరంగమునకు ప్రభువైన 'అకలంకనాట్టాళ్వాన్' అనునతడు శ్రీరంగనాథాలయమునకు ప్రాకారమును నిర్మించుచుండగా నొక శ్రీవైష్ణవ స్వామి యొక్క భవనము అడ్డముగా నుండ రాజు దానిని పగులగొట్టుడని యాజ్ఞాపించెనట. ఆ ప్రభువు శ్రీకూరత్తాళ్వారుల శిష్యుడు గనుక ఆ స్వామి భట్టరు వారితో విన్నవింపగా వారు ఆ ప్రభువుతో "శ్రీరంగనాథుని రక్షించునది ప్రాకారము కాదు. శ్రీవైష్ణవుల మంగళా శాసనమే రక్షించునని చెప్పినట్లు ఒక ఐతిహ్యాము కలదు) అచ్చట చతుర్వేదాధ్యయన సంపన్నులైన శ్రీవైష్ణవులు అనన్య ప్రయోజనపరులై భగవదాజ్ఞా నిర్వహణమునకును, భగవద్ద్వేషుల నశింపజేయుటకును నెల్ల వేళలయందును యజ్ఞముల నిర్వహించుచుందురు. ఆ యజ్ఞధూమము ఆకాశమున వ్యాపించి ఆదిత్యాది గ్రహముల తేజస్సును మరగుపరచును. ఇట్లు శ్రీవైష్ణవుల యజ్ఞములున్ను, ఎత్తై నిబిడములై యున్న ప్రాసాదములున్ను

స్వామికి రక్షకములై యుండగా నిక ఆతని విషయమై ఆళ్వారుల భయము తీరి స్వస్థచిత్తులగుచున్నారు.

"అథసోZభయఙ్గతో భవతి" "భయాన్ముచ్యేత భీతస్తు" అన్నట్లు ఆ స్వామిని శరణుజొచ్చినవారికి, ఆ స్వామి సహస్రనామముల ననుసంధించు వారికి భయముండదు. పరమ పదమున స్వామికి ఎవరి నుండియు ఆపద వచ్చు నవకాశమే లేకున్నను సుదర్శన మగ్ని గ్రక్కుచు తిరుగుచుండునట. పాంచజన్యము "సఘోషో ధార్త రాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్" అనునట్లు ధ్వనిచేయుచుండునట. అట్టి నిత్యసూరులకు సర్వవిధబంధువైన స్వామియే ఆళ్వార్లకు ధారకమైనవాడు. ఆ స్వామి సర్వజ్ఞుడు. ఐనను తన వైభవమును తానే 'యింత' యని తెలిసికొనజాలడు. శ్వేతద్వీపవాసు లాశ్రయించుటకు, మధుకైటభాది రాక్షసుల సంహరించుటకు, బ్రహ్మరుద్రాదులు ప్రేమించుటకునై పాలసముద్రమున పవళించినాడు. అట్టి స్వామి కేమి యాపద కలుగునో యని యాతని రక్షణకై మూడువేలమంది శ్రీవైష్ణవులు ఆ తిరుచ్చిత్తార్‌లో వేంచేసి యున్నారు. శ్రీరాము డరణ్యావాసమున నేగినది మొదలు రావణ సంహారము జరిపి తిరిగి వచ్చువరకు నాతని కేమి యాపద కలుగునోయని భయపడి మంగళాశాసన మొనర్చు చుండిన భరద్వాజ మహర్షితో వారందరు సమానులే. వారొక్కొక్కరే త్రిమూర్తులు గావించు స్పష్ట్యాదివ్యాపారముల గావింప సమర్థులు. వీరికి తోడు ఆయూరి ప్రాకారమున్ను శత్రువులకు ప్రవేశింప శక్యము కానిది. ఇక ఆళ్వార్లు భయపడుట కవకాశ మేమున్నది?

7) తిరుచ్చెఙ్గన్నూరిలో వేంచేసియున్న యా స్వామి తన సౌందర్య మంతటితోను ఆళ్వార్ల హృదయమున వసించియున్నాడు. కాంతి, సౌందర్యము, రక్తిమగల తామరలతో సమానము లాతని నేత్రములు, వానిని మించినది స్మితము. ఆ స్మితమునకు దాసులైన వారికి ఆశ్రయణీయము లైనవి యా శ్రీపాదములు. శ్రీపాదముల నాశ్రయించిన వారిని ఆలింగనము చేసికొను శ్రీహస్తములు,'సర్వోత్పత్తిస్థానమా' యనునట్లున్న నాభి, భగవత్సంబంధము లేనివారికిని మొదటగా నాశ్రయింప దగినదైన లక్ష్మీదేవికి వాసస్థానమైనది వక్షఃస్థలము. ఆ తిరుమేనికి అలంకారమై పుంస్త్వావహమైనది స్వామి ధరించిన పీతాంబరము. ఆ కిరీటము రక్షకత్వసూచకము. యుద్ధభూమిలో ఆయుధములై, భోగదశలో అలంకారములై యుండునవి ఆ పంచాయుధములు. ఇన్నింటితో గూడిన స్వామి ఆళ్వార్ల హృదయమున వేంచేసి యున్నాడు. ఇంక వారు భయపడనవసరము లేదు.

8) తిరుచ్చెఙ్గన్నూరిలో వేంచేసియున్న ఆ స్వామిని నాలుగు వేదములను కరతలామలక మొనర్చుకొన్న శ్రీవైష్ణవులు అంతటను నిలచి స్తుతించుచుందురు. తమ నాశ్రయించిన వారికి రక్షకులైయుందురను కీర్తిగల బ్రహ్మాదులకును ఆపద వచ్చినచో రక్షకుడై యుండు వాడాస్వామి. ఆతడు, ముంజేతి బలము గల రాక్షసులును, యముడును "త్రాహి త్రాహి" యనునట్లు వారికి

మృత్యువైనవాడు. "ఆ స్వామిని స్తుతించువా రెందరో యున్నారు. నేను స్తుతింపకున్నను ఆ స్వామికి కొదువలేదు. ఆతనిని స్తుతించు విధానమును నాకు తెలియదు. అయినను స్తుతింపక నిలువజాలను. "జగత్తుయొక్క సృష్ట్యాదివ్యాపారముల చేయువా" డని సంక్షేపముగ చెప్పుటయే తప్ప విస్తరించి చెప్పజాల" నని సాయించుచున్నారు.

9) తిరుచ్చెజ్గన్నూరిలో వేంచేసియున్న శ్రీవైష్ణవులు చతుర్విధోపాయములలో నొకటియగు దానగుణముచే శత్రువులను వశీకరించుకొన సమర్థులు. "విద్యాదానం విశిష్యతే" (దానములలో విద్యాదానము మిన్న) అన్నట్లు వీరు విద్యాదాన మొనర్తురు. "విదేశేష్వపి విఖ్యాతాః" తమ జ్ఞానముచే విదేశముల యందును ప్రసిద్ధులు. వీరి జ్ఞానమును గూర్చి విన్న శత్రువులు - అచ్చటి కేగినచో తిరిగి రాజాలమను భయముతో నచ్చటికి పోవలెననియే తలంపరు. వీరా సర్వేశ్వరుని వలె నారంభించిన కార్యమును ముగించనిదే వెనుదిరుగరు. వీరి జ్ఞానము చేతనే కాదు, ఆచార వైకల్యము లేని అనుష్ఠానము చేతనున్ను శత్రువుల కజేయులై యుందురు. భగవదారాధనయే వీరి నిత్యయాత్ర. ఇట్టి శ్రీవైష్ణవావాసమైన తిరుచ్చెజ్గన్నూరు నందుగల స్వామి బ్రహ్మరుద్రాదుల కంతర్యామియై, చేతనాచేతన విభాగము లేక అందరకును నిర్వాహకుడై యున్నాడు. ఇది స్తోత్రము కాదు, యదార్థము.

10) సర్వేశ్వరుడు ఉభయ విభూతులకును నిరుపాధికశేషి. "త్రైలోక్యమపి నాథేన యేన స్యాన్నాథవత్తరమ్" అన్నట్లు ఈతనిచే రక్షింపబడువారే తక్కువై రక్షకత్వమే మించియుండు స్వామి యీతడు. ఒకరికిచ్చుటయే తనకు సర్వస్వముగా గల స్వామి. యాచకులు తమకు కావలసిన దానిని కోరవలసియుండగా తానే వారిని ప్రార్థించి వారి కోరికలను తీర్చును. "ఉదారా స్సర్వ ఏవైతే" తన నుండి చతుర్విధపురుషార్థములలో దేనిని ప్రార్థించి గైకొనినను వారు ఉదారులని యీతని భావన. ఈతని ప్రార్థించి తమ యభీష్టమును బడయగలిగితిమని అర్థులు సంతోషించగా వారు కోరిన దాని నీయగలిగితినని యీతడు సంతోషించును. అర్థుల కోరికల సఫలమొనర్చుటయే తన యదృష్టముగా భావించువాడీతడు. "స సర్వానర్థినో దృష్ట్వా సమేత్య ప్రతినన్ద్యచ" శ్రీరామచంద్రుడు యాచకులు కనిపించినచో నెదురేగి సంతోషముతో తీసికొని వచ్చి వారి కోరికల నాదరముతో తీర్చుచుండువాడట! ఇట్లిచ్చుటకు తగిన పూర్తియు, సంబంధము కలవాడగుట చేతనే యీతడు "అమ్మాన్" (స్వామి) అయినాడు. అట్టి స్వామి మూడువేల మంది - మూడువేల మందియే కాదు భూసురులగు శ్రీవైష్ణవుల కందరకును ప్రాప్యభూమియైన యీ తిరుచ్చెజ్గన్నూరిలో వేంచేసి యున్నాడు. బ్రహ్మరుద్రాదులకును స్వామియైన యీతనిని తమకు స్వామిగా లభించి ఆళ్వారులు నిర్భీతులై యున్నారు.

11) ఈ స్వామి తేనె వలె, పాలవలె, చెరకు వలె, అమృతము వలె భోగ్యమైనవాడు. ప్రళయ సమయమున ఆపదలో నున్న జగత్తునంతను నశించకుండునట్లు తన యుదరములో నుంచుకొని

రక్షించిన స్వామియే యీతడు. తిరిగి యీ జగత్తును, కర్మానుగుణముగా, సృష్టించుటకై తన నాభికమలము నుండి బ్రహ్మను సృష్టించినాడు. ఆపత్సఖుడు, ఇట్టి సర్వేశ్వరుని శౌర్యగుణమును వర్ణించుచు నమ్మాళ్వార్లు సాయించిన వేయి పాశురములలోని యీపది పాశురములును అనుసంధించు వారికి పరమపదమును ప్రసాదించి సంసార సంబంధమును పోగొట్టును.

సంసార సంబంధము పోయిన పిమ్మట గదా పరమపద ప్రాప్తి యన్నచో –

రాజకుమారు డొకడు నేరము చేసి చెరసాలలో బంధింపబడినాడు. ఇంతలో రాజు చనిపోగా రాజ్య మరాజకమైనది. అపుడు ప్రధాన పురోహితాదులు రాజకుమారుని తలపై కిరీటము నుంచి, అతని విడుదలకై యాజ్ఞ నతనిచేతనే చేయించి సంకెలల విడిపించునట్లు ఈ పదిపాశురములును మొదట పరమపదము నొసంగి పిమ్మట సంసారమను మహానాటకమును భేదించును.

**ఆళ్వార్ తిరువడిగళే శరణం**

12



భగవద్రామానుజులు

# తిరువారన్ విళై

ఉ.వే.శ్రీమాన్ డా॥ సముద్రాల వేంకట రంగ రామానుజాచార్యస్వామి
కొవ్వూరు.

ఆనందమాకలయితుం కమలాసఖస్య
సంశ్రావ్య తత్కరుణయా స్వకృతం ప్రబన్ధమ్।
అర్హే తదాదరణశాలిని దివ్యదేశే
యాత్రా మనోరథ మసౌ దశమే చకార॥

అని 'ద్రవిడోపనిషత్సంగతి'లో శ్రీవాదికేసరి అழగియ మనవాళ జీయర్లు అనుగ్రహించిన దశక సంగ్రహ శ్రీసూక్తి. తాము వ్రాసిన దివ్య ప్రబంధాన్ని 'తిరువారన్విళై' దివ్యదేశములో వేంచేసి యున్న లక్ష్మీసనాథుడైన శ్రియః పతికి వినిపించి ఆనందింప జేయగోరినారు నమ్మాళ్వారులు.

తిరువాయిమొழిలోని ఏడవ పత్తులోని పదవ దశకంలో 'ఇన్బం పయక్కవెழిల్' అనే పాశురంతో ప్రారంభించి మళయాళ దేశంలోని తిరువారన్ విళై దివ్యదేశాన్ని బహుధా కీర్తించినారు ఆళ్వారులు. ఈ దివ్య క్షేత్రాన్ని సాక్షాత్తు శ్రీవైకుంఠంగా ఆళ్వారులు "నీణగరమతువే" ఇత్యాదిగా కీర్తించారు. ఈ క్షేత్రము పట్ల ఆళ్వారులకు గల ప్రీతి నిరతిశయము. శ్రీవైకుంఠము - తిరువారన్ విళై దివ్యదేశము ఈ రెండూ ఒక్క సారి సంప్రాప్తిస్తే, తాము ఈ దివ్య దేశాన్నే కోరుకుంటామంటారు. అంతే కాదు ఈ దివ్య దేశాన్ని పొందాలనే తమ కోరికకు విరుద్ధంగా శ్రీవైకుంఠాన్నే స్వామి అనుగ్రహించినా తాము స్వీకరింపమంటారు. అసలు, స్వామి, తమ మనోరథానికి విరుద్ధంగా చేయరని వీరి విశ్వాసం. ఈ దివ్యక్షేత్రమందు ఇంత ప్రావణ్యము కలవారవడం చేతనే, తమ తిరువాయ్మొழి దివ్య ప్రబంధాన్ని, ఇక్కడే, తమ కొరకే, తమ వాచా కైంకర్యాన్ని స్వీకరించడానికే వేంచేసి యున్న స్వామికి విన్నవించ గోరినారు ఆళ్వారులు. ఈ దివ్యక్షేత్ర సందర్శనకై తమ ఆర్తిని బహుధా ఆవిష్కరించారు నమ్మాళ్వారులు.

ఇక్కడ స్వామి, శ్రియఃపతి, అమ్మతో వెలసి తాను సుఖంగా వేంచేసి యుండి ఈ ఏడులోకాలకు సుఖ సంతోషాలు కలగాలనే భావనతోనే ఇక్కడ తన వైభవాన్ని చాటుతున్నాడని అంటారు ఆళ్వారులు. ఈ దివ్యదేశం మనోహరాలైన పూదోటలతో లీలా విభూతి వైభవాన్ని వేనోళ్ల చాటుతూ, ఎప్పుడు దర్శింపవలెనా అనెడి ప్రీతిని ఆర్తిని పెంచుచున్నది. ఇట్టి దివ్య దేశాన్ని ప్రదక్షిణంగా పరిక్రమించే భాగ్యం తమకు కలుగుతుందా తమకు? అని ఆర్తిగొన్నారు ఆళ్వారులు.

ఈ ప్రదేశం అయోధ్య కంటే విలక్షణాతిశయమని ఆళ్వార్ హృదయాభిజ్ఞ శిఖామణుల అనుభవం. అంతే కాదు, శ్రీరామాయణం కంటే కూడా ఆళ్వారులు వినిపింప కోరిన తిరువాయి మొழి మిక్కిలి విలక్షణమైనదని కూడ వారి అనుభవం. ఎందువల్ల? అయోధ్యలో సీతమ్మ

దగ్గర లేని దశలో 'సీతాయాశ్చరితం మహత్' అని కీర్తింపబడిన సీతాచరితాన్ని, శ్రీరామచంద్రుడు, ఒంటరిగా విన్నాడట. ఇక్కడో, లక్ష్మీసనాథుడై స్వామి సానందహృదయుడై ఉంటాడట. అయోధ్యలో కావ్యకర్త స్వయంగా వినిపింపలేదు. కుశలవుల ద్వారానే వినిపించినాడు. మరి, ఇక్కడనో ప్రబంధ కర్త స్వయంగా వినిపింపనున్నారు. కనుక శ్రీరామాయణ విలక్షణమే ఈ దివ్యప్రబంధం అంటారు.

ఈ దివ్యదేశంలో ప్రబంధాన్ని వినిపించడమనే కైంకర్యాన్ని చేయాలని సంకల్పించారు ఆళ్వారులు. ఇక్కడ శ్రోతలు కూడా విలక్షణులే, వారే దివ్యసూరులు. (యావరుమ్‌వందు నావినుళుమ్, ఉళ్లత్తినుళుమ్, అమైన్ద నొ(ట్రి2వినుళ్లామ్, వణంగుమ్ పొళిల్ తిరువారన్‌విళై అందరూ (నిత్య సూరులతో పాటుగ) వచ్చి నాలుకతో, మనస్సుతో, సకల వ్యాపారాలలో స్తుతించి నమస్కరించే పూదోటలు గల తిరువారన్‌విళై అనికదా ఆళ్వారుల శ్రీసూక్తి) శ్రీమదనన్తునిపై పరివేష్టించి ఉండి దేవేరులతో కలసి నిత్యసూరులతో పాటుగ కొలువుదీరి ఆళ్వారుల దివ్యప్రబంధాన్ని విని ఆనందిస్తాడట స్వామి. ఈ దివ్య దేశానికి వెళ్లి ప్రబంధశ్రవణ కైంకర్యాన్ని చేయగోరినారు ఆళ్వారులు.

'ఈసమస్త లోకాలకూ ఆనందాన్ని కల్గించడానికి సుందర సుకుమారాంగన అయిన లక్ష్మితో పాటు చాల విలక్షణంగా ఉపవిష్టుడై పాలిస్తున్న స్వామి, శ్రియఃపతి, తిరువారన్‌విళైలో వేంచేసి యున్న వానిని ప్రదక్షణించి రెండు చేతులతో, నమస్కరించే శుభదివసాలు లభిస్తాయో లేదో'' అని ఆర్తి చెందినారు ఆళ్వారులు. ఇక్కడ వేంచేసి యున్న వామనులను కూడా ఎప్పుడు సేవింతునా అని, తత్పాద సమాశ్రయణ ప్రావణ్యాన్ని ఆవిష్కరించారు రెండవ పాశురంలో. ఎత్తైన ప్రాకారాలతో అలరారుతున్న ఈ దివ్యక్షేత్రంలో సుగంధిలమైన జలంతో చక్కగా ప్రోక్షణ కైంకర్యాన్ని చేయాలని ఆశపడుపడుతున్నారు ఆళ్వారులు. ఇక్కడ - పాడుంపెరుమ్పుకళ్ నాన్‌మత్రై వెళ్వియైన్దాఅజ్గమ్ పన్నినరవాళ్' పెరుమాళ్ళ యొక్క నిరతిశయ కల్యాణ గుణపరంపను పాడే నాల్గు వేదాలను షడంగాలను అభ్యసించి పంచ మహాయజ్ఞ నిరతులైన శ్రీవైష్ణవ సంప్రదాయ నిరతులు వేంచేసి యున్న ఈ క్షేత్రం, గోవిందుడు, మధుసూధనుడు, నృసింహుడు గరుడ వాహనారూఢుడైన సర్వేశ్వరునికి నివాసం కదా! దానిని నిత్యమూ ఆశ్రయింప గల్గుట సంభవమా? అని క్షేత్ర వైశిష్ట్యాన్ని సంభవిస్తున్నారు నమ్మాళ్వారులు. స్వామి, శ్రీవైకుంఠాన్ని విడచి ఇక్కడ వేంచేసి ఉండటం చేతనే ఈ క్షేత్రం సస్య సమృద్ధమై అలరారుతున్నది. ఎక్కడ చూచినా చెరకు తోటలతో, ఎర్రని ధాన్యాలు విరగబండిన పంట పొలాలతో పరివేష్టితమై ఉంటుంది. త్రిలోకాధిపతియైన ఉత్తర మధురా సంజాత శ్రీకృష్ణస్వామి, ఆశ్రిత భోగ్యమైన నల్లని తిరుమేనితో, తన పాద కమలాలను యధేష్ట కైంకర్యానికి అనువుగా అందిస్తూ ఉంటే, వాటిని మనసులో ధ్యానించడం సంభవమా? అని ఆశపడుతున్నారు ఆళ్వారులు. ఇక్కడ వేంచేసి యున్న స్వామి యొక్క కల్యాణ గుణాలను కీర్తిస్తే సర్వ పాపాలూ నాశనమైపోతా యంటారు. 'ఉలగుమలి

పుగఝ్ పాడ, నమ్మేకవినై ఒన్డు నల్లాకెడుమ్' అని అంటారు. ఆరవ పాశురంలో, స్వామి, రుక్మిణిని పత్నిగా పొందిన నాటి వైభవాన్ని భావిస్తున్నారు. స్వామి, తన్ను వలచి తన దగ్గరకు రప్పించు కున్న రుక్మిణిని పొందడంలో ప్రతి బంధంగా నిలచిన, తత్సోదరుడు రుక్మిణిని జయించాడు అవలీలగా. తన అసమాన పరాక్రమానికి ప్రత్యక్ష నిదర్శనాలైన తన సుందర దీర్ఘ బాహువులతో రుక్మిణిని సంశ్లేషించినాడట స్వామి. ఏడవ పాశురంలో ఆళ్వారులు, స్వామి నివసించియున్న తిరువారన్విళై సాక్షాత్తు శ్రీవైకుంఠమే 'నీళ్‌గరమ్ అతువే' అని అంటారు. ఇక్కడ, స్వామి, స్వాశ్రితుల పట్ల వెఱ్రి వ్యామోహం కలవాడట. (నెడుమాల్) అతడెవరు? 'కణ్ణన్' కృష్ణస్వామియే ఈతడు 'బాణాసుర నిగ్రహణం' ద్వారా శివగర్వ భంగం చేసినాడట. ఇక్కడ వ్యాఖ్యాతలు చమత్కరిస్తారు. 'ఏనుగుకు కూడా దానికి తగ్గ వాత రోగం ఉన్నట్లు మనకంటే గొప్పవారని అనుకునే దేవతలకు సహితం దురభిమానం ఉంటూ ఉంటుందట. వారికీ జ్ఞానభ్రంశం తప్పదు. బుద్ధి పెడత్రోవను పడక తప్పదు అప్పుడప్పుడు. కనుకనే, "దీన్ని నిర్వహించిన వాడను నేనే" అనే అభిమానం కలవారి, అభిమానాన్ని నశింపచేసి, 'నేనొక దేవతనైయుండి ఇలాంటి దురభిమానం కలిగి ఉండరాదని' బుద్ధి తెచ్చుకునేంత వరకు యుద్ధంచేసి గర్వభంగం చేశాడట స్వామి. పూర్తిగా బాణుని ప్రాణాలు తీస్తే 'ఊష' పితృహీన అవుతుందనే అనుకంపతో వేయి చేతులు నరికి ప్రాణాలతో వదలినాడట స్వామి. ఇలా స్వాశ్రిత వ్యామోహంతో శ్రీవైకుంఠాన్ని వదలి, ఈ దివ్యక్షేత్రాన్నే శ్రీవేకుంఠంగా స్వావస్థానం చేత అనుగ్రహించడానికి అవతరించాడు స్వామి. ఇక్కడ ప్రాప్యతత్త్వం పరమాత్మ కాడట! ఆయనకు నెలవైన ఈ దివ్యదేశమే స్వయంగా ప్రాప్యమవుతుందని అనడం ద్రోహం కాదా అంటారు వ్యాఖ్యాతృ శిఖామణులు. ఎనిమిదవ పాశురంలో అనన్య శరణత్వభావనను ఆవిష్కరిస్తున్నారు ఆళ్వారులు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రసిద్ధమైన గజేంద్ర మోక్షాన్ని ఇక్కడ దృష్టాంతంగా ఉట్టంకిస్తున్నారు ఆళ్వారులు. "అన్ఱి మత్తోన్ఱిలమ్ నిన్ శరణే యెన్ఱిఅకలిరుమ్ పొయ్‌కైయిన్ వాయ్, నిన్ఱుతన్ నీళ్ కఝలేత్తియ వానైయిన్నెఞ్జిడర్ తీర్త పిరాన్" 'నీచరణాలు తప్ప మరొక ఉపాయము కలవారము కాము, అని అగాధమైన మడుగులో ఉండినీ శ్రీ చరణాలను స్తుతించిన గజేంద్రుని మనఃక్లేశాన్ని తీర్చిన స్వామి'' అని స్వామి యొక్క శరణాగత వాత్సల్యాన్ని, గజేంద్రుని అనన్య శరణ్య భావనను ఉద్ఘోషించారు ఆళ్వారులు. శరణాగతుడైన వానికి బుద్ధిపూర్వకంగా చేసిన దానివల్లగాని, ప్రామాదికంగా చేసిన దానివల్ల గాని ఎలాంటి భయం ఉండదట. అంతటి నిర్భయంగా నిలుచున్నదట ఏనుగు. అయితే, గజేంద్రానికి మనస్సులో ఒక దుఃఖం ఉండిపోయిందట. అదేమిటి? (ఆనైయిన్నెఞ్జిడర్ తీర్తపిరాన్) తాను తన తొండంతో ఎత్తి పట్టిన పుష్పాన్ని స్వామికి సమర్పించాలని ఆతురత పడుతున్నది. ఎందువల్ల? ఆ పుష్పం కాలవిలంబం వల్ల వాడిపోతుందేమో నన్న బెంగతో ఆర్తి చెందిన గజేంద్రానికి కల్గిన ఆర్తిని తీర్చినాడట స్వామి. స్వామి శ్రీచరణాలపై తామరస పుష్పాన్ని వాడకముందే సమర్పించి కృతకృత్యతను

చెందినదట గజేంద్రము. ఇది స్వామి యొక్క "ఆశ్రితావనత్వర"ను ఆవిష్కరిస్తున్నది. ఇక్కడ వ్యాఖ్యాతలు, గజేంద్రానికి కల్గిన దుఃఖ కారణాన్ని మరొక విధంగా కూడా భావించారు. గజేంద్రుడు ఇంతగా మొసలి నోటిలో చిక్కి క్లేశపడుతూ పరతత్త్వాన్ని రక్షణకై మొరపెడుతూ ఉంటే ఎంత బాగా రక్షించాడయ్యా స్వామి! ఈయన్నా మనం ఆశ్రిత రక్షకునిగా స్వీకరించింది? అని స్వామిలో, దోషాన్ని, లోకులు, ఎన్నుతారేమోనని దుఃఖ పడిందట గజేంద్రము. ఇటువంటి అపవాదు తనకు అంటకుండా త్వరగా వచ్చి రక్షించి, గజేంద్రానికి కల్గిన బెంగను తీర్చినాడట స్వామి ఇంతేకాదు పట్టిన వానికి, పట్టుబడిన వానికి ఇరువురికీ ఏక కాలంలో మోక్షం అనుగ్రహించాడట. మొసలికి శాపమోక్షం, గజేంద్రానికి సాక్షాన్మోక్షం. ఇలా ఆశ్రితావన వైచిత్రిని చాటినాడట స్వామి. ఈ పాశురంలో వైష్ణవత్వ సాధక లక్షణాన్ని ఆళ్వారులు ఆవిష్కరించారు. స్వామియొక్క ఉపకారకత్వాన్ని భావించేటప్పుడు "గజేంద్రానికి దుఃఖం పోగొట్టడం అనేది దానికి ఉపకారం కాదు, ఇది నాకే ఉపకారం అని అనుకోవడం, ఇలాగే ఎవరికైనా అనర్థం కలిగినప్పుడు ఇది నాకే కలిగిందని భావించడం వైష్ణవత్వ పూర్తికి సాధకం అని గజేంద్రోపకారాన్ని స్వీయోపకారంగా ఆళ్వారులు అనుసంధానం చేస్తున్నారు. ఇలా తన ఆశ్రితావనత్వం లోని వైచిత్రిని చాటుతూ భూమిపై తిరువారన్ విళైలో అవతరించిన స్వామిని, ఆదివ్యదేశవైభవాన్ని నిత్యసూరులు సహితం కీర్తిస్తూ ఉంటారని అంటారు ఆళ్వారులు. ఈ దివ్యదేశం, పరమపదం, ఈ రెండూ ఏక కాలంలో ఉపస్థితాలైతే నేను ఈ దివ్య దేశాన్నే ప్రదక్షిణం చేసి ఆశ్రయించడం సంభవమా? అని ఈ దివ్య దేశంపట్ల విశేషప్రావణ్యాన్ని ఆవిష్కరించారు ఆళ్వారులు తొమ్మిదవ పాశురంలో. ఇక, పదవ పాశురంలో, నిర్ద్వంద్వంగా ఇక్కడ వేంచేసియున్న స్వామికి, తాము శేషత్వాన్ని పరిపూర్ణంగా స్వీకరించిన తరువాత మరొక వస్తువు (అది ఏదైనా) తమకు సమ్మతం కాదని స్వామి ఎరుగునని, కనుక తమకు అసమ్మతమైన దేనినైనా స్వామి అనుగ్రహింపడని ఉద్ఘోషించారు ఆళ్వారులు. ఈక్షేత్ర వైశిష్ట్య భావనయే ప్రధానంగా సాగిన ఈ దశకం శేషత్వాతిరిక్త సమస్త నిరసనం ద్వారా, శ్రీవైష్ణవ సంప్రదాయ సర్వస్వ నిదర్శకమై భోగ్యమైనది. అనుసంధింతము గాక!

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్



మకర నెడుం కళక్కాదన్

శ్రీమతే రామానుజాయ నమః శ్రీమతే శఠకోపాయ నమః

# తిరుక్కడిత్తానమ్

ఉ.వే.-శ్రీమాన్ తూపురాణి ఉడయవర్‌స్వామి
విజయవాడ

నమ్మాళ్వార్లు "మాయక్కూత్తా" అనే తిరువాయ్‌మొళ్ళి లో భగవంతుని దివ్య మంగళ విగ్రహమందు ఆసక్తులై బాహ్య సంశ్లేషమును కోరి "కాణవారాయ్ ఎన్ఱు కణ్ణుం వాయుం తువర్‌న్దు (కంటికి గోచరించేటట్లు నా ఎదుటికి రమ్మ అని కన్నులు, నోరు ఎండిపోవునట్లు) అంటూ అలమటించారు. తమ ఆర్తిని తెలియజేసే సామర్థ్యం కలవారు కావడం చేత దానిని పాశురాలలో చెప్పకలిగారు. కాని మన ఆళ్వార్ల విషయంలో భగవంతునికి ఉన్న తొందరను తెలియ జేయడానికి, ఆళ్వార్లకు కూడ సాధ్యం కాలేదు.

వేదాలు కూడ "యతో వాచో నివర్తన్తే, అప్రాప్యయమనసాసహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్" అని చెప్పినట్లుగా బ్రహ్మయొక్క ఆనందము అనే ఒక్క గుణమును మనసుతో గాని, వాక్కుతో గాని తెలిసికొన లేక వెనుతిరిగినవట. అటువంటి అసంఖ్యేయ కళ్యాణ గుణపరిపూర్ణుడైన పరమాత్మకు తన భక్తులయందుండెడి "ఆర్తత్రాణ పరాయణత్వము" (తన భక్తుల బాధలను తొలగించి వారిని రక్షించుట యందు ఉండెడి పట్టుదల) అనే గుణము కూడ వాక్కునకు గాని, మనస్సునకు గాని అందనిదే.

దీనికి ఉదాహరణముగా రామాయణములో సీతమ్మకు రాముని యందుండే ప్రేమ కంటే, రామునకు సీతమ్మ యందుండే ప్రేమే ఘనమైనదిగా మనకు గోచరిస్తుంది. సుందరకాండలో సీతమ్మ హనుమంతునితో మాట్లాడుచూ "ఊర్ధ్వంమాసాన్నజీవిష్యే"(రాముని విడచి ఇంక ఒక నెల కంటే బ్రతుకను) అని తెలియజేయగా అదివిన్న రామచంద్ర స్వామి "నజీవేయం క్షణమపి వినాతా మసితేక్షణాం" (సీతమ్మను విడచి తాను క్షణం కూడ జీవించలేను) అని తెలిపినాడుగదా!

అట్లే భగవద్గీతలో భగవానుడు "జ్ఞానీత్వాత్మైవ మే మతం" (జ్ఞాని నాకు ఆత్మవంటివాడు) అని, అట్టి జ్ఞాని యెడల తనకు గల ప్రీతి ఇంత అని తాను కూడ చెప్పలేను అని చెప్పి ఉన్నాడు గదా!

దీనిచే తేలినదేమనగా - భగవంతుని విడచి ఒక్క క్షణం కూడ బ్రతుకజాలని నమ్మాళ్వార్ల వంటి భక్తుల విషయంలో, భగవంతుడు కూడ అంతకంటే అధికమైన ప్రీతిని కలిగిఉంటాడు - అని.

'భగవంతుని ఎలా దర్శిస్తాను? ఎక్కడ దర్శించగలను?' అని అలమటిస్తున్న నమ్మాళ్వార్లకు, వారి ఆర్తి తీర్చి. దర్శనాన్ని ప్రసాదించి, ఆనందింప చేయలేక పోయినందుకు, భగవంతుడు చాల సిగ్గుపడ్డాడట.

శ్రీరామాయణంలో - అరణ్యావాస సమయంలో ఋషులతో తన వద్దకు వచ్చి రాక్షసుల బారి నుండి తమను కాపాడుమని రామచంద్రుని ప్రార్థించగా, రామచంద్రుడు - మీ రక్షణ విషయంలో నేను ఆలశ్యం చేశాను. మీరు అడగక ముందే మీ రక్షణనునేను నిర్వహించవలసి యుండగా, మీరంతా ఇలా వచ్చి ప్రార్థిస్తున్నందుకు నాకు చాల సిగ్గుగా యున్నది' - అని అన్నాడు గదా! అదే రీతిలో ఆళ్వార్ల ఆర్తనాదాన్ని విని, వ్యాకులపాటు చెంది సిగ్గుతో, వీరికి (ఆళ్వార్లకు వెంటనే దర్శనాన్ని అనుగ్రహిస్తే, ఆళ్వార్లు ఆ ఆనందాన్ని తట్టుకోలేరని భావించి, వారికి తన దర్శనం చే కలిగే ఆనందం అనుభవయోగ్యం చేయాలి అని భావించి, మొదటి మెట్టుగ తిరుక్కడిత్తానం అనే దివ్యదేశంలో వేంచేయగా, దానిని తలచి ఆళ్వార్లు, భగవంతునకు తమపై గల వ్యామోహమునకు ముగ్దులగుచున్నారు.

భగవంతుడు ఆళ్వార్లతో కలసి, వారికి తన దర్శనంచే గలిగే ఆనందాన్ని అనుభవయోగ్యంగా చేయడానికి ముందు,'తిరుక్కడిత్తానం' అనే దివ్య దేశంలో వేంచేసి ఉన్న రీతికి, రామాయణంలో నుంచి ఒకటి, మహాభారతంలో నుంచి మరియొకటి ఉదాహరణలన మన పెద్దలు చూపిస్తున్నారు.

యుద్ధానంతరం పుష్పక విమానంపై బయలు దేరిన రామ ప్రభువు, తిన్నగా నంది గ్రామం చేరి భరతునకు హఠాత్తుగా దర్శనం ఇస్తే ఆ ఆనందాన్ని భరతుడు తట్టుకోలేడని భావించి ముందుగా భరద్వాజ ఆశ్రమంలో దిగి అక్కడ నుండి తన రాకను హనుమ ద్వారా తెలియజేస్తాడు

అలాగే పాండవుల కోసం దూతగా వెళ్లిన కృష్ణపరమాత్మ, హస్తినాపురం చేరేముంద 'కుశస్థలి' అనే పట్టణం నుండి తన రాక గురించి, తనయందు అతి ప్రీతిపరవశులై ఉండె విదురాదులకు తెలియజేస్తాడు. కారణం, హఠాత్తుగా దర్శనం ఇస్తే, వారు ఆ ఆనందాన్ని అనుభవించలేరని అలా చేసినట్లు చెప్పబడింది.

ఈ విధంగా తమతో కలియడం కోసమే భగవానుడు 'తిరుక్కడిత్తానం' లో వేంచేసి ఉండి తమ (ఆళ్వార్లు) ఎడల అత్యంత వ్యామోహాన్ని ప్రదర్శిస్తున్నాడని ఆళ్వార్లు భావించి, దానిని ఈ తిరువాయ్‌మొళ్ళి లో చెప్పి ఆనందిస్తున్నారు. బాధ పెట్టిన వారే, బంధువులైనట్లు క్రిందటి తిరువాయ్‌మొళ్ళిలో తమకు దు:ఖాన్ని కలిగించిన భగవద్భావనయే ఈ తిరువాయ్‌మొళ్ళిలో ఉజ్జీవన హేతువు అయింది.

నా ఆర్తి తీర్చి అనుగ్రహించేవాడు ఆ సర్వేశ్వరుడే. ఆయనే నా కోసం 'తిరుక్కడిత్తానం దివ్యక్షేత్రంలో వేంచేసి ఉన్నాడు అంటున్నారు.

మొదటి పాశురంలో:-

రాత్రింబవళ్లు అనే భేదంలేక, ఎల్లప్పుడూ తనను స్మరించుకుంటూ ఉండేటట్లు అనుగ్రహించిన ఉపకారకుడు అతడు. నాదోషములను గాని, తన సర్వజ్ఞత్వము మొదలైన

గొప్పగుణములను గాని పాటించక, తనకే ప్రయోజన మన్నట్లు అనుగ్రహించిన మహనీయుడు. క్రిందటి తిరువాయ్‌మొళ్రిలో నా ఆర్తనాదాన్ని విని అనుగ్రహించాడు అని భావిస్తున్నారా? కాదు నన్ను అనుగ్రహించడం తనకే ప్రయోజన మన్నట్లు భావించి నిత్యసూరులకు కూడ లభించని ఆనందాన్ని, నాచే అనుభవింపచేసినాడు. నేను ఆశపడినట్లే, అందమైన చల్లని తిరుత్తుళ్ళాయ్ మాలను కిరీటమందు ధరించి నా కోసమై 'తిరుక్కడిత్తానం' లో వేంచేసి యున్నాడు. ఈ విధంగా ఉపకారకుడు వేంచేసిన దివ్యదేశం కావడం చేత, మనకందరకు చేరతగిన ఊరు 'తిరుక్కడిత్తానం' . భగవంతుని స్మరణతోను, ఆయన ఎడబాటు వలన కలిగిన దు:ఖంతోను, కాలం గడప వలసిన అవసరం లేకుండా, ఎప్పుడూ భగవదను భవంతో కాలం గడిపే అదృష్టవంతులు ఆవూరిలోని వైష్ణవులు. 'లక్ష్మణో లక్ష్మి సంపన్న:' అని లక్ష్మణ స్వామిని కైంకర్య లక్ష్మీ సంపన్నులని రామాయణంలో చెప్పినట్లుగా 'తిరుక్కడిత్తానం' లోని భాగవతోత్తములు కూడ భగవత్ కైంకర్య లక్ష్మీ సంపన్నులే.
రెండవ పాశురంలో:-

ఆళ్వారులను చేరాలి అని కోరిన భగవంతునికి, ఆళ్వార్లలో అనేక దోషములు కనిపించగా, ఆ ప్రతిబంధకముల నన్నిటిని తానే తొలగించి, 'తిరుక్కడిత్తానం' అనే దివ్యదేశమందును, తమ హృదయమందును సమానమైన ఆదరము కలవాడై యున్నాడని తెలియ జేయుచున్నారు.

తిరుక్కడిత్తానమును, నామనసును ఒకే రీతిగా ఆదరించి నా మనస్సు నందు నిత్య నివాసం ఏర్పరచుకున్న ఉపకారకుడాతడు. నాహృదయంలో ఆయన ఆ రీతిగా నివాసం ఏర్పరచుకోగా, నా పాపాలన్నీ, రాముని చేతిలో రాక్షసులు నశించినట్లు, నశించినవి. ∵ మేము నమస్కరింపము అని యుద్ద కండూతితో బుద్ధిహీనులై రాముని ఎదిరించిన రాక్షసులను రాముడు ఛిన్నాభిన్నము చేసి, శరవర్షము కురిపించి ఏకవీరుడుగా నిలచి, వారిని నిర్మూలించినట్లు, నా విరోధులను కూడ అదే విధముగా సమూల నిర్మూలము కావించినాడు.
మూడవ పాశురంలో -

పిరాట్టితో కూడ తిరుక్కడిత్తాన మందు వేంచేసి ఆశ్చర్యభూతుడుగా నున్న మహోపకారకుని తలచుకొని ప్రీతి పరవశులగుచున్నారు.

రాక్షసులతో జరిగిన యుద్ధంలో ఒక్కొక్క రాక్షసునికి ఒక్కొక్క రాముడుగా కనిపించి, ఒక్కోసారి ఎవరికీ కనిపించక శరవర్షాన్ని కురిపించిన రామచంద్ర స్వామి సీతమ్మతో సహ తిరుక్కడిత్తానంలో వేంచేసి యున్నాడు. న కశ్చిన్నాపరాధ్యతి (తప్పులు చేయని వాడెవడు) అని అందరి అపరాధములను క్షమింప జేసే సీతమ్మ పైగల ఆదరమునే నాపైగూడ చూపడం చాల ఆశ్చర్యముగా ఉన్నది.
నాల్గవ పాశురంలో -

'భగవంతునికి తిరుక్కడిత్తానం ఒకరాజ సభవంటిది మాత్రమే. కాని నా యందుండే ప్రీతిచేత నా మనస్సునే పడకటిల్లుగా స్వీకరించాడు' అనుచున్నారు.

భగవంతుడు తన ఆశ్చర్యకరమైన గుణచేష్టితములచే అందరకు ఉపకరించు మహనీయుడు. భగవంతుని వీడి నేను ఎంత దు:ఖించానో? ఎంతటి ఆర్తితో ఆయనను కానరావా! అని పిలిచానో - ఆ దు:ఖము ఆర్తి, అంతా సవాసనగా పోగొట్టి నాయందలి ప్రీతిచే నామనస్సునే పరమపదంగా భావించి నిత్యనివాసం చేస్తున్నాడు గదా! భగవదనుభవమే యాత్రగా గలవారగు నిత్యసూరులు కూడ కోరుకునే తిరుక్కడిత్తానంతో కూడ నా మనస్సులో చేరి నిత్యనివాసం ఏర్పరచుకున్నాడు.

5వ పాశురంలో:-

నాయందలి ప్రీతిచే తిరుక్కడిత్తాన దివ్య క్షేత్రంతో పాటుగా నా హృదయమందు వేంచేసి యున్నాడు, అనుచున్నారు.

'తిరుక్కడత్తానం' అంటే పరమాత్మకు ఎంతో ఇష్టం. చెప్పుల మీద శ్రద్ధ కలవారు గుడిబయట చెప్పులు విడచి గుడిలోనికి వెళ్లినా, వారి మనసంతా ఆ చెప్పుల మీదే ఏ విధంగా ఉంటుందో, అదే రీతిలో ఆళ్వార్ల హృదయంలో నివసించినా, ఎప్పుడూ ఆ తిరుక్కడిత్తానమే జ్ఞాపకం రావడంతో, పరమాత్మ ఆ తిరుక్కడిత్తానంతో సహా ఆళ్వార్ల హృదయంలో నిర్భయంగా వేంచేసియున్నాడు. భగవంతుడు అసలు తిరుక్కడిత్తానంలో వేంచేసి ఉన్నది, ఆళ్వార్లను వశం చేసుకోవడానికి ఉపకరించిన 'తిరుక్కడిత్తానం' ను విడువలేక. పరమాత్మ దానితో పాటుగ ఆళ్వార్ల హృదయంలో వేంచేసియున్నాడు. పరమపదంలో అనంతుడు, సేనముదలి మొదలగు వారిచే సేవించబడే పరమాత్మ, కృష్ణుడు గా వచ్చి అవతరించి ఘటనృత్యం చేయడం చేత కలిగిన శ్రమ అంతా తీరేటట్లు తిరుక్కడిత్తానంలో అర్చామూర్తిగా వేంచేసి యున్నందున, 'తిరుక్కడిత్తానం' చాల ప్రసిద్ధి కెక్కింది.

6 వ పాశురంలో -

ఆళ్వార్లు తమకు కలిగిన ఆనందాతిశయం చేత అందరను పిలచి 'తిర్కుడిత్తానంను ఆశ్రయించండి' అనుచున్నారు.

భగవంతుని ఎడబాయిడం వలన నాకు కలిగిన దు:ఖాన్ని అంతను తన మనోహరమైన చేష్టితములచే సవాసనగ పోగొట్టిన స్వామి అతడు. భగవంతుని ఆశ్రయించడానికి అడ్డుగా ఉండే సకల పాపములను పోగొట్టే భగవానుడు ఉండే చోటు కావడంచేత, తిరుక్కడిత్తానంలో ఎప్పుడూ వసంత కాలమే రాజ్యమేలుతూ ఉంటుంది. చక్కటి పూల తోటలతో కూడిన 'తిరుక్కడిత్తాన' క్షేత్రాన్ని స్తోత్రం చేసినంత మాత్రాన మన దు:ఖాలన్నీ కిమ్మనకుండా మాయమైపోతాయి. ఇది యథార్ధము.

7వ పాశురంలో -

మన దు:ఖాలు పోవాలంటే, తిరుక్కడిత్తాన దివ్యదేశాన్ని స్తోత్రం చేయవలసిన అవసరం కూడ లేదు; దానిని స్మరించినంత మాత్రం చేతనే దు:ఖాలు తొలగిపోగలవు అంటున్నారు.

మీ దు:ఖాన్ని పోగొట్టే తిరుక్కడిత్తానాన్ని మనసారా ధ్యానించండి. భగవంతుడు సర్వసులభుడు. తామరపూవు వంటి సుకుమారమైన తన పాదాలతో భూమిని ఆకాశాన్ని కొల్చినాడుకదాష కుడి ఎడమలు తెలియని అజ్ఞానులైన మనకోసం గదా, కోరి, తిరుక్కడిత్తానంలో వేంచేసి ఉన్నాడు. పరమ పదం నిత్య సూరులకే అనుభవయోగ్యమైనట్లు, ఈ తిరుక్కడిత్తానం మన అనుభవం కోసమే ఏర్పడింది. ఇంతటి సౌలభ్యాన్ని ప్రదర్శించే పరమాత్మను, తిరుక్కడిత్తానంలో సేవించుకోవాలని నిత్యసూరులు కూడ అక్కడకు వస్తూ ఉంటారు. ఇటువంటి మహిమ గల 'తిరుక్కడిత్తానం' క్షేత్రాన్ని మీరు స్మరించినంత మాత్రం చేతనే మీ దు:ఖాలన్నీ తొలగిపోతాయి. సంసారులమైన మనం పరమపదం వెడితే అనుభవించేది, భగవంతుని పరత్వ గుణాన్ని. కాని అక్కడ ఉండే నిత్యసూరులు మొదలైన వారు తిరుక్కడిత్తాన దివ్యదేశాన్ని సేవించి అనుభవించేది భగవంతుని సౌలభ్యాన్ని.

8వ పాశురంలో -

భగవంతుడు, తనకంటూ విలక్షణమైన ప్రదేశాలు చాలా ఉన్నా, పిత్రార్జితంగా వచ్చిన దానివలె మిక్కిలి అభిమానించి వేంచేసి ఉండేది తిరుక్కడిత్తానమే - అంటున్నారు.

ఊర్ధ్వలోకాలు, పాలసముద్రము మొదలుగా అనేక ప్రదేశాలు తనకు నివాసస్థలములుగా ఉన్నను, భగవంతుడు నా హృదయ ప్రదేశమందే ఆసక్తుడై యున్నాడు. పిత్రార్జిత సంపదవలె నాహృదయము ఆయనకు ఆనందాన్ని చేకూర్చేది కావడమే ఇందుకు కారణము.

9వ పాశురంలో -

మిగిలిన దివ్యదేశాలన్నీ భగవంతుని ఆదరణీయాలే, అయినా, నన్ను స్వాధీన పరచుకోడానికి ఉపకరించిన స్థలంగదా అని 'తిర్క్కడిత్తాన' మందు ప్రత్యేక అభిమానాన్ని కలిగి ఉన్నాడు - అనుచున్నారు.

నిత్యసూరులు కూడ వచ్చి సేవించేటట్లు 'తిరుక్కడిత్తానం' లో వేంచేసిన స్వామి, ఎవరని అనుకుంటున్నారు? ఆనాడు గోపకులంలో అవతరించి, వారినందరిని తన ఆశ్చర్యచేష్టలతో ఆనందింపచేసిన కృష్ణుడే, ఈనాడు అనేక దివ్యదేశాలలో అర్చామూర్తిగా వేంచేసియున్నాడు. ఆయనకు ఎన్ని దివ్యదేశాలు ఉన్నా, 'తిర్క్కడిత్తానం' అంటే ఆయనకు ప్రత్యేక అభిమానం. అందుకు కారణం ఆళ్వార్లను తమకు వశులనుగా చేసి ఇచ్చినది ఆవూరు కావడమే. ఈ క్షేత్రంలో భగవానుడు తన పరత్వాన్ని, సౌలభ్యాన్ని కూడ ప్రకాశింపజేస్తూ వేంచేసి యున్నాడు.

10వ పాశురంలో -

నేను లభించే వరకే 'తిరుక్కడిత్తానం' లో వేంచేసి ఉన్న పరమాత్మ, నేను తనకు స్వాధీనుడనైన తరువాత నామనసు నందే, స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు - అంటున్నారు.

భగవంతునిలో ఆశ్రితవాత్సల్యము అనే గుణం ప్రకాశిస్తూ ఉంటుంది. అంటే, తనను

ఆశ్రయించిన వారి దోషములను కూడ, ఆయన గుణములు గనే ఆదరిస్తూ, వారిదోషములు ఎంత బలిష్ఠమైనవి అయినప్పటికిని, వాటిని సులభంగా పోగొట్టకల సామర్థ్యం కలవాడు. తిరుక్కడిత్తానంలో ఉండే భాగవతోత్తములంతా భగవంతుని ఈ ఆశ్రిత వాత్సల్య గుణాన్ని ఎంతగనో పొగడుతూ ఉంటారు. ఆవూరిలోని తోటలన్నీ అనన్య ప్రయోజనులైన వైదిక భాగవతోత్తముల వేదఘోషతో మార్మోగుతూ ఉంటాయి. అటువంటి 'తిరుక్కడిత్తానం'లోవేంచేసిన పరమాత్మ ఆఊరితో సహా వచ్చి నామనసులో వేంచేసి యున్నాడు.

చివరి పాశురంలో -

ఈ తిరువాయ్మొళ్ళి (10 పాశురములు) అభ్యసించిన వారు, అట్టి అనుసంధాన మాత్రం చేతనే పరమపదం పొందగలరు అని చెప్పి ముగించు చున్నారు.

తిరుక్కడిత్తానం, దర్శన మాత్రం చేతనే శ్రమను పోగొట్టేది. చక్కటి తోటలతో, ఎప్పుడూ కనులకు ఆనందాన్ని కలిగించేది. పెద్ద పెద్ద ప్రాకారాలతో కూడి ఉన్నది. ఆ ప్రాకారాలు, సాంసారిక దుఃఖాలను లోనికి రాకుండా ఆపుతున్నాయా! అన్నట్లు ఉంటాయి. ఆ ఊరికి స్వామి (నాయకులు) నమ్మాళ్వార్లు. ఆయన భగవంతుని గుఱించి పాడిన వేయి పాటలను (పాశురములను) తిరువాయ్ మొళ్ళి అని అంటారు. 'రఘువరచరితం ముని ప్రణీతం' అని (వాల్మీకి పాడిన రామచరితం) వాల్మీకి వ్రాయడం చేత రామాయణానికి ఎలా గొప్పతనం వచ్చిందో, అట్లాగే నమ్మాళ్వార్లు వ్రాయడం చేత తిరువాయ్మొళ్ళికి కూడ గొప్పతనం ఏర్పడింది. ఆ పాశురాలు చదువుతూ ఉంటే, పాలు, అమృతం కలిపి త్రాగితే ఎంత ఆనందంగా ఉంటుందో అంత ఆనందంగా అనిపిస్తుంది. తిరుక్కడిత్తానంలో వేంచేసిన భగవానుడు పాలవంటి వాడట. నమ్మాళ్వార్లు సాయించిన పాశురాలు అమృత తుల్యములట. ఇట్టి భోగ్యత ఈ పదిపాశురాలకు ఏర్పడింది అని ఆళవందార్ (యామునాచార్యులు) చెప్పెడివారు.

ఈ పది పాశురాలను అనుసంధించిన మాత్రం చేతనే 'ఈ సంసారంలో దీనిని అభ్యసించేవారు ఉండడం చాల ఆశ్చర్యంగా ఉన్నదే అని భగవానుడు సంతోషించి, అట్టి అనుసంధాతలకు, ఎన్నడూ తన ఎడబాటు వలన దుఃఖింప అవసరం లేని పరమ పదాన్ని ప్రసాదించగలడు.

ఈ ప్రకారంగ, "ఎల్లియుం కాలైయుం" అనే ఈ తిరువాయ్మొళ్ళిలో (8వ పది - 6వ తిరు) -

భగవంతుని పొందాలి అని భక్తునకుండే ఆర్తి కంటే, భక్తుని పొందాలి అని భగవంతునికి ఉండే ఆర్తి అతిశయించి ఉంటుందని, అదే రీతిలో ఆళ్వార్ల కంటే అతిశయించిన ఆర్తితో భగవానుడు ఆళ్వార్లను కలియగోరి, అలా అకస్మాత్‌గా తన దర్శనం ఇస్తే దానిని ఆళ్వార్లు అనుభవ యోగ్యంగా చేసుకొలేరని ముందుగా తిరుక్కడిత్తానంలో వేంచేసి తరువాత ఆళ్వార్లకు తన ఆనందానుభవాన్ని ప్రసాదించాడని తెలియజేస్తి ముగించినారు.

శ్రీమతే శఠకోపాయ నమః

# తిరుప్పలియూర్‌లోని ఉత్తమ నాయక వైభవము

- న్యాయ వేదాన్త విద్వాన్ ఈయుణ్ణి రంగాచార్య స్వామి
అంతర్వేదిపాలెం

ఉపోద్ఘాతము : శ్రియఃపతి అగు సర్వేశ్వరుని నిర్హేతుక కటాక్షమునకు పాత్రులైన నమ్మాళ్వార్లు భగవత్తత్త్వమును పూర్ణముగా దర్శించి, ఆ అనుభవ పరీవాహరూపముగా నాల్గు ప్రబంధములను లోకమునకు అనుగ్రహించిరి, తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది, తిరువాయ్‌మొఝ్రి అను ఆ నాల్గు ప్రబంధములు ఋగ్యజు స్సామాథర్వణవేదముల సారమును తెలియజేయుచున్నవని పూర్వాచార్యుల అభిప్రాయము. "వేదమ్ తమిళ్ శెయ్‌ద మాఱన్'' అని ఆళ్వార్లు కీర్తింబడుచున్నారు కదా! వీనిలో చరమ ప్రబంధమగు తిరువాయ్‌మొళి సామవేదసారముగా ప్రసిద్ధి చెందినది. ఈ ప్రబంధమునకు నాలాయిర దివ్య ప్రబంధమున గల స్థానము అతి విలక్షణమైనది. తిరువాయ్‌మొఝ్రి వైశిష్ట్యమును గూర్చి ఆళ్వార్లు స్వయముగా "ఏఝ్రుమ్ పెరుమ్‌పుకళ్ ఆయిరమ్'' అని పల్కిరి. పరమ గహనములైన వేదాంత రహస్యములను ఆబాలగోపాలము అర్థము చేసికొనునట్లు గుడ జిహ్వికాన్యాయమున సరసమైన ఆలంకారిక ప్రక్రియలో నమ్మాళ్వార్లు తిరువా మొఝ్రిలోని పలు దశకములలో తెలియజేసిరి. అట్టిదశకములలో "కరుమాణిక్కమలై'' అను దశము ఒకటి. ప్రస్తుత వ్యాసమున ఆ దశక వైలక్షణ్యాము యథావకాశముగా విన్నపింపబడుచున్నది.

పూర్వదశక ప్రమేయము :ఆ దశకములోని అర్థమును తెలిసికొనుటకు ముందు, పూర్వదశకము యొక్క విషయమును సింహావలోకనము చేసికొనుట అవసరము. ఆళ్వార్లు తమ ఆత్మ మిక్కిలి నీచమైనదని, భగవదర్పణమునకు అర్హము కాదని తలపగా, ఆళ్వార్ల ఆ భావనను పోగొట్టుచు భగవానుడు జీవాత్మయొక్క గొప్పతనమును, అది ప్రకృతికంటె వేరనుటను, ఆత్మయొక్క భోగ్యత, జ్ఞానానందత్వములు, నిత్యత్వములతో పాటు, కౌస్తుభమణివలె ఆత్మ తనకు మిక్కిలి ప్రియకరమగుటను, తనకు అత్యంతము శేషమగుటను తెలియజేసెను. ఈ అనుభవము "కణ్‌గళ్‌శివన్దు" దశకమున తెలుపబడినది. అందు మొదటి రెండు పాశురముల ద్వారా భగవానుని సౌందర్యము, శీలాది గుణములను అనుసంధించిన ఆళ్వార్లు, మిగిలిన పాశురములలో ఆత్మయొక్క వైలక్షణ్యమును, భగవచ్ఛేషత్వమును వివరించిరి.

ఆళ్వార్ల నాయికా భావన : ఆత్మయొక్క భగవచ్ఛేషత్వమును అనుసంధించిన ఆళ్వార్లు ఆ అనుభవపారవశ్యముచే తమ స్థితిని మఱచి, కన్యకాభావనను పొందిరి. భగవానునిపై భక్తి అతిశయించినపుడు తమను ఒక నాయికగా భగవానుని నాయకునిగా భావించుట పలువురు

ఆళ్వార్లలో కనుపించు చున్నది. "జ్ఞానత్తిల్ తన్‌పేచ్చు ప్రేమత్తిల్ పెణ్‌పేచ్చు" కదా! "భక్తి
శృంగారవృత్త్యాపరిణమతి" అని వేదాంత దేశికులును నుడివిరి. "భక్తి ప్రభావ భవ దద్భుత భా
బంధ సంధుక్షిత ప్రణయ సార రసౌఘపూర్ణః", "భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే భక్తి
నిజాం ప్రణయభావనయా గృణంతః, ఉచ్చావచైః విరహ సంగమజై రుదంతైః శృంగారయం
గురవో హృదయం త్వదీయాః" అను పూర్వాచార్య సూక్తులిచట స్మరణీయములు. ప
అన్నమాచార్య కీర్తనలలో, క్షేత్రయ్య పదములలో ఇట్టి భావనా విశేషమును కాననగును. కన్య
దశను పొందిన ఆళ్వార్లు తమ అనన్యార్హశేషత్వమును చెలికత్తె మాటల ద్వారా అన్యాపదేశ ప్రక్రియ
పల్కుట ప్రస్తుత దశకములోని ప్రమేయము. కావుననే మణవాళ మహామునులు "కరుమా
తిఱత్తిల్ ఒరుకన్నికైయా మాఱన్ ఒరుమా కలవి యురైప్పాల్, తిరమాగ వన్నియరుక్కా
తవన్ననక్కేయాకు ముయిరిన్నిలైయై యోరునెడితా" అనుచు ఈ దశక ప్రమేయమును గూ
తిరువాయ్‌మొழி నూత్తన్దాదిలో సాయించిరి.
ఆళ్వార్ల నాయికా భావన తగినది, సహజమైనదియు : పురుషుడు తనను స్త్రీగా భావించుట భ్రమ
అగును. కావున దివ్య జ్ఞానసంపన్నులగు ఆళ్వార్లకు ఇట్టి భ్రమ తగునా? అను సందేహమిచట
కలుగుటకు అవకాశము కలదు. "అఞ్జిఱైయ మడనారాయ్"(1-4) దశక ప్రవేశములో నమ్పి
అను ఆచార్యులు ఈడు వ్యాఖ్యానమున ఈ శంకను పరిహరించుచు పల్కిన చక్క
సమాధానమిచట స్మరింప తగినది. "అవన్తానే కొడుత్త వఱివుమ్ విశ్లేషత్తిల్ అకించి త్కరమామ్బ
యిఱే అననుడైయ వైలక్షణ్యమ్", "ఎత్తిరయిల్ పుంస్త్వత్తైయ ழிత్తు పెణ్ణుడై యుడుత్తుమ్బడియి
యవనుడైయ పురుషోత్తమత్వమిరుప్పదు" అనుచు నమ్పిళ్ళై భగవానుని దివ్యసౌందర్యము ఇట్టి
భావనను కల్గించుటలో ఆశ్చర్యము లేదనిరి. అంతేకాక, ఈ భావన ఆత్మలన్నిటికి సహజమైనది
ఆళ్వార్ల విషయమున మరింత అర్థవంతమైనదియును అనుటకు "కళిమామలర్ ప్పావైయొప్పా
' అను తిరుమజ్గమన్నన్ శ్రీసూక్తి, "కురుమామణి యాయణైయుమ్ వస్తువుక్కు మణివల్లిప్పేచ్చు
వన్దేఱియన్తు" అను ఆచార్యహృదయ చూర్ణికయు స్మరణీయములు. ఆళ్వార్లకు పిరాట్టిత
(లక్ష్మీదేవితో) గల సామ్యమును తెలుపు "ఇన్బుమన్బుమ్ ముళ్పుడువదు కొళున్దు విడువదాగిఱద
కడిమామలర్ప్పావై యోడుళ్ల సామ్యషట్కత్తాలే" అను ఆచార్యహృదయ సూత్రము, అచటి మణ
వాళమహామునుల రస్యమైన వ్యాఖ్యానమును అనుసంధింప తగినవి. అనన్యార్హశేషత్వము
అనన్యశరణత్వము, అనన్య భోగ్యత్వము, అన్వయమున ధరించుట, విశ్లేషమున సహింపలేకుండుట
తదేక నిర్వాహ్యత్వము అనునది ఆళ్వార్లకును పిరాట్టికిని మధ్యగల సామ్య షట్కము. మఱియు
ఈ సందర్భమున "రూపసంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతాం, దదృశుః విస్మితాకారా
రామస్య వనవాసినః " అని శ్రీరాముని దివ్య సౌందర్యమును దండకారణ్యములోని మునుల
దర్శించి విస్మయ పడుటయే కాక, స్త్రీ భావమును పొంది, ఆ సౌందర్యమును అనుభవింపవలెనని

ఆశపడిరని, శ్రీకృష్ణావతారమున గోపికలుగా ఆ ఋషులు జన్మించుట వలన వారి కోరిక తీరెననియు చెప్పబడు ప్రసిద్ధమైన ఐతిహ్యము ఉట్టంకింపతగినది.

ఆళ్వార్లు నాయికా భావనతో పల్కుట తత్త్వమును ఉపదేశించుటలోని ఒక విశిష్ట ప్రక్రియ అని చెప్పవచ్చును. ఇందులకు "భక్తి కార్యమాన ఉక్తియై కాముక రూపేణ శొన్నదు పురుషన్ పురుషననైస్నేహిక్కుమదిలుమ్ "కామమష్టగుణం భవేత్" ఎన్గిఅపడియే స్త్రీక్కు పురుష విషయస్నేహమ్ పళ్లమడై యాకైయాలే తాదృశమాన అతిమాత్ర ప్రావణ్య సూచక మాకైయాలుమ్, గుడజిహ్వికా న్యాయత్తాలే విషయ ప్రవణరాన సంసారికళ్ పరిగ్రహిత్తు ఉజ్జీవిప్పార్ కళెన్నుమత్తాలుమ్" అను అఙ్ఞరైయమడనారాయ్దశక ప్రవేశములోని అరుంబద వివరణమును స్మరింపనగును.

**ఆళ్వార్లు నాయిక, తల్లి, చెలికత్తె మాటలతో పల్కుట :**

తిరువాయ్మొ[్రి ఉత్తమోత్తమ ధ్వని కావ్యము. ఇందు ఆళ్వార్లు చేయు తత్త్వోపదేశములు ధ్వన్యర్ధరూపమున నుండును. ఆళ్వార్లు స్వయముగా తమ వచనముల ద్వారా చేయు ఉపదేశమునకు స్వాపదేశమనియు, ఆ విధముగా కాక, నాయిక లేక ఆమె తల్లి లేక ఆమె చెలికత్తె మాటల ద్వారా చేయు ఉపదేశమునకు అన్యాపదేశమనియు పేరు. అపదేశమనగా వ్యాజమని భావము. అనగా వేరు రూపమున తత్త్వోపదేశమును చేయుటకు అన్యాపదేశమని అర్థము. తిరువాయ్మొ[్రిలోని అన్యాపదేశదశకములు మొత్తము 27 కలవు. వానిలో నాయికా దశకములు 17 "అఙ్ఞరైయ" వంటి దశకము లట్టివి(తాయ్) తల్లి మాటలతో పల్కుపదికములు 7. "కజ్గలుమ్ పకలుమ్" వంటి దశకములు ఈ రీతిలోనివి. చెలికత్తె (తో[్రి) మాటలతో పల్కుదశకములు 3. ప్రస్తుత దశకము ఈ కోవకు చెందినది. శూళ్విశుమ్బు దశకము కూడ అన్యాపదేశ ప్రక్రియలోనికి చేరునని నమ్బిళ్లై అభిప్రాయపడిరి. ఇందు ఆళ్వార్లు తమ అనుభవమును భగవద్భక్తుల అనుభవముగా పల్కుటచే అన్యాపదేశ ప్రక్రియయే అగునని ఆ ఆచార్యుల అభిప్రాయము.

ఇట్లు నాయికగా, తల్లిగా చెలికత్తెగా పల్కుటలో గల స్వాపదేశార్థమును ఆచార్య హృదయ కారులగు అ[్రిగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ భగవదనన్యార్హశేషత్వము అను సంబంధమును వివరించునపుడు చెలికత్తెగా, సిద్ధోపాయాధ్యవసాయమును బోధించునపుడు తల్లిగా, ప్రాప్యత్వరను ప్రకటించునపుడు నాయికగా ఆళ్వార్లు పల్కిరని తాత్పర్యము. ఇట్టి వివరణమును నమ్బిళ్లై "వెళ్లచ్చురి శఙ్గ" ప్రవేశమున అనుగ్రహించుట కాననగును.

నాయికగా, తల్లిగా, చెలికత్తెగా పల్కు పల్కులన్నియు ఆళ్వార్ల వచనములే అగును. "శడకోపన్ వాయ్న్దురైత్త" అని "వణ్కురుమార్ శడకోపన్శొల్" అని, "శడకోపన్ కుత్తేవల్శెయ్దు వాయ్న్దతమిళ్మాలై" అని ఆయాదశకముల చివర యుండుట ఇందులకు ప్రమాణము. "ఒక నది పాయలుగా చీలి ప్రవహించునపుడు ఒక్కొక్క పాయకు ఒక్కొక్క పేరు పెట్టబడును. అయినను, ఆపాయలన్నియు ప్రధానమైన నదికి చెందినవే అగును. అట్లే ఆళ్వార్లు నాయికగా,

తల్లిగా, సఖిగా పల్కినను ఆ మాటలన్నియు ఆళ్వార్లవే అగును." అని ఉ.వే.శ్రీమాన్ ప్ర.భ. కాంచీ అణ్ణంగరాచార్య స్వామి వివరించిరి.

తొళిదశకములు :- తిరువాయ్‌మొళ్రి లోని "తీర్‌ప్పారైయామిని", "తువళిల్ మామణిమాడమ్", "కరుమాణిక్కమలై" అను మూడు దశకములలో చెలికత్తె పరాంకుశనాయకి యొక్క స్థితిని తల్లికి తెలుపుట కనుపించుచున్నది. ఈ మూడు దశకములు జీవాత్మయొక్క అనన్యార్హశేషత్వమును ప్రతిపాదించు చున్నవగుటచే ప్రణవములోని ఉకారార్థమును తెలుపుచున్నవని మణవాళ మహామునులు ఆచార్యహృదయ వ్యాఖ్యానమున (సూ 46), శ్రీ.ప్ర.భ.కాంచీ అణ్ణంగరాచార్య స్వామి తిరువాయ్‌మొళ్రి వ్యాఖ్య అగు దివ్యార్థదీపికలోను పల్కిరి. "తీర్‌ప్పారైయామినిలో "వెఱివిలక్కు" (దేవతాంతర సంబంధనిరసనము) అను తమిళ ఆలంకారిక ప్రక్రియను అనుసరించి దేవతాంతర సంబంధ రాహిత్యము యొక్క ఆవశ్యకతను తెలుపుట ద్వారా నాయిక యొక్క అనన్యార్హశేషత్వము చెప్పబడినది. "తువళిల్ మామణి మాడమ్" అను దశకమున చెల్లికత్తె నాయిక యొక్క తల్లితో "ఉమక్కాశైయిల్లై విడుమినో" అని పల్కుచు, నాయిక యొక్క అనన్యార్హతను తెలిపెను. ప్రస్తుత దశకమున "మణమిక్కు" (వివాహ నిషేధము) అను తమిళ ఆలంకారిక పద్ధతిలో చెలికత్తె తన తల్లితో మధ్యస్థవచనములను పల్కుచు నాయిక యొక్క అనన్యార్హశేషత్వమును నిర్దుష్టముగా తెలిపెను.

"కణ్‌గళ్‌శివన్దు" దశకములోను జీవాత్మ యొక్క అనన్యార్హ శేషత్వమే స్వాపదేశార్థమైనను, అందు "ఇఱవేఱి" మొదలగు సూక్తుల ద్వారా అన్యశేషత్వమను భ్రాంతి తొలగింపబడుట ప్రధానాంశము. ఇందు "అరుమాయన్ పేరన్ఱి పేచ్చిలళ్" అనుట ద్వారా స్వశేషత్వనివృత్తి తెలుప బడుటచే పునరుక్తి శంకకు ఇచట అవకాశము లేదు. "అన్యశేషత్వము తొలగింపబడుట చేతనే స్వశేషత్వ నివృత్తియు కలుగును కదా "! అనినచో ప్రణవములోని అన్యయోగ వ్యవచ్ఛేదమును తెలుపు ఉకారము వలన చెప్పబడు అన్యశేషత్వ నివృత్తి నమఃపదముచే ప్రతిపాదింపబడు స్వశేషత్వ భ్రాంతి నివృత్తిచే నిష్కృష్టముగా ప్రతిపాదింపబడినట్లే, ఇచటను ముందు దశకమున తెలుపబడిన అన్యశేషత్వ నివృత్తి ఈ దశకమున ప్రతిపాదింపబడు స్వశేషత్వనివృత్తి కల్గినను, "అహంమే" అను స్వశేషత్వ భ్రాంతి పోవుట మిక్కిలి అరుదు కదా! పరాంకుశనాయకి సకల జీవాత్మలకు సంకేతము కావున ఈ దశకమున "కథంనామో పధాస్యామి భుజమస్య కస్యచిత్" అని చెప్పబడు జీవాత్మల భగవదనన్యార్హశేషత్వము స్వాపదేశార్థము.

ఆళ్వార్లు సంతుష్టులై యున్న స్థితిలో అన్యాపదేశ ప్రక్రియలో పల్కిన దశకమిది ఒక్కటియే అని కూరత్తాళ్వాన్ అభిప్రాయము. మిగిలిన అన్యాపదేశ దశకములలో ఆళ్వార్ల విరహావస్థయే కనుపించును. ఈ దశకమున గల "అప్పన్ తిరువరుళ్ మూళ్గికినళ్" అను సూక్తి ఆళ్వార్ల సంతోషాతిశయమును, తృప్తిని తెలుపుచున్నది.

దశక ప్రవేశము :- పరాంకుశ నాయికి యుక్త వయస్సు వచ్చుటచే ఆమె తల్లిదండ్రులు, బంధువులును స్వయంవరమును ప్రకటించి, మంగళ వాద్యములను మ్రోగింపజేసిరి. ఈ విషయము నెఱిగిన చెలికత్తె (తోళి) నాయిక తిరుప్పులియూర్‌లోని భగవానుని పట్ల బాల్యము నుండి గొప్ప ప్రావీణ్యమును కల్గియున్నదని, ఆమె ఆస్వామికి అనన్యార్హ అని ముందుగానే గ్రహించిన దగుటచే "మానిడవర్క్కెన్ఱుప్పేచ్చుప్పడిల్ వాழ్గిల్లేన్", "అన్టిప్పిన్ మరువర్క్కెన్ఱె పేశలొట్టేన్ మాలిరుఞ్జలై యెమ్మాయఱ్కల్లాల్" అనునట్లు స్వామిపట్లు ధృఢమైన అధ్యవసాయమును కల్గిన నాయికకు స్వయంవర వృత్తాంతము చెవిసోకిన ఆమె జీవించుట కల్ల అని తలచి, మిక్కిలి చింతించెను. వెంటనే వివాహ ప్రయత్నమును నిలుపుట తన కర్తవ్యమని భావించెను. నాయికకు తిరుప్పులియూర్ స్వామి యందు వ్యామోహము కల్గినదని తల్లికి నేరుగా చెప్పుట కామె సాహసింప లేక పోయెను. ఎందులకనగా అట్లు పల్కుట నాయికకు సంరక్షకురాలగు తన యొక్క కర్తవ్యతా లోపమును తెలియజేయునని ఆమె భయపడెను. నాయిక తన మనస్సులోని ప్రేమను, సిగ్గు వలన స్వయముగా తల్లితో తెలుప జాలదు కావున ఆమెకు అనర్ధము సంభవించునని, ఏదో ఒక ఉపాయము ద్వారా దానిని అరికట్టి, నాయిక స్థితిని తల్లికి తెలియజెప్పవలెనని నిశ్చయించు కొనెను. నాయికకు తిరుప్పులియూర్ లోవేంచేసియుండు స్వామి పట్ల ప్రేమ ఏర్పడుట తనకు అంతకు పూర్వము తెలియనట్లు, ఆ సమయమున నాయిక లక్షణములను బట్టి మాత్రమే తనకు ఆ సంగతి బోధపడినట్లు పల్కుట ద్వారా నిజమును తల్లికి తెలియ జేయుటయే అప్పటికి తగిన ఉపాయమని భావించి మధ్యస్థ వచనములను పల్కుచు బంధువుల నుద్దేశించి ఇట్లనెను.

"అమ్మలారా! మీకుమార్తె స్థితిని పరిశీలింపగా ఆమె తిరుప్పులియూర్ స్వామి యందు నిరతిశయ ప్రావణ్యమును కల్గియున్నట్లు తోచుచున్నది. ఆ స్వామి గుణములను, లీలలను ఎల్లప్పుడు అనుసంధించు కొను చున్నది. కావున మీరు స్వయంవర ప్రయత్నమును విరమించుట తగినపని. "అనుడు నాయిక తల్లి ఆమెతో "నాకుమార్తెకు కాబోవు భర్త ఆమె వైశిష్ట్యమును తగిన వాడై యుండవలెను. సౌందర్యము, శౌర్యపరాక్రమములు, ఐశ్వర్యము, ఔదార్యము, ప్రణయిత్వములను కల్గియుండ వలెను. చక్కని ప్రవర్తనను కలవాడై వేదార్ధ తత్త్వవిదుడై యుండవలెను. తిరుప్పులియూర్ స్వామికి అట్టి యోగ్యత కలదా" అని ప్రశ్నించెను.

అందులకు చెలికత్తె "మీరు పల్కిన యోగ్యతయే కాక, అంతకంటే ఎక్కువ యోగ్యతయు ఆ స్వామి యందు కలదు. ఒకవేళ అట్టి యోగ్యత లేకున్నను, మీ కుమార్తె ఆ స్వామికి అనన్యార్హ కావున మీ స్వయంవర ప్రయత్నమును మానుడు." అని సమాధానమిచ్చెను. ఇదియే ఈ దశకములోని ప్రమేయము.

(6) తిరుప్పులియూర్ క్షేత్ర మహిమ :- ఈ దశకములోని పాశురములు తిరుప్పులియూర్ దివ్యదేశ నామముతో అంకితమై యుండుటను గమనింప వచ్చును. ఈ దివ్యదేశము ప్రస్తుత

కేరళ రాష్ట్రములో "శెజ్గన్నూరు" కు సమీపమున కలదు. "మాయప్పిరాన్" అను నామమును కల్గిన ఇచటి స్వామి నిలుచున్న సన్నివేశమున నున్నాడు. ఆళ్వార్లును "నిన్ఱమాయప్పిరాన్' అనుచు ఈ విషయమును సాయించిరి కదా! విమానమునకు పురుషోత్తమ విమానము అని, తీర్థమునకు ప్రజ్ఞా సరస్సు, పూమ్శులై తీర్థమనియు పేర్లు కలవు. ఇచటి స్వామి సప్తర్షులకు ప్రత్యక్షమని స్థలపురాణము తెలుపుచున్నది. భీమ సేనునిచే ప్రతిష్ఠచేయ బడినట్లు ప్రసిద్ధి కల్గినది.

శిబి కుమారుడగు వృషాదర్భి రాజ్యము చేయునపుడు, అతని రాజ్యము గొప్ప క్షామము సంభవించెను. అపుడు అచటికి వచ్చిన సప్తర్షులకు దానమీయ వలసినదిగా ప్రభువుకు కొందరు చెప్పగా, వృషాదర్భి ఋషులకు దానమీయ బోయెను. కాని సప్తర్షులు వృషాదర్భి వద్ద దానమును గ్రహించుటకు ఇష్టపడలేదు. మంత్రుల మూలముగా రాజు బంగారముతో కలసిన పండ్లను ఋషులకు పంపగా, వారు దివ్య దృష్టితో ఆ విషయమును గ్రహించి ఆఫలములను తిరస్కరించిరి. వృషాదర్భి అపుడు హోమము చేసి, కృత్యను సృష్టించి, సప్తర్షులను చంపవలసినదని ఆజ్ఞాపించెను. భగవానుడంత, ఇంద్రుని పంపి, అతనిచే కృత్యను సంహరింపచేసి, ఋషులను కాపాడి, వారిని స్వర్గమునకు చేర్చెను. స్థల పురాణమునకు చెందిన ఈ కథ మహాభారతములో కించిత్తు మార్పుతో కన్పించుచున్నది. ఈ క్షేత్రమున సప్తర్షులు శ్రీమన్నారాయణుడే పరదేవత అని నిర్ణయించుటచే, స్వామి మిక్కిలి సంతుష్టుడై "మాయప్పిరాన్" రూపమున వారికి సేవనొసగెనను ఐతిహ్యము కలదు. నమ్మాళ్వార్లే కాక, తిరుమజ్గైయాళ్వార్లును శిఱియతిరుమడల్ ప్రబంధమున "నఱైయూర్ తిరుప్పులియూర్" అనుచు ఈ దివ్యదేశమును కీర్తించిరి. ఈ క్షేత్రవైభవము "తెన్త్తిశైత్తిలదమ్ పురై కుట్టనాట్టు త్తిరుప్పులియూర్ ", కరవార్ తడన్దోరుమ్ తామరైక్కెయుమ్ తీవికై నిన్ఱలరుమ్ పూవార్ కఱ్ఱినికళ్ శూఱ్ఱ్ "తిరుప్పులియూర్" మొదలగు పాశురములలో ఆళ్వార్లు కీర్తించుట కానవచ్చును. "అవగాహిత్తార్రై అనన్యార్హమాక్కుమ్ నాయక లక్షణమ్ వళమ్ పుకఱ్ఱమూరిలే కాట్టమిడుమ్" అను ఆచార్యహృదయ సూక్తి. ఇచటి స్వామి భక్తులను అనన్యార్హశేషత్వ రూప లక్షణమును కల్గిన వారినిగా చేయు ఉత్తమ నాయక లక్షణమును కల్గినవాడని తెలుపుచున్నది.

దశకభావ సంగ్రహము:- ఈ దశకములోని పాశురముల భావము క్రమముగా తెలుపబడు చున్నది:-

1) లక్ష్మీపతి అగుస్వామి దివ్యావయవములతో మిక్కిలి సుందరుడై వేంచేసియున్నాడు. నల్లని మాణిక్య పర్వతమున అందమైన చెఱువులో తామరలు పూచినట్లు అతని వక్షఃస్థలము, అధరములు, కన్నులు, కరములు, నాభి, పాదములు, పీతాంబరమును మొదలగునవి మిక్కిలి ఎఱ్ఱగా ప్రకాశించు చున్నవి. ఇట్టి సౌందర్యమును కల్గిన స్వామి కుట్టనాడులో గల తిరుప్పులియూర్లో వేంచేసి యున్నాడు. అతని నామములను తప్ప వేరు దేనిని నాయిక పల్కుట లేదు. అమ్మలారా! ఇందులకు నేనేమి చేయుదును!

2) తల్లులారా! అందమైన మేరుపర్వతముపై వ్యాపించు కాంతితో కూడిన సూర్యుడు, అతని చుట్టు పలు విధములుగా వెలుగు నక్షత్రముల వలె స్వామి కిరీటము, హారము, ఆభరణములును ప్రకాశించు చున్నవి. ఇట్టి స్వామి పొన్నచెట్లుతో నిండిన తిరుప్పులియూర్‌లో ఉన్నాడు. నాయిక ఆ ఊరిని తలచి, ఎల్లప్పుడును పొగడు చున్నది. దీనికి నేనేమి చేయుదును.

3) భగవానుడు అసురులను సంహరించినపుడు ప్రదర్శించిన పరాక్రమ సన్నివేశమెట్లో కదా! కెరటములచే మోదబడు సముద్రమున అగ్ని వ్యాపించి వెలుగునట్లు, గొప్ప కిరణములను కల్గిన చక్రము (సుదర్శనము) మొదలగు ఆయుధములను ధరించిన వాడై, సర్వేశ్వరుడు యుద్ధమున అసురులను సంహరించెను. అట్టి భగవానుడు నిలచియుండు దివ్యదేశము మిక్కిలి ప్రకాశించు సౌధములతో కూడియున్న కుట్టనాడు తిరుప్పులియూరు. ఈ దివ్యదేశము యొక్క సౌందర్యమును గూర్చియే నాయిక రాత్రింబగళ్లు నిరంతరము కీర్తించుచున్నది.

4) తిరుప్పులియూర్ క్షేత్రము ఫలసంపదతో నిండిన తోటలు, చెఱకు తోటలు, చక్కని క్షేత్రములను కల్గియున్నది. అందు ఏఱులు సమృద్ధిగా నుండుటచే అనేకములైన కొలనులు కలవు. అచట వేంచేసి యుండు స్వామి తన గుణములు ప్రకాశించునట్లు ముల్లోకములను రక్షించుటకై వానిని ప్రళయకాలమున తన ఉదరములోన పెట్టుకొనిన వాడుకదా! అతని తిరునామములను ఆభరణములను అలంకరించుకొని యున్న ఈ నాయిక మిక్కిలి వ్యామోహముతో పల్కుచున్నది. అతని పేరును తప్ప వేఱు విషయమును దేనిని ఈమె చెప్పుటలేదు.

5) ఈమె స్థితిని గమనించినంత మాత్రముననే ఈమె తిరుప్పులియూర్ లోని స్వామి పట్ల అత్యంతము ప్రావణ్యమును కల్గియున్నట్లు, అతని కృపకు పాత్రురాలు అయినట్లు తెలియుచున్నది. ఈమె దాల్చియున్న వస్త్రము, ఆభరణముల శోభ అనిర్వచనీయము, అపూర్వము. ఈమె శరీరమున ప్రకాశించు నూతనమైన కాంతిని గమనింపుడు. ఇవి అన్నియు ఈమెకు స్వభావసిద్ధములని మనము నమ్మగలమా? వీనినన్నిటిని ఈమె పొందుటకు తిరుప్పులియూర్ స్వామి కృపయే కారణము. వాగులలోఅంతట తామరపూలుపూచు ఆ దివ్యక్షేత్రమున ముల్లోకమును రక్షించు ప్రభువు అగు సర్వేశ్వరుడు వేంచేసి యున్నాడు. ఆ స్వామి కృపయందు ఈమె మునిగినది.

6) ఆ స్వామి యొక్క ఔదార్య గుణమందు నాయిక ఆకర్షితురాలగుటకు గుర్తు స్పష్టముగా కన్పించుచున్నది. దీని చిహ్నమును మఱచుటకు సాధ్యము కానట్లు ఎట్లు తెలిసినది? అనినచో ఆస్వామి కృపచే ఆదేశమున వృద్ధిచెందు పోకచెట్ల అందమైన పండ్లవలె ఈమె అధరము ఎఱ్ఱగా ప్రకాశించుచున్నది.

7) తిరుప్పులియూర్‌లో మృదువైన ఆకులను, పచ్చని రంగును కల్గిన తమలపాకు తీగలు ఆదరముతో నవనవలాడు మూలమును కల్గిన పోకచెట్లను చుట్టుకొని యున్నవి. అచటికి

సమీపమున గల అరటి చెట్లు లేలేత ఆకులను కల్గినవై, ఆ తీగలకు, పోకచెట్లకు ఎండ సోకకుండునట్లు నీడను ఇచ్చుచున్నట్లు చుట్టును వ్యాపించి యున్నవి. ఈ అరటి చెట్లకు చుట్టును కొబ్బరిచెట్లు వ్యాపించి యున్నవి. వీనిపై నుండి వీచు మలయ మారుతము సుగంధమును కల్గినదై యున్నది. ఇట్టి గొప్పతనము నిండిన తిరుప్పులియూర్ దివ్య దేశమున నిలచియున్న, గొప్ప ప్రణయిత్వ సంపదను కల్గిన శ్రీకృష్ణుని పాదములను ఈ నాయిక ఆశ్రయించినది.

8) తల్లులారా! మొండిపట్టుదలను (భవ్యతను) కల్గిన ఈ నాయిక యొక్క స్వభావమును మీకు నేనెట్లు చెప్పగలను? తిరుప్పులియూర్‌లో సంస్కృత వేదములను, ఇతిహాసపురాణములను తెలిసిన బ్రాహ్మణులు యాగములను చేయుదురు. వారు చేయు యాగములలో సమర్పించిన నేతి వలన పైకి లేచిన పొగ ధృఢమైన ఆకాశమును కూడ కప్పివేయును. ఇట్టి దివ్యదేశమున నిలచి యున్నస్వామి ఆదిశేషుని పడుకగా కల్గిన సర్వేశ్వరుడు. అతని నామములను తప్ప వేరేమియును ఈ కన్య పల్కుట లేదు.

9) తిరుప్పులియూర్ దివ్యదేశమున బ్రాహ్మణులు సామవేదమును సస్వరముగా పఠింపగా, ఆధ్వని సముద్ర ఘోషకంటెను ఎక్కువగా వినిపించును. మొసళ్లను కల్గిన, లోతైన, అచటి తటాకములలో తామరపూలు మంగళదీపముల వలె వికసించును. సారము నిండిన క్షేత్రములతో, కూడిన ఆ దివ్యదేశమున వేంచేసి యున్నవాడు, చల్లని జలము వంటి రూపమును, శీలమును కల్గిన శ్రీకృష్ణస్వామి. ఈమె ఈ దివ్యదేశవైభవమును, ఇచటి స్వామి గుణములను తప్ప వేఱేమియు ఎప్పుడును పల్కుట లేదు.

10) ఈ నాయిక తిరుప్పులియూర్‌లో నిలచియున్న "మాయప్పిరాన్" అను పేరు కల్గిన స్వామి కృపకు లక్ష్యమైనది అనుట సులభముగా తెలియుచున్నది. ఈమె శరీరము నుండి అందమైన, చల్లని తులసీ పరిమళము వీచుచున్నది. కావున ఈమె తిరుప్పులియూర్ స్వామి కృపను పొందిన దనుటకు వేరు గుర్తును దేనిని చూపనక్కఱలేదు. పర్వతముల వంటి ఉన్నతములైన, మాణిక్యములను పొదిగిన సౌధములతో నిండిన ఈ దివ్యదేశము దక్షిణ దిక్కునకు తిలకము వలె శోభను కల్గించుచున్నది. ఈమె ఇట్టి దివ్యదేశమున వెలసియున్న భగవానుని ఆశ్రయించి, ఆ స్వామి కృపను పొందినది.

ఫలశ్రుతి:- ఎట్టికొఱతలేని ముల్లోకములకు ప్రభువు సర్వేశ్వరుడొక్కడే. అతని దాసులకు దాసులు అగువారికి దాసునిగా తమను భావించిన శఠకోప సూరి ద్రావిడ భాషలో వేయి పాశురములతో భగవానుని కీర్తించిరి. ఆ పాశుర సహస్రము లోని ఈ దశకమును నేర్వగల్గిన వారు లక్ష్మీనాథుని కైంకర్యమును చేయుటకు అర్హులగుదురు.

ఉపసంహారము:-ప్రణవములోని మధ్యమాక్షరమగు ఉకారము జీవాత్మ యొక్క అన్యశేషత్వ భ్రాంతిని, అష్టాక్షరీ మహామంత్రములోని మధ్యమ పదమగునమస్సు స్వశేషత్వ భ్రాంతిని

తొలగించుచున్నవి. కావుననే భట్టరు అష్టశ్లోకిలో "ఉకారో నన్యార్హం నియమయతి సంబంధ మనయోః" అని, "మంత్రబ్రహ్మణి మధ్యమేన నమసా పుంసఃస్వరూపం" అని నుడివిరి. ఈ దశకమున ప్రమేయము కూడ అదియే అనుట పూర్వోక్తమే. చెలికత్తె నాయికా నాయకుల మధ్య మెలగుచు వారి మధ్య అనురాగమును పెంపొందించి, నాయిక యొక్క అనన్యార్హతను తెలియజేయును. కావున ఆమె మధ్యస్థురాలని చెప్పవచ్చును. ఇట్లు మధ్యవర్తిని అగు సఖి పల్కు మధ్యస్థ వచనముల ద్వారా ప్రణవములోని మధ్యమాక్షరము యొక్క, అష్టాక్షరి లోని మధ్యమ పదము యొక్క అర్థమును ఆళ్వార్లు విశదీకరించుట ఈ దశకములో గమనింప తగిన విశేషము.

ఈ దశకములోని 5వ పాశురమున "పునైయిళైకళ్ అణి మాడైయుమ్", "పుదుక్కణిప్పుమ్' ' అని, 4వ పాశురమున "ఇప్పనై యుఱ్ఱియే" అని పరాంకుశనాయకి పలు ఆభరణములను, వస్త్రమును దాల్చినట్లు, ఆ ఆభరణముల, వస్త్రముల అలంకారము వలన కల్గిన కాంతి అపూర్వమైనది, అనిర్వచనీయమైనదనియు చెప్పబడినది. ఇచట పరాంకుశనాయకి ధరించినట్లు చెప్పబడిన ఆభరణములు, వస్త్రమును లౌకికమైనవి కావు అవి ఆత్మాలంకారములను సూచించును. "యస్యాస్మి" అను మొదలగు శ్రుతులు తెలుపు జీవాత్మయొక్క అనన్యార్హశేషత్వము మొదలగు ఆత్మాలంకారమును అవి సూచించును.

"అరుమాయన్ పేర్లన్రి పేచ్చిలళ్", "పడవరవణైయాళ్ తన్నామమల్లాల్", "తిరుప్పులియూర్ పుకఴ్న్రిమ" మొదలగు సూక్తులు పరాంకుశనాయకి యొక్క స్వస్వాతంత్ర్య నివృత్తిని తెలుపు చున్నవి.

పూర్వదశకమున, ప్రస్తుత దశకమున ఆళ్వార్లు సర్వేశ్వరుని విషయమున ప్రదర్శించిన అభినివేశాతిశయమును, తరువాతి దశకమగు "నెడుమార్కడిమై" యందు అనుసంధించిన భాగవత పారతంత్ర్య పరాకాష్ఠను పదేపదే అనుభవించిన కీర్తి మూర్తులు నూజివీడు సంస్థాన ఆస్థాన విద్వాంసులు, జగద్విఖ్యాత కవి పండితులు, ఉభయ వేదాంత మహోదధి, దాసునకు మాతామహ చరణులును అగు కిడాంబి గోపాలకృష్ణమాచార్య స్వామి వారు ఆళ్వార్ల వలెనే తామును అత్యంతము ఉత్కటమైన ఆర్తిని పొందిన వారై, తత్ఫలితముగా స్పృహను కోల్పోయి, మూడు దినములట్లే వేంచేసి యుండి, "అప్పన్ తిరువరుళ్ మూఴ్కినళ్" అను పరాంకుశ నాయకి వలెనే సర్వేశ్వరుని పరిపూర్ణ కటాక్షమునకు పాత్రులై, మూడవనాటి రాత్రి ఆచార్య తిరువడిగళ్లను చేరిరి. ఈ విధముగా మాతామహవర్యులతో అవినాభావ సంబంధమును కల్గిన ఈ దశకమును గూర్చి విశ్వసించు సదవకాశము ఆ మహనీయుల కటాక్షము వలననే లభించినది. అమూల్యములైన సందేశములను విశ్వమునకు అందించి, మహోపకారమొనర్చిన ఆళ్వార్లను గూర్చి వాచాకైంకర్యమును చేయు అవకాశమును దాసునకు ఇచ్చిన ఉభయవేదాంత సభ, పెంటపాడు, వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞలను సమర్పించుకొనుచున్నాను.

"ప్రపన్న జనకూటస్థం ప్రపద్యే శ్రీ పరాంకుశమ్"

# కాట్కరై అప్పన్

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య
ఉ.వే. శ్రీమాన్ త్రిదండి శ్రీరంగరామానుజ జీయరుస్వామి
జి. వేమవరం

శ్లో॥ ఆశ్చర్యే హాన్వితత్వాత్, అఖిల పతితయాచ, అంతరాత్మాత్వ భూమ్నా,
రాశక్యే శక్తత్వ భూమ్నా, జలద తనుతయా, భవ్యతా కర్షకత్వాత్,
ఔదార్యాదే: విశిష్టాదపిచ, భవభృతాం రక్షణే తీవ్ర సంగాత్,
విస్మర్తుం నైవ శక్యో, హరిరితి శఠజిత్ కంస జేతారమాహ

"హరి:, విస్మర్తుం అశక్య: ఏవ"–

'సర్వేశ్వరుడు మరచుటకు శక్యుడే కాడు' అంటున్నారు, నమ్మాళ్వార్లు. అవును మరి, ఆయన శఠకోపులు (శఠజిత్) కనుక అది ఆయనకి తగి ఉన్నది. 'ఇరుళ్ తరు మా ఇలమ్' అంటే అంధకారము నిండియున్న అంటే అజ్ఞానము వ్యాపించియున్న ఈ లీలావిభూతిలో నున్న మనకు సర్వేశ్వరుని స్మరించడం ఇష్టమే కాని ఆయన స్మరణ కలిగిన సమయాలే అతి తక్కువే మరి! మనం ఎప్పటికైనా "హరి: విస్మర్తుం అశక్య:" అని అనగలమా?

అనగలమట, చాల కష్టమేమో అంటే............ 'అబ్బే! చాల సులభమైన ఉపాయం చెబుతాను, వినండి' అంటున్నారు.''

మొదట, అలా ఒక్క క్షణం కూడ మరవకుండా ఉండేవారిని ఏమంటారో తెలుసుకోవాలి. వారి పేరు నిత్యసూరులు. 'సదా పశ్యంతి సూరయ:' అని మంత్ర పుష్పంలో చెపుతూ ఉంటాం చూసేరా! ఆ నిత్య సూరులే వీరు. పరమపదంలో ఎప్పుడూ భగవంతుని సేవలో మగ్నమయే వీరికుండే అతిశయమంతా 'సదా' అన్న పదంలో చెప్పబడింది.

మరి మనం, అంటే లీలా విభూతిలో ఉన్నవారం నిత్యవిభూతిలో నున్న నిత్యసూరులతో సమానమైన 'దర్శనం' పొందాలంటే మన ఈ 'జన్మ' పరంపరలు తొలగాలి. వాటికి కారణమైన 'సంసారమూ' తొలగాలి. ఎలా? బెంగ అక్కర్లేదు. తొలగిపోతాయి - అంటున్నారు ఆళ్వార్లు. 'శొల్ వడివమై ఆయిరత్తు, ఇప్పత్తినాల్, ఎమ్ శన్మమ్ ముడివెయ్‌తి, కానల్ నాశం కండీర్ గళ్' - 'తాను అనుగ్రహించిన వేయి పాశురములలో ఈ పది పాశురముల చేత (తిరుక్కాట్కరై లో వేంచేసి యున్న స్వామిని గురించి ఉరుగుమాల్ ...... అను పది పాశురముల చేత) జన్మము నశించి, ఎండమావి వలెనున్న సంసారము నశించును సుమండీ' అని అర్థము.

ఎంత సులభమో చూడండి! ఈ ఉపాయము. ఎక్కడుందీ తిరుక్కాట్కరై? కేరళ రాష్ట్ర రాజధాని అయిన త్రివేంద్రానికి సుమారు 45 కి.మీ. దూరంలో (నాగర్ కోయిల్‌కు 30

కి.మీ. దూరం) నున్నది. ఇక్కడ వేంచేసి యున్న అర్చామూర్తిని 'కాట్కరైయప్పన్' అని అంటారు సంప్రదాయస్థులు. 'వామనుడ'ని పిలుస్తారు స్థానికులు. అమ్మవారి పేరు 'పెరుం శల్వ నాయకి' . స్వామి నిలుచుని ఉంటారు, భక్తుల కోసం ఎదురుచూస్తూ.

ఆనాడు ఈస్వామి తనకి వందలాది కిలో మీటర్ల దూరంలో (తిరునగరిలో) ధ్యానమగ్నులై, పరభక్తి పరజ్ఞాన పరమ భక్తి పరిపూర్ణులై, తన విరహాన్ని ఓపలేక శిథిలమౌతున్న నమ్మాళ్వార్లకు ప్రత్యక్షమయి, ఆయనను తాననుభవించి, తానాయనకు అనుభవాన్ని కటాక్షించాడు.

ఆ పరస్పర అనుభవ విధానాన్ని, అందునా స్వామే ఆళ్వార్లను అనుభవించిన విధానాన్ని మనం అధ్యయనం చేస్తే చాలట! మన సంసారము నశిస్తుందిట.

ఎక్కడనుంచి వచ్చిందీ సంసారము మనకు? ఈ దు:ఖ పరంపరకు మూలమేది? భగవత్ కైంకర్య రూపమైన కర్మలు చేసి, శాశ్వతానందాన్ని అనుభవించకుండా తుచ్ఛమైన కోరికలను ప్రేరేపించే 'అవిద్యే' దీనికి మూలము. ఈ 'అవిద్య', 'కర్మ'ని, ఆ'కర్మ' 'వాసన'నీ, ఆ 'వాసన', 'రుచి'నీ. ఆ వాసనా, రుచులు మరల 'అవిద్య'నీ పెంపొందిస్తూనే ఉంటాయి. ఇదొక భయంకరమైన సంసార చక్రము. ఎంత భయంకరమైనదంటే మనము ఆ చక్రములో పడి కొట్టుకుంటున్నామన్న జ్ఞానము కూడ మనకు కలుగకుండా చేసివేసేయ గలదు.

మనము చేసే ప్రతి కర్మ ఒక సంస్కార రూపంలో మనస్సులో రూపు దిద్దుకొంటుంది. ఆ సంస్కారము మరల ఆ కర్మని చేయడానికి ప్రేరణనిస్తూ ఉంటుంది. చేశామా, వెంటనే ఆ సంస్కారం బలపడుతుంది. మరింత బలంగా ప్రేరణని ఇస్తూ ఉంటుంది. ఇదొక వ్యసనమై పోతుందన్న మాట. మరి విడిచి పెట్టడానికి వీలు లేకుండా తయారవడమే వ్యసనమంటే. ఈ సంస్కారాలు పెరిగి పోతున్న కొద్దీ 'అవిద్య' పెరిగిపోతుంది. తెల్లని వస్త్రం మీద కాఫీ మరకలు పడి పడి ఆ వస్త్రం రంగు గుర్తించడానికి వీలులేనట్లు తయారైనట్లే మనస్సు కూడ చిరకాలానికి సరిదిద్దడానికి వీలు కానట్లు తయారవుతుంది.

ఈ స్థితిలో నున్న మనము మనలను ఉద్ధరించు కోలేము! భగవంతుడే ఉద్ధరించాలి. మనవైపు నుంచి ఉండవలసింది కేవలము 'ఆయన రక్షణ'ని అంగీకరించే ప్రవృత్తి మాత్రమే.

ఈ మాత్రం కూడ చేయనివ్వవు మనలోనున్న సంస్కారాలు లక్షలాది, కోట్లాది సంస్కారాలు అలా అలా ప్రతిక్షణము ఉద్బుద్ధ మౌతూనే ఉన్నా, వాటిలో భగవంతుని విషయమైన స్మరణలు చాల స్వల్పమైన శాతంలో ఉంటాయి.

ఈ స్మరణ లేదా స్మృతి లేదా జ్ఞాపకానికి రావడమనేది అతి విచిత్రంగా ఉంటుంది. ఏది ఎందుకు జ్ఞాపకం వస్తుందో, ఎందుకు జ్ఞాపకం రాదో ఆధునిక శాస్త్రజ్ఞులైతేనేమి, ప్రాచీన శాస్త్రకారులైతేనేమి వివరించడానికి చాల ప్రయత్నించారు. వెలుగుతో పాటే చీకటీ ఉన్నట్లు 'జ్ఞాపకం' రావడం తోటే 'మరిచిపోవడమూ' ఉంటుంది. ఏదో అవసరానికి వ్రాసుకున్న టెలిఫోన్ నెంబరు

మరిచిపోవచ్చు కాని టెలిఫోన్ రిసివర్ ఎలా తీయాలో, ఎలా డయల్ చేయాలో, ఎప్పటికీ మరిచిపోము. ఒకటి షార్ట్ టెర్మ్ మెమొరీ, రెండవది లాంగ్ టెర్మ్ మెమొరీ అంటారు శాస్త్రజ్ఞులు.

సదృశ, అదృష్ట, చింతాదులు స్మృతికి కారణమని శాస్త్రకారుల వచనము. 'ఆదులు' అంటే సాహచర్యమని యతీంద్ర మతదీపిక. సమాన ఆకార విశేష, గుణవిశేషములు కల దేవ దత్త యజ్ఞ దత్తులలో ఒకరిని చూచిన మరొకరు గుర్తు వచ్చుట సాదృశ స్మృతి. చింతన చేయగా చేయగా తిరుమలాది దివ్యదేశములలో తానదివరకు చూచిన దివ్య మంగళ విగ్రహము గుర్తుకు వచ్చుట చింతాస్మృతి. సహచరితులగు కరటక దమనకులలో ఒకరిని చూచిన మరొకరు గుర్తుకు వచ్చుట సాహచర్య స్మృతి. అప్రయత్నముగా ఒక్కొక్క సమయమున ఒక్కొక్క వస్తువు గుర్తుకు వచ్చుట 'అదృష్టస్మృతి', బాగుగా పూర్వ మనుభవింపబడిన సర్వ పదార్థములు స్మృతి విషయమవుతాయని నియమము. చాలకాలము గడుచుట వలననో, వ్యాధి మొదలగు వానిచే సంస్కారము నశించిననో మరి స్మృతి కలుగనేరదు. ఇక్కడ మత్తః స్మృతిః, జ్ఞానం, అపోహనం చ' అని గీతాకారులు అసలు రహస్యం బయట పెట్టనే పెట్టేసాడు.

ఇంతకీ చెప్పదలచిన విషయమేమంటే మన ఉజ్జీవనానికీ, పరభక్తి పరజ్ఞాన పరమ భక్తులు పెరగడానికీ మనలో నున్న సంస్కారాలు ఉద్బుద్ధమై స్మృతి విషయములుగా ఎలా రావాలి? ఏవేవి స్మృతి విషయములు అవాలి? అవి ఎంత బలంగా ఉండాలి? ఇవన్నీ మనకి స్వానుభవ కథనంగా ఉపదేశిస్తున్నారు, నమ్మాళ్వార్లు ఈ దశకంలో.

ఎనిమిదవపది అయిదవ దశకంలో 'మాయక్కూత్తా వామనా' అని స్వామి సౌందర్యాన్ని మానసికంగా అనుభవించి అనుభవించి, ఆ సౌందర్యాన్నే బాహ్యంగా అనుభవించాలని ఆశపడి, అది లభించక పెద్దగా దుఃఖించారు, నమ్మాళ్వార్లు. వీరి ఈ భావము ఉన్మస్తకమైపోయి (అధికమైపోయి) దేహత్యాగం చేసివేస్తారేమో అని భయపడి పోయినాడు, భగవంతుడు. అందుచేత ఆయన ఆ ప్రేమ ప్రకర్షమును తగ్గించి, కొంచెము కొంచెము ఆనందమును అనుభవింప చేసారు 6వ దశకంలో. క్రమ క్రమంగా ఆ అనుభవము పక్వమై 5వ దశకంలో కలిగిన విరహక్లేశము తీరి, స్వామి ఆశ్రిత పారతంత్ర్యము, సౌలభ్యము, భక్త పరాధీనత 7వ దశకమైన 'ఇరుత్తుంవియందు ఎన్నై'లో అనుభవించారు ఆళ్వార్లు.

అటు తరువాత మరల స్వామి 'తిరుప్పులియూర్, తిరుప్పుళిం గుడి మొదలగు దివ్య దేశములలో తాను ప్రీతితో వేంచేసియున్న తీరును ప్రకాశింపచేసి, సాక్షాత్కరింప చేసాడు. తొమ్మిదవ శతకం అయిదవ తిరువాయ్మొళిలో బాహ్య సంశ్లేషమును కలిగించక ఉదాసీనుడై ఉన్న ఈశ్వరుడిని చూసి, తాము నాయికావస్థను పొంది క్లేశ పడ్డారు. 'అక్కైయుం పైయవే పుయక్కృత్తతు' అని జీవమున ఆశను వదులుకొని మాట్లాడారు.

ఈ అవస్థలో ఉండగా, తాను ఇది వరకు అనగా 'ఇరుత్తుం వియందు'లో అనుభవించిన

భగవంతుని సంశ్లేషము స్మరణకు వచ్చింది. అంటే జ్ఞాపకం వచ్చింది. అప్పుడింక ఉరుకు మాల్ నెంజమ్....' అని పాయిస్తున్నారు.

ఎలా జ్ఞాపకం వచ్చింది? ఏమో? ఆనాడు సీతాదేవి ఆంజనేయ స్వామిని చూడగానే 'సమా ద్వాదశ తత్రాహం, రాఘవస్య నివేశనే, భుంజానా మానుషాన్ భోగాన్, సర్వకామ సమృద్ధినీ' అని పన్నెండు సంవత్సముల పాటు తాను, రామచంద్ర మూర్తి కలిసి మామగారింట్లో అనుభవించిన భోగములన్నీ గుర్తు తెచ్చుకొంది. అదే విధంగా నమ్మాళ్వార్లకు కూడ ఈ 'విరహదశ'లో ఆ 'కలయిక' జ్ఞాపకానికి వచ్చిందా? కుదరదు. ఎందుకంటే సీతాదేవి ఆంజనేయుడిని చూడగానే, ఆయన తాను రామదూతనని చెప్పగానే రాముడు గుర్తుకు వచ్చి వెంటనే మామగారిల్లు గుర్తుకు వచ్చి, తాను అనుభవించిన సంశ్లేష వైభోగం, గుర్తుకు రావచ్చును. మరి నమ్మాళ్వార్లకు అలా ఎవరూ కనిపించలేదు కద! మరెలా జ్ఞాపకం వచ్చింది?

స్మృతి ఎన్ని విధాలుగా వస్తుందో వివరించేం కదూ! అందులో ఇది 'అదృష్ట' స్మృతే అయి ఉంటుంది. ఎవరిదంటారు ఆ 'అదృష్టం'? ఈయన జీవనాదృష్ట మవవచ్చు ఈశ్వరుడి భాగ్యమూ కావచ్చు. వీరు ఈశ్వర విషయమై చెప్పే విషయాలను సంధించుకొని ఉజ్జీవించడానికి ఎదురు చూస్తున్న చేతనుల అదృష్టం కావచ్చు.

మూడు లోకములూ తన బొజ్జలో నుంచుకొన్న వామనుడు తనతో కలిసిన కలయికను తలుచుకొని అదొక జ్ఞాపకంగా కాక, అది ఇప్పుడే జరిగినట్లుగా తిరిగి అనుభవించి శిథిలులు అవుతున్నారు.

ఇది షార్ట్ టెర్మ్ మెమొరీ కాదు నమ్మాళ్వార్లకు, లాంగ్ టెర్మ్ మెమొరీయే. "మయర్వర మతినలమ్ అరుళపెత్తవన్ కదా!" ఆయన ఈ స్మృతి సుఖరూపంగా నున్నది వీరికి. ఎప్పుడో జరిగిన విషయం ఇప్పుడు సుఖరూపముగా నుండటం సాధ్యమౌతుందా?

'తచ్చ సంస్మృత్య సంస్మృత్య హృష్యామి చ పునః పునః' అని సంజయుడు తాను దర్శించిన విశ్వరూపాన్ని దృతరాష్ట్రునికి 10 రోజుల తరువాత వివరిస్తూ రోమాంచితుడైనాడు.

ప్రేయసీ ప్రియులు కలిసియున్న సమయంలో విరహవేదనని గుర్తు తెచ్చుకొని అది అప్పుడే జరుగుతున్నట్లు భావించి మరింత పరస్పరం చేరువవడం, విరహ సమయంలో తాము కలసియున్న సుఖాన్ని గుర్తు తెచ్చుకొని స్వస్థులవడానికి ప్రయత్నించడం మనకు తెలిసినదే. తాను, ీతాదేవి కలసి జలక్రీడ లాడిన స్థలాన్ని చూసి, ఆమె దూరమై పోయిన సమయంలో, వెనుకటి ుఖం గుర్తుకు వచ్చి, "అస్మిన్ మయా సార్ధ ముదారశిలా, శిలాతలే పూర్వముపోపవిష్టా" అని ిథిలుడౌతాడు రామచంద్రమూర్తి.

సీతాదేవి కూడ 'వానరోహం మహాభాగే దూతో రామస్యధీమతః' అని ఉంగరాన్ని ంజనేయులు వారు ఆమె చేతిలో నుంచగానే ఆ ఉంగరం ధరించబడిన వేలు, ఆవేలు గల

చేయి, ఆచేయి గల భుజములు, ఆ భుజములు గల పురుషోత్తముడు, ఆ పురుషోత్తమునితో తాననుభవించిన సౌఖ్యములు వెంటవెంటనే జ్ఞాపకానికి వచ్చి 'జానకీ ముదితా భవత్' అని విరహ దశలో కూడ ఆనందానుభవాన్ని స్మృతి విషయంగా పొందింది. అలాగే నమ్మాళ్వార్లు కూడ వెనుకటి సంశ్లేషాన్ని స్మరించి స్వస్థులౌతున్నారు.

వీరిని శిథిలము చేసిన గుణము లేవేవి అంటే అబ్బో! 'బహవః'- అనేకం అంటున్నారు. దశరథుని కొలువులో పిల్లవానికి పట్టాభిషేకం చేసే ప్రసక్తి వచ్చేసరికి పురప్రముఖులు, సామంతరాజులు కూడ వివరించిన కల్యాణ గుణములన్నీ నమ్మాళ్వార్ల హృదయాన్ని కుదిపివేస్తున్నాయి.

"అయ్యో! మనస్సు శిథిలమై పోతున్నదే! అనుభవించడానికి పరికరమైన మనస్సు తూట్లు పడిపోతూ ఉంటే ఆయన యందు వ్యామోహం మరింత పెరిగిపోతూ ఉన్నది. నేనేం చేసేది? ఆ శైథిల్యాన్ని ఆపగలనా? ఈ వ్యామోహాన్ని ఆపగలనా? పరమ పదంలో నున్న స్వామి, విభవంలో (అవతరించిన) స్వామి వీరిరువురి కన్న ఈ తిరుక్కాట్కరైలో వేంచేసియున్న "మాయన్" – సౌందర్యము, సౌశీల్యము మొదలగు వాని చేత పిచ్చెత్తించే స్వభావము గల ఈ స్వామి ఒక్కొక్క గుణమే కాల తత్త్వమున్నంత వరకు అనుభవించినా తృప్తి తీరదే! ఇన్ని గుణములతో ప్రవేశించి నా మనస్సులో, క్షణ క్షణము ప్రవహిస్తున్న అమృత ఝురిలా అనుభవిస్తున్నాడు నన్ను, తన అద్భుత వ్యాపారములతో.

"కల్యాణ గుణములు గుర్తుకు వస్తున్నాయి. వెంటనే మనస్సు కరిగిపోయి నీరయిపోతోంది. అయినా ఆ గుణాలు మరపుకు రావడం లేదు. మరల స్మృతి వస్తోంది – పూర్తి కావడం లేదు – నీ కల్యాణ గుణములు సకల జనులకు పాపహరము లౌతూ (దుఃఖములను తొలగిస్తూ ఉంటే) నాకవి శిథిల పరిచేవిగా నున్నాయే! లోకనాథుడైన రామచంద్రుడు 'సుగ్రీవం నాథమిచ్ఛతి' అన్నట్లుగా అనుగ్రహించడాన్కి వచ్చి 'శేషభూతుని'గా నిలిచిన ఇదేమి సౌశీల్యము? ఔపాధిక బంధువులు ఎలా సన్నిహితంగా ఉంటారు అలాగే సన్నిహితుడవైయున్న తిరుక్కాట్కరై యప్పన్ స్వామీ! నీ విషయాన్ని తలచడాన్కి కూడ అసమర్థుడనై యున్నానే! 'సర్వులకు స్వామి' అవడం వలన "ఇదేమి? మరీ ఇంత సౌశీల్యమా?" అని అడిగే వారే లేకపోయినారే!

"వంచన చేసి నా మనస్సులో ప్రవేశించిన వాడా! నీవు నా కంతరాత్మవే కద! ఎప్పుడు నామనస్సును ఆర్ద్రపరిచావో ఎప్పుడు నన్ను నీ గురించి తెలుసుకొనేటట్లు చేసావో కొంచెము కూడ ఎరుగలేకున్నాను. సర్వాధికుడైన స్వామి తనని తాను తగ్గించుకుని వచ్చిన ఈ రీతి నాభ్రమ కాదు కద!

"సకల భూతములకు తానాధారమై, తనకు సకల భూతములు ఆధారముగా కలిగి యుండటం ఎంతటి ఆశ్చర్యకర విషయమో, తాను శేషి అయి, శేషభూతుడుగా కూడ ఉంటూ క్షుద్రుడినైన నా యందింత దయ చూపడం ఎంత ఆశ్చర్యకర విషయం – అశక్యమైన దానిని శక్యముగా చేయడం ఆయనకే కదా! తగును.

"వర్షాకాలపు మేఘము వంటి శరీర వర్ణము కల నా కృష్ణుని చేష్టలు ఎంతటివో ఊహింపశక్యం కాదు. విరోధియైన శరీరాన్ని పోగొట్టడం ఆయన పని అని నేను భావిస్తూ ఉంటే దేహాత్మ విభాగం చేయకుండా నన్ను అనుభవిస్తున్న కాట్కరైయప్పన్ చర్యలు అత్యాశ్చర్యకరములుగా నున్నాయి.

"విశేషమేమంటే ఆయన వంచకుడు అని తెలుస్తున్న కొద్దీ ఆయన పట్ల ఆకర్షణ శక్తి పెరిగిపోయి, భవ్యుడైన ఆ స్వామి యందే నా మనస్సు అహోరాత్ర విభాగము లేక పడియున్నది.

"నేనేమి చేయకముందే, చేయాలని భావన కూడ ఉన్నదో లేదో తెలియక ముందే తాను వచ్చి నా మనస్సులో చేరి నిలిచి ప్రతిదినము అనుభవిస్తున్నారు.– ఆయనకు కదా నేను దాసుడను.

"అద్భుతమైన విశాలమైన నేత్రములు, చిన్న తడితో మెరుస్తున్న అధరములు, నాలుగు భుజములతో నున్న స్వామి గురించిన నా అనుభవము నిత్యసూరులకు కూడ లేదు. (నూతన వధువు, తనకు తొలిసారిగా పురుష స్పర్శ తగలగానే శరీరము ఝల్లుమని, తాను పొందిన ఆ అనుభవం ఇంకెవరికీ లేదను కుంటుంది. అలాగే నిత్యసూరులకన్న తన అనుభవమే గొప్పదంటున్నారు ఆళ్వార్లు.)

"నేను ఆయనని చూచి, స్వరూప రూప గుణ విభవైశ్వర్యాదులను ఒక్కొక్కటే అనుభవిద్దామని సిద్ధపడేంతలో నాకంటే ముందుగానే నాలో ప్రవేశించి నన్ను అనుభవించటకే కాట్కరైయప్పన్‌గా తిరుక్కాట్కరైలో వేంచేసి యున్నాడు."

అని ఈడు పడిన నమ్మాళ్వార్లు, మనని ఈ పది పాశురములు అనుసంధానము చేసుకుంటే, జన్మము సంసారము తొలగుతాయని ఆదేశిస్తున్నారు.

ఇదొక విలక్షణమైన ధ్యాన మార్గ నిర్ణయ స్వరూపము- స్వామి గుణవిభూతులు ఎలా, ఏ వరుసలో అనుభవించడం ప్రారంభిస్తే జన్మల పరంపరకు మూలమైన సంసారము, ఆ సంసారమునకు మూలమైన సంస్కారములు నశిస్తాయో తెలియపరుస్తున్నారు.

స్వామిని ధ్యానం చేయడం ప్రారంభించగానే తొలుత ఆయన అద్భుతమైన చేష్టలను అనుసంధించుకోవాలి. తరువాత ఆయన 'సర్వశేషి' అని అనుసంధించుకోవాలి. 'అంతర్యామిగా' వేంచేసి యున్న తీరును గమనించాలి. అఘటిత ఘటనా సామర్థ్యాన్ని తెలుసుకోవాలి. ఇప్పుడు దివ్యమంగళ విగ్రహాన్ని స్మరించాలి. హృదయాన్ని ఆకర్షించే గుణములను పరిశీలించాలి. మిక్కిలి ఉదారముతో, అది తన ఫలమే అన్నట్లుగా సంసారులను రక్షించేందుకు ఆయన పట్టుదలను చూడాలి– ఇక సర్వేశ్వరుడు మరచుటకు శక్యము కాని విధంగా మన మనస్సులో స్థిరంగా నిలుస్తాడు. నిత్యసూరుల గోష్ఠిలో చేరగలమప్పుడు.

ఆ భాగ్యమును శ్రియః పతి మనకు కలిగించు గాక!

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః

# తిరుమూழிక్కళమ్

విద్వాన్. ఉ.వే. శ్రీమాన్. శఠకోప రామానుజన్‌స్వామి
ఎమ్.ఎ. నెల్లూరు.

ప్రపన్న జన కూటస్థులైన శ్రీనమ్మాళ్వార్ తిరువాయ్‌మొழிయను తమ దివ్య ప్రబంధము నందు నాల్గుదశకములలో దూతప్రేషణ గావించియున్నారు. సర్వేశ్వరుడు పర, వ్యూహ, విభవ, అర్చా, అన్తర్యామి అని ఐదువిధములుగ వేంచేసియున్నాడు. 1. శ్రీవైకుంఠమునందు వేంచిసియున్నవాడు పరవాసు దేవుడు. 2. జగత్సృష్ట్యాదులకై క్షీరాబ్ధియందు వేంచేసియున్నావాడు వ్యూహమూర్తి. 3. రామకృష్ణ నృసింహాది అవతారమూర్తులను విభవమూర్తులనియందురు. 4. మనము దేవాలయముల యందును గృహాదులయందును అర్చించు శిలాలోహాది కృత విగ్రహముల నధిష్ఠించియున్నవాడు అర్చామూర్తి. 5. ప్రతి జీవునియొక్క హృదయమున వేంచేసియున్నవాడు అంతర్యామి. ఈ మూర్తులందరియొద్దకును వీరు దూతప్రేషణము గావించినారు.

1. అంజిఱైయ మడనారాయ్ (1-4) అనుదశకము నందు "కడలాழிనీర్‌తోత్తి అదనుళ్లే కణ్వాళరుం, అడలాழி యమ్మానై క్కణ్డక్కాల్" (సముద్ర జలములను సృష్టించి అందు శయనించియున్న చక్రధారిని సేవించినచో) అనుచు వ్యూహామూర్తి సన్నిధికి అతని క్షమాగుణమును పురస్కరించుకొని "మదియిలేన్ వల్వినయే మాళాదో (1-4-3) (మతిలేని దాననైన నా పాపములే వశింపకున్నవా? మరి వారి క్షమాగుణము ఏమైనట్లు?) అనుచు పక్షులను దూతలనుగా పంపినారు.

2. వైకల్ పూజ్గழிవాయ్ (6-1) అనుదశకమున "మాఱిల్ పోరరక్కన్ మదిళ్ నీరెలచ్చెత్తుగన్ద (6-1-10) (నిరుపమానముగ యుద్ధముగావించు రావణాసురుని కోటను భస్మమొనర్చి సంతసించిన) అనుచు వీరు విభవమూర్తియగు శ్రీరామచంద్రుని సన్నిధికి "పుణర్తపూం తణ్డుళాయ్ ముడి నమ్బెరు మానైక్కణ్డు" (పుష్పములతో కూడిన తిరుత్తుళాయ్ మాలికను కిరీటమున ధరించిన మనస్వామిని) అని అతని ఆర్త రక్షణ దీక్షను పురస్కరించుకొని దూతప్రేషణము గావించినారు. "శిరన్ద శెల్వం మల్గు తిరువణ్ వణ్డూర్ (6-13) (సంపత్సమృద్ధమైన తిరువణ్ వణ్డూర్) అని ఆ ఐశ్వర్యమును చూచి ముగ్ధుడై ఆలసించియుండును అని తలంచుచున్నారు.

3. పొన్నులగాళీరో (6-8) అను దశకమున "వానవర్ కోనైక్కణ్డు" (6-8-24) (నిత్యసూరి పరిషన్నిర్వాహకుని దర్శించి" అని పరమపదనాథుని సన్నిధికిని "ఎజ్గుచ్చెన్నా నిలుం కణ్డు (6-8-5) (ఎక్కడికైనను వెళ్లి దర్శించి) అని అంతర్యామి సన్నిధికిని- "తన్ మన్నునీళ్ కழల్‌మేల్ తణ్డుழாయ్ నమక్కన్రి నల్గాన్ (6-8-6) (తన తిరువడి

గళ్లలో సమర్పింపబడిన తిరుత్తుళాయ్‌ని (ప్రేయసియైన నాకు తప్పక ఇచ్చును.) అనుచు అతని రసికతను పురస్కరించకొని దూతప్రేషణలను గావించినారు, "మున్నులగెంగళెల్లాం పడైత్త ముగిల్‌వణ్ణన్ కణ్ణన్" (6-8-1) (సృష్ట్యాదిలోలోకముల నన్నింటిని సృజించిన నీలమేఘశ్యాముడు, తడు జగద్రక్షణమున నిమగ్నుడై నన్ను మరచియుండును) అని భావించుచున్నారు.

4. ఎజ్ఞానల్ (9-7) అను ఈ దశకమునందు "తమరోడు అఙ్గరైవార్కు" (9-7-2) (భాగవతులతో అక్కడ వేంచేసియున్నవారికి ) అనుచు అతడు భాగవత గోష్ఠిలో తన్మయుడై యుండునని భావించి "శెక్కమలత్తలర్ పోలుం తిరుమేని యడిగళుక్కు తక్కిలమే కేళీర్" (9-7-3) ("ఎఱ్ఱతామరపుష్పముల వంటి నేత్రములు, శ్రీహస్తములు, శ్రీపాదములు, తామరాకుచ్ఛాయను తలపించు దివ్య మంగళ విగ్రహమునునగల ఆ స్వామిని సేవించుటకు మేము తగమా " అని అడుగుడు) అని అతని సౌందర్యాతి శయమునుపురస్కరించుకొని తిరుమూళిక్కళమను క్షేత్రమున వేంచేసియున్న అర్చామూర్తి యొద్దకు దూతలను పంపినారు.

తిరువాయ్‌మొళిలో నమ్మాళ్వార్ కీర్తించిన 38 దివ్యదేశములలో తిరుమూళిక్కళమను దివ్యదేశము అన్యతమము. ఇదిమళయాళ దేశమున నున్నది. దీనికి "వళత్తిన్ కళమ్" అనునామాన్తరము గలదు. ఇచటి స్వామికి "తిరుమూళిక్కళత్తాన్" అని తిరునామము "పిన్నోనార్ వణఙ్గుంశోది తిమాళిక్కళత్తానాయ్ ముదలానాయే" (తిరునెడుందాణ్డగం - 10పా) (జగత్కారణమైన ఓ స్వామీ నీవు రామకృష్ణాద్యవతారములను చాలించిన పిదప కూడ ఈ లోకమున నిన్ను భక్తులు సేవించుటకు వీలుగ అర్చారూపమున తిరుమూళిక్కళమను క్షేత్రమున వేంచేసియున్నావు గదా) అని తిరుమంగైయాళ్వార్ ఈ స్వామిని కీర్తించియున్నారు.

"మహాత్మాక్కళ్ విరహం సహియాద మార్దవం వళత్తిన్ కళత్తిలే కూడుపురిక్కు:' (ఆచార్య హృదయము 3-30) అనుసూత్రమున అళగియ మణవాళప్పెరుమాళ్‌నాయనార్ "మహాత్ములైన భాగవతోత్తములతో విశ్లేషమును సహింపజాలని మార్దవ గుణము ఈ క్షేత్రమునగల స్వామి యందు దర్శింపనగునని అనుగ్రహించినారు. మహాత్ములైన భాగవతులనగ నెవ్వరో శ్రీ ఆళవన్దార్ తమస్తోత్రరత్నము నందు ఇట్లు అనుగ్రహించినారు.

శ్లో॥ సకృ త్త్వదాకార విలోకనాశయా
తృణీకృతానుత్తమ భుక్తి ముక్తిభిః ।
మహాత్మభిః మా మవలోక్య తాం నయ
క్షణేఽపి తే యద్విరహోఽ తి దుస్సహః ॥

స్వామీ, నీ దివ్య మంగళ విగ్రహ సౌందర్యమును సేవింపవలయునను మనోరథముతో భోగ మోక్షమును తృణీకరించియుండువారే మహాత్ములైన భాగవతులు అట్టి మహాత్ములతో క్షణకాల విరహము సర్వేశ్వరా నీకు దుస్సహమైనది. అట్టివారి అనుగ్రహమునకు పాత్రుడునగునట్లు నన్ను కటాక్షింపుము. "తమరోడు

అజ్ఞురైవార్కు" అనుపాశురఖండము ఈ అర్థమునే బోధించుచున్నది.

"ఉరుగుమాల్ నెంజం" అనుపూర్వ దశకమున నమ్మాళ్వార్లు అప్రీతితో భగవద్గుణానుభవము చేసినారు. ఈ దశకమున భగవత్సాక్షాత్కారము కానందు వలన అప్రీతి అతిశయింపగ విరహిణీ భావనతో దూతప్రేషణము గావించుచున్నారు.

1. అందమైన కాళ్లుగలిగి మాతోటలో విహరించు ఓ సారసపక్షీ నీవు తులసీమాలాలంకృతుడై తిరుమూళిక్కళములో వేంచేసియున్నస్వామి యొద్దకువెళ్లి నా పరిస్థితిని వారికి తెలిపి తిరిగివచ్చినచో నీపాదములను శిరసా వహింతును.

2. ఆనందముతో జంటలు జంటలుగ తిరుగుచున్న ఓ నీటి కోళ్ళూ, మీరు తిరుమూళిక్కళత్తాన్ సన్నిధికివెళ్ళి "స్వామీ, పరాఙ్కుశనాయకి తనవారిని కాదని నిన్నుగాఢముగా ప్రేమించినది కాని నీవు ఆమెను అనుగ్రహింపకున్నావు. ఇపుడు ఆమెను బన్ధువులు పరిత్యజించినారు. నీవును త్యజింతువా? ఆమె ఇచటికివచ్చి ఈ భాగవతగోష్ఠిలో చేరి నిన్ను సేవించుటకు తగదా," అని నామాటలుగ అడుగుడు.

3. నీటి సమీపమున ఆహారమునకై జంటలుగ సంచరించు చున్న (కొక్కు-కురుగు) పక్షులారా తామరపుష్పముల వంటి తిరునేత్రములు శ్రీహస్తములు శ్రీపాదములు గల్గితామరాకుచ్ఛాయతో నలరారు తిరుమూళిక్కళత్తానును సేవించుటకు మేము తగమా అని ప్రశ్నింపుడు.

4. ఓ అందమైన మేఘములారా, తన దివ్యమంగళ విగ్రహ సౌందర్యముతో చూపరులను పరవశింపజేయు తిరుమూళిక్కళం స్వామియొద్దకువెళ్లి తన దివ్య మంగళ విగ్రహ సౌందర్యమును నేను సేవించునట్లు అనుగ్రహింపుమని ప్రార్థింపుడు. అతడు మిమ్ములను తరిమివేయునేమోయని భయపడుచున్నారా.

5. మిఱుమిట్లు గొలుపు మెఱుపులతో ఆకసమున పరుగిడుచున్న మేఘములారా, తులసీ మాలాలంకృతుడై దేదీప్యమానముగనున్న తిరుమూళిక్కళం స్వామి సన్నిధిలో ఈ అదృష్టహీనురాలి సందేశమును వినిపింపుడు.

6. పుష్పములయందలి మకరందము నాస్వాదించి మధురముగ ఝుంకారము గావించుచున్న తుమ్మెదలారా, వక్షస్థలమున లక్ష్మీదేవిని తాల్చి తిరుమాళిక్కళమను దివ్యదేశమున వేంచేసియున్న నా స్వామికి నా సందేశమును వినిపించి నా విరహ దుఃఖమును తెల్పుడు.

7. ఓ జలచర పక్షులారా, నా కంకణములను వస్త్రములను (అభిమానమును) హరించి తిరుమూళిక్కళమను క్షేత్రమున విహరించుచున్న నా స్వామికి తియ్యని మాటలతో నా సందేశమును వినిపింపుడు. అతని నేత్రములు పద్మములవలె నుండును. అతని అధరము పగడమును పోలియుండును.

8. హాయిగ గుంపులు గుంపులుగ తోటలలో సంచరించుచున్న తుమ్మెదలారా, నాస్వామి, దృఢతరములైన ప్రాకారములచే పరివేష్టితమైన తిరుమూళిక్కళమను

క్షేత్రము నందు వేంచేసియున్నాడు. అతని శరీరచ్ఛాయ నల్ల అవిసె పువ్వును తలపించును. అతని కిరీటము తులసి మాలాలంకృతమైయుండును. అతని చెంతకేగి నన్ను గురించి ఒక్కమాట చెప్పుడు.

9. కిరీటమున తులసి మాలికను శ్రీహస్తమున సుదర్శనమును ధరించి తిరుమూళిక్కళమున వేంచేసియున్న నాస్వామితో "స్వామీ, పరాంకుశ నాయిక నీ విశ్లేష దుఃఖమును సహింపలేక మేనిఛాయ గోల్పోయి కంటతడిపెట్టుచున్నది. నీవిట్లు ఆమెను వీడివచ్చుట న్యాయమేనా". అని అడుగుడు.

10. ఆనందముతో జంటలుగ సంచరించు హంసలారా, నా శరీరము భగవద్విరహముచే కృశించి విచ్ఛాయయైనది. ఆభరణములు జారిపోవుచున్నవి. నాప్రాణములును పోవుచున్నవి. కావున తిరుమూళిక్కళమున వేంచేసియున్న నాస్వామి యొద్దకు వెళ్లి మీరు "పరాంకుశ నాయికను ఇట్లు బాధించుట నీకు తగ"దని చెప్పిరండు.

11. భగవద్విశ్లేష దశలో నాయికా భావనతో శ్రీనమ్మాళ్వారులు తిరుమూళిక్కళమను క్షేత్రమున వేంచేసియుండు స్వామి సన్నిధికి పక్షులద్వారా తమ దీనస్థితిని తెలియజేసిన ఈ దశకమును శ్రద్ధగ అధ్యయనము గావించువారు ఇట్టి దీనస్థితిని పొందరు- ఇది ఈ దశకములోని సారాంశము.

ఇందునమ్మాళ్వార్ పక్షులను దూతలుగ పంపినారుగదా. పక్షులనగ ఆచార్యుడని యర్థము. పక్షి రెండు రెక్కలు గలిగి ఆకాశమున విహరించుచుండును. ఆచార్యునకు కర్మజ్ఞానములు రెండును రెక్కలు. ఆ రెక్కలతోనతడు ఆకాశ శబ్దవాచ్యుడైన పరమాత్మయందు విహరించుచుండును. తమ దుర్దశను భగవంతునకు నివేదింపుమని ఆచార్యులను ప్రార్థించు చున్నారని భావము. ఈ విషయమును "శేర్వారై ప్పక్షికళాక్కి జ్ఞానకర్మజ్గళై చ్చిఱకెన్ఱు గురుసబ్రహ్మచారి పుత్రశిష్య స్థానే పేశుం" (3-1) అను ఆచార్య హృదయసూత్రమున నాయనారులు దాని వ్యాఖ్యానమున శ్రీ మణవాళ మహామునులును వివరముగ తెలిపియున్నారు. ఈ పక్షులకు కొన్నిసార్వపదేశార్థములు గలవు.

1. నారై - కొక్కు - ఇవి కొంగజాతికి చెందినవి. ఇవి తెల్లగనుండును. తమ పిల్లల నోటికి సరిపడు చేప పిల్లలను వెదకి సంపాదించును. ఇవి గుంపులు గుంపులుగ సంచరించుచు, తమ యాహారము లభించునంత వరకును నొంటికాలిమీద నిలబడి తదేక నిష్ఠతో నుండును. కావున ఈ పదములచే మన పూర్వాచార్యులు సూచింపబడుచున్నారు. మన పూర్వాచార్యులు బాహ్యాభ్యంతర శుద్ధిగలిగి తమ శిష్యులకు బోధింప వలసిన విషయములను వారిగ్రహణ శక్తినిబట్టి సరసముగ బోధించుచు భగవదేక నిష్ఠ గలిగి సదా సత్సంగము గావించు చుందురు గదా.

2. మేఘము - మేఘము సముద్రము నుండి ఉప్పు నీటిని గ్రహించి నల్లని కాంతితో వివిధ దిక్కులకు వెడలి అచటివారి తాపముతీరునట్లు చల్లని తియ్యటి నీటిని వర్షించి వారికి జీవనమును ప్రసాదించును. ఇట్టి మేఘముతో సమానులు

పోయ్‌గైయాళ్వార్, పూదత్తాళ్వార్, పేయ్ ఆళ్వార్, తిరుమழிశై ఆళ్వార్, ఎంబెరుమానార్ మొదలైన వారని ఆచార్యహృదయము తెలుపుచున్నది. మేఘమువలె వీరును కఠినతరములైన శాస్త్రార్థములను చక్కగ నాకళించుకొని వివిధ ప్రాంతములకేగి అచటి వారికి ఆ అర్థములను మధురాతి మధురముగ భోదించి వారినుజ్జీవింపజేసి పరమానంద భరితులగుదురు. గదండీ,

3 వండు - తుమ్మెద, తుంబి = చిన్న తుమ్మెద,

ఇవి అటనట సంచరించుచు పుష్పములందలి మకరందమునాస్వాదించి పరవశముతో సదా ఝుంకారము గావించుచుండును. నారద మహాముని తిరుప్పాణి యాళ్వార్ తంబిరాన్‌మార్ మొదలగువారు ఈ శబ్దములచే సూచింపబడుచున్నారు. వీరు భగవద్గుణామృతమును ఆస్వాదించుచు ఆ భగవంతుని నామములను అతని చరిత్రమును కీర్తించుచు పరవశించు చుందురు. వీరిలో తంబిరాన్‌మార్ అనువారు తిరువాయ్‌మొழி గానముచే లబ్ధ ప్రతిష్ఠులు.

4. అన్నమ్ = హంస. హంసలు పాలను నీటిని వేరుచేసి పాలను మాత్రమే స్వీకరించును. భగవంతుడు హంసరూపియై శాస్త్ర ప్రదానముగావించినాడు. వీటికి బురదనీరు సరిపడదు. ఇట్టివారు పరమహంసలైన నాథమునులు యామన మునులు మొదలగువారు వీరు శాస్త్రములయందలి సారాసారములను వివేచించి సారతమమైన దానిని మాత్రమే గ్రహించి ఇతరులకు భగవద్విషయమును ఉపదేశించుచు కలుషితమైన ఈ సంసారమునందు ఆసక్తిలేకయుందురు. కావున ఇట్టి వారు హంసగ పేర్కొనబడినారు. ఈ విధముగా ఈదశకమునందలి, పక్షి, మేఘము మొదలగు వానికి స్వాపదేశార్థములు గ్రహించునది.

ఈ దశక సారాంశమును మణవాళ మహామునులు ఈ క్రింది పాశురమున సంగ్రహముగ ఇట్లు తెల్పినారు.

ఎంగాదలుక్కడి మాలేయ్‌న్ద వడివழగెన్ఱు,
అంగాదు పత్తాశా, ఆంగవన్బాల్; ఎంగు ముళ్ల
పుళ్లినత్తై తూదాగ ప్పోగవిడుం మాఱన్ తాళ్
ఉళ్లినర్కు, త్తీంగై యఱుక్కుమ్ (తి.నూ - 87)

సర్వేశ్వరుని దివ్యమంగళవిగ్రహ సౌందర్యము ఆళ్వార్లను ముగ్ధుల గావించినది. ఆ సౌందర్యమును సేవింపగోరి వీరు "ఎఙ్గానల్" అనుదశకమున పక్షులను భగవత్సన్నిధికి దూతలుగ పంపుచున్నారు.

ఇట్టి నమ్మాళ్వార్ల శ్రీపాదములే ఈ దశకమును అనుసంధించువారి పాపములను హరించును.

శ్రీమతే రామానుజాయ నమః

# తిరునావాయ్

ఉ.వే.శ్రీమాన్. కె.భక్తవత్సలన్ స్వామి,

ఒంగోలు.

శ్రీవైష్ణవ సంప్రదాయమునకు పట్టుగొమ్మలైన వారు ఆళ్వార్లు, ఈ ఆళ్వార్లు
"భూతం సరశ్చ మహదాహ్వాయ బట్టనాథ
శ్రీ భక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతో2స్మి నిత్యమ్" అని పదుగురు, వీరినే శ్రీకోయిల్ పెరియ జీయర్ మణవాళమహాముని -
"పొయ్‌గైయార్ పూదత్తార్ పేయార్, పుగళ్‌మళిశై
అయ్యా నరుళ్ మాఱన్ శేరలర్ కోన్, తుయ్యపట్ట
నాదన్ అన్బర్‌దాళ్ తూళి నఱ్పాణన్ నన్‌కలియన్" - అని తమ దివ్య ప్రబంధమైన "ఉపదేశరత్తినమాల" యందు అనుగ్రహించి యున్నారు. ఈ ఆళ్వార్లలో నమ్మాళ్వార్ అనబడు వకుళ భూషణ భాస్కరులు మూర్ధన్య స్థానీయులు. ఆళ్వార్ తిరునగరి అను దివ్య దేశమునందు కలియుగ ఆరంభమున ప్రమాది నామ సంవత్సర వృషభమాసము నందు విశాఖా నక్షత్రమున శ్రీమాన్ కారి ఉడయనంగయార్ అను దివ్య దంపతులకు విష్వక్సేనాంశతో అవతరించిరి. వీరి యొక్క వైభవమును శ్రీమధురకవి ఆళ్వార్ "కణ్ణినుణ్ శిరుత్తాంబు" అను దివ్య ప్రబంధము ద్వారా అనుగ్రహించి యున్నారు. ఈ నమ్మాళ్వార్లు 16 తిరు నక్షత్రముల వరకు అన్న పానీయాదులు లేకుండ "ఆళ్వార్ తిరునగరి" "పొలిన్ద నిన్నపిరాన్" సన్నిధి యందుగల "తిరుప్పుళి ఆళ్వార్" అని కీర్తింపబడు చింతచెట్టు క్రిందనే వేంచేసి యుండిరి.

శ్రీవైష్ణవ సంప్రదాయమునందు ప్రసిద్ధ పుణ్యక్షేత్రములు 108. ఈ 108 పుణ్యక్షేత్రములలో యందు వేంచేసి యుండు పెరుమాళ్ళను పదుగురుం ఆళ్వార్లు మంగళాశాసనమును చేసిరి. ఆళ్వార్లచే మంగళాశాసనము చేయబడిన శ్రీవైష్ణవ పుణ్యక్షేత్రములకు "దివ్యదేశము" లనిపేరు. పై 108 దివ్యదేశములలో నమ్మాళ్వార్లు 38 దివ్య దేశములను తాము వేంచేసి యున్న ఆ దివ్యదేశము నుండియే మంగళాశాసనము చేసిరి. వీరు తమ తిరువాయ్‌మొళ్రి అను దివ్యప్రబంధమునందు 9వ శతకము 7వ దశకమున భగవంతుని కల్యాణ గుణములను స్మరించు కొలదియు వీరికి సర్వేశ్వరుని నేరుగ సేవింపవలెనను ఆశ మిక్కుటమైనది. సర్వేశ్వరుడు ఆళ్వార్లను మరచెనా అనునట్లు పర్వత ప్రాంత దివ్యదేశములలో ఒకటైన "తిరుమూళ్రిక్కళమ్" అను దివ్యదేశము

నందు నిత్య సూరి పరిషన్నిర్వాహకుడుగ విహరించుచున్న అతని వద్దకు కొన్ని పక్షులను దూతగా పంపిరి: పక్షులనగా ఆచార్యులు. ఆ పక్షులు తిరుమూర్‌్రిక్కం లోని సర్వేశ్వరుని వద్దకు వెళ్ళి "దేవరవారి సౌందర్యమున ఆసక్తురాలైన పరాంకుశ నాయకి నిన్ను వదలి జీవించగలదా? అని చెప్పిరి.

ఈ విధముగ నాయికా భావమున నమ్మాళ్వార్ తిరుమూర్‌్రిక్కళము నందు వేంచేసి యుండు శ్రీసూక్తినాథన్ సన్నిధి నుండి దూతలు మరలి వచ్చు వరకు వేచియుండజాలక సమీపముననుండు "తిరునావాయ్" అను క్షేత్రమున వేంచేసి యుండు "నారాయణన్" పెరుమాళ్ళను సమీపింప దలంచిరి. కాని ఆదివ్య దేశమునకు కూడ పోగలిగిన స్థితిలో తాము లేనందున తాము వేంచేసి యుండు స్థలము నుండియే తమ మనోరథమును తెలుపుచున్నారు.

శ్రీవైష్ణవ సంప్రదాయమందు ప్రసిద్ధికెక్కిన 108 దివ్య దేశములలో మళయాళ తిరుపతులు 13. ఇందులో "తిరునావాయ్" దివ్య దేశమొకటి. ఇచ్చట వేంచేసియున్న పెరుమాళ్ళకు "నావాయ్ ముకున్దన్" అని తిరునామము. "మలర్‌మజ్ఞై" తాయార్లు. శజ్గమల పుష్కరిణి, వేద విమానమ్. దక్షిణముఖము. కూర్చున్న సేవ. శ్రీపెరియ పిరాట్టియార్లకు, శ్రీగజేంద్రాళ్వానుకు ప్రత్యక్షము. నమ్మాళ్వార్, తిరుమజ్ఞై ఆళ్వార్ మజ్గళాశాసనము చేసిరి. మలైనాడు దివ్య దేశములలో తాయార్లకు ప్రత్యేకముగ సన్నిధిని యీ దివ్యదేశము నందు మాత్రమే సేవింపగలము. నమ్మాళ్వార్లకు యీపెరుమాళ్ళు తన ఆనృశంస్యము అనుగుణమును ప్రకాశింపచేసిరి. సర్వేశ్వరుని వియోగముచే కలిగిన దుఃఖ సముద్రమును దాటించు నావ వంటివాడు యీ "తిరునావాయ్" దివ్యదేశ స్వామి. "ఆవాలడి యా నివనెన్నరుళాయే" - వీడు నాదాసుడని నన్ను దయ చూడుము. అనుటచే ఆనృశంస్య గుణమును ప్రకాశింప చేసిరి. ఇచట "నావాయుఱైక్కిన్ద" నావగా వసించు నట్టి వాడు అని పేర్కొనుటచే యీ దివ్య దేశమునకు "తిరునావాయ్" అను తిరునామము కలిగినది.

ఆనృశంస్యము అనగా స్వామి ఎంబెరుమానార్ల వారు మళయాళ దివ్య దేశములకు మజ్గళాశాసనమునకు వేంచేయుచు, అచటి తిరునావాయ్ దివ్య దేశము సమీపములో నున్న భాగవతోత్తములను "తిరునావాయ్" అను దివ్య దేశము "ఇంకెంత దూరమున్న"దని యడుగగ వారు తిరువాయ్ మొழ్రిలో నమ్మాళ్వార్ "కుఱుక్కుమ్" అని పాయించిరి గదా, తెలియదా అన్నారట. "కుఱుగుమ్" అను ద్రావిడ పదమునకు "కుఱుక్కుమ్" అని మళయాళ రూపము. కుఱుక్కుమ్ అనగా సన్నిహితము అని అర్థము. స్వామి నమ్మాళ్వార్ ఆ మళయాళ దివ్య దేశ మజ్గళాశాసన దశకములో అదే మళయాళ పదమును వాడిన ఆనురూప్యమున శ్రీస్వామి ఎంబెరుమానార్ల వారు ఎంతయో ఆనందించిరట. పరమభోగ్యుడగు సర్వేశ్వరుని మనస్సు నందు లగ్నము చేయుటలో ఏకాగ్రత కలిగి అభిలషించు భక్తులకు అనుభవ విరోధములను పోగొట్ట గలిగి నదియు, సుగంధ పూరితములైన చల్లని పుష్పముతో కూడిన వనములచే

పరివేష్టింపబడినదియు లగు తిరునావాయ్ అను దివ్యదేశమును సేవింప పాపినైన నాకు సమీప మార్గమున్నదా? అని ఆళ్వార్లు తన నైచ్యమును ఇందు విన్నవించుకొనిరి. పద్మాలయ యగు శ్రీమహాలక్ష్మికి నాథుడును, పదునైన వేలాయుధమును పోలిన విశాల నేత్రములు కలిగినదియునగు నీళాదేవికి కాంతుడునగు సర్వేశ్వరుడు నిత్యవాసము చేయు దివ్య దేశమును తోటలచే అలరారుచున్న తిరునావాయ్ అను దివ్య దేశమును దాసుడు సేవించుట యిన్నడో? పురుషోత్తముని వశపఱచు కొన్న సౌందర్య వతులగు శ్రీదేవి, నీళాదేవులు వేంచేసి యుండి, పురుషకారము చేసి దాసుని ఆ స్వామితో చేర్పగల తల్లులుండియు దాసుడు వినష్టుడనగుట తగునా?

పెద్ద పూదోటలచే పరివేష్టితమైన తిరునావాయ్ క్షేత్రమున వేంచేసి యున్న విశాల నేత్రములు కల నీళాదేవికి నాథుడా! దాసుడును సర్వకాల సర్వావస్థలయందు దేవర వారికి నిత్యకైంకర్యోత్సుకుడనైతిని. ఆ సత్ కైంకర్య భాగ్యము దాసునకెన్నడో?

ఈ దశకమున పిరాట్టి ప్రస్తావము తరచు వచ్చుటను గుఱించి శిష్యులు నంబిళ్ళగారిని కారణము అడుగగ, వారు ప్రాప్యదేశమునకు వచ్చిన వెంటనే తల్లిని పలుమార్లు స్మరించు చున్నారనియు, దేశాన్తరము నుండి తిరిగి వచ్చిన శిశువు తల్లినే గదా తరచు స్మరించును! అనియు సాయించినారుట. ప్రభువు అన్న గర్వముతో నున్న మహాబలి వద్ద నుండి వామనావతారముతో మూడడుగులు యాచించి త్రివిక్రముడై త్రిలోకములను కొలచిన దేవా! దేవా సుర యుద్ధమున ధర్మ నిర్ణాయకుడా! శ్రీమన్నారాయణా! తిరునావాయ్ దివ్యదేశమున వేంచేసి యున్న జ్ఞానశక్తి పూర్ణుడా! ఈ దాసుని అనుగ్రహింపుమా!

జ్ఞానము అనగ సదా నా హృదయమున వీరు (సర్వేశ్వరుడు) వేంచేసి యుండుటయే. దాసుని ఒక వస్తువునుగ చేసి నీ దివ్య పాదార విందముల చెంత ఆశ్రయ మిచ్చినను యిమ్ము. అజ్ఞాన వాసన లేకుండునట్లు నిన్ను నా హృదయమున నిల్పుకొను జ్ఞానమునిమ్ము. దేవతలకును, మహర్షులకును స్వప్రయత్నముచే సేవించుటకు సాధ్యపడిన వాడును, బ్రహ్మరుద్రేంద్రాదులకు నాయకుడును, ముల్లోకములకు పరిపాలకుడునైన సర్వేశ్వరుడు తిరునావాయ్ స్వామి.

ఈ దివ్య దేశమును సేవించినచో ఐహిక, ఆముష్మిక శ్రేయములు కలుగును. ఐహికమనగ, యీ లోకమున చిరకాలము సుఖముగ నుందురట. ఆముష్మికమనగ సర్వగంధత్వములో భగవత్సామ్యా పత్తి నొందుట. ఈ దివ్య దేశ వైభవమును శ్రీ.ఉ.వే.శ్రీమాన్ మహావిద్వాన్ నూజివీడు సంస్థాన ఆస్థాన పండితులు కిడాంబి.గోపాలకృష్ణమాచార్య స్వామి వారు దివ్య దేశ వైభవ ప్రకాశిక యందు యీ విధముగ అనుగ్రహించి యున్నారు.

శ్లో॥ "శ్రీమచ్చంగమల్లాభి ధాన సరసా యుక్తే పురే సున్దరే
నావాయ్ నామని వేద మన్దిర వరే యామ్యాసనా లఙ్కృతః ।
లక్ష్మీ నాగ వరేక్షిత స్సముపయన్ దేవీం మలర్మఙ్గ ఇ
త్యాస్తే సుత్యవపు శ్శతారి కలిజిత్ యుగ్మేణ నారాయణః॥"

అస్మద్గురుభ్యోనమః శ్రీమతే రామానుజాయ నమః

# తిరుక్కణ్ణపురమ్

- ఉ.వే.శ్రీమాన్.తి.న.చ.నరసింహాచార్య స్వామి వారు, నెల్లూరు

శ్లో॥ పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్త సార్వజ్ఞసమ్పదమ్ ।
ప్రపన్నజన కూటస్థం ప్రపద్యే శ్రీపరాఙ్కుశమ్ ॥

ఈ తొమ్మిదవ శతకములో శ్రీనమ్మాళ్వార్లు అనుభవించి పాయించినది ఆపత్సఖత్వము వలె ఈ శతకములోని 10వ దశకములో అనుభవించి పాయించినది. శరణ్యముకున్దత్వము. ఆచార్య హృదయం ప్రకరణం 4 సూత్రం 9 లో ఆపత్సఖత్వమున్ను అందులోనే ప్రకరణం3 సూత్రం 32లో శరణ్యముకున్దత్వమున్ను వివరించియున్నారు ఈ శరణ్యముకున్దత్వ మనే గుణమును ఎచ్చట అనుభవించి పాయించినారనగా తిరుక్కణ్ణపురములో ఉత్పలావతక విమానములో వేంచేసి యుండే సర్వాఙ్గసున్దరుడైన శౌరి రాజప్పెరుమాళ్ల విషయములో. ఈ దశకము పరోపదేశపరము.

ఆళ్వార్లుకు ఈ యనుభవమున్ను పరోపదేశమున్ను ఎట్లు ఏర్పడినది యనిన పూర్వ తిరువాయ్మొழிలతో సంగతిని యనుభవించిన విశదము కాగలదు. ఎఙ్గానలకంకழிవాయ్ అను తిరువాయ్మొழிలో తిరుమూழிక్కళం లోవేంచేసియుండే అర్చామూర్తి సౌందర్యమును అవలంబించి వారికి దూత ప్రేషణము చేసిరి. దూతలు వెళ్లి స్వామివారికి విన్నవించి ఆళ్వార్ నాయికకు వారి సందేశమును తెలుపునంత వరకు గాని లేక స్వామివారు వేంచేసి అనుగ్రహించు నంతవరకు గాని ఏర్పడే ఆలస్యము సహించలేక దూతప్రేషణ వల్లను స్వామి వారి గుణాను సన్ధానము వల్ల ఏర్పడే మనః ప్రసన్నత వల్లను స్వామి వారు తిరునావాయ్ దివ్య దేశముకు తమను పిలుచుకొని వెళ్లుట నిశ్చయమని తలచి అచ్చటికి తాము వెళ్ళలేక అచ్చటి అనుభవాదులు ఎప్పుడు కలుగునాయని పలురీతిలో అనుభవించిరి అఱుక్కుంవినై యాయిన దశకములో. అనుభవించిన వెంటనే అనుభవాదులు లభించనందున, సన్ధ్యాసమయము వచ్చినది. పశువులు వచ్చినవి, పశువులకు ముందు కృష్ణ దర్శనము లేనందున పశువుల వెనుక వచ్చుచున్న కృష్ణుని నిరీక్షించుతడివి లేక సన్ధ్యాసమయములో గోపికలు పడిన బాధను తాము ఒక్కరే పడినట్లు బాధను తెలుపునది మల్లికైకమళ్‌లో - ఈ విధమైన మనోరథమునున్ను మనోరథానుసారము అనుభవము లభించనందున ఏర్పడిన క్లేశమునున్ను కటాక్షించి సర్వేశ్వరుడు ఆళ్వార్లతో నన్ను పొందుటకు మనోరథించుట మీరా? మనోరథాను సారము లభించనందున క్లేశపడుటయూ మీరా? మేము కదా మిమ్ము పొందుటకు మనోరథించుటయూ మనోరథానుసారము లభించని యడల నష్టపడే వారము. మీకే కొరతయూ లేదు. ఏవిధమైన వృద్ధి, అపక్షయాదవికారాదులు లేని విస్తారమైన

గొప్ప శ్రీవైకుణ్ఠము మాకు వాసస్థానమై యుండగా దానిని విడిచి తిరుక్కణ్ణపురములో వేంచేసి యుండుటయూ మీ కొరకే కదా యనియూ మీ ఈ శరీరావసానములో మీ యపేక్షితానుసారము అనుభవమును పూర్తిచేయకల వారమనియూ సమాధాన పరచగా ఆళ్వార్లున్ను సమాధానమొంది సన్తోషపడి పరోపదేశము చేయతొడగిరి. ఆళ్వార్ల స్వభావము భగవదనుభవము బాహ్యాకరణములకు లభించనప్పుడు మోహించి యుందురు. స్వస్థత ఏర్పడి నప్పుడు తమ వలె యందరూ భగవల్లాభమొంది ఉజ్జీవించవలెనని యానృశంస్యముతో పరోపదేశము చేయుదురు.

ఈ దశకములో ఆళ్వార్ల ఉపదేశములు 1 భగవస్తుడు సర్వసమాశ్రయ ణీయుడు 2 వానియందు భక్తి చేయండి 3 అందుకు పరికరము లేని వారు అనగా ఈ భక్తి యందు సుకరత్వ స్వరూపాను రూపత్వ పరికరము లేనివారు ప్రపత్తి చేయండి 4 అందుకు తగిన మహా విశ్వాసము లేనివారు దివ్య దేశనామోచ్చారణ మైనా చేయండి అంత మాత్రము చేతనే భగవన్తుడు చేయి విడవకుండా రక్షించును అని-

భగవన్తుడు ఆళ్వార్లను ఈ శరీరావసానములో మీయపేక్షను పూర్తి చేయుదుమని సమాధాన పరుచుటయు వీరు సమాధాన పడుటయు తగు నాయని పూర్వపక్షము. ఏలననగా ప్రారబ్ధకర్మావ సానమున కదా మోక్షము ఈ శరీరా వసానమున తగదని బ్రహ్మ సూత్రము అధ్యాయము 4 పాదము 1లో "భోగేనత్వితరేక్షపయిత్వాZథ సమ్పద్యతే" అనే సూత్రభాష్యములో ప్రారబ్ధ కర్మావసానమున మోక్షమని స్వామి భాష్యకారుల వారు సిద్ధాన్తము చేసిరి గనుక అని పూర్వపక్షుల అభిప్రాయము. ఈ విషయము ఉపాసకులకు సంబంధించినది ప్రపన్నులకు సంబంధించినది కాదు. ఆళ్వార్లు ప్రపన్నులు గనుక వీరికి ఈ శరీరమే విమల చరమ దేహము, గనుక ఈ శరీరావసానమున మోక్షమిచ్చునట్లు భగవన్తుడు సమాధాన పరుచుటయు ఆళ్వార్ల సమాధానపడుటయు తగునని సిద్ధాన్తము. దీనినే వేదాన్త దేశికుల వారున్ను "ఆర్తే ష్వాశు ఫలా తదన్య విషయే దేహాన్తరోచ్ఛేదినీ" యని సాయించిరి. ఈ శరణాగతి అనగా ఆర్త ప్రపన్నులకు అప్పటి కప్పుడే మోక్షము, దృప్త ప్రపన్నులకు మరియొక శరీరమును పోగొట్టునది. భట్టర్ వారున్ను అహృత సహజ దాస్యాస్సూరయః అని నిత్య సూరులను ప్రస్తబన్ధాః అని ముక్తులను విమలచరమ దేహాః అని ప్రపన్నులను చెప్పి వీరందరూ పూజ్యమైన తిర్యక్, స్థావర, మనుష్య శరీరములను ధరించి శ్రీరంగమును పొందుచున్నారనియూ అను గ్రహించియున్నారు.

ప్రపన్నునికి ఏల శరీరావసానమున మోక్షమని ప్రశ్న కలుగును. అందులకు వీడు ఆశ్రయించినప్పుడేనా సకల భరములు నీదేయని సర్వేశ్వరుని యందు భరసమర్పణము చేసిన వాడు గనుక వీని కృత్యములలో పక్వము కావలసిన ఆలస్యమున్ను లేదు. ప్రపత్తికి విషయమైన సర్వేశ్వరుడు సర్వశక్తుడు గనుక ఈ ప్రపన్నునికి శరీరావసానములో మోక్షము కలుగుటకు అభ్యన్తరము లేదని సమాధానము చెప్పిరి. ఇందుకు ప్రమాణముగ శ్రీరంగమహాత్మ్యములో "భగవన్తం

ప్రపన్నా సా భగవన్త మవాప సా" మాధవీయను తపస్విని ప్రపత్తి చేసి భగవన్తుని పొందెను. ఈ ప్రపన్నునికే కాక అవతార రహస్య జ్ఞాన వన్తునికి కూడా ఇదే క్రమము చెప్పబడినది. "జన్మ కర్మచమే దివ్యం ఏవంయోవేత్తి తత్త్వతః, త్యక్త్వాదేహంపునర్జన్మ నైతిమామేతి సోర్జున" ఓ అర్జున నా యొక్క జన్మములు, వ్యాపారములు, కర్మానుగుణముగ ఏర్పడినవి కావు. దివ్యం - విలక్షణమైనవి అప్రాకృతము లైనవియని ఎవరు తెలుసుకొనుదురో వారు ఈ శరీరమును విడిచి తిరుగా జన్మ మెత్తరు నన్ను పొందుదురు అని. అయితే ఈ ప్రపన్నునికి పరిపక్వము కావలసిన అంశమున్ను లేదు, సర్వేశ్వరునికి జ్ఞాన శక్తులలో లోపమున్ను లేనందున శరణాగతుడైన వెంటనే భగవల్లాభము కావద్దా? యన్న, వీనికి అయిష్టమైన శరీరముతో ఉండుటకు కారణము భగవన్తుడు ఉంచగా ఉన్నాడా? వీని కర్మ శేషముతో ఉన్నాడా? యని భగవన్తుడు ఉంచగా ఉన్నాడనిన వానికి దయాహీనత ఏర్పడును.

భగవన్తుడు మన విరోధియైన కర్మను ఛేధించి ఈ ప్రకృతికి ఆవల తీసుకొని వెళ్ళుడనిన శ్రీసూక్తికిన్నీ విరోధమగును గనుక సుఖదుఃఖాద్యనుభవములు చేయు కర్మము చేతనే కావలెను. కర్మము చేతనైన యడల ప్రారబ్ధ కర్మావసానమువరకు ఉండుటకు అభ్యన్తర మేమగా ఈ ప్రపన్నునికి గల విశేషము ఈ శరీరావసానమున మోక్షము కలుగటయే.

వీడు ప్రపత్తి చేసిన వెంటనే ముక్తుడు కాకుండుటకు కారణమే మనిన నాలుగు కారణములను చెప్పుచున్నారు. 1వెంటనే ముక్తుడైన ఎడల ఇది విషపు పుష్కరిణి యని ఎవరును ఆశ్రయించరు. 2 ఇటువంటి అధికారిని ఇచ్చట కొంత కాలముంచగా వీరి ఉపదేశ, అనుష్టానము వల్ల కొందరు దిద్దు బాటొంది ఉజ్జీవించుటకు అవకాశము కలుగును. 3 ఈ శరీరములో కదా ఈ యాత్మలభించినదనే భావముతో సర్వేశ్వరుడు ఈ శరీరమును ఉపేక్షించక ప్రీతితో ఉంచును. 4 వీడు శరణాగతి చేసిన సమయమున ఇప్పుడే విరోధియైన శరీరము పోయి మీ పాదములను పొంద వలయునను త్వరయూ వీనికి కలుగనందుననూ, ఈ శరీరమును విడువమనిననూ శీఘ్రముగ అంగీకరించడు. అయితే వీని యభిప్రాయము ఊర్ధ్వలోకములలో సుఖదుఃఖాను భవముచేయుట, గర్భవాసము చేయుట, మరియొక శరీరముతో ఈ లోకము లో ఉండుట వద్దనేంత మాత్రమే వీనికి ఏర్పడి నందున ఈ శరీరావసానమున మోక్షమునది.

ఇందుపై మరియొక ప్రశ్న ఏర్పడుచున్నది అది ఏమనిన ఈ చివరి శరీరముతో ఉండునంత కాలము ఆధి వ్యాధులు మున్నగునవి కలుగక మిక్కిలి సుఖానుభవముతో ఉంచకూడదాయనిన వీనికి ఈ ప్రకృతిహేయమని తెలిసియూ విడవజాలనివాడు సుఖానుభవముతో ఉంచిన యడల ఇచ్చటి వాసమున్ను సుఖము గనే యున్నదనే భావముతో దీనిని విడుచు అభిప్రాయము కలుగదు గనుక వీనికి కష్టానుభవము ఏర్పడిన గాని దీనిని విడుచుటలో త్వర ఏర్పడదు.

ఇచ్చటి సుఖానుభవము మరపించునాయని సన్దేహము వలదు. శ్రీరామాయణమున

ఒక కథ జ్ఞప్తికి వచ్చుచున్నది. అయోధ్యావాసి జనులకు శ్రీరామచన్ద్రుని వనవాసమందు విశ్లేష బాధ వాచామగోచరము, అయిననూ వారికి భరద్వాజాశ్రమములోని సుఖానుభవముచే వారు మనము అయోధ్యకున్ను వెళ్లవద్దు దండకారణ్యముకున్ను వెళ్లవద్దు ఇచ్చటనే యుందుమనుకొనిరి. మిగిలిన వారి విషయము చెప్పవలెనా? గనుక శరణాగతునికి ఈ శరీరావసాన మోక్షము తప్పదు. అన్తిమ స్మృతి యూ నవసరము లేదు. ఆ భగవన్తుడే స్మరించి ఉత్తమ గతికి తీసుకొని వెళ్లునట్లు శ్రీవరాహస్వామి భూదేవికి అనుగ్రహించిన శ్లోకద్వయము అను సన్దేయము. వాటి యర్థము - చంచలమైన మనస్సు నిశ్చలమై, శరీరము స్వస్థమై, వాతపిత్త శ్లేష్మములనేధాతువులు వాటివాటి పరిమాణములో నుండగా సత్వగుణము తల ఎత్తినప్పుడు, శరీరము జ్ఞానశూన్యము, దీనికంటే విలక్షణుడు ఆత్మ, ఈయాత్మ భగచ్ఛేషమైనది. భగవన్తుని పొందునదియే మోక్షము అనిన్నీ భగవన్తునికి సమస్తము శరీరము. వానికి మన వలె కర్మకృత జన్మము లేదనిన్నీ ఎవరైతే తలచెదరో వారు మరణదశలో కాష్ఠము పాషాణముతో సమానమై జ్ఞానశూన్యమైన దశలో నేను వారి భజనమును స్మరించి “దేని కంటే ఉత్తమమైన స్థానము లేదో అట్టి స్థానమును” పొందింతును. అనగా ఆత్మ ఈ శరీరమునుండి బయలు దేరి వైకుంఠము పొందు క్రమములు 1 అర్చిరాది మార్గములో వెళ్లుట 2 పెరియ తిరువడిని (గరుత్మన్తుని) పంపివారి ద్వారా తీసుకొని వెళ్లుట 3 తానే స్వయముగ వచ్చి వీనిని తీసుకొని వెళ్లుట ఈ క్రమములో మొదటి రెండు క్రమములు కాక మూడవ క్రమములో తిరుమంగైయాళ్వార్లనే పరకాల నాయికనుకళ్వన్గాల్ దశకములోని క్రమములో తానే స్వయముగ తీసుకొని వెళ్లెదని సాయించిరి -

ఈ యవతారిక వల్ల ఏర్పడిన విషయములు -

1ఈ నమ్మాళ్వార్లు పూర్వ దశకములో భగవదనుభవాలాభము వల్ల బాధ పడగా భగవన్తుడు తమ శరణ్యముకున్దత్వమును చూపగా సమాహితులై భగన్తుని భజనీయ మోక్షప్రదత్వాలను ఉపదేశించుట.

2 ఆమోక్ష ప్రదత్వము ఈ శరీరావసానమందా? ప్రారబ్ధావసాన మందాయనిన ప్రపన్నునికి శరీరావసానమందునూ ఉపాసకునికి ప్రారబ్ధావ సానమందని తీర్మానించిరి.

3 ప్రపన్నునికి ఆశ్రయణానన్తరం మోక్షము కలుగనందుకు కారణములు.

4 శరీరావసాన పర్యన్తము సుఖోత్తరముగ ఉంచని కారణము

5 అన్తిమ స్మృతి లేకనే వీనికి మోక్షము

6 మోక్షప్రాప్తి లో గల గమన విశేషములు

7 వరాహచరమ శ్లోక వ్యాఖ్య.

పా-1 ఈ తిరువాయ్మొళ్రిలో, ఈ తిరుక్కణ్ణపురం పెరుమాళ్లను భక్తి ప్రత్తుల ద్వారా ఆశ్రయించి కడతేరండియని సాయించబోవు విషయములకు సంగ్రహము ఈ మొదటి పాశురము

1. వటదళశాయిన్నీ సముద్ర అలలు తాకు ప్రాకారము కలిగిన తిరుక్కణ్ణ పురం స్వామి యొక్క

పాదపద్మములలో వ్యామోహ రూపభక్తి చేసి సర్వకాలముల యందు తామరసాది పుష్పములను సమర్పించి మీరు మీ సకల దురితములు పోవునట్లు నమస్కరించి కడతేరండి - ఇది భక్తి చేయమని ఉపదేశించుట.

2 వటదల శాయియిన్నీ ఆశ్రిత వ్యామోహము కలవాడున్ను సముద్ర అలలతో వ్యాపించిన ప్రాకారముతో చుట్టిబడిన సన్నిధి కలవాడున్ను అయిన తిరుక్కణ్ణపురం స్వామి వారి చరణార విన్దములలో శరణాగతి చేసి సర్వ కాలముల యందును తామరసాది పుష్పములను సమర్పించి మీరు మీ విశ్లేష వ్యథను తీరి కడతేరింది. ఇది శరణాగతి చేయమని ఉపదేశము. దీని వలన ప్రాకృతములైన వస్తువులైననూ చాలును, మీరున్ను కొత్త యోగ్యత సంపాదించనవసరము లేదు, మీ ఇచ్ఛయే అధికారము, కాల నియమమున్ను లేదు, ఆశ్రయించవలసిన వాడు మాత్రం అందరున్ను ఆశ్రయించుటకు సులభముగ ఉండే శౌరిరాజప్పెరుమాళ్లే అని సాయించిరి.

పా-2 భగవన్తుని యందు ఆశ కలిగిన వారు వానియందు అతిప్రేమాతిశయముతో వాని రక్షణకు ఏ విధమైన భయము లేని వారై జల సమృద్ధి కలిగిన చేలతోను సముద్రమనే అగడ్తతోను చుట్టబడి నట్టిన్నీ నక్షత్ర మండలము వరకు వ్యాపించిన ప్రాకారములు కలిగిన తిరుక్కణ్ణపురంలో వేంచేసి యుండే స్వామి వారి పాదపద్మములలో మధుస్యన్దియైన పుష్పములను సమర్పించి దండం సమర్పించి వారి గుణములను అనుభవించి అనుభవజనిత ప్రీతితో ఉండుడు. భగవన్తుడు వస్తు తారతమ్యమును చూడడు సమర్పించు వాని భక్తినే చూచును. ఇచ్చట ఒక ఐతిహ్యము శ్రీజగన్నాధస్వామి వారికి అతి ప్రీతికరమైన శణ్బక పుష్పమును సమర్పింప వలెనని ప్రీతితో రాజపుత్రులు అంగడికి వెళ్లగా అచ్చట ఒకటే పుష్పమున్నందున వీరు పోటీతో ధరపెంచి ఎక్కువ ధరతో ఒకరు ఆ పుష్పమును సమర్పించెను. ఆ రాత్రి స్వామి వాని స్వప్నములో నీవు నాకు నిండాభారముంచితివే యనిరి. దీని వలన వీని అత్యాసక్తి యేభారము కాని ఒక పుష్పము కాదు.

పా-3 తుమ్మెదలు మధుపాన మత్తమై పాడుచుండే తోపులతో చుట్టబడిన తిరుక్కణ్ణపురములోని శౌరిప్పెరుమాళ్ళు ఉభయ విభూతి నాధుడు గనుక మీ దుఃఖనివృత్తి కని ప్రత్యేక ప్రయత్నము చేయక భగవత్కైఙ్కర్యములో ఆశాలేశము కలవారై లక్ష్మణస్వామి వలె సర్వ విధకైంకర్యములు చేయు ప్రాప్తి కలిగిన భక్తులందరూ ఏక మనస్సు కలవారై ఇతర కోరికలను కోరక కైఙ్కర్యమే ప్రయోజన మనే భావముతో మధుస్యన్దియై భోగ్య, తామారసాది పుష్పములను సమర్పించి ఆశ్రయించమని సాయించిరి. ఇందులో అమరర్ పెరుమాన్ అన్నందున శ్రీవైకుణ్ఠ నాధుడనిన్నీ అణ్డవాణ్ అనినందున లీలా విభూతి నిర్వాహకుడనిన్నీ చెప్పినందున ఉభయ విభూతి నాధుడు సౌశీల్యాది గుణములతో తిరుక్కణ్ణ పురములో వేంచేసి యున్నారు ఈ శీలాది గుణములను అనుభవించుటకు నిత్యసూరులున్ను ఇచ్చటికి వచ్చి అనుభవింతురు గనుక మీరున్ను ఇచ్చటనే అనుభవింతుడు ఇదియే సౌశీల్యాది గుణాధిక్యము కల స్థలమని వ్యాఖ్యానించి

"ప్రతిమాస్వప్రబుద్ధానాం " అని ప్రమాణము సాయించగా బింబములు జ్ఞానశూన్యులకే కదాయని కొందరడుగగా "ఇందుకు శ్రీఆళవందార్లు, జ్ఞానశూన్యులకే యనికాదు జ్ఞానశూన్యులకే గోచరించిన వైభవము జ్ఞానాధికులకు చెప్పనవసరము లేదని సాయించిరని సాయించిరి;" అట్లు కానియడల అర్చావతారమైన బింబములను నరనారాయణాది భగవదవతారములున్ను నిత్యసూరులున్ను ధవళ ద్వీపవాసులున్ను బ్రహ్మరుద్రాది దేవతలున్ను సనకాదియోగులున్ను నారదాది ముని గణములున్ను ఆళ్వార్లున్ను పంచకాల పరాయణులైన పూర్వాచార్యులున్ను అర్చావతార గుణానుభవ కైజ్కర్య మంగళా శాసన పరులై ఉంటూ వారిని ఆశ్రయించిన అస్మదాదులకు ఉపదేశించుటయూ ఏర్పడదు. ఆరాధనాదులకు గాను ఏర్పడిన శ్రీపాంచరాత్యాది ఆగమములున్ను పాఇ్చరా త్యాగమప్రాశస్త్యమును పఇ్చమవేదమైన భారతములో ఉగ్గడించుటయూ ఉండవు.

పా-4 ఈ పాశురములో లేళ్లు సిగ్గుపడునట్టి నేత్ర సౌన్దర్యము, మ్రదిమ, పతి పారార్థ్యము, కరుణాది ఆత్మ గుణముల కూడిన నప్పిన్నైప్పిరాట్టికి భవ్యుడున్ను; తేనెవలె రసస్వరూపుడైనట్టియూ ఆకసముతో స్పర్ధ చేయునట్టి ప్రాకారములతో కూడినట్టియూ ఆశ్రిత సంశ్లేషముకు ఏకాన్తమైన స్థలమని తిరుక్కణ్ణ పురములో ఈ తిరువాయ్మొళ్రిలో చెప్పబోవు అధికారము కలిగిన వారికే యోగ్యమైన భక్తి యోగమును చేయమనీన్నీ సాయించిరి.

పా-5 జన్మ వృత్తములవల్ల ఎంత తక్కువైన వారైననూ తమ శ్రీపాదములనే ఉపాయముగ ఆశ్రయించిన వారందరికీ తానే ఉపాయభూతుడై రక్షకుడగును. ఈ శరీరావసానమున శ్రీవైకుణ్ఠమును ఇచ్చే ఉపకారకుడు. ధృఢమైన ప్రాకారములతో కూడిన తిరుక్కణ్ణపురములో వేంచేసి యుండే స్వామి వారు తనయందు ప్రీతి కలిగిన వారి యందు తాను మిక్కిలి ప్రీతి కలవారై యుందురు.

పా-6 స్పృహణీయమైన ప్రాకారములతో కూడిన తిరుక్కణ్ణపురములో ఆశ్రిత రక్షణకు తగిన స్థలమని ప్రీతితో వేంచేసియు శరణాగత వత్సలుడైన స్వామి అనన్య ప్రయోజనపరులైన ఆశ్రిత దోషములను చూడక వారియందు ఏక రూపవ్యామోహము తో నుండును.

పా-7 అనన్య ప్రయోజనపరులకు అనగా వేరే ప్రయోజనములను కోరక భగవంతునే కోరువారికి సులభుడై ఇతర ప్రయోజములను కోరువారికి ప్రయోజనాన్తరములను ఇచ్చి తాను తొలగి యుండును. అది ఎట్లనిన తమనే యాశ్రయించిన పాండవులకు సర్వ ప్రకారములుగ సహాయపడి సైన్యమునపేక్షించిన దుర్యోధనునికి సైన్యమునిచ్చి తాను తొలగియుండి వారిని నశింపచేయుట, అక్షోహిణీ సైన్యముతో తానే వచ్చెదననిన దశరథుని వద్దని రాముడే అకృతాస్త్రుడైనను బాలుడైనను చాలు ననిన విశ్వామిత్రునికి మేము కింకరులము మీ ఇష్టానుసారముగ ఆజ్ఞాపింపుడు తమ శాసమును చేయుదుమని వారికి భవ్యులై వారి కార్యములను నిర్వహించిరి.

పా-8 మణులతోను బంగారముతోను కూడిన ప్రాకారములు కలిగిన తిరుక్కణ్ణపురములో

వేంచేసియుండే పరమపదనిలయుని శ్రీపాదములను ఆశ్రయించిన వారందరికి మిక్కిలి సన్నిహితుడై మీ దుఃఖములను వాటికి మూలమైన జన్మములను పోగొట్టి కైఙ్కర్యములను స్వీకరించి ఏలును.

పా-9 వేదార్థవేత్తలైన వారు ఆదరించి వేంచేసియుండే తిరుక్కణ్ణపురములో నిత్యం సన్నిహితుడైనట్టి యా జగత్కారణభూతుడైన శౌరిరాజప్పెరుమాళ్ల శ్రీపాదములను ఆశ్రయించగ అనాది కాలము నుండి నాతో ఉండే సంచితము నశించినది. ఆశ్రయించిన తర్వాత ప్రామాదికముగ చేయబోవు ఉత్తరాఘములు అంటవు. ఇక నాకేమి కొరతయూ లేదు అని స్వానుభవమును చెప్పి మీరున్ను ఆ జగత్కారణభూతుని ఆశ్రయించండి. అటువంటి మీకు ఏ విధమైన దుఃఖములున్ను ఉండవు అనిన్నీ ఉపదేశించిరి. ఈ పాశురములో వేదనావర్ విరుంబుం అనినందున వేదార్థవేత్త లయిన తిరుమంగై ఆళ్వార్ వంటివారు ఆదరించు స్థానమనిరి. ఏలననగా జగత్కారణభూతుడే ధ్యేయుడనిన్నీ ఆ జగత్కారణ భూతుడు శౌరి రాజప్పెరుమాళ్ళే యనిన్నీ వారే పరమ భోగ్యులనిన్నీ ఆ భోగ్యతను అనేక ప్రకారములుగ విస్తారముగ అనుభవించి అతివ్యాముగ్ధులై ఇవి యంతయూ వేదసారమైన అష్టాక్షరీ మన్త్రమును నేర్చినందున ఏర్పడినదనియూ ఇంతేకాక దీనివలన నాకు దేవతాన్తర భక్తులతో పొత్తు లేదనియూ తిరుక్కణ్ణపురం స్వామి వారి దాస్యమును పొందిన వారి దాస్యమును పొందితిననియూ పాయించిరి. వీరివంటి వారు అనినందున పెరియాళ్వార్, కులశేఖరాళ్వార్ మొదలైన వారగురుదు. ఐదవ పాశురము మొదలు ఈ తొమ్మిదవ పాశురము వరకు శరణాగతి యుపదేశము.

పా-10 ఈ పాశురములో భక్తి ప్రపత్తులకు అశక్తులైన వారు తిరుక్కణ్ణ పురం అనే సూక్తి నైనా చెప్పండి. అంతటితో మీ సమస్త పాపములున్ను పోవును.

పా-11 ఆఖరు పాశురములో మీ ప్రతిబన్ధకములు తొలగవలెనని కోరిక కలవారు ఆప్తులైన నమ్మాళ్వార్లు పాయించిన భోగ్యమైన ఈ పదిపాశురములను ప్రీతి పూర్వకముగ గానము చేసి ప్రీతి ప్రేరితులై సమ్భ్రమ నృత్యము చేయుచూ ఆ శౌరి రాజప్పెరుమాళ్ళ శ్రీ పాదములనే ఆశ్రయించుడు.



శ్రీ రంగనాథ

శ్రీమతే రామానుజాయ నమః

# కాలమేఘ స్వామి మార్గబంధుశైత్యము

ఉ.వే.శ్రీమాన్. డా॥ఇ.ఎ. సింగరాచార్యస్వామి
తిరుపతి

తిరుమోగూర్‌క్షేత్ర వైభవము: "తాళతామరైత్తడమణి వయల్ తిరుమోగూర్" అని నమ్మాళ్వార్లు కీర్తించిన విధముగా ఈదివ్యదేశము "తాళతామరై" అనుపేరును కల్గిన తటాకముయొక్క తీరమున కలదు. ఈ తటాకరమునకు అట్టిపేరు ఆళ్వార్ల సూక్తి వలననే ఏర్పడెనని పెద్దలందురు. పాండ్యదేశములోని క్షేత్రములో ఒకటి అగు ఈ దివ్యదేశము మధురకు 10 కి.మీ. దూరమున కలదు. అమృతమును పంచుట కొఱకు భగవానుడు మోహినీ రూపమును గ్రహించినపుడు దేవతలు, ఋషులు ప్రార్థనపై ఇచట కాలమేఘమూర్తిగా వెలసెనట. "కామరూపమ్‌కొణ్డు" అను ఈదశకములోని శ్రీసూక్తిని వ్యాఖ్యానించుచు అఴ్గియమణవాళచ్చీయర్ పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలో" అమృత ప్రదానదశైయిల్ పెణ్ణాకి యముతూట్టిన పడియైచ్చొల్లి త్తాకవుమామ్" అని పల్కుట స్మరణీయము. కావున ఈ పురము శ్రీమోహనపురముగా పేరుపొందినది. ఈపేరు యొక్క మారురూపమే తిరుమోగూర్ అను ప్రస్తుతనామము. ఇచటస్వామి తూర్పుముఖముగా నిలుచున్న భంగిమలో కుడిచేతియందు అభయముద్రతో, ఎడమచేతియందు కౌమోదకీ గదతో సేవసాయించుచున్నాడు. అమ్మవారు మోహనవల్లి, మేఘవల్లి మొదలగుపేర్లతో పిలువబడుచున్నది. పుష్కరిణి క్షీరాబ్ధి పుష్కరిణి. ఈ క్షేత్రము యొక్క జల సమృద్ధిని, సస్యసంపదను వర్ణించుచు ఆళ్వార్లు "ఎణ్‌తిశైయుమ్ ఈన్‌కరుమ్బొడు పెరుమ్‌శెన్నల్ విళైయ" అని, "వాయ్‌త్త తణ్‌పణై వళైవయల్ శూఴ్ తిరుమోగూర్" అని, "ఉయర్‌కోళ్‌శోలై ఒణ్ తడమణి యొఴ్గి తిరుమోగూర్ "అనియు పల్కిరి. ఇచటి శ్రీవైష్ణవులు నలఙ్గొళ్ నాన్మఱై వాణర్‌కళవాఴ్ తిరుమోగర్" అనునట్లు ఆనృశంస్యమే పరమ దర్మమను వేదతాత్పర్యమును గ్రహించినవారు. ఇట్లు ఇచటిస్వామి సర్వజన సమ్మోహకుడైనట్లే, క్షేత్రమును సర్వజనాకర్షకమై యుండును. "యథారాజా తథా ప్రజాః" కదా!

కాలమేఘస్వామి మార్గబంధుశైత్యము:- ఆచార్య హృదయమను రహస్య గ్రంథమున అఴ్గియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ తిరువాయ్‌మొఴ్గి ప్రబంధమున నమ్మాళ్వార్లు మంగళాశాసనమును చేసిన దివ్యదేశములోని అర్చామూర్తుల ప్రధాన గుణములను గూర్చి తెలుపుచు "మార్గబంధుశైత్యమ్ మోహనత్తే మడు విడుమ్" అని ఈ క్షేత్రములోని స్వామి మార్గబంధుశైత్వమును విశిష్టమైన గుణమును కల్గియున్నట్లు తెలిపిరి. అనగా తిరుమోగూర్‌లోని భగవానుడు అర్చిరాది గతిలో పయనించు జీవుని సాంసారిక సకల తాపములను హరించు శైత్యగుణమును కల్గియున్నాడని తాత్పర్యము. ఇందులకు

కారణమును శ్రీమణవాళమహాములు తెలుపుచు ఇచటి స్వామి చక్కని కేశపాశమును కల్గియుండుట, కమలముల వంటి కన్నులను కల్గియుండుట, దొండపండు రంగువంటి అధరవర్ణమును కల్గియుండుట, కాలమేఘుడను నామమును కల్గియుండుట, చల్లని తటాకము వంటి పాదచ్ఛాయను కల్గియుండుట, స్వయముగా మరతకమణి తటాకము వంటి వాడగుటయు కారణములని పల్కిరి. ఈ శ్రీసూక్తి తాత్పర్యము. కాలమేఘము, తటాకము తాపహారకములు. స్వామి అందమైన కేశములు తాపమును పోగొట్టుననుటకు "కేశవః క్లేశనాశనః" "కెడుమిడరాయవెల్లామ్ కేశవావెన్న వంటిసూక్తులు స్మరణీయులు. మఱియు కేశవ శబ్దమునకు ''ప్రశస్తకేశవాన్'' అనునిర్వచనము ప్రస్తుతమున గ్రహింపనగును.

నమ్మాళ్వార్లు తిరువిరుత్త దివ్య ప్రబంధమున "వేదనై వెణ్ పురినూలనై'' అను 79వ పాశురమున "పాఱ్కడల్ పామ్బణైమేల్ పళ్లికొణ్డరుళుమ్ శీతనై" అనుచు క్షీరాబ్ధిలో ఆదిశేషుడను పడకపై పవళించిన వ్యూహమూర్తిని శీతలస్వభావునిగా కీర్తించిరి. ఇచటి "శీతనై'' అను పదమును వ్యాఖ్యానించుచు నమ్బిళ్లై, పెరియవాచ్చాన్ పిళ్లైయు "తిరుప్పాఱ్కడవిలే కిడక్కిఱ పడియై నినైత్తాల్ తాపమడైయ తీరుమ్బడి యిరుక్కఱవనై' అనుచు క్షీరాబ్ధిలో భగవానుడు శయనించియున్న సన్నివేశమును స్మరించిన తాపమంతయు తీరునని పల్కిరి. "తరత్యఖిల దుఃఖాని తాపార్తో జలశాయినమ్ (స్మృత్వా) అను విష్ణుధర్మశ్లోకము, (41-30) వ్యూహరూపము తాపహారకమనుటను తెలుపుచున్నది. కావున క్షీరాబ్ధిశాయి యగు వ్యూహమూర్తికి సకల తాపహరణాత్మకమైన శైత్యము ముఖ్యగుణమని తెలియుచున్నది. శ్రీరంగములోని అర్చామూర్తి పరమపదనాథునకు ప్రతిరూపమైనట్లే, తిరుమోగూర్‌లోని అర్చామూర్తి వ్యూహమూర్తికి ప్రతిరూపమని చెప్పవచ్చును. ఎట్లనగా - "తేవరుమ్ మునివరుమ్ తొడరప్పడర్‌కోళ్ పామ్బణైప్పళ్లి కొళ్వాన్ తిరుమోగూర్" (దేవతలు, మునులు ఆశ్రయించునట్లు విస్తరించు పడగలను కల్గిన ఆదిశేషుడను పడకపై పవళించువాడు తిరుమోగూర్ స్వామి) అను ఈ దశకములోని సూక్తిలో పదముల సమభివ్యాహారము వలన వ్యూహరూపము తిరుమోగూర్‌స్వామిగా రూపొందె ననవచ్చును. పై శ్రీసూక్తిలోని "తేవరుమ్ మునివరుమ్'' అనుటకు "ఈశ్వర్యోహమెన్తిరుప్పారుమ్, ఐశ్వర్యార్థమాకయత్నమ్ పణ్ణువారుమ్" అని, "పడర్‌కోళ్ పామ్బణైప్పళ్ళి కొళ్వాన్" అనుటకు "ప్రయోజనాంతర పరర్క్కు ముకమ్ కొడుక్కైక్కాగ క్షీరాబ్ధియిలే కణ్వళర్ న్దరుళికిఱాన్' అనియు నమ్బిళ్లై వివరించిరి. కావున వ్యూహమూర్తియొక్క ప్రధానగుణమైన తాపహరణాత్మకశైత్యమును తత్ప్రతిరూపమైన తిరువెూగూర్‌లోని స్వామి కల్గియుండుననుట తగినదేకదా!

"మీనాయామైయుమాయ్ నరశిఙ్గముమాయ్ కుఱళాయ్, కానారేనమమాయ్ కఱ్కియామ్ ఇన్నమ్ కార్వణ్ణనే'' అనుచు పంచమశతకమున ఆళ్వార్లు

స్వయముగా కాలమేఘ స్వామియే అవతారమూలకందమని పల్కిరి. ఈ సూక్తిలో కార్వణ్ణన్'' అనుటకు పన్నీరాయిరప్పడిల్ "కాలమేఘ మ్బోలే శ్యామలమాన అసాధారణ విగ్రహత్తైయుడైయవన్" అని, ఈడు, ఇరుపత్తునాలాయి రప్పడి వ్యాఖ్యలలో "వర్షుక వలాహకమ్బోలే యిరుక్కిఱానత్తై" అనియు వ్యాఖ్యానింపబడుట ఇచట స్మరణీయము. (కార్ అనుపదము వర్షుక వలాహకమను అర్థమునిచ్చును). కాలమేఘుడను పేరు ఈ దివ్యదేశములోని అర్చామూర్తికి అసాధారణము కావున అచటిస్వామి అవతారకందముగా చెప్పబడు వ్యూహమూర్తికి ప్రతిరూపమనవచ్చును. ఈ సందర్భమున "కామరూప కన్దరూపత్తావే ప్రపన్నార్తి హరనానవన్'' అను ఆచార్యహృదయసూక్తి, దానిని వ్యాఖ్యానించుచు మణవాళ మహామునులు అనుగ్రహించిన "కామరూపమ్కొణ్డు ఎழுన్దళిప్పాన్" ఎన్ను ఆశ్రితరుడైయ ఆపద్రక్షణానురూపమాక వేణ్డిన పడి పరిగ్రహిక్కుమ్ విగ్రహఙ్గళుక్కెల్లామ్ కన్దమా యిరుక్కుమ్ దివ్యవిగ్రహత్తైక్కొణ్డు" అనుపంక్తులును ఇచట స్మరణీయులు. అంతియేకాక, ఈ దివ్యదేశమున క్షీరాబ్ధి శాయిమూర్తి సన్నిధి ఉండుటయు గమనింప వచ్చును.

4. దశక ప్రవేశము: "నాళేలంటియేన్ ఎనక్కుళ్లన" అనుచు ఆళ్వార్లు తమ పరమపద ప్రాప్తిని గూర్చి ఎప్పుడా! అని త్వరపడుటను చూచిన సర్వేశ్వరుడు'' మరణమానాల్'' అని ప్రకృతి సంబంధము తొలగిన వెంటనే పరమపదమును అనుగ్రహింతుననెను. భగవానుడు ఏదైన పల్కిన తావన్మాత్రముననే ఆకార్యము సిద్ధించినట్లు సంతోషపడు స్వభావమును కల్గినవారు ఆళ్వార్లు. మఱియు, భగవానుడు, సత్యసంకల్పుడు కావున అతడు పల్కిన మాట అంతయు సఫలమగును. ఇట్లు తాము పరమపదమును చేరుటకు ఒక నిశ్చితమైన కాలావధిని పొందిన ఆళ్వార్లు అర్చిరాది మార్గమున పయనించినపుడు తమకు మార్గ బంధువుగా శీతల స్వభావుడగు తిరుమోగూర్‌లోని స్వామిని ఆశ్రయించుట ఈ దశకములోని ప్రధానాంశము.

చిఱకాలముగా సంబంధమును కల్గియున్న దేహమును, లౌకిక బంధువులను విడచిపోవుట జీవునకు అంతిమకాలమున మిక్కిలి కష్టము. మఱియు, తానుచేరవలసిన దేశము అగు పరమపదము ఇంతకు పూర్వము దర్శించినదికాదు. దగ్గఱలో నున్నదియుకాదు. పయనించునపుడు మార్గములోని అడ్డంకులు అవిద్య, కర్మ, వాసన, రుచి వంటివి ఎన్నియో! వీనినన్నిటిని గ్రహించి, అధిగమించుటకు జీవునిశక్తి, యుక్తులు చాలవు. కావున వీనినన్నిటిని అధిగమించి పోవుటకు సహాయముగా సమర్థుడైన మార్గబంధువు తప్పక కావలెను. ఇంత వఱకును సంసారమున మునిగియున్నను తనశ్రేయస్సును గ్రహించి, భగవానుని ఆశ్రయించుట ద్వారా ప్రయత్నమును చేసిన ప్రపన్నులకు వేరొకరి సహాయము అవసరమేమి - అనినచో అందులకు జీవుని పూర్వ వృత్తమును గమనించినచో అతడు తనకు సహాయకుడు కాడనుట స్పష్టము అని ఈడులోని శ్రీసూక్తి. జీవుని స్థితి, ప్రవృత్తులన్నియు భగవదధీనములే కదా! అంతియే కాక ప్రపత్తిని చేసినను అది అచేతనమగుటచే రక్షకము కాజాలదు. కేవలము

ఆభిముఖ్య ద్యోతకము. కావున సమర్థుడైన మార్గబంధువును సహాయకునిగా ఆశ్రయింప వలసి యున్నదనుట నిర్వివాదము, నిస్సంశయమును.

తిరుమోగూర్‌స్వామి మార్గబంధు లక్షణపూర్తి: మార్గబంధువు దారిలోగల విరోధుల (ఆటంకము) స్వరూపమునుగూర్చి, వానిని నివారించు ఉపాయములనుగూర్చి చక్కగా తెలిసియుండవలెను. ఆవిరోధులను పోగొట్టుటకు అవసరమైన శక్తి, సామర్థ్యములను కల్గినవాడై యుండవలెను. "యః సర్వజ్ఞః సర్వవిత్" అని, "పర్యాస్యశక్తి ర్వివిదైవ శ్రూయతే" అనుచు వేదము భగవానుని సర్వజ్ఞునిగా, సర్వశక్తియుక్తునిగా కీర్తించినది. సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడును అయిన చాలదు. రక్షించుటకు తగిన సంబంధమును, రక్షింపవలెనను దయాగుణమును మార్గబంధువు కల్గియుండవలెను ఈ రెండు గుణములును సర్వేశ్వరునకు కలవు." మాతా పితా భ్రాతానివాసః శరణం సుహృత్ గతిః నారాయణః" అని, "పతింవిశ్వస్య" అనియు వేదము భగవానుని నిరుపాధిక బందువుగా, సర్వశేషిగా తెలుపుచున్నది. "తాయాయ్ తన్దైయాయ్ మక్కళాయ్ మత్తుమాయ్ ముత్తుమాయ్", "ఆయిరమ్‌పేరుడై యమ్మాన్" వంటి ఆళ్వార్లసూక్తులు భగవానుని నిరుపాధిక బంధుత్వమును కీర్తించుచున్నవి. లౌకిక బంధుత్వము సహజమైనది, స్థిరమైనదికాదు. అభాసరూపమైనది. భగవానుడు అట్టివాడు కాడు. భక్తుడు తనను "అమ్మా" అనిపిలచిన, ఆడగొంతుకతో "ఏమి తండ్రీ!" అనును, "తండ్రీ!" అనిపిలచిన మగ గొంతుకతో సమాధానమిచ్చును. ఇట్లు సకల విధ బంధుకృత్యములను పరిపూర్ణముగా చేయగల్గినవాడు, చేయువాడును సర్వేశ్వరుడే. ఇక, భగవానుని నిర్హేతుక దయాగుణమును గూర్చి ప్రబంధ ప్రారంభముననే ఆళ్వార్లు "మయర్వరమది నలమరుళినన్" అనుచు కొనియాడిరి. ఇట్లు మార్గ బంధులక్షణములన్నిటిని కల్గిన వాడగుటయే. "తాన్ ఘునిముదలాముత్‌తుమ్ తేవరోడు ఉలకుశెయ్‌వాన్" అనుటచే కాలమేఘప్పెరుమాళ్ సకలసృష్టి కార్యోపయోగియగు సర్వజ్ఞత్వమును కల్గినవాడని, "అశురరైత్తకర్క్కుమ్ తోళ్" (విరోధులను నిరసించు బాహువులను కలవాడు) అనుటచే పరమ దయాళువని, ఆప్తుడని, "ఆయిరమ్ పేరుడైయమ్మాన్" అనుటచే నిరుపాధిక బంధువని స్పష్టపడుచున్నది. మఱియు "కమలక్కణ్, కనివాయ్" శురికుళ్రల్ అనుటచే యామ్య మార్గమున పయినించునపుడు కలుగుశ్రమ అంతయు తీరునట్లు కాలమేఘస్వామి తన కటాక్షామృతవృష్టితో చల్లపఱచి, యమభటుల అతి కఠినములైన వాక్కులను వినుటవలన కల్గిన తాపమును "శెవిక్కినియ శెఞ్జొల్" అనునట్లు అమృతప్రాయములగు వాక్కులతో తీర్చునని, చక్కని కేశ సౌందర్యమను ప్రకటించుట ద్వారా మనస్సునకు ఆహ్లాదమును కలుగచేయునని ధ్వనించుచున్నది. భీకరమైన యమ దర్శనము వలన కల్గిన తాపము తీరునట్లు తన దివ్య సౌందర్యామృతమును నిరంతరము వర్షించు కాలమేఘరూపి యగు స్వామి దారిలోని ఆటంకములన్నిటిని తన దివ్యాయుధములతో నశింపచేసి, ఉత్తమగతిని

పొందించు ఆప్తతముడు (ఇచట కాల శబ్దమునకు పావృట్కాలమని, నల్లని అని రెండర్థములను గ్రహింపవచ్చును. అట్లే "మిహ - సేచనే" అను ధాతువు నుండి పుట్టిన మేఘశబ్దమును ప్రయోగించుట ఇచట మిక్కిలి సందర్భోచితము.) కావున విశ్వసనీయుడు. స్వామి శైత్యగుణమును గూర్చి తెలుపుటకు "మరతకమణిత్తడమ్", "మణిత్తడత్తడి" ('అడి అనుపదము దివ్యమంగళ విగ్రహమునకు ఉపలక్షణమని అరుంబద వివరణము),'' 'అడినిఱల్ తడమ్' (పాదచ్ఛాయ అను తటాకము) వంటి సూక్తులను గ్రహింపవగును. "పథిమరు తరువాపీ వారివత్ సర్వభోగ్యమ్'' అనునట్లు అనుకూలురకు అందఱకు చల్లనివాడు పరమభోగ్యుడును కదా స్వామి.

ఇట్లు ఆళ్వార్లు కాలమేఘస్వామిని మార్గబందువుగా ఆశ్రయించి, తమ ఆత్మ (రక్షణభారము)ను ఆస్వామి యందు నిక్షిప్తమును చేయుటను నమ్పిళ్లై చక్కని లౌకికమైన ఉదాహరణముతో వివరించిరి. మిక్కిలి భయమును కల్గిన దారిలో ప్రయాణమును చేయువారు (రాజకుమారులు) తమతోపాటు రక్షకునిగా మిక్కిలి శక్తిని, సమయస్ఫూర్తిని కల్గిన అంతరంగ సేవకుని వెంటనిడికొని, తమవద్దగల అమూల్యమైన వస్తువును అతని హస్తమునపెట్టి భద్రపఱచి, గమ్యమును క్షేమముగా చేరిన పిదప తమ వస్తువును తిరిగి పొందుదురు. అట్లే, ఆళ్వార్లు శరీర విశ్లేష సమయమున పలువిధములైన ప్రతిబంధకములతో కూడిన అర్చిరాదిగతిలో తాము పయనించవలసి యుండుటచే అమూల్యమైన, భగవానునకు కౌస్తుభ రత్న సమానమైన ఆత్మవస్తువును సర్వస్వామి, సర్వజ్ఞుడు, సమర్థుడును అగు కాలమేఘస్వామి సన్నిధిలో నిక్షిప్తముచేసి, ప్రాప్య భూమి యగు పరమపదమును చేరిన పిమ్మట తిరిగి పొందెదనుగాక అని తలచి, ఆస్వామిని మార్గబంధువుగా ఆశ్రయించిరి అని నమ్పిళ్లై వివరణము. ఈ దృష్టాంతమును లౌకిక భావనతో గ్రహింప తగినదని అచటి అరుమ్బదములో వివరింపబడినది. ఎందులకనగా పరమ పదమునకు చేరిన పిమ్మట జీవుడు తన ఆత్మను తిరిగిపొందుట అను ప్రసక్తియేలేదు కదా! మఱియు అర్చామూర్తి యగు కాలమేఘస్వామి సన్నిధిలో ఆళ్వార్లు ఆత్మ సమర్పణమును చేయుటలో ఒక విశేషము కలదు. "తిరువేఙ్గడత్తుక్కివైపత్తుమ్ పిత్తార్ పిడిత్తార్ వీత్తిరున్దు పెరియవానుళ్ నిలావువరే'' అని ఆళ్వార్లు సాయించుటనుబట్టి ఆశ్రయణీయస్థలము సౌలభ్య, సౌశీల్యాదులకు నిలయమగు అర్చామూర్తి అని. కైంకర్యము చేయునది మాత్రము పరమపదనాథునకు అని ఏర్పడుచున్నది కదా! ఆక్రమమునుబట్టి ఇచట ఆళ్వార్లు తమ ఆత్మను కాలమేఘస్వామికి సమర్పించిరని చెప్పనగును. ఇక ఇచటి ఆళ్వార్లు పల్కిన ఆత్మ నిక్షేపణము ఏమన తమకు మార్గ బంధువుగా కావలయునని స్వామిని ప్రార్థించుటయే. లేనిచో తనస్వంతముకాని ఆత్మవస్తువును తాను నిక్షేపించుట అర్థములేనిదేకాక, "కింతేన నకృతం పాపం చోరేణాత్మాపహారిణా'' అనుసూక్తి చొప్పున అసహ్యమైన చౌర్యములోనికి చేరును. కావుననే ఆళ్వార్లు "యానే యెన్తనదె ఎన్తిరున్దేన్, యానేనీ యెన్నుడైమైయుమ్ నీయ్'' (నేను అని నాది అని తలచుచుంటిని. కాని

నేనునీ వాడనే, నాది అంతయు నీదే) అని సాయించిరి. దీనిని అనుసరించుచు పరమాచార్యులగు ఆళవన్దార్ (యామునుల) "అహమద్యైవ మయా సమర్పితః" అనిసాయించి, వెంటనే "మమనాథ యదస్తి య్యోస్మ్యహం సకలం తద్ధితవైవ మాధవ.... అథవాకింను సమర్పయామితే" అనుచు తనదికాని ఆత్మను సమర్పించితినని పల్కితినే అని పరితపించిరి. కావున ఇచట ఆళ్వార్లుచేయు ఆత్మ నిక్షేపణము కేవలము రక్షణార్థకమైన ప్రార్థనయే. "సకృదేవ", అంతమస్మృతి వర్జనమ్" ఇత్యాది భగవద్వాక్యముల వలన, "సకృదేవహి శాస్త్రార్థః", "సకృత్ ప్రపన్న జనతా సంరక్షైకవ్రతీ" ఇత్యాది అభియుక్తోక్తులవలన సకృత్ ప్రపదనమే చాలునని తెలియచుండగా, ఆళ్వార్లు ఇచట అంతిమ కాలమున భగవానుని మరల ఆశ్రయించుట ఏమి? అనగా- "అవనుడై యరుళ్ పెరుమ్పోదరిదాల్" అని, "అవనురుళ్ పెరుమళ మావినిల్లాదు" అనియు పూర్వశతకమున ఆళ్వార్లు క్షణకాల విలంబము సైతము సహింపలేని తీవ్రమైన ఆర్తిని పొందిన వారగుటచే తాళలేక ప్రపత్తినిచేసిరేకాని, పునః పునః ప్రపదనము కర్తవ్యమను ఉద్దేశ్యముతో కాదని తెలియనగును.

6. దశక సంగ్రహము:- ఈ దశకములోని పాశురములభావము క్రమముగా సంగ్రహముగా తెలుపబడుచున్నది.

1. దృఢమైన నాళములను కల్గిన తామరపూలతో (అలంకరించబడిన) నిండిన తటాకములను అలంకారములుగా కల్గిన, సస్యక్షేత్రములచే చుట్టబడియున్న తిరుమోగూర్ దివ్యదేశములో నిత్యవాసము చేయుచున్నవాడు, అందు మిక్కిలి ఆదరమును కలవాడు, అసురులను సంహరింప కల్గిన నాల్గు భుజములను కలవాడు, చక్కని కేశపాశమును కలవాడు, కమలనేత్రడు, బింబాధరుడు అగుకాలమేఘస్వామి తప్ప వేరొక గతిని కల్గిన వారముకాము.

2. పరమ భోగ్యమైన తులసీమాలను కలవాడు, వేయిపేర్లను కలవాడు, విలక్షణులైన వైదికోత్తములు నివసించు తిరుమోగూర్‌లో తనపాదములను స్థిరముగా నిలపినవాడు, అగుస్వామి యొక్క పాదముల నీడ అనెడి తటాకము తప్ప వేరొక గతిని మేము ఏ జన్మములోను కల్గిన వారముకాము.

3. "దాసులమగు మేము నిన్ను తప్ప వేరొక శరణమును కల్గిన వారముకాదు" అనుచు పలుమార్లుపలికి, బ్రహ్మరుద్రాదులతో పాటు దేవతలు ఆశ్రయింపగా, వారి విరోధులను జయించువాడు, ఈ ముల్లోకములను రక్షించుటయే కృత్యముగా కల్గినవాడగు స్వామియొక్క తిరుమోగూర్ దివ్యదేశమును మనము మనదుఃఖములు తొలగునట్లు ఇపుడు చక్కగా ఆశ్రయించెదము.

4. "మా దుఃఖములు తీరునట్లు వేంచేసి, మమ్ములను రక్షింపవలెను" అని పలుమార్లు పల్కి, తన తేజోమయమైన దివ్యరూపమును స్తోత్రముచేసి దేవతలు, మునులును అనుసరించి, ఆశ్రయించుటకు తగినట్లు విశాలమైన పడగలుకల ఆదిశేషుడను పడకపై పరుండియున్న స్వామియొక్క తిరుమోగూరు దివ్యదేశమును చేరి మన దుఃఖము తీరునట్లు స్తోత్రముచేయుదుము. భక్తులారా! మీరును రండు.

5. మనము సేవించుటకు తగిన, తేజోమయమైన దివ్యమంగళ విగ్రహమును కలవాడు, లోకములకన్నిటికిని అద్వితీయమైన కారణమైనవాడు, అందముతో కూడిన ముల్లోకములను కొలిచిన స్వామి, ఎనిమిది దిక్కులయందు తీయని చెఱుకుతోపాటు, గొప్ప సస్యములు పండునట్టి అందమైన తిరుమోగూరులో తాను పరిగ్రహించిన సన్నిధికి ప్రదక్షిణముజేసి, నాట్యమును చేయుదుము. భక్తులారా! రండు.

6. చక్కగా నర్తనమును చేయువాడు (నర్తనగతులను తలపించు నడకలను కలవాడు). పశువులవెంటపోయి వానిని రక్షించువాడు, బాధను కల్గించు అసురులకు మృత్యువు, తనను స్తుతించు మనకు, దేవతలకు, ఋషులకును ఆనందమును కల్గించువాడు, విస్తరించిన, చల్లటినీటి ప్రదేశములతో, చక్కగా పండిన సస్యక్షేత్రములతో చుట్టబడియున్న తిరుమోగూరులో వేంచేసియున్న పరమాప్తుడు అగు స్వామియొక్క పాదారవిందములను తప్ప వేరొక రక్షకమును మేము కల్గినవారముకాము.

7. దృఢమైనదై, అపరిచ్ఛిన్నమై, భోగమోక్షములను ఇచ్చునదియై, అద్వితీయమైన మూల ప్రకృతితోపాటు ఆవరణ జలమును సృష్టించి, ఆక్రమములోనే బ్రహ్మమొదలగు సమస్త దేవజాతులను, సకలలోకములను సృష్టించు సర్వేశ్వరుడు వేంచేసియుండు ప్రదేశమగు తిరుమోగూరును మనము చుట్టి ప్రదక్షిణమును చేసినచో మన దుఃఖములు వేగముగా నశించును. కావున ఈ దివ్యదేశము తప్ప వేరొక రక్షకమును కల్గిన వారముకాము.

8. ఉన్నతములైన తోటలను, అందమైన తటాకములను, అలంకారములుగా కల్గిన, అందమైన తిరుమోగూరులో, వారి క్రూర కర్మలకు తగినట్లు బ్రహ్మశత్రు, యజ్ఞశత్రు వంటి సహస్రనామములచే ప్రతిపాదింపబడువారు, క్రూరులగు రాక్షసులు ప్రవేశించి, మునిగి, నశించునట్లున్న, దశరథ చక్రవర్తి పొందిన మరతకమణి తటాకమువలెనున్న భగవానుని ఓ దాసులారాః మీరు సమీపించి, నమస్కరింపుడు. అట్లు నమస్కరించినచో, మీ క్లేశములన్నియు త్వరగా తీరును.

9. అందమైన మణి తటాకము వంటి చల్లని పాదములను (ఇచట పాదము దివ్య మంగళ విగ్రహమునకు ఉపలక్షణము), తామరపూవు వంటి కన్నులను, పవళము వంటి ఎఱ్ఱని అధరమును, అందమైన నాల్గు భుజములను కల్గినస్వామి అసురులను ఎల్లప్పుడు నిరసింప గల్గిన శక్తిని కలవాడు. ఆ ప్రభువు నిత్యవాసముచేయునట్టిది, తోటల సమృద్ధిగ కల్గినది అగు తిరుమోగూరు దివ్యదేశము మనకు రక్షకము. అది సమీపముననే ఉన్నది. దానిని మనము భజింపగల్గితిమి.

10. "మనకు శరణము అగునట్లు మనము సమీపించిన చక్కని రక్షకమైన ప్రదేశమిది' అని సాధువులు అగుదేవతలు తమకు ఆపదలను కల్గించు అసురులకు భయపడి వచ్చి ఆశ్రయింపగా, వారికి ఇష్టమైన (వారిరక్షణకు తగిన ) రూపమును పరిగ్రహించి, వృద్ధిచెంది, వారిని రక్షించునట్టి స్వామి వేంచేసి యుండు దేశము అగు తిరుమోగూరు యొక్క పేరును ఆత్మీయులారా! తలచి, స్మరింపుడు. స్తుతింపుడు.

11. "ఆత్మీయులారా! కీర్తింపుడు" అనుచు తాను స్వయముగా పల్కి కుంభనృత్యమును చేయుస్వామిని గూర్చి నమ్మాళ్వార్లు కూర్చిన, వాగ్రూపమైన కైంకర్యమగు వేయిపాశురములలో ఈ పదిపాశురములు తిరుమోగూరు విషయముగా సమర్పింపబడినవి. వీనిని గొని భగవానుని స్తుతింపగల్గిన వారికి దుఃఖములు నశించును.

7. దశకవిశేషములు: నమ్మాళ్వార్ల తిరువాయ్మొழி దివ్యప్రబంధము సుమధురమైన ఉత్తమోత్తమ ధ్వని కావ్యము. ఇందు నాయకుడు సాక్షాత్తు భగవానుడు, నాయిక పరాంకుశనాయికి అనబడు ఆళ్వార్లే. "కడిమామలర్ ప్పావైయోడుళ్ల సామ్యషట్కత్తాలే" అను ఆచార్య హృదయసూక్తి చొప్పున ఆళ్వార్లకు పిరాట్టితో సామ్యము కలదుకదా! ప్రకృష్టమైన భావ బంధముతో కూడిన ఈ దివ్యప్రబంధమున రసములకు, గుణాలంకారాదులకు ఏమి కొదువ? చక్కని అలంకారములకు, శబ్దార్థగుణములకు లక్ష్యములైన సూక్తులెన్నియో ఈ దశకమున కలవు. ఉదాహరణకు ఎనిమిదవ పాశురమున "తయరదన్పెత్త మరతకమణిత్తడమ్" అనుసూక్తి రూపకాతిశయోక్త్యలంకారమునకు, తొమ్మిదవ పాశురములోని "మణిత్తడత్తడి మలర్కళ్గళ్" ఇత్యాదిపాశురము సావయవరూపకమునకు లక్ష్యములు. తిరువాయ్మొழி ప్రబంధము అంతయు ఆళ్వార్ల స్వానుభవరూపముగను, పరోపదేశాత్మకముగను యున్నదనుట స్పష్టము. అట్లే, ఈ దశకమున కొన్ని పాశురములు ఆత్మానుభవరూపముగను, మఱికొన్ని (4,5 పాశురములు) పరోపదేశాత్మకములుగను అమరియున్నవి. ఈ దశకమునకు ఆచార్యులు అనుగ్రహించిన వ్యాఖ్యలలో రస్యములైన పలు విశేషాంశములు తెలుపబడినవి. వానిలో కొన్ని దిఙ్మాత్రముగా ఇచట ఉట్టంకింపబడుచున్నవి.

మొదటి పాశురమున "అశురర్గైత్తకర్క్కుమ్ తోళునాన్గుడై" అనుటకు అసురులను నిరసించునాల్గు భుజములను కల్గినవాడను అర్థము. ఇచట ఆళ్వార్లు తిరుమోగూరు అర్చామూర్తిని వర్ణించు సందర్భమున ఈ విధముగా పల్కుట ఎట్లు తగును? అను ప్రశ్నను లేవనెత్తిన నమ్బిళ్లైకు నంజీయర్ ఈ సూక్తి విభవ - అర్చావతారముల అభేద భావనతో పలుకబడినదని సమాధాన మిచ్చిరి. మఱియు "విడుకాతానాలుమ్ తోడిట్టువళర్న్దకాదెన్ఱు తెరియుమ్ కాణ్" అనుచు అందులకొక నిదర్శనమును తెలిపిరి. అనగా, చెవియొక్క దైర్ఘ్యము (చెవి తమ్మలు పొడుగాసాగియుండుట)ను బట్టి ఆ చెవి కర్ణాభరణములను చిఱకాలము కల్గియుండుటచే అట్లు దీర్ఘమైనదని తెలియునట్లే, జ్యాకిణ కర్కశమైన భుజములను దర్శించిన, అవి విభవావతారమున అసురులను నిరసించిన బాహువులను విషయము తెలియునని తాత్పర్యము. ఇట్టి క్రమమును పలువురు ఆళ్వార్లేకాక, ఆచార్యులును అనుసరించిరి. తిరుమాలిరుమ్ శోలై అనుదివ్య దేశములోని సుందర బాహు స్వామిని స్తుతించుచు కూరేశులు "జ్యాకిణాంక పరికర్మ ధర్మిణో భాంతి సుందరభుజస్య బాహవః" అని, వారి కుమారులగు శ్రీపరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవ - పూర్వశతకమున శ్రీరంగనాథుని బాహువులను వర్ణించుచు "శార్ఙ్గజ్యాకిణ కర్కశిమ్ని" అనియు పల్కుట ఇచట ఉదాహార్యములు.

“వాన్ తికళ్ళుమ్ శోలై మదిళరఙ్గర్ వణ్ పుకళ్మేల్ ఆన్ణతమళ్ ముప్పైకళ్ ఆయిరమ్” అనుభట్టరు శ్రీసూక్తినిబట్టి తిరువాయిమొళ్ళి ప్రబంధము శ్రీరంగనాథుని ఉద్దేశించి పలుకబడినదని ఏర్పడుచున్నది కాని, ఆళ్వార్లు ప్రస్తుత దశకములోని ఫలశ్రుతి పాశురములో “వణ్ తిరుమోగూర్ క్కీత్తపత్తు” అనుచు తిరుమోగూరు దివ్యదేశ విషయముగా ఈ దశకము సమర్పింపబడినదని పల్కుట ఎట్లు అర్థవంతము? అను ప్రశ్న ఉదయింపవచ్చును అని పల్కుచు మహావిద్వాన్, పద్మభూషణ, కాంచీ ప్రతివాది భయంకరం అణ్ణంగ రాచార్యస్వామివారు దివ్యార్థ దీపిక అను తమ వ్యాఖ్యలో, అందులకు పూర్వాచార్యులొసగిన (నమ్బిళ్లై) సమాధానమును ఇట్లు తెలిపిరి. “కఙ్గులుమ్ పకలుమ్” (7-2) అను దశకము చివర ఫలశ్రుతిపాశురమున “ముకిల్ వణ్ణ నడిమేల్ శొన్నశొల్ మాలైయాయిరమ్” అని యుండుటచే తిరువాయ్మొళ్ళి ప్రబంధము శ్రీరంగనాథుని పాదారవిందములపై రచింపబడినదనుట సరియే. శ్రీరంగనాతుని ఉగ్రాణము (సామానులు భద్రపరచుగది) నుండి ఆయా దివ్యదేశములలోని అర్చామూర్తులకు సామానులు కొలిచి, విభాగించి, పంపునట్లే, శ్రీరంగనాథుని విషయమున సమర్పింపబడిన వేయిపాశురములలో కొన్ని దశకములు ఆయాదివ్యదేశములలోని అర్చామూర్తులకు విభాగించి, సమర్పింపబడినవి. “పెరియపెరుమాళ్ తిరువడికళిలే తిరువాయ్మొళ్ళి యాయిరమ్ శొల్లిత్తు. “తిరుమోగూర్క్కీత్తపత్తు, తిరువేఙ్గడత్తుక్కివైపత్తు” ఎన్నుపిరిత్తుక్కొడువిత్తనై. పెరుమాళ్ తిరుప్పలకైయిల్ అముతు పడియెలే మ త్తుత్తిరుప్పతికళ్ నాయన్మార్కుమళన్దు కొడుక్కుమాప్పోలే ఎన్ఱుపిళ్లై యరుళిచ్చెయ్వర్” అను ఈడు శ్రీసూక్తి ఇచట అనుసంధేయము.

తిరువాయ్మొళ్ళి ప్రబంధమునకు శ్రీరామాయణమునకు కలసామ్యమును నమ్బిళ్లై ఈడు వ్యాఖ్యలో పలుసందర్భములలో విశదీకరించిరి.

ప్రస్తుతదశకమున “వల్లరక్కర్ పుక్కళున్ద త్తయిరదన్ పెత్తు మరతక మణిత్తడమ్” బలిష్ఠులైన రాక్షసులు ప్రవేశించి, మునిగి, నశించునట్లు దశరథ చక్రవర్తి పొందిన మరకతమణి తటాకము) అనుచు ఆళ్వార్లు భగవానుని అభివర్ణించిరి. ఈ సూక్తిని వ్యాఖ్యానించుచు నమ్బిళ్లై “కాకుత్థ్య పాతాళముఖే పతన్ సః ఎన్గిఅపడియే ఉకవాతర్క్కు నాశకమాయిటే యిరుప్పదు” అని పల్కుట ఇచటస్మరణీయము. ఇచట కాకుత్థ్స శబ్దము శ్రీరాముని పరముగా కాక లక్ష్మణుని పరముగా వ్యాఖ్యానింపబడినను, “రామస్యదక్షిణో బాహుః” అనుటను బట్టి వారిద్దరి మధ్య అభేద భావనతో ఇచట కాకుత్థ్సశబ్దము గ్రహింపబడినదని చెప్పనగును. ప్రస్తుత ఆళ్వార్ల సూక్తిని కొంతవరకు అనుసంధించుచు కూరేశులు శ్రీవైకుంఠస్తవములో “బాహ్యాః కుదృష్టయ ఇతి” అను శ్లోకరత్నమును రచించిరని చెప్పవచ్చును. ఈ శ్లోకమున భగవానుడు పరోక్షముగా తటాకముగా రూపింపబడెను. అసురుల స్థానమున మాయావాదులు గ్రహింపబడిరి.

"తాళతామరై త్తడమణివయల్" అనుచు ఆళ్వార్లు తిరుమోగూర్ దివ్యదేశములోని తామరపూలతో నిండిన తటాకములను, సస్యక్షేత్రములను వర్ణించుటలో గల స్వారస్యమును శ్రీఅణ్ణాస్వామి తమ దివ్యార్థ దీపికలో వివరించుచు, ఆకాశము వరకు పెరిగి పుష్పించి యున్న తామరలను చూడగా త్రివిక్రమావతార సందర్భమున (ఆకాశమును ఆక్రమించిన) భగవానుని పాదారవిందమును దర్శించినట్లుండుటచే చక్కగా పండిన పొలములలోని సస్యములు గుత్తుల బరువుచే వంగియుండుటను చూచినపుడు "నమంతి సంతః త్రైలోక్యాదపి లబ్ధుం సమున్నతిం" అనునట్లు నమస్కారమే రూపుదిద్దుకొన్నట్లుండు భాగవతోత్తములను దర్శించినట్లుండుటచే అని తెలిపిరి. ఆళ్వార్ల ఈ సూక్తిని అనుసరించుచు పెరియాళ్వార్లు'' ఉరమ్‌త్తు మలర్‌క్కమలమ్ ఉలకళన్దశేవడిపో లుయర్‌న్దుకాట్ట, వరమ్‌పుతత్తు కదిర్‌శెన్నెల్‌తాళ్ శాయ్‌త్తు త్తలైవణక్కుమ్ తణ్ణరజ్గమే'' అనుపాశురమును సాయించిరనియు తెలిపిరి.

నమ్మాళ్వారు ''మాయక్కూత్తా'' అనుదశకమున మొదటిపాశురములో, ప్రస్తుతదశకమున రెండు పాశురములలో అనగా మొత్తము మూడుపాశురములలో భగవానుని తటాకరూపిగా కీర్తించిరి. ఒక పర్యాయము తటాకముగా స్వామిని వర్ణించినను తనివితీరకుండుటచే ఆళ్వార్లు ఇట్లు పలుమార్లు అట్టి వర్ణనను చేసిరని చెప్పనగును. ఇట్టి క్రమమునే భట్టరు శ్రీరంగరాజస్తవమున అనుసరించిరి. శ్రీరంగనాథుని "ఉత్ఫుల్ల పంకజ తటాకమివ" అని తటాకముగా అభివర్ణించిన భట్టరు, అంతటితో తృప్తిచెందని వారై ఆవర్ణనను "పిబ నయన పురస్తే రంగధుర్యాభిధానం", "సౌశీల్యశీతలం" అను మరిరెండు శ్లోకములలో కొనసాగించిరి. ఈ విధముగా ప్రస్తుత దశకముయొక్క ప్రభావము తరువాతి ఆళ్వార్లపై, ఆచార్యులపై స్పష్టముగా గోచరించుచున్నది.

ఇట్టి తటాక సదృశుడగు భగవానుని స్వరూపరూపగుణవిభూతుల అనుభవమున మునిగిన వారగుటచే కదా ఆళ్వార్లకు అట్టి సంజ్ఞకల్గినది. కావున ఈ దశకము "ఆళ్వార్లు'' అను నామమునకే మూలమనదగును. ఇంకను పలు విశేషములు ఉన్నను అవకాశము లేకుండుటచే అవి ఇచట ప్రస్తావింపబడలేదు.

8. ఉపసంహారము: తిరుమోగూర్ దివ్యదేశములోని స్వామియొక్క ప్రత్యేకగుణము శీతలస్వభావమని ఇంతకుముందే తెలుపబడినది. భట్టరు శ్రీరంగరాజస్తవమున శ్రీరంగనాథుని తటాకముగా వర్ణించుచు "సౌశీల్యశీతలమ్'' అనిపల్కిరి. అనగా సౌశీల్యగుణముచే భక్తుల మనస్సును చల్లబఱచువాడని తాత్పర్యము (పన్నీరాయిరప్పడి వ్యాఖ్యలోకూడ "శీల శీతలమ్'' అని వివరింపబడినది.) "శీరారుమ్ మాలిరుమ్ శోలైత్తిరుమోగూర్" అను శిఱియతిరుమడల్ శ్రీసూక్తిని వ్యాఖ్యానించుచు పెరియవాచ్చాన్ పిళ్లై ఇచటిస్వామిని గూర్చి "ఆశ్రితరోడు అవిభాగరస మనుభవక్కిఱానాయిటే యిరుక్కిఱదు'' అని సాయించిరి. ఈ సూక్తిని వివరించుచు అరుమ్బదకారులు

"తిరుమోగూర్ అమృత మథన సమయత్తితే అనాశ్రితరాన అసురర్క్కు విభాగరసనాయ్, యిరున్దా నెన్టిడే ప్రసిద్ధి" అనిపల్కిరి. ఆశ్రితులతో భేదము లేకుండ కలసియుండుటయే కదా సౌశీల్యము. "మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్" అనునది ఈగుణ నిర్వచనము. ఆశ్రితులతో అవిభాగ రసమును కలవాడై యుండుట అనగా సౌశీల్య గుణమును ప్రదర్శించుటయే. కావున ఇచటి స్వామి శీతల స్వభావుడనుట తగినదే.

"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్" అను శ్రీరామాయణ సూక్తిలో "గుణవాన్" అనుపదమును వ్యాఖ్యానించుచు గోవిందరాజీయ వ్యాఖ్యానకర్త మొదట "కోవా సకల కల్యాణగుణాకరః" అనపల్కి, వెంటనే" యద్వా గుణ్యతే ఆవర్త్యతే పునః పునః ఆశ్రితై రనుసంధీయతే ఇతి గుణః సౌశీల్యం" అని తెలిపిరి. కావున భక్తులు మాటిమాటికి అనుసంధించు స్వామి సౌశీల్యగుణము వలన వారిమనస్సునకు చల్లదనము కల్గును. అందువలన సౌశీల్యగుణము శీతలస్వభావమునకు మూలము అంతియేకాక, గుణశబ్దము పంకజాది శబ్దమువలె యోగరూఢమని పైవ్యాఖ్యానసూక్తి వలన ఏర్పడుచున్నది. ఇట్లు గుణములన్నిటిలో రత్నాయమానమగు సౌశీల్యగుణమును, తత్కార్యమైన శీతల స్వభావమును తిరుమోగూర్ స్వామి కల్గియుండుటచే "రత్నహారీచ పార్థివః ఎన్నుమాప్పోలే, ఇత్తిరువాయ్మొழியిల్ ఇనిమైయాలే తిరుమోగూర్క్కాయిరున్దన వెన్టుకొడుత్తార్" అను ఈడు శ్రీసూక్తి మిక్కిలి అన్వర్థము రసఘనము. "రత్నం" అనుపదమునకు "రమంతే అస్మిన్ఇతిరత్నం" రమయతి ఇతిరత్నం - రము - క్రీడాయాం" అనువ్యుత్పత్తి ఇచట వివక్షితము. ఈ సూక్తిని ఇంకొక విధముగా కూడ సమర్థింపవచ్చును. ఆళ్వార్లు కౌస్తుభమణి సదృశమగు తమ ఆత్మను తిరుమోగూర్ స్వామి సమీపమున దాచి, పరమపదమును పోదలచిరని ఇంతకుముందే వివరింపబడినది. శ్రీవిష్ణుపురాణములోని అస్త్రభూషణాధ్యాయమున ఆత్మలకు ప్రతీకగా కౌస్తుభమణి తెలుపబడినది. కౌస్తుభమణి వంటి ఆళ్వార్ల ఆత్మను గ్రహించిన తిరుమోగూర్ స్వామినిగూర్చి "రత్నహారీచ పార్థివః" అను సూక్తి మిక్కిలి స్వరసము.

ద్రావిడ భాషలో సౌశీల్యగుణము "నీర్మై" అనుపదముచే తెలుపబడుచున్నది. "నీర్మై" అనుటకు నీటియొక్క స్వభావమని అర్థము. (నీరినుడైయ తన్మై). "సుతప్త మపి పానీయం పునర్గచ్ఛతి శీతతామ్" అనుసూక్తినిబట్టి నీటియొక్క సహజగుణము శైత్యము అనితెలియుచున్నది. కావున సౌశీల్య - శైత్యములు రెండును పర్యాయవాచకములని ఏర్పడుచున్నది. ఇందుచే "మణిత్తడత్తడి" అని, "మరతక మణిత్తడమ్" అని స్వచ్ఛమైన జలముతో నిండిన తటాకముగా అభివర్ణింపబడిన తిరుమోగూర్స్వామి శీతలస్వభావుడగుట మిక్కిలి తగినది.

"మరతకమణిత్తడమ్" అను రూపణము వలన భగవానుని విరోధినిరసన స్వభావము, అనుకూలురకు చల్లనివాడగు గుణమును తెలుపబడినదని

పన్నీరాయిరప్పడిలో వివరింపబడినది. "విషహారముమాయ్, ఆభరణము మాన మరతక దృష్టాన్తత్తాలే ప్రతికూల నిరసనముమ్, అనుకూలర్కు ఆశ్రయముమెన్టుకర్తుత్తు" అను అచటి సూక్తి స్మరణీయము. మరకత శబ్దము "మరం - మరణం తకతి అనేనేతి మరకతం తక - హనన హసనయోః అథవా మరకం తరతి అనేన ఇతి మరకతం"
"అనువ్యుత్పత్తినిబట్టి మరకతమణి విషహారమగుట స్పష్టము మణి అగుటచే ఆభరణము శైత్యమును సిద్ధము. తిరువాయ్మొళ్ళిలో ఒక్కొక్క శతకమున భగవానుని ఒక్కొక్క గుణవిశేషము ప్రతిపాదింపబడినదని ఆచార్య హృదయమున వివరింపబడినది. ఆక్రమములో దశమ శతకములో భగవానుని ఆర్తిహరత్వమను గుణము ప్రకాశింప చేయబడినదని (సూ. 218) తెలియుచున్నది. ఇట్లు ఆచార్యహృదయకారులు పల్కుటకు ప్రస్తుత దశకమే మూలమని చెప్పనగును. ఆళ్వార్లు స్వయముగా "తిరుమోగూర్క్కిత్తపత్తు ఇవైయేతత్తు వల్లార్క్కు ఇడర్కెడుమే" అనుచు ఈదశకఫలము ఆర్తి హరత్వమని పల్కిరికదా!

ఇట్టి పరమ రస్యమైన తిరుమోగూర్ దశకమును గూర్చి యథామతి విన్నవించు మహదవకాశమును అనుగ్రహించిన వారు, దాసునకు మాతులపాదులును అగు వాచస్పతి, ఉ.వే.శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యస్వామివారి సన్నిధిలో, ఉభయవేదాంతసభ (పెంటపాడు) కార్యదర్శి, మన్మిత్రమును అగు ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యస్వామివారి సన్నిధిలో కృతజ్ఞతా పూర్వక నమస్సులను సమర్పించు కొనుచున్నాను.

"నమామ్యహం ద్రావిడ వేదసాగరమ్"



**ఆదినాథన్**

# తిరువనంతపురము

శ్రీమతి ల.సౌ. ఎన్. హేమాబ్జవల్లి
నరసాపురం

తిరువనంత పురే భుజగేశయో రుచిర మత్స్య సరోవర సుందరే ।
శశివిభూషణ వజ్రధరేక్షిత శ్శుతరిపూత్తమ సూరి పరిష్కృతః ॥
అనంత పద్మనాభ శ్రీహరి లక్ష్మీ సమన్వితః
ద్వారత్రయేణ సంసేవ్యః హేమకూట విమానగః

ఇది కేరళ రాష్ట్ర దివ్యదేశములలో ప్రధానమైనది. ఇచటి పెరుమాళ్లు అనంత పద్మనాభ స్వామి. హరిలక్ష్మి తాయార్లతో మత్స్య పుష్కరిణీ తీరమున హేమకూట విమానములో తూర్పుముఖముగా భుజంగ శయనులై వేంచేసియున్నారు. ఈక్షేత్రస్వామిని గూర్చి నమ్మాళ్వార్లు పదియవ శతకం రెండవ దశకమున "కెడుమిడ రాయవెల్లాం" అని ప్రారంభించి కీర్తించియున్నారు.

తిరుమజ్జై ఆళ్వార్లు "ఒరునల్ శుత్తం వనక్కుయిరొణ్బొరుళ్" అని అనేక దివ్యదేశములను ఒక్కసారిగా స్తోత్రించియున్నారు. ఇట్లు స్తోత్రము చేయుటకు కారణమేమి? అని నంజీయర్ వారు పరాశర భట్టారుకులను అడిగినారట.

వివాహమైన తర్వాత పుట్టింటి నుండి అత్తవారింటికి పోవు నూతన వధువు అత్తవారింటికి పోయివత్తుమని బంధువులయిండ్లకు పోయిచెప్పినట్లే ఆళ్వార్లును ప్రాప్యభూమి (పొందదగిన ప్రదేశము అనగా పరమ పదము) సన్నిహితముకాగా ప్రతిదివ్యదేశమును సేవించుచున్నారని" భట్టరు వారు సమాధానము చెప్పినారట.

ఆవిధముగనే నమ్మాళ్వార్లు తిరుప్పుళింగుడి; తిరుక్కాట్కరై; తిరుమూళ్రిక్కళమ్, తిరునావాయ్, తిరుక్కణ్ణపురమ్, తిరుమోగూర్ అనుదివ్యదేశములను సేవించి తిరువనంత పురమును సేవింపబోవుచున్నారు.

క్రిందటి దశకమున (తాళతామరై) "పరమపదము"నకు ప్రయాణమైన ఆళ్వార్లు తమకు ప్రతిబంధకములైన వానిని పోగొట్టి తమకు సహాయముగా నుండుటకు కాలమేఘ స్వామిని తోడుగా తీసికొని బయలుదేరిరి" అని చెప్పబడినది.

ఇంతలో ఆళ్వార్లకు తిరువనంత పురము జ్ఞప్తికి వచ్చినది. ఈ లోకము నందే పరమపద తుల్యమైన తిరువనంత పురము ప్రాప్యమైయుండగా పరమపదము వరకు మనమేల పోవలయును? అని నిశ్చయించుకొనిరి. ఈ తిరువనంత పురము పరమపద తుల్యమగుట యెట్లు అనగా "పేశుమిన్కూశమిన్ని పెరియ నీర్వేలై శూళ్రిన్దు వాశమే కమళ్రుంశోలై వయలణి యనందపురమ్" (సముద్ర పరివేష్ఠితమై పరిమళించు పుష్పోద్యానములుగల తిరువనంత పురమును నిర్భయముగా చెప్పుడు) అనునట్లు రమణీయమై సర్వేశ్వరునకు గూడ ఆదరము కలది. కావుననే జగన్నాథుడగు స్వామి

వచ్చి యిచ్చట వేంచేసియున్నాడు. స్వామి నివసించుటచే సంసారగంధ మంటని పవిత్ర ప్రదేశమయ్యెను.

దేహావసానమున పరమ పదమునకుపోయి చేయవలసిన కైంకర్యమును ఇచటనే రుచి కలిగిన వెంటనే చేయుటకు అనుకూలమైనది యీ తిరువనంతపురము. కావుననే నిత్యసూరులు బ్రహ్మాది దేవతలు కూడ విచ్చేసి కైంకర్యము చేయు దివ్యదేశమైనది. "కళిప్పుమ్ కవర్ మవత్తు" అనుననటు "నిత్యాభివాంఛిత పరస్పర నీచభావైః మద్దైవతైరపి జనైస్తవ సంగసీయ" అనునట్లుగా భాగవత గోష్ఠితో కలసియుండుటకు తగిన స్థలము ఈ దివ్యదేశము.

అంతేకాదు ఈ క్షేత్రము దివ్యదేశములన్నిటి కంటెను అధికముగా భగవద్విషయము నందు రుచిని పుట్టించును. రుచి కలిగిన పిమ్మట "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్" అనువిధముగా సౌలభ్య పరాకాష్ఠయగుటచేత ఉపాయ భావము పరిపూర్ణమైయుండును. అంతేకాక ప్రాప్యమగు పరమపదమునకు తీసికొనిపోవునపుడు "ఆతివాహక గణమందు ప్రధానుడైన తానే మార్గమందున్న ప్రతిబంధకములను పోగొట్టును. సంసార బంధము నశింపచేసి కైంకర్య విరోధులను పోగొట్టి కైంకర్య మందు అన్వయింపచేయును.

కావున రుచిని పుట్టించి (ఆసక్తి కలిగించి) రుచికలుగగానే ఉపాయమై; జ్ఞాన భక్తులను కలిగించునదై. నిత్య దాస్యమును ప్రసాదించునదగుటచే తిరువనంతపురము పరమప్రాప్యమైనది అని నిశ్చయించి మాతో సంబందము గలవారందరు గుంపులు గుంపులుగా పోయి తిరువనంతపురమును సేవింపుడు అని ఆళ్వార్లు ఆనతిచ్చుచున్నారు.

శ్రీరంగమున అధ్యయనోత్సవమున అరయరు స్వాములు ఈ పాశురమును గానము చేయగా విని ఆనంద పరవశులైన "ఆళవందారులు" "ఆళ్వార్లు పిలచిన ఈ క్షేత్రమునకు పోయిరావలెనని తలచి వెంటనే తిరువనంతపురమునకు వేంచేసిరి.

"కురుగైక్కాలప్పన్" అను ఆచార్యులు ఆళ్వందార్లకు యోగ రహస్యములను ఉపదేశింప దలచి ఒక సుముహూర్తమును నిర్ణయించిరి. కానీ ఆళ్వందార్లు ఆ దినమున తిరువనంతపురములో వేంచేసియుండిరి. ఆ కారణముచే వారికి యోగ రహస్యములు లభింపలేదు. "అయ్యో! పుష్పక విమానము లేకపోయెనే! ఉన్నచో కురుగైక్కావలప్పన్ సన్నిధికిచేరి యోగరహస్యములను పొందియుండు వారముగదా యని తలంచిరట.

కేశవ నామము సమస్త ఆపదలను తొలగించును. మేరు పర్వతమువలె మందర పర్వతమువలె నున్న మనపాపరాశి అనువ్యాధులు "కేశవు"అనే మూడక్షరములుగల వైద్యునిచే నశింపచేయబడుచున్నవి. "కేశవు డనగా" కేశి అను రాక్షసుని సంహరించినవాడు. ఆ వృత్తాంతమును తలచినంత మాత్రమున మన ఆపదలు తీరిపోవును.

అంతేకాదు. నరకయాతనలను అనుభవించువారిని చూచి యముడు

"సమస్త క్లేశములను పోగొట్టు కేశవుని ఆరాధించి యుండలేదా! లేకున్నచో నీకీ నరక బాధలేల సంప్రాప్తమగును? అని ప్రశ్నించునట. నరకే పశ్యమాన స్తు యమేన పరిభాషితః । కిం త్వయా నార్చితో దేవః కేశవః క్లేశనాశనః ॥ కేశవ నామ సంకీర్తనమే కేశవారాధనము. కేశవనామ సంకీర్తన చేయువారికి యముని భయము లేదు. ఆ కేశవుడు తిరువనంతపురమున శేషతల్పమున పద్మనాభ స్వామిగా పవళించియున్నాడు. ఆ ఆదిశేషుడు కేశవుని యందలి ప్రేమాతిశయముచే స్వామి విరోధులను నశింపచేయగోరి విషమును వెడలగ్రక్కుచున్నాడు. అట్టి తిరువనంతపుర క్షేత్రమును సేవింతము రండు.

ఈ తిరువనంతపురము అందమైన తోటలు గలది. దానిని సేవింపదలచిన బుద్ధి కలిగిన నాడే పోయి సేవింపుడు. ఆయన తిరునామములలో ఒక్కదానినైన చెప్పుడు. ఒక్క నామమే వేయి విధములుగా ఉపకరించును. సంసార దోషములు మీదరికైన చేరజాలవు.

ఆస్వామి గరుడవాహనుడు. గరుడధ్వజుడు, ఈ విశ్వమును సృజించువాడు. కాపాడువాడు, సంహరించువాడు, ఆతడు ప్రీతితో వేంచేసియున్న దివ్యదేశమే తిరువనంతపురము. మిక్కిలి విశ్వాసముతో ఆక్షేత్రమునకు పొండు. ఆస్వామి సహస్రనామములో ఒక్కదానిని అనుసంధానము చేయుడు. తక్షణమే మీ బాధలు పాపములు అన్నియు నశించును.

ఆ తిరువనంతపురము సముద్రతీరమున నున్నది. అందమైన తోటలతో విరాజిల్లుచున్నది. కావుననే భగవంతుడు శ్రీవైకుంఠమునందు కంటె మిక్కిలి ప్రీతితో ఇచట వేంచేసియున్నాడు. ఆ స్వామిని సేవించి పుష్పములతో పూజించువారు ఎంతటి భాగ్యశాలురో! కదా!

మీరును స్వామిని సేవించి మంచి తీర్థమును పుష్పములను సమర్పించి ఆయన నామాను సంధానము చేయుడు. మీ సంసార బంధములు నశించును. ఆ స్వామిని ఆశ్రయించువారు అనంత గరుడాది నిత్యసూరులతో సమానులగుదురు. ఇది మేము నిశ్చయముగా చెప్పుచున్నాము.

(కాలుజాఱి పడినవాడు అసంకల్పితముగా అమ్మా! అనునట్లే సంసార బంధములో చిక్కినవాడు భగవన్నామాను సంధానము చేసియే తీరును. అయినచో భగవన్నామమును చెప్పుటకు నియమనిష్ఠలు అవసరము లేదా! అన్నచో అవసరములేదు. మన పాపములను పోగొట్టు గంగ పవిత్రమైనది కదా! యని దానిలో మునుగుటకు ముందుగా వేరొక గుంటలో మునిగి ఆ తర్వాత గంగలో స్నానము చేతుమా! లేక ముందుగా గంగలోనే స్నానము చేతుమా! అట్లే భగవన్నామము చెప్పుటకు ప్రీతి విశ్వాసము తప్ప వేరొక నియమ నిష్ఠలతో పనిలేదు)

కుమారస్వామికి తండ్రియగు పరమశివుని దుఃఖమును పోగొట్టిన గోవిందుడు

నిత్యనివాసము చేయుస్థలమే తిరువనంతపురము. కావుననే నిత్యసూరులువచ్చి సేవచేయుచున్నారు. నామాట వినుడు. మనమును పోయి వారితో పాటు స్వామిని సేవించెదము.

తిరువనంతపురములో అనంత పద్మనాభస్వామి మూడు ద్వారములలో సేవ సాదించును. ఈమూడు ద్వారములసేవను గూర్చి ఆచార్య హృదయము అనుగ్రంథమున "ససైన్య పుత్ర్త శిష్య సాధ్య సిద్ధ భూసురార్చన త్తుక్కు ముఖనాభి పాదజ్గళై ద్వారత్రయత్తాలే కాట్టువమ్ సామ్యమ్ అనన్తశయనత్తిలే వ్యక్తమ్" అని వివరింపబడినది. అనగా ముఖద్వారమున నిత్యసూరులకు నాభీ ద్వారమున బ్రహ్మాది దేవతలకు పాద ద్వారమున మనవంటి వారికి సేవసాయించును అని భావము.

చరాచర ప్రపంచమును సంహరించి సృజించు పరమపురుషుడు శేషశాయియై తిరువనంతపురమున వేంచేసియున్నాడు (సృష్టి సంహారము పూర్వముగా గలదియగుటచే సంహారము ముందుగా చ్పెబడినది) మన మాతని సన్నిధి చేరి వాకిలి ఊడ్చుట మున్నగు సేవలు చేసిన మనమహాపాపములన్నియు నశించును.

ఈ క్షేత్రము మిక్కిలి సుందరమైనది. స్వామి మన్మథ జనకుడు. ఆయనకు నిత్యావాసమైనది తిరువనంతపురము. మాతో సంబంధము గలవారలందరు స్వామిని సేవింపరండు. మేము చెప్పినట్లు చేసితిరేని మీ పాపములన్నియు నశించును.

మేము పరమపదమునకు చేరు సమయము సమీపించినది. చివరిగా చెప్పుచుంటిమి. తిరువనంతపురమునకు పొండి. మంచిమనస్సుతో స్వామికి ధూపమును పుష్పములను సమర్పింపుడు. స్వామి పాదార విందములను స్తోత్రము చేయుడు. మీ పాపములు తమంతట తామే నశించును. మీకు క్షేమము కల్గును. ఇది అనుభవమైన మాట.

మాధవా! అన్నచో పాపములు రూపుమాయును. ఆ స్వామిని చందనముతో ధూపదీపములతో పద్మపుష్పములతో నిత్యము సేవించువారు నిత్యసూరులకంటె యశోవంతులగుదురు.

ఇట్లు తిరువనంతపురమున వేంచేసియున్న పద్మనాభస్వామి మహిమను. ప్రస్తుతించిన ఆళ్వార్లు ఈ దశకమును అనుసంధానము చేసిన దానికి కలుగు ఫలమును చెప్పిముగించుచున్నారు.

సేవించినంత మాత్రమున విముఖలను సైతము స్వాధీనము చేసికొనగలుగు పద్మనాభ స్వామిని గూర్చి నమ్మాళ్వార్లు అనుగ్రహించిన యీ పదిపాశురములను అనుసంధానముచేయువారు దేహావసానమున పరమపదమునుచేరి అచట దివ్యాప్సరసలచే సత్కరింపబడుదురు.

# తిరువాట్టారు

- ఉ.వే. శ్రీమాన్ డా. ఇ.ఎ. శింగరాచార్య స్వామి, తిరుపతి

## (1) తిరువాయ్ మొ(ళ్రి) వైశిష్ట్యము :

భగవద్భక్తులకు అమృతమై, సమస్త లోకమునకు ఆమోదమును కల్గించునదియై, వేయి శాఖలను కల్గిన ఉపనిషత్తుల అర్థమునకు కూడలియై, సకల జ్ఞాతవ్యర్థములను తెలుపునదియై, సామవేదసారమై వెలుగొందు తిరువాయ్‌మొ(ళ్రి) దివ్య ప్రబంధము నాలాయిర దివ్య ప్రబంధ సాహిత్యమున నాల్గవ సహస్రముగా చెప్పబడుచున్నది. వరుస క్రమమును బట్టి ఇది చివరి ప్రబంధము అయినను, విషయ గౌరవమును బట్టి ప్రప్రథమ స్థానమును పరిగణింప బడుచున్నది. ఈ ప్రబంధమునకున్నన్ని వ్యాఖ్యానములు మరియే ఇతర ప్రబంధమునకు లేకుండుటయు దీని విశిష్టతను చాటుచున్నది. ఆళ్వార్లు అందరిలోను నమ్మాళ్వార్లు అంగిగా కీర్తింప బడునట్లే, వారిచే ప్రణీతములైన నాల్గు ప్రబంధములు నాలాయిర దివ్య ప్రబంధములలో అంగిగా చెప్పబడుచున్నవి. ఆళ్వార్ల మొదటి మూడు ప్రబంధముల వివరణను తిరువాయ్‌మొ(ళ్రి) చేయుచుండుటచే ఆనాల్గింటిలోను ఈ ప్రబంధమే అంగి అని చెప్పవచ్చును. ఈ ప్రబంధము "పాఠ్యే గేయే చ మధురమ్" అని పొగడబడు శ్రీరామాయణముతో పలు విధముల సామ్యమునే కాక ఆధిక్యమును కల్గినదై, భగవానుని స్వరూప రూప గుణవిభూతులను సుస్పష్టముగా ప్రతిపాదించుచున్నది. ఇందు మొత్తము నూఱు దశకములు, 1102 పాశురములును కలవు. పాశురములు "మణ్డల అన్దాది" అనబడు తమిళ ప్రబంధ ప్రక్రియతో కూర్చబడినది. "నిరైక్కొళ్ అన్దాది", నిఱమ్ కిళర్న్ద అన్దాది' ',"అనానిల్ అన్దాది", "కేళిల్ అన్దాది" అని స్వయముగా ఆళ్వార్లు, "యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః' అని పూర్వాచార్యులును ఈ ప్రబంధమును గూర్చి పల్కిరికదా! తిరువాయ్‌మొ(ళ్రి)లోని ఒక్కొక్క దశకము ఒక్కొక్క విశేషార్థమును ప్రతిపాదించు చున్నదని మహనీయులగు పూర్వాచార్యులు అభిప్రాయపడిరి. వానిలో "అరుళ్‌పెఱువార్" (10-6) అను దశకమును గూర్చి యుధావకాశముగా ప్రస్తుత వ్యాసమున విన్నపింపబడుచున్నది.

## (2) తిరువాట్టాఱు దివ్యదేశ వైభవము :

తిరువాయ్‌మొ(ళ్రి)లోని కొన్ని దశకములలో నమ్మాళ్వార్లు ఆయా దివ్య దేశముల మాహాత్మ్యమును, అచటి అర్చా మూర్తుల మహిమను కొనియాడిరి. ప్రస్తుత దశకమున మళయాళ ప్రాంతమునకు చెందిన "తిరువాట్టాఱు" దివ్యదేశమును, అచటి స్వామిని కీర్తించిరి. ఈ క్షేత్రము తిరువనంతపురము - నాగర్‌కోయిల్ మధ్య కలదు. అచటి స్వామికి ఆదికేశవ స్వామి అనిపేరు. ఆళ్వార్లు "కేశవనెమ్బెరుమానై" అనుచు ఈ నామమును ఈ దశకములో కీర్తించిరి. స్వామి

శేషశయనమున పశ్చిమ ముఖముగా పరుండియున్నాడు. అమ్మవారు మరకతవల్లి. తీర్థమునకు కడల్ వాయ్ తీర్థము, వాట్టాఱు, రామతీర్థములను పేర్లు కలవు. విమానము అష్టాంగ విమానమని, అష్టాక్షర విమానమని ప్రసిద్ధము. "మాలైముడి నీత్తు మలర్ పొన్నడి నోవ, ప్పాలైవనమ్ నీపుకున్దాయ్ పణ్డెన్ఱు, శొలవు నాన్కేట్టా యిలేన్ కాణ్ కేశవనే, పామ్బణైమేల్ వాట్టాత్తుక్కణ్డుయిలే కొళ్వాయ్' ' (ఓ కేశవస్వామి! పూర్వము నీవు పట్టాభిషేకమును వలదని, నీ బంగారు పాదములకు నెప్పి కల్గునట్లు కఠినమైన అరణ్యమును సంచరించితివి అని విని నేను నిద్రపోలేకున్నాను. నీవు మాత్రము ఏ చింతయు లేక తిరువాట్టాఱులో శేషశయనముపై తూగుచున్నావు కదా!) అనుచు దివ్యకవి పిళ్ళైప్పెరుమాళ్ అయ్యంగార్ ఈ క్షేత్రస్వామి యొక్క శేషశయన సన్నివేశమును గూర్చి నూత్తెట్టుత్తిరుప్పది యన్దాదిలో సరసముగా పల్కిరి.

ఇచటి ఆలయము తిరువనంతపురము లోని కోవెలలో వలెనే మిక్కిలి విశాలమైనది. మూడు ద్వారములను కల్గినది. సన్నిధిలోపల శ్రీకృష్ణుని ఆలయమును కలదు. గర్భగృహములోని మూల విరాట్టు ముఖమండలముపై ఉదయ కాలమున సూర్యకిరణములు పడునట్లు నిర్మింపబడుట ఇచటి విశేషము. ఇచటి స్వామి చంద్రునకు, పరాశర మహర్షికి ప్రత్యక్షమైనట్లు చెప్పబడుచున్నది. పూర్వము ఒకానొక సమయమున కేశి అను రాక్షసుడు దేవతలను బాధించుచుండగా, వారు భగవానుని రక్షింపవేడిరి. అపుడు భగవానుడు కేశితో మల్లయుద్ధము చేసి, అతనిని క్రిందకు తోసి, అతనిపై పరుండెను. కేశి భార్య అగు ఆసూరి గంగను అచటికి ప్రవహింపుమని ప్రార్థింపగా, గంగానది తామ్రపర్ణితో కలసి గొప్ప ప్రవాహరూపమున ప్రవహించుచు వచ్చెను. అంత భగవానుని ఆజ్ఞచే భూదేవి భగవానుడు పరుండియున్న చోటును ఉన్నతము గావించెను. ఆ ప్రదేశము చుట్టును ప్రవహించిన గంగ, తామ్రపర్ణియు భగవానునకు మాల సమర్పించిన విధముగా వట్టముగా(గుండ్రముగా) అమరెను. అందువలన ఈ క్షేత్రమునకు "వట్టాఱు" అనుపేరు కల్గెను. కాలక్రమమున ఈపేరు "వాట్టాఱు" అయ్యెను. "ఆఱు" అనగా నది అని అర్థము. స్వామి కేశిని సంహరించిన వాడగుటచే కేశవుడయ్యెను. ఈ వివరములన్నియు స్థల పురాణము వలన తెలియుచున్నవి. ఈ దివ్యదేశమును నమ్మాళ్వార్లు ఒక్కరే కీర్తించిరి. "మణ్ణులకిల్ వళమ్మిక్క' ' అని, "వరైకుఴ్రివు మణిమాడ వాట్టాత్తాన్" అని, "తిరైకుఴ్రివు కడలై పుడైశూఴ్ తెన్నాట్టుత్తిలదమన్న" అని ఆళ్వార్లు ఈ క్షేత్రము యొక్క ప్రకృతి రామణీయకతను, అచటి సౌధముల సొబగును కీర్తించిరి. "మోక్షదానత్తిల్ ప్రణత పారతంత్ర్యమ్ వళమ్ మిక్కనదియిలే కరైపురళుమ్" అను ఆచార్య హృదయ చూర్ణిక వలన ఈ దివ్యదేశములోని స్వామి యందు భక్త పార తంత్ర్యము విశేష గుణమని తెలియుచున్నది. ఈ దివ్యదేశమునకు "వళమ్మిక్కనది" అను అన్వర్థమైన పేరు కలదని పూర్వోక్త ఆచార్య హృదయ పంక్తి వలన ఏర్పడుచున్నది.

**(3) దశక ప్రవేశము :**

ముందు దశకమగు "కణ్ణన్ కళ్ళిలిణై" యందు ఆళ్వార్లు భక్తియోగ నిష్ఠుల కృత్యములను
ార్చి లోకులకు ఉపదేశించిరి. "ఎణ్ణుమ్ తిరునామమ్ తిణ్ణమ్ నారణమే" (అను సంధింపతగిన
రునామము నిశ్చయముగా నారాయణ అనునదియే) అని నామసంకీర్తనమును, "అరవణైయాన్
ాళ్‌వాయ్‌మలరిట్టు నాళ్‌వాయ్‌నాడీరే" (శేషశయనుని పాదములందు పూలను సమర్పించి
ితిదినము ఆశ్రయింపుడు) అని ఆశ్రయణమును, పుష్ప సమర్పణమును, "నాడీర్‌నాడోరుమ్
ిడామలర్ కొణ్డుపాడీర్ అవన్‌నామమ్" (ప్రతిదినము వాడని పూలను గైకొని ఆశ్రయింపుడు,
ితని నామమును అనుసంధింపుడు) అని ఆశ్రయణమును, పుష్ప సమర్పణమును, నామ
ంకీర్తనమును, "నన్మలరిట్టు నినైమిన్ నెడియానే"(మంచిపూలను సర్వాధికుడగు స్వామికి సమర్పించి
్యానింపుడు) అని ధ్యానము మొదలగు భక్తి విశేష కృత్యములను లోకులకు తెలియజేసిరి.

ఇట్లు భక్తి స్వరూపమును లోకులకు ఉపదేశించు ఆళ్వార్లకు తన పట్ల గల వ్యామోహము
ృద్ధి అగుటను చూచిన సర్వేశ్వరునకు ఆళ్వార్లను తక్షణమే పరమ పదమునకు కొనిపోయి, ఆచట
ారితో ఏకాంతముగా అవిచ్ఛిన్నముగా కాలమును గడుపవలెనను వాంఛ తీవ్రమయ్యెను. ఆస్వామి
మయమును చూచి ఆళ్వార్లను పరమ పదమునకు కొనిపోవుట కొఱకై తిరువాట్టాఱులో వేంచేసి
ుండెను. కావున ఆ క్షేత్రమున స్వామి వేంచేసి యుండుట ఒక ప్రదేశము నుండి
మ్యస్థానమునకు పోవుచు, మార్గమధ్యమున చేయు పరస్థానము వంటిది. అందుచే తిరువాట్టాఱు
్రత వాసము తనకు ప్రియకరమైనను, అంతకంటె ప్రియతములగు ఆళ్వార్లను పరమపదమునకు
ినిపోవుటలోనే భగవానుడు అభినివేశమును చూపెను. మఱియు, ఆళ్వార్లకు భగవానుని పట్ల
ల వ్యామోహము కంటె భగవానునకు ఆళ్వార్ల యందలి వ్యామోహము అధికము. భగవద్గీతలో
ీకృష్ణ భగవానుడు స్వయముగా "సచ అత్యర్థం మమ ప్రియః" అని పల్కెను కదా! శ్రీరాముడును
చిరంజీవతి వైదేహీ యదిమాసం ధరిష్యతి, నజీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్" అనుచు
ి విషయమును తెలిపెను. లోకమున సొత్తుదారునకు సొత్తుపై గల వ్యామోహము, ఆసొత్తునకు
ొత్తుదారునిపై గల వ్యామోహము కన్న అధికము కదా! "ఉడైమై ఉడైయవనై పెత్తాలిరుక్కుమళవన్రితే
ుడైమై ప్పెత్తాలుడైయవను క్కిరుప్పదు " అను ఇరుపత్తునాలాయరప్పడి సూక్తి ఇచట స్మరణీయము.
ఈ సందర్భమున "ఎన్నవావఱచ్చూళ్న్దాయే" అను ఆళ్వార్ల సూక్తి, అచట నమ్పిళ్ళై ఈడులోని
తత్త్వత్రయత్తైయుమ్ విళాక్కులైక్కొణ్డు అవై కుళప్పడి యామ్పడి పెరితాన వెన్నుడైయ వభినివేశత్తై,
ితిలుమ్ పెరియ వున్నభినివే శత్తైక్కాట్టి వన్దు సంశ్లేషిత్తాయే" అను వ్యాఖ్యానమును ఉదాహార్యములు.
చట "అఱ" అనుటకు "అల్పమగునట్లు" అని అర్థమని అరుంబదకారులు వివరించిరి. "అఱ'
అనుపదము అల్పార్థకమైన నఞ్ అని ఉ.వే.ప్ర.భ. కాంచీ అణ్ణంగరాచార్య స్వామి తమ దివ్యార్థ
ిపిక అను వ్యాఖ్యానమున తెలిపిరి. అంతియేకాక, ఆళ్వార్లకు భగవానుని పట్ల అభినివేశము ఈ
న్మలో కల్గినది. కాని, స్వామికి గల ఆదరము ఆళ్వార్ల యొక్క ఎన్ని జన్మల నుండియో అను

వర్తించు చున్నది. ఈ విషయమును ఆళ్వార్లే స్వయముగా "ఎన్నిల్ మున్నమ్ పారిత్తు" (9-6-10)(నాకంటె ముందుగా ఆశపడి) అని "ఎదిర్ శూర్ర్దిల్ పుక్కు"(2-76) అని తెలిపిరి. కావున భగవానుని అభినివేశము ఆళ్వార్ల వ్యామోహము కంటె పూర్వకాలికము, అధికమును.

ఆళ్వార్లను వెనువెంటనే పరమ పదమునకు కొని పోదలచిన స్వామి నిరంకుశ స్వతంత్రుడు అయినను, అట్లు ఆళ్వార్లను తీసికొని పోవుటకు వారి అనుమతిని, ఆదేశమును అపేక్షించుచు వారికి పరతంత్రుడై నిలచెను. కాని, పారతంత్ర్యమును స్వరూపముగా భావించు ఆళ్వార్లు భగవానుని నియమింప నిష్టపడరు కదా! భగవత్పారతంత్ర్యము తన స్వరూపమని భక్తుడు భావించునట్లే, ఆశ్రిత పారతంత్ర్యము తనకు స్వరూపమని భగవానుడు తలచుట యుక్తమే కదా! ఇట్టి పారతంత్ర్యమే భగవానుని స్వరూప నిరూపకములలో ప్రధానమైనది. కావుననే గోదాదేవి తిరుప్పావై ప్రబంధమున మొదటి పాశురమున తాము అనుసంధించిన పరత్వసూచకమగు నారాయణ నామమును చిన్నపేరుగా, పిమ్మట కీర్తించిన గోవింద నామమును పెద్ద పేరుగా నుడివిరి. శ్రీరామాయణమున అయోధ్యా కాండములో వశిష్ఠుడు శ్రీరామునితో "ఆత్మానం నాతివర్తేథాః" అను పల్కు సందర్భమున "ఆత్మానంస్వా సాధారణ ధర్మత్వాత్ ఆశ్రితపారతన్త్ర్యం నాతివర్తేథాః - ఇత్యాచార్యాః" అను గోవింద రాజీయ సూక్తి ఇచట స్మరణీయము. మఱియునమ్మాళ్వార్ ఈడులోగల "ఇతుక్కుమున్బెల్లామ్ - సర్వేశ్వర నాకిఱాన్ సర్వనియంతావాయ్ స్వతంత్రనాయిరు ప్పానొరువన్ ఎన్నిరున్దార్; ఇప్పోదు అజ్గనల్ల ఆశ్రిత పారతంత్ర్యమే అననుక్కు స్వరూపమెన్గిఱార్" అను రస్యమైన వ్యాఖ్యాన పంక్తియు ఉదాహార్యము. ఇట్టి పారతంత్ర్యము భగవానుని స్వరూపమునకు శుద్ధి కల్గించుననుటను మనవాళ మహామునులు ఈ దశక ప్రమేయమును తెలుపు తిరువాయ్మొళి నూత్తన్దాది పాశరమున "ఇరువిశుమ్బిల్ ఇత్తుడన్ కొణ్డేక ఇశైవు పార్త్తే యురున్దశుత్తి" (పరమపదమునకు చరమ దేహముతో తీసికొని పోవుటకై ఆళ్వార్ల అనుమతిని ఎదురు చూచుట అనెడి పవిత్రత) అను సూక్తి ద్వారా వ్యక్తపఱచిరి. "శరైస్తు సంకులాంకృత్వా ఇత్యాదిప్పడియే పిరాట్టి తిరువుళ్లత్తై ప్పిన్శెన్ను శెయ్దాప్పోలే, ఇవరనుమతి పార్త్తే యిరున్దవనుడైయ శుద్ధియైచ్చొల్లుమ్ ఆళ్వారుడైయ శ్రావ్యమాన శబ్దజ్గళ్" అను ఈ సందర్భములోని పిళ్లైలోకమ్ జీయర్ వ్యాఖ్యానమును స్మరణీయము.

మఱియు భగవానుడు ఆళ్వార్ల నియమునమును కోరుటలో ఒక విశేషము కలదు. పరమ పురుషార్థమగు పరమ పద ప్రాప్తి కొఱకు ఆళ్వార్లు చేయు ప్రార్థనను భగవానుడు ప్రతీక్షించుట సమంజసమే. "పురుషేణ అర్థ్యతే ఇతిపురుషార్థః" అనునట్లు భక్తునిచే కోరబడునది పురుషార్థము. కావున అట్టి పురుషార్థము కోరిన వారికి మాత్రమే లభించును. లేనిచో, అడిగిన వారికి అడుగని వారికి అందరికిని ముక్తిని భగవానుడు ప్రసాదింప వలసి వచ్చుట అను సర్వముక్తి ప్రసంగము ఏర్పడును. అంతేకాక, ప్రార్థింపకనే పురుషార్థమును ప్రసాదించుట భగవానుని

పురుషోత్తమత్వమునకు లోటును కల్గించును.

ప్రస్తుత దశకమున ఆళ్వార్లు తమ పట్లఅత్యంత వ్యామోహమును చూపు భగవాను పరత్వమును, అట్టి పరత్వ విశిష్టుడై యున్నస్వామి తనకు విధేయుడై యుండుటను వర్ణించు స్పష్టముగా గోచరించుచున్నవి. ఆళ్వార్ల విషయమున భగవానుడు చూపు ఆదరాతిశయమ "(ఎన్నెఞ్జమ్) కుడికొణ్డాన్"(నామనస్సును నివాసముగా గొనెను), "నిలైపేరా నెన్నెఞ్జత్తైప్పొ(ప్పు)దుమ్ ' (నా హృదయము నుండి ఎప్పుడును కదలడు) అనుట వలన, పరత్వము "ఆప్రియాన్ (చక్రమును కలవాడు), "కైనిన్ఱశక్కరత్తన్" (చేతి యందు నిలచిన చక్రమును కలవాడు) అను వలన, భక్త పరతంత్రత " అదునమదు విదివకైయే" (అది మన నియతి ప్రకారమే), "విణ్ణులకవ్ తరువానాయ్ విరైకిన్ఱాన్ విదివకైయే" (పరమ పదమును నా నియమన ప్రకారము అనుగ్రహించుట త్వరపడుచున్నాడు) అనుట వలన తెలియుచున్నవి. ఇట్లు ఈ దశకమున పరత్వముతో కూడి ప్రణత పారతంత్ర్యము ప్రమేయముగా కన్పించు చున్నను, భక్త పారతంత్ర్యమే ప్రధాన విషయమ శ్రీరామానుజులు, వారికి పిమ్మట గల పూర్వాచార్యులు అందరును ఏకగ్రీవముగా పల్కిరి రామానుజులకు ముందు గల ఆచార్యులు విధి శబ్దమునకు అదృష్టమని అర్థము చెప్పి, భగవానుడ మన భాగ్యాను సారము పరమపదమును అనుగ్రహించునని వ్యాఖ్యానించిరి. ఈ అన్వయమున భగవానుడు ఆశ్రితుల అదృష్టానుగుణముగా అనుగ్రహించు ననియే తప్ప ఆశ్రిత పరతంత్రుడన భావము ఏర్పడదు. కావున ఇట్టి యోజన ఈ దశకములోని పాశురముల భావమునకు సరిపోద తలచిన ఆలంకారిక మూర్ధన్యులగు రామానుజులు విధిశబ్దమునకు భాగ్యమను అర్థముకాక నియమనము అను అర్థమును చెప్పి, ఈ దశకమున భగవానుని ఆశ్రిత పరతంత్రత ప్రధా విషయమని నిర్ణయించిరి. శ్రీరామానుజులు చూపిన యోజన రసవత్తరమనుటను సహృదయులెల్లర అంగీకరింతురు కదా!

భగవానుని ఆశ్రిత పారతంత్ర్య పరాకాష్ఠను దర్శించిన ఆళ్వార్లు ఆ గుణవిశేషమున అనుభవించుటకు తమకు తోడుగా నుండగల వారెవ్వరా అని పరిశీలించి చూచిరి. "ఏకఃస్వాద నభుంజీత" అని కదా సూక్తి. సంసారులు లౌకిక వాంఛలయందు మునిగి యుండుటచే వార తమకు తోడుగా నుండరని తలచిరి. అట్లే భగవానుడు తమను వెనువెంటనే పరమపదమునక కొనిపోయిన తప్ప నిలువ లేని వ్యామోహముతో కాలు తడబడుచున్నవాడని గుర్తించి, అతడున తమకు తోడు కాడని భావించిరి. ఇక మిగిలినది సుఖదుఃఖములలో తమను వీడక యుండునది భగవద్విషయమున "ముయత్తిశుమన్నై(ప్రి)న్ను మున్నునెఞ్జే" అనునట్లు తమకంటె ముందు నుండునది అగు మనస్సే కావున, దానిని ఉద్దేశించి పల్కుచు సర్వేశ్వరుని పరత్వమును, తమ విషయమున అతడు చూపు పరతంత్రతను, తాము అచింతితముగ పొందిన ఫల విశేషము గూర్చి వర్ణించుట ఇందు కానవచ్చుచున్నది.

ఈ దశకమున భగవానుని ప్రణత పరతంత్రత ప్రధాన ప్రమేయమనినచో, "ఇరుత్తుమ్ వియన్దు" (8-7) అను దశకములో కూడ ఆశ్రిత పారతంత్ర్యమే విషయమని చెప్పబడుటచే, ఆ దశకమునకు ప్రస్తుత దశకమునకు గల భేదమేమి అను శంక కలుగవచ్చును. నమ్పిళ్లై ఈడు వ్యాఖ్యానమున, పెరియ వాచ్చాన్ పిళ్లై ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానమున ఈ శంకకు ఈ క్రింది సమాధానము చూపబడినది. "ఇరుత్తుమ్ వియన్దు" దశకమున సర్వేశ్వరుని ఆశ్రిత పారతంత్ర్యమే వర్ణింపబడినను అందులకు హేతువు అచట తెలుపబడలేదు. ఇచట అట్లుకాక "అడియార్‌తమ్ అడియనేన్" (భగవానుని దాసులకు దాసుడను) అనుచు ఆళ్వార్లు తాము భాగవత శేషత్వమను చరమ పర్వమున నిలచుటచే, భగవానుడును ఆశ్రిత పారతంత్ర్యమును సహేతుకముగా అనుసంధించిరి. కావున పునరుక్తి లేదు. "మను మద్భక్త భక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్" అని భగవానుడే స్వయముగా పల్కెను కదా!

నమ్మాళ్వార్లు అనుగ్రహించిన నాల్గు ప్రబంధములలో తిరువిరుత్తము మొదటిది. తిరువాయ్మొఴి చివరిది. తిరువిరుత్తము లోని "పొయ్‌నిన్ఱఞ్ఞానముమ్" అను మొదటి పాశురము నుండి "కణ్ణన్ కழலిణై" అను ముందు దశకము వరకు ఆళ్వార్లు భగవానునకు విధేయులగుట తెలుపబడగా, ఈ దశకమునుండి చివరి వరకు భగవానుడు ఆళ్వార్లకు విధేయుడగుట వర్ణింపబడుచున్నదని ఈడు వ్యాఖ్యాన కారుల రసోక్తి. ఆళ్వార్ల పారతంత్ర్యము నాల్గు ప్రబంధములలో వర్ణింపబడగా, భగవానుని పారతంత్ర్యము నాల్గు దశకములలో తెలుప బడుచున్నదని పెద్దలు ఈ సందర్భమున చమత్కరించుట కలదు. ఆళ్వార్లు పూర్వము తమ అజ్ఞానము వలన భగవత్పారతంత్ర్యమును కోల్పోగా, ఇపుడు భగవానుడు చూపు పారతంత్ర్యము వలన మరల తమ పారతంత్ర్యమును కోల్పోవు చున్నారను ఈడు వ్యాఖ్యానములోని రసఘనమైన సూక్తి స్మరణీయము.

ఇక ఈ దశకములోని పాశురముల భావము క్రమముగా తెలుప బడుచున్నది.

(1) ఓ మనసా! భగవద్భక్తులకు దాసుడనగు నాపట్ల సుదర్శనమును ఆయుధముగా గల స్వామి నాసమ్మతిని (నియమనమును) అనుసరించి కృపచేయనున్నాడు. ఇక అజ్ఞానమును కల్గించు ఈ సంసారము నందలి జన్మను కోరను. నీవు అర్చావతారమును వీడి పరమపదమునకు పోనను అజ్ఞానమును వీడి, మనలను పరమపదమును కొనిపోవుటకై తిరువాట్టాఱు క్షేత్రమున వేంచేసి యున్న స్వామి పాదములను సేవింపుము.

(2) నాకు విధేయమగు మనసా! నాపల్కులను వింటివా! భూమి యందు భక్తుల జన్మను నశింప చేయుటకై తిరువాట్టాఱులో వెలసియున్న స్వామి పాదములను ఆశ్రయించి, కేశవుడను ఆ మనస్వామిని అనేక పాశురములలో కీర్తించి, అనాది పాపములను సైతము పూర్తిగా పోగొట్టుకొంటిమి. లోకులతో సహవాసమును వీడి ఆ శ్రీమన్నారాయణుని ఆశ్రయించితిమి.

(3) మనసా! భగవానుని పలు విధములైన నామములను కీర్తించి, ఆశ్రయించితిమి. భూమి యందు గొప్ప సంపదను కల్గిన తిరువాట్టాఱులో వేంచేసి యుండు స్వామి ఇపుడు మనకు మన నియతి చొప్పున పరమ పదమును అనుగ్రహింప త్వరపడుచున్నాడు. స్వామి మనలను అనుగ్రహించునా? అని మనము అనుకొనగా, ఇపుడీ విధముగ కార్యము సఫల మగుట మన ఊహకు మించినదికదా!

(4) అనుకూలమైన మనసా! భగవద్విరోధముచే కఠినుడైన హిరణ్యకశిపుని హృదయమును చీల్చినవాడు, తిరువాట్టాఱు దివ్యదేశాధిపతి, క్షత్రియులందఱు భయపడునట్లు భారత యుద్ధమున పాండవుల కొఱకై ఆయుధము నెత్తిన వాడును అగుమనస్వామి నాహృదయమున నిలచి, ఈ లోకమునందు గొప్పదైన ద్రావిడ ప్రబంధమును (శాస్త్రమును - అనగా తిరువాయ్మొழிని) నాద్వారా ప్రవర్తింప జేసెను. ఆ స్వామి మనలను కృప చేయగలడు.

(5) పరమపదమును చేరుటకై అర్చిరాదిమార్గమును అనుగ్రహించిన స్వామి తిరువాట్టాఱులో వేంచేసి యున్నాడు. ఆ స్వామి పల్కిన సూక్తి (కృష్ణచరమ శ్లోకము) ప్రకారము నేను పరమపదమును పొందబోవుచుంటిని. ఓ మనసా! తేనెను స్రవించు పూలతో, తులసీమాలతో ప్రకాశించు పాదములను కలవాడు, అందమైన గరుడుని అధిరోహించి సంచరించువాడు అగు స్వామి యొక్క పాదయుగము నాతలపై నున్నది. ఇట్లు నిత్యాశ్రితులు పొందు ఫలమును పొందితిమి. ఇక నరకమును (సంసారమును) పరిహసింపుము.

(6) స్వామి పాదము నాతలపై నున్నది. పద్మనేత్రుడగు నా ప్రభువు నా హృదయమునుండి చలింపడు. ఇట్లు నన్ను అన్ని విధముల వీడనివాడు, సర్వాధికుడు, పెద్ద పెద్ద సౌధములను కల తిరువాట్టాఱులో శేషశయనమున పరుండిన వాడు, మదించి, తనను చంపుటకై మీదకు వచ్చిన కువలయా పీడము (కంసుని ఏనుగు) యొక్క దంతములను విఱచిన వాడును అగు స్వామి యొక్క మనోహరముగా శబ్దించు పాదములను చేరితిమి.

(7) భగవానుడు సపరివారముగా నామనస్సును వాసస్థానముగా స్వీకరించెను. కెఱటముల సమూహమును కల సముద్రముచే చుట్టబడినది, దక్షిణదిక్కునకు తిలకము వంటిది, పర్వతముల వలె పెద్ద పెద్ద మణిసౌధములతో విరాజిల్లునది అగు తిరువాట్టాఱు దివ్యదేశమునగల స్వామి పాదపద్మములలో సమర్పింప బడుటచే సువాసనను కల్గిన తులసీమాల పరిమళము నా శరీరమున గుబాళించుచున్నది.

(8) దివ్యదేహమునుండి పరిమళించు తులసీ సువాసనతో వ్యాపించిన కిరీటమును కలవాడు, తన సంకల్పానుసారము యుద్ధము చేసితిరిగి వచ్చు సుదర్శనమును కలవాడు, సముద్ర జలము వలె, నిలచి యున్న పర్వతము వలె మిక్కిలి విలక్షణమైన దేహవర్ణమును కలవాడు, తిరువాట్టాఱు క్షేత్రమున పవళించిన వాడగు స్వామి నా మనస్సున వెలుగొందుచు నిలగుటకు నేనేమి ఉపకారమను చేసితిని? ఏమియు చేయలేదు కదా!

(9) సహజముగా ప్రకాశించు వక్షఃస్థలమున నిలచియున్న లక్ష్మీదేవిచే వెలుగొందువాడు అగు సర్వేశ్వరుడు నివసించు చోటు తిరువాట్టాఱు. గొప్పకీర్తిని కల గరుత్మంతుడు ఆస్వామికి వాహనము. యుద్ధమునకు వచ్చిన రాక్షస కులమును నిర్మూలించిన వాడు అతడు. అత్యంతము పూర్ణుడయినను ఆ ప్రభువు ఎట్టి అనాదరమును లేక నామనస్సున ఎల్లప్పుడు నిలచియున్నాడు. నాపట్ల ఎంతటి వ్యామోహము!

(10) ఎల్లప్పుడును నాకైంకర్యమును చేయుమనుచు స్వామి నా జన్మలను పోగొట్టి నన్ను తన దాసునిగా చేసికొనెను. పూర్వము నరసింహుడై హిరణ్యకశిపుని వక్షమును చీల్చిన వాడు, శరీరముపై గీతలను, కాంతిని, అనేక ముఖములను కల్గిన ఆదిశేషునిపై తిరువాట్టాఱులో పరుండియున్న ప్రభువు గొప్ప వారికి దాసులైనచో పొందదగిన ఫలమును పొందు విధమును చూపెను.

ఫలశ్రుతి :- ఈ దశక ఫలమును గూర్చి ఆళ్వార్లు మిక్కిలి రమణీయమైన రీతిలో ఇట్లు పల్కిరి.

తన స్వరూప గుణవిభూతులను ప్రకాశింప చేయు తన దివ్యదేహమును నిర్హేతుకముగా చూపి, క్రూరమైన సంసారమను నరకమును పోగొట్టిన వాడు, తిరువాట్టాఱు దివ్యదేశమున నిలచియున్న వాడగు స్వామిని గూర్చి అందమైన తిరునగరికి స్వామి అగు నమ్మాళ్వార్లు అనుసంధించుటకు, పాడుటకు మధురమగు తిరువాయ్మొழ్ఱి అను పాశుర సహస్రములోని చెవికి ఇంపగు అందమైన ఈ పదిపాశురములను వినిన నిత్యసూరులు సైతము తృప్తిని పొందక, ఇంకను వినవలెనను ఆశను పొందుదురు. ఇట్లు నిత్యసూరులను కూడ ఆకర్షింప గల్గిన పదముల శ్రావ్యత, అర్థములోని రమణీయతయు ఈ దశకమున కలదు. మఱియు భగవద్గుణములలో ఉత్కృష్టమగు ఆశ్రిత పారతంత్ర్యమిందు వర్ణ్యమగుటయు అందులకు కారణము. కావుననే మణవాళమహా మునులు ఈ దశకమును "శెమ్శొల్" (స్పృహణీయమైన వచనము) అని పల్కిరి.

ముగింపు:- "ఆఱ్ఱియాన్ అరుళ్ తరువానమై కిన్టాన్ అదునమదు విదివకైయే" అను సూక్తి ఈ దశకము యొక్క అర్థమునకు ప్రాణము. భగవానుని ఆశ్రిత పారతంత్ర్య చరమావధిని తెలుపు ఈ దశకములోని భావము తిరుప్పావై మొదటి పాశురములోని "నారాయణనే నమక్కే, పారోర్ పుకழ్ఱప్పడిన్దు పఱై తరువాన్" (భూలోక వాసులందరు పొగడునట్లు శ్రీమన్నారాయణుడు మనకు ప్రాప్యమును అనుగ్రహించును) అను సందర్భమున "అజ్జకుడిక్కొరు సంతతి" అగు గోదాదేవిచే అనుసంధింప బడినదని కీర్తిమూర్తులగు ఉ.వే.మహావిద్వాన్ కాంచీ ప్ర.భ.అణ్ణంగరాచార్య స్వామి శెజ్గత్తమిళ్ మాలై అను గ్రంథమున తెలిపిరి. "పడిన్దు" అనుటకు విధేయుడై అని అర్థము. మూలోకవాసులు పొగడుటకు భగవానుడు ప్రదర్శించు ఆశ్రితపారతంత్ర్యమే కారణమని వారి వ్యాఖ్యానములోని భావము.

తిరువిరుత్తములోని ఒక్కొక్క పాశురము తిరువాయ్మొழ్ఱిలోని ఒక్కొక్క దశకము యొక్క అర్థమును సంగ్రహముగా తెలుపుచున్నదను నిర్వాహమొకటి కలదు. ఈ వివరణము

ర్వాచార్యుల వ్యాఖ్యానములలో ఎచటను కన్పించుటలేదు. ఈ నిర్వాహమును బట్టి ప్రస్తుత
ిక భావము తిరువిరుత్తములోని "మడనెఞ్జమెన్తుమ్" (46వ పా) అను పాశురమున
ుడియున్నదని చెప్పబడుచున్నది. తిరువిరుత్తపాశురమున ఆళ్వార్ల మనస్సు తిరిగి నివర్తింప
యసాధ్యము కానట్లు భగవానుని యందు లగ్నమగుట స్వాపదేశార్థమని
ళ్లిగియమణవాళచ్చీయర్ తెలిపిరి. ప్రస్తుత దశకములోను ఆళ్వార్లు తన మనస్సుకు "మడనెఞ్జే'
అని రెండుమార్లు సంబోధించుట ద్వారా భగవత్ప్రావణ్యమున మనస్సు యొక్క సహకృతిని
ుంచిరి. తిరువిరుత్తమున ఈ ఒక్క పాశురములోనే "అప్పాన్ పెయరోన్ తడనెఞ్జమ్ కీణ్డపిరానార్'
అని నృసింహావతార ప్రసక్తి కలదు. హిరణ్యకశిపుని వక్షమును చీల్చిన ఈ వృత్తాంతము
ువాయ్మొళ్లిలో పలు తావుల కన్పించుచున్నను రెండుమార్లు ఈ దశకములో మాత్రమే
ుసంధింపబడుట గమనింపతగినది. బహుశః ఇట్టి కారణముల వలన ప్రస్తుత దశకము ముందు
ప్పబడిన తిరువిరుత్త పాశురముతో అర్థసామ్యమును కల్గియున్నదని చెప్పబడి యుండవచ్చును.

విష్ణుసహస్ర నామములోని విజితాత్మా, విధేయాత్మా, భక్త వత్సలః, చలః, అనీశః వంటి
మములు భగవానుని ఆశ్రిత పారతంత్ర్యమును, వాత్సల్యశీలాదులను నిరూపించు చున్నవని
ాశరభట్టర్ తమ భాష్యమున వివరించిరి. "విధేయాత్మా" అను నామ భాష్యమున
ిషాంవిధేయంహి, ఇహాగచ్ఛ, ఇహతిష్ఠ, ఇహాస్స్వ, ఇదంభుంక్ష్వఇతి విధాతుంచ యోగ్యం అస్యేతి
ేయాత్మా" (ఆశ్రితులకు విధేయమైన అనగా ఇచటకు రమ్ము, ఇచట నిలువుము, ఇచట
ుడుము, దీనిని భుజింపుము అని ఆజ్ఞాపించుటకు తగిన ఆత్మను అనగా స్వరూపమును
ువాడు) అని పల్కుట ఇందులకు ఉదాహరణము. ఆళ్వార్లు తమ తిరువాయ్మొళ్లి
బంధములోని పాశురములను "నామజ్గళా యిరత్తుళ్" అని పల్కుటచే అందలి వేయి
శురములు భగవానుని వేయినామముల అర్థమును విశదీకరించు చున్నవని పూర్వాచార్యులు
భిప్రాయపడిరి. కావున ప్రస్తుత దశకములోని పాశురములు పైన పేర్కొనిన నామముల,
త్సదృశములైన నామముల అర్థమును ప్రతిపాదించుచున్నవనుటలో ఎట్టి విప్రతిపత్తి లేదు కదా!

అలంకార శాస్త్ర దృష్టితో పరిశీలించి చూచినను ఈ దశకమున అత్యుత్తమమైన కవిత్వము
చరమగుమ. "తెన్నాట్టుత్తిలదమన్న", "మైనిన్తవరైపోలుమ్" వంటి సాలంకార ప్రయోగము
ుదులకు తార్కాణములు. శాస్త్రజటిలములైన రహస్యార్థములను కాంతాసమ్మిత ప్రక్రియలో
మధుర ప్రబంధ రూపమున లోకమునకు అందించి మహోపకారమొనర్చిన నమ్మాళ్వార్లు ప్రపన్న
కములకు చిరస్మరణీయులు. అట్లే వారి ప్రబంధములు మిక్కిలి ఉపాదేయములు. ప్రత్యేకించి,
విక్కినియ శొఞ్జొల్" అని ఆళ్వార్ల చేతనే కీర్తింపబడిన ఈ దశకములోని పాశురములు, అందలి
వములును అను దినము అందరికిని అనుసంధేయములు.

"శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోస్మి నిత్యమ్"

శ్రీమతేరామానుజాయ నమః

# తిరుప్పేర్ నగర్

ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి శఠకోప రామానుజాచార్య స్వామి

అంతర్వేదిపాలె

**(1)తిరుప్పేర్ నగర్ వైభవము :-** శ్రియః పతి అగు సర్వేశ్వరుని - నిర్హేతుక కృపకు పాత్రు తత్ఫలితముగా నిర్మల జ్ఞానమును పొంది, ఆస్వామి గుణసముద్రమున పరిపూర్ణము అవగాహించిన ఆళ్వార్లకు - దివ్యసూరులని; వారు అనుగ్రహించిన ప్రబంధములకు - దివ్య ప్రబంధములని, వారు కీర్తించిన క్షేత్రములకు, దివ్యదేశములనియు ప్రసిద్ధి కలదు. శ్రీవైష్ణ సంప్రదాయమున అట్టి దివ్యదేశములు 108 - వానిలో "తిరుప్పేర్‌నగర్" అను దివ్యదేశమొక దీనికే పెరునగర్ (పెద్దనగరము) అని ప్రసిద్ధమైన నామాంతరము ఉన్నట్లు - ఒరువనైయున్దిప్పొమే - అను పెరియ తిరుమొழி(5-9-3 పాశురములను) బట్టి తెలియచున్నది. ఈ క్షేత్రవ శ్రీరంగమునకు తూర్పు దిశలో సుమారు 15 కి.మీ. దూరమున కలదు. కోవిలడి అనునది దీ యొక్క వ్యావహారిక నామము - తిరుపతికి గడపవంటి దగుటచే గడపకు ఆపేరు వచ్చిన కోయిల్(కోవిల్) అనబడు శ్రీరంగమునకు - పాదస్థానమున ఉండుటచే (మిక్కిలి సమీపము నుండుటచే) ఈ క్షేత్రమునకు కోవిలడి అని పేరు కల్గినదేమో! ఇచటి ఆలయము ఉన్నతమై స్థలమున నిర్మింపబడినది - మూలమూర్తికి అప్పక్కుడత్తాన్, అప్పాలరంగనాధన్ అనిపేర్లు ప్రతి దినము రాత్రి శయన సమయమున అరవణై ప్రసాదముగా అప్పాలను నివేదించటచే ఈ పేర్లు కల్గినవని చెప్పుదురు. పేరుకు తగినట్లే - స్వామి కుడిచేతి క్రింద కుంభము దర్శనమిచ్చు - స్వామి శేషశయనమున పశ్చిమ ముఖముగా పరుండియున్నాడు. అమ్మవారికి ఇందిరాదేవి కమలవల్లి అని పేర్లు కలవు. విమానము ఇంద్ర విమానము. తీర్థము ఇంద్రతీర్థము. కొల్లిడం ఆ ప్రసిద్ధము. ఇచటి స్వామి ఉపమన్యువునకు, పరాశర మహర్షికిని ప్రత్యక్షమని స్థలపురాణము వల తెలియచున్నది. ఈ దివ్యదేశమును నమ్మాళ్వార్లు - తిరుమఙ్గైయాళ్వార్లు - తిరుమழிశైయాళ్వా పెరియాళ్వార్లును కీర్తించిరి. నమ్మాళ్వార్లు కీర్తించిన దివ్యదేశములలో ఇది చివరిది అందుచే ఆళ్వా ఈక్షేత్రము నుండియే - పరమ పదమును పొందినట్లు ఐతిహ్యము ఏర్పడియుండవచ్చును.

నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొழிలోని తిరుమాలిరుమ్ శోలై అను 10-8(ఈ) దశకము ఈ క్షేత్రవైభవమును, ఆచటి ఆర్చామూర్తి మాహాత్మ్యమును కీర్తించిరి - కొడిక్కోపురమాడఙ్గళ్‌శూ తిరుప్పేరాన్, వణ్ణనన్ మణిమాడఙ్గళ్ శూతిరుప్పేరాన్; కున్తైన్న తికళ్ మాడఙ్గళ్ శూழ் తిరుప్పేరా అనుచు అచటి సౌధముల అందమును ఔన్నత్యమును - కిళితావియ శోలైకళ్‌శూழ் - తేనేయ్‌పొழ

వణ్డుకళిక్కుమ్‌పొఴ్ఱిలో శూఴ్, అనుచు అచటి అందమైన తోటలను - మణవాళర్‌కళ్‌వాళ్ తిరుప్పేర్: అనుచు ఆ క్షేత్రము - వేదవిదులకు నివాసమగుటను ఆళ్వార్లు ఈ దశకమున వర్ణించిరి. తిరువాయ్‌మొఴ్ఱిలో కీర్తింపబడిన ఒక్కొక్క దివ్యదేశములో గల అర్చామూర్తి - ఒక్కొక్క గుణమును ప్రధానముగా ప్రకాశింప చేయుచున్నట్లు ఏర్పడుచున్నది. తిరుమాలిరుమ్‌శ్శో" దశక ప్రమేయమును. పూర్వాపర సందర్భములతో తెలిసికొనుటద్వారా ఈ గుణమును యధావకాశముగా నిరూపించుట ప్రస్తుత వ్యాసము లోని ఉద్దేశ్యము.

**(2) భగవానుని స్వామిత్వము:**

స్వామీత్వీశ్వరః పతిరీశితా - అని అమరము - స్వంఅస్యఅస్తీతి స్వామీ, తస్యభావః స్వామిత్వమ్ అనువ్యుత్పత్తిని బట్టి స్వామి అనగా సొత్తు దారుడనియు సొత్తును కల్గియుండుట స్వామిత్వ మనియు తెలియచున్నది. లోకమున సొత్తుదారులు పలువురు పలు విధముగా కలరు. వారి స్వామిత్వము సోపాధికము. కావున పరిమితము. అనిత్యము. కాని భగవానుని స్వామిత్వము. అట్టిది కాదు అనగా నిరుపాధికము అగుటచే అపరిమితము. నిత్యము. జీవులకు దాస్యమును - భగవానునకు స్వామిత్వమును సహజమైన వనుటను. భగవత ఏవాహమస్మి "ఆత్మదాస్యం హరేః స్వామ్యం స్వభావంచ సదాస్మర.. స్వత్వమాత్మని సంజాతం స్వామిత్యం బ్రహ్మణిస్థితమ్" అని మొదలుగా గల పలుప్రమాణములు తెలువుచున్నది - స్వామిత్యం - "స్వవ్యతిరిక్త వస్తుషుస్వకీయత్వాభిమానః - అని అష్టశ్లోకీ వ్యాఖ్యానమున ప్రతివాది భయంకరం అణ్ణన్ - క్లుప్తముగా నిర్వచించిరి - విశదవాక్ శిఖామణి అగు మణవాళమహామునులు ముముక్షుప్పడి వ్యాఖ్యానమున "స్వామిత్వమావదు - ఇవన్ విముఖనాన దశైయిలుమ్ విడాదేనిన్ఱు సత్తైయై నోక్కిక్కొణ్డు పోరుకైక్కు హేతువాన ఒరుసంబంధ విశేషమ్ - అదావదు ఉడైయవనాయిరుక్కు మిరుప్ప, అద్వేషమ్ తొడజ్గి కైంకర్య పర్యంతమాక ఉణ్డాన స్వభావ విశేషజ్గళై యెల్లామ్ ఉణ్డాక్కుకిఅది" అనుచు స్పష్టముగా విశదీకరించిరి - చేతనుడు భగవద్విముఖుడై యున్నప్పుడును భగవానుడు అంతర్యామిగా నిలచి రక్షించుటకును - అద్వేషము మొదలు కైంకర్య పర్యంతము గల చేతనుని ప్రవృత్తుల కన్నిటికిని మూలకారణమైనది స్వభావ సిద్ధమైన సంబంధమే - స్వామిత్వము. దీని వివరణమును అప్పన్ శ్రీనివాసాచార్యలను మహనీయులు సాయించిన అష్టశ్లోకి వ్యాఖ్యానమున గమనింపవచ్చును.

**(3) ఆశ్రయణసౌకర్యాపాదకగుణములు - స్వామిత్వము.**

సహజమగు భగవానుని స్వామిత్వము. తిరుమంత్రము లోని నమఃశబ్దార్ధ తాత్పర్యమని పిళ్లైలోకాచార్యులవారు. నవవిధ సంబంధమున వివరించిరి. తిరుమంత్రములోని - ద్వయములోని పూర్వోత్తర ఖండముల లోని నారాయణ పదముచే, అట్లే శ్రీకృష్ణ చరమ శ్లోకములోని మాం అను సర్వనామ శబ్దముచే స్వామిత్వము తెలుపబడుచున్నది. కావున ఈ గుణము వాత్సల్యాది ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములలో జ్ఞానశక్త్యాది ఆశ్రిత కార్యాపాదక గుణములలోను

నుసంధింపబడుచున్నదని తేలినది. అయినను ఈ గుణము యొక్క ప్రాముఖ్యము ఆశ్రయణ ాకర్యా పాదక గుణములలోనేనని పూర్వాచార్యులు తలచిరి. కావుననే మణవాళ మహామునులు ముముక్షుప్పడి వ్యాఖ్యానమున "ఇవత్తిల్ నాలుమ్ ఆశ్రయణ సౌకర్యాపాదకమ్, జ్ఞానాది కళిరణ్డుమ్ ఆశ్రిత కార్యాపాదకమ్" అని సాయించిరి.

మాతాపితా భ్రాతా నివాసః శరణం సుహృత్ నారాయణః అను సుబాలోపనిషద్వాక్యమున - మాతృ పదముచే వాత్సల్యము. పితృపదముచే స్వామిత్వము - భ్రాతృపదముచే సౌశీల్యము, నివాస పదముచే నిత్య సాన్నిధ్య రూపమైన సౌలభ్యము అను ఆశ్రయణ సౌకర్యాపాదక గుణములు కలుగును, శరణ శబ్దముచే ఉపాయము. సుహృత్ శబ్దముచే ఆశ్రిత కార్యాపాదకములగు జ్ఞాన శక్త్యాదులు సూచింపబడుట ఇచట స్మరింపనగును. మఱియు ప్రపన్న జనకూటస్థులగు నమ్మాళ్వార్లు భగవానుని శరణాగతి చేయుచు "నికరిల్ పుకళాయ్" అని వాత్సల్యమును "ఉలకమ్ మూన్డుడైయాయ్" అని స్వామిత్వమును.. ఎన్నైయాళ్వానే, అని సౌశీల్యమును, "తిరువేజ్గడత్తానే" అని సౌలభ్యమును పైన ఉదహరించిన ఉపనిషద్వాక్యచ్ఛాయలో పల్కుటయు - ఇచట అనుసంధేయము.

## 4) ఆశ్రిత కార్యాపాదక గుణములు - స్వామిత్వము:

స్వామిత్వము ఆశ్రిత కార్యాపాదక గుణములలో కూడ కీర్తింప బడుచున్నదని పూర్వోక్తమే కదా! పరాశరభట్టర్ అష్టశ్లోకిలో ద్వయ మంత్రము యొక్క పది అర్థములను - నేతృత్వం అను శ్లోకమున తెలుపుచు, స్వామిత్వమును పేర్కొనిరి - ఈ స్వామిత్వము ఉత్తర ఖండములోని నారాయణ పదముచే బోధింప బడుచున్నదని వ్యాఖ్యానమున స్పష్టపడుచున్నది. - కావున ద్వయములోని ఉత్తర ఖండములో గల నారాయణ పదమునకు ప్రకరణవశముచే స్వామిత్వ గుణములో ప్రధానమైన దృష్టికలదని ఏర్పడుచున్నది. ఇన్నారాయణపదమ్ జ్ఞానశక్త్యాది సమస్త కల్యాణగుణఙ్గళైయుమ్ శొల్లుమేయా కిలుమ్ - ఇజ్గే ప్రకరణ బలత్తాలే కైంకర్యత్రినుడైయ స్వరూప ప్రాప్తతా హేతువాన స్వామిత్వత్రిలే నోక్కాయిరుక్కుమ్-అను శ్రీనివాసాచార్య వ్యాఖ్యాన సూక్తి ఇచట స్మరణార్హము - ప్రస్తుత దశకమున ఆళ్వార్లు కైంకర్య ప్రార్థనను చేయు "ఉత్తేను న్నుపణిశెయ్‌ది - అను పాశురమున "ఈదేఎన్నుమ్ వేణ్డువదుఎన్దాయ్" అనుచు స్వామిత్వ గుణ ప్రకాశకమగు"ఎన్దాయ్" అను సంబోధనతో భగవానుని కీర్తించుటయు గమనింపతగును - కావున నారాయణ పదము సహజముగా భగవానుని సమస్త కల్యాణ గుణములను నిర్దేశించుచున్నను, కైంకర్య ప్రార్థనా రూపమగు ప్రకరణ వశముచే తదనుబంధియగు స్వామిత్వ గుణమును ప్రత్యేకముగా తెలుపు చున్నదని చెప్పవచ్చును. స్వామి విషయమున చేయుకైంకర్యమే కదా. స్వరూపానురూపమగునది. శేషిత్వము స్వామిత్వ ప్రయుక్త మగుటచే పిళ్లైలోకాచార్యులు వారునక- శేషిత్వత్తిలేనోక్కు" అని నారాయణ (ఉత్తర ఖండములోని) పదార్థమును గూర్చి పల్కిరి.

**5) స్వామిత్వము - ప్రాప్తి :-** ఆశ్రిత కార్యాపాదకగుణములలో పరిగణింపబడు ప్రాప్తి, స్వామిత్వములు రెండును అభిన్నములుగా ఆపాతతః కనుపించినను ఆ రెండు గుణములును స్వల్ప భేదమును కల్గిన వగుటచే వేర్వేరు అని చెప్పనగును - స్వామిత్వమనగా - జీవుని సత్త మొదలు కైంకర్య ప్రధాన పర్యంతము భగవానుడు చేయు ప్రయత్నమునకు మూలకారణమగు సంబంధ విశేషము - ఈసొత్తు నాదన్న భావము .. ప్రాప్తి అనగా - సమస్త వస్తువులయొక్క కలాతిశయములను పొంది; ఆనందించుటకు మూలమైన సంబంధము - సర్వశేషిత్వమని సంగ్రహముగా చెప్ప వచ్చును. కావున ఈ గుణములు పరమార్ధతః భిన్నములు అందువలననే భగవద్రామానుజులు గద్యత్రయమున "అశేష చిదచిద్వస్తు శేషిభూత!" అని ప్రాప్తిరూపమైన సర్వశేషిత్వమును, అఖిల జగత్స్వామిన్, అస్మత్స్వామిన్, అని స్వామిత్వమును వేర్వేరుగా కీర్తించిరి.

**5) స్వామిత్వము - వాత్సల్యము :** ఆశ్రయణసౌకర్యాపాదక గుణములలో వాత్సల్య గుణము ప్రప్రధముగా కీర్తింపబడినను ఈ వాత్సల్య గుణము స్వామిత్వమూలమగుట గమనింప దగినది "అంగుష్ఠ మాత్రః పురుషః మధ్య ఆత్మనితిష్టతి, ఈశానో భూతభవ్యస్యనతతో విజుగుప్సతే' అను ఉపనిషద్వాక్యము వలన అంగుష్ఠ మాత్రుడగు పరమాత్మ జీవాత్మ మధ్యలో అధివసించియున్నాడు. అతడు భూత భవిష్యత్ వర్తమానకాలముల కధిపతి. కావుననే అట్లు నిలచియుండుటకు జుగుప్సను పొందడు. అని ఏర్పడుటచే దోషాదర్శిత్వ దోషభోగ్యత్వ రూప వాత్సల్యమునకు "ఈశనో భూత భవ్యస్య" అను స్వామిత్వము కారణమగుట స్పష్టబడుచున్నది.

ప్రధానముగా సౌలభ్య గుణ ప్రకాశమగు అర్చామూర్తియందు పరత్వ ప్రధానమగు స్వామిత్వమెట్లు ప్రకాశించును అనినచో తన దివ్యదేహమును సామాన్యుల కన్నులకు సైతము కనిపించునట్లు చేయుట అను సౌలభ్యమునకు మూలకారణము స్వామిత్వమగుటచే. అట్టి సౌలభ్యమునకు మూలమగు స్వామిత్వమును ఇచట అను సంధించుటలో విప్రతిపత్తి లేదుకదా! ఈ సందర్భమున -- ఇవైయెల్లామ్ నమక్కు నమ్బెరు మాళ్ పక్కలిలే కాణలామ్ - అను ముముక్షుప్పడి సూత్రము - స్వామిత్వ ప్రకాశకమాక క్కవిత్తుముడియుమ్" అను మణవాళమహా మునుల వ్యాఖ్యాన సూక్తియు అనుసంధింప తగినవి.

ఇట్లే సౌశీల్యమునకును మూలకారణము స్వామిత్వ మనియు చెప్పనగును. మఱియు స్వామిత్వ గుణము యొక్క ఫలమును గూర్చి తెలుపు ముముక్షుప్పడి లోని "కార్యమ్ శెయ్యుమెన్నుతుణీకైక్కు స్వామిత్వమ్ అను సూత్రమును బట్టి భగవానుడు తప్పక తన కార్యమును సఫలము చేయునని భక్తుడు విశ్వసించుటకు స్వామిత్వము కారణమగునని తెలియ చున్నది. అట్టి స్వామిత్వము " తిరుమాలిరుఞ్జలై'' దశకమున ప్రతిపాదింపబడినదని పూర్వాచార్యుల నిర్వాహము.

## (7) తిరుమాలిరుఞ్జోలై దశకములోని స్వామిత్వము:

పై అంశము ప్రస్తుత దశక ప్రమేయమును పరిశీలించిన స్పష్టమగును "తిరుమాలిరుఞ్జోలై మలై ఎన్రే నిన్న తిరుమాల్ వన్దెన్నెఞ్జే నిఱైయ ప్పుకున్దాన్. అనుటచే భగవన్నిర్హేతుక విషయీకారము "ఊనేయ్ కురమ్బై యదనుళ్ పుకున్దు" అనుట వలన వాత్సల్యమును, "తాన్ తడుమాఱ్ఱ వినైకళ్ తవిర్త్తాన్" అని విరోధి నిరసనమును మేలైత్తొణ్డుకళిత్తు అన్దితో(మ్) శొల్లుపెత్తేన్ - అనుచు కైంకర్య ప్రధానమును "ఇన్టెన్నై పొరుళాక్కి" అని సత్తను కల్గించుట "అడఙ్గ పిడిత్తేనే" అని పూర్ణ విషయాకారమునకు పాత్రులగుట. ఈ దశకమున తెలుపబడినవి - చేతనుని అద్వేషము మొదలు కైంకర్యము వరకు గల ప్రవృత్తులన్నియు ఈ స్వామిత్వ గుణ ప్రయుక్తములగుటచే పై సూక్తులన్నియు భగవానుని స్వామిత్వమును ప్రతిపాదించుచున్నవి కదా! మఱియు ఈడు వ్యాఖ్యానములో ఈ దశక ప్రవేశములోని ముదలివై జగుత్సృష్ట్యాదికళై ప్పణ్ణి త్తన్పక్కలిలే యిచ్చై యైంపిఱపిక్కై క్కువళ్ళియిట్టవైత్తాన్ - తన్పక్కలిలే ఉపాయ భావత్తై ఏఱిట్టుక్కొన్డుపోయ్నిన్టఞ్జానన్దడఙ్గి యివ్వళవాక తన్పక్కలిలే వరనిఱుత్తినాన్ - పరభక్తి తొడఙ్గ పరమభక్తి పర్యంతమాన దశావిశేషఙ్గళై పిఱప్పిత్తాన్" అను సూక్తులిచట స్మరణీయములు.

## (8) దశక ప్రవేశము :

ఆరుళ్పెఱువారడియార్ అను దశకమున ఆళ్వార్లు భగవానుడు తమను పరమపదమునకు తీసుకొని పోవుటలో ప్రదర్శించు పారతంత్ర్య గుణమును కీర్తించిరి. ఈ దేహముతో ఆళ్వార్లు తనను కీర్తించిరి కదా అను భావము భగవానునకు ఆళ్వార్లను చరమ దేహముతో పరమపదమునకు కొనిపోవలయునను అభినివేశమును కల్గించెను. భగవానుని ఈ భావమును గమనించిన ఆళ్వార్లు అట్టి ప్రయత్నము తగదని సపాద గ్రహణముగా ప్రార్థించిరి. భక్త సులభుడగు స్వామి వారి ప్రార్థనను మన్నించెను. ఈ వృత్తాంతము "శెఞ్జల్ కవికాళ్" దశకమున తెలుపబడినది. అఱుళ్పెఱువార్ దశకమునకు ప్రస్తుత దశకమునకు మధ్య జరిగిన ఈ వృత్తాంతము "శెఞ్జల్ కవికాళ్" దశకమున ప్రవృత్తమగుచే. అది పూర్తి అయిన వెంటనే పూర్వము వలెనే మరల సర్వేశ్వరుడు ఆళ్వార్లను పరమపదమునకు చేర్చుటలో తొందరను చూపసాగెను. భగవానుడు కొందరిని ఆతివాహికుల ద్వారా మఱికొందరిని పెరియ తిరవడి(గరుత్మంతుని) ద్వారా పరమపదమునకు చేర్చును. ఆళ్వార్ల వంటి పరమ భక్తులను తానే స్వయముగా గరుడ వాహనారూఢుడై వచ్చి "సగౌరవముగా తీసికొనిపోవును" అహం స్మరామి మద్భక్తం నయామి పరమాంగతిమ్" అను శ్రీవరాహ స్వామి వచనమిందులకు ప్రమాణము. మఱియు తిరువిరుత్త ప్రబంధములోని "నానిలమ్" అను పాశురమున భగవానుడు "సంసారమను" "ఊషరక్షేత్రమును దాటిపోయితిమి పునరావృత్తి లేని దివ్య దేశమును చేరితిమి" అనుచు పరాంకుశనాయకితో పల్కుటను బట్టి స్వామి పరమ భక్తులను స్వయముగా పరమపదమునకు తీసుకొని పోవునని తెలియుచున్నది కదా!

) ఆళ్వార్ల ఆలోచన :

భగవానుడీ విధముగ తనను పరమపదమును కొనిపోవుటకిప్పుడు చూపు తొందరకు ారణమేమి" అని ఆళ్వార్లు తనలో ఆలోచించిరి - అందులకు తగిన హేతువేమియు వారికి ుబడలేదు. మొట్టమొదట సర్వేశ్వరుడు తమకు తన పట్ల ద్వేషమును కల్గించుటను, ర్మాలముగా విశేషముగా కటాక్షించుటను, తన విషయమున ఆసక్తిని పెంపొందించుటను - నే (భగవానుడే) ఉపాయమను బుద్ధిని కల్గించుటను, అనేకములగు తమ అసహ్యాపచారములను తము క్షమించుటయే కాక - ఇతర విషయములలో ఆసక్తిని గలతాము "స్వామీ! నాకుపలు 'కిక విషయములను చూపి నశింప చేతువా? అని తలచునట్లు చేయుటను" తాను లేనిచో ుపలేనంతటి వ్యామోహమును కల్గించుటను, తానే స్వయముగా వచ్చి పరమ పదమునకు ుకొని పోవుటలో తొందరపడుటను - అనుసంధించిన ఆళ్వార్లు ఇంత కాలము తమను గవానుడు ఎందులకు ఉపేక్షించెను? ఇపుడెందులకిట్లు ఆదరించు చుండెనని పరిశీలించి చూచిరి. ని వారికి హేతువేమియు కనుపింప లేదు. తమ దృష్టిలో కారణము లేకున్నను, భగవానుని ృష్టిలో కారణమైన ఉండవచ్చును కదా! అనినచో - చిరకాలము అళ్వార్లను పొందవలెనని గవానుడు ఆశపడుటచే ఇపుడు ఆళ్వార్లు ఏదియో సుకృతము చేయుట వలన భగవానుడు నుగ్రహించెనన వీలు లేదు. మఱియు అట్టి సుకృతమును దేనిని భగవానుడు ఎదురు చూడడు వా! కావున ఈ విషయమును గూర్చి ఆళ్వార్లు భగవానుని ప్రశ్నింపదలచిరి. ఆళ్వార్లు అడిగిన శ్నలకు సర్వేశ్వరుడు సైతము నిరుత్తరుడయ్యెను. అంత "యమే వైషవణుతే తేన లభ్యః" అనునట్లు గవానుని నిర్హేతుక కృపయే ఇందులకు కారణమని తలచిన ఆళ్వార్లు అందులకు మూలమగు ్వామిత్వమును అనుసంధించుచు, సంతోషించుట ఈ దశకములోని ప్రధానాంశము. ఆళ్వార్లకు గవానునకు మధ్య సంవాదము జరిగినదనుట "ఇన్రెన్నైప్పారుళాక్కి" అనుపాశురమును బట్టి ని తెలియనగును. మణవాళ మహామునులు ఈ దశక ప్రమేయమును తెలుపు "తిరుమాల్ న్బాల్ విరుప్పమ్ శెయ్‌కిన్ర నేర్‌కణ్డారు మాయత్త అన్నగల్వి ప్పానెన్, పెరుమాన్నీయిన్రై న్బాల్‌శెయ్ ెన్నెన్న విడరుత్తు నిన్రాన్ తున్నుపుకర్రిరిమారునైత్తాన్ శూర్రిన్ను" అను పాశురమును సైతము ఈ ప్రక్రియలోనే సాయించిరి.

(౦) ఆళ్వార్ల భగవానుల మధ్య సంవాదము :

జీవుడు భగవద్విముఖుడై యున్న సమయమున కూడ అంతర్యామిగా నిలచి రక్షించుట ుండి కైంకర్య ప్రధాన పర్యంతము భగవానుడు చేయు కార్యములన్నియు స్వామిత్వ గుణ ంయుక్తములు. ఈ వివరమును తెలుపు - ఆళ్వార్లకు భగవానునకు మధ్య జరిగిన సంభాషణ ూడు వ్యాఖ్యానమున ఇన్రెన్నైప్పారుళాక్కి " అనుపాశుర వ్యాఖ్యానమున; ఆచార్య హృదయములో

సూత్రవ్యాఖ్యానమున మిక్కిలి హృదయంగమముగా వర్ణింపబడినది -ఇచటి సంభాషణ వివరము ఈడు వ్యాఖ్యానమును బట్టి చూపబడినది.

**ఆళ్వార్లు :** : సర్వేశ్వరా! ఇంతవరకు నీవు నన్ను వదలి పెట్టుటకు, ఇపుడిట్లు దయ చూపుటకు గా కారణమును తెలుపుము.

**భగవానుడు :** ఆళ్వారే! దీనిని గూర్చి నేను పలుకవలెనా? మీకే తెలియును కదా!

ఆళ్వార్లు : స్వామీ! దాసునకు తెలియదు - సర్వజ్ఞుడవగు నీవే తెలుపుము.

భగవానుడు : అయినచో నేను మీ హృదయమున ప్రవేశించునపుడు మీరు అనుమతించిరి కదా! అందుచే మిమ్ములను అనుగ్రహించితిని.

ఆళ్వార్లు : ఓహో అదియా సంగతి! యానొట్ట యెన్నుళ్ ఇరుత్తువమ్" అనునట్లు నేను సమ్మతించి నాయందు నీవు ఉండదలచిన ఉండుమని భావించిన వాడను కాదు కదా!

భగవానుడు : అదిలేకున్నను, నేను మీయందు ప్రవేశించిన పిదప నన్ను ఆదరించిరికదా!

ఆళ్వార్లు : మరువిత్తొ్ర్రమ్ మనమే తన్దాయ్" అట్టి మనస్సును ప్రసాదించినది నీవేకదా స్వామీ!

భగవానుడు : నిజమే - అట్టి మనుస్సును ఇచ్చినది నేనే అయ్యును నన్ను ఆదరించినట్లు మిగిలిన విషయములను మీరు ఆదరించలేదు కదా!

ఆళ్వార్లు : సర్వేశ్వరా! "ఎన్నైత్తీ మనమ్‌కెడుత్తాయ్" అను విధముగా నాలోని విషయాన్తర ప్రావణ్యమును నివర్తింపచేసినది నీవే కదా!

భగవానుడు : ఇవి ఏమియు లేకున్నను నేను మీకు ప్రసాదించిన భక్తి రూపజ్ఞానమును అభివృద్ధి చేసికొనిరి కదా!

ఆళ్వార్లు : స్వామీ! కాదల్ కడల్ పురైయ విళై విత్త కారమర్‌మేని" అనునట్లు అట్టి భక్తి విశేషమును వృద్ధి చేసినది కూడ నీవే -

ఇట్లు ఆళ్వార్లు పలుకగానే సర్వజ్ఞుడగు భగవానుడు సైతము ఇంతకాలము ఆళ్వార్లపై ఏదో ఒక దోషమును ఆరోపించి కోల్పోయిన నేను ఏమని బదులు పల్కగలను? అని తలచి నిరుత్తరుడై లజ్జాభారముతో కాలితో నేలను వ్రాయుచు నిలచెను. ఇట్టి స్థితిలో సర్వేశ్వరుని చూచిన-ఆళ్వార్లు భగవానుని నిర్హేతుక కృపయే తమను అనుగ్రహించుటకు కారణమని తలచి, ఆగుణమునకు మూలమగు స్వామిత్వమును ఈ దశకమున కొనియాడిరి -

ఇక ఈ దశకములోని పాశురముల భావము సంగ్రహముగా తెలుప బడుచున్నది.

(11) దశక ప్రమేయము

(1) యాదృచ్ఛికముగా నేను "తిరుమాలిరుఞ్జోలైమలై అనగానే. ఆమాటను

సహృదయోక్తిగా గ్రహించి శ్రియఃపతి నామనస్సున నిత్యవాసము చేయు దివ్య దేశము గొప్ప మణులను తీరమునకు చేర్చు నీటిని కల్గిన కావేరి నదికి దక్షిణ దిశలో గల తిరుప్పేర్‌నగర్ -

(2) తిరుప్పేర్ నగర్‌లో నిత్యవాసము చేయు స్వామి. ఇక ఈ చోటును వీడననుచు నామనస్సున పూర్ణముగా ప్రవేశించెను. పుష్కలావర్తకాది మేఘములను ఏడింటిని ఏడు సముద్రములను – సప్త కులపర్వతములను తన ఉదరముననుంచుకొన్నను" అయ్యో! రక్ష్య వర్గమునకు ఏమియు చేయలేక పోయితినే" అను అతృప్తితో నుండువానిని నేను అంతయు చేయ గల్గితినని - తృప్తి పడునట్లు పూర్ణముగా ఆశ్రయించి అనుభవించితిని.

(3) (సర్వేశ్వరుని పాదములను) ఆశ్రయించితిని - జన్మ పునరావృత్తము కానట్లు నశింప చేసికొంటిని - ఇకపై పుణ్యాపాపరూపములగు కర్మలను పొందను. సంసారమున - ఉండుటకు హేతువగు మాయను -నివర్తింపచేసికొంటిని - ధ్వజములతో, గోపురములతో, సౌధములతో నిండిన తిరుప్పేర్ నగర్‌కు అధిపతి అగు స్వామియొక్క పాదములను చేరుట నాకు సులభమైన తీరు ఎట్టిదో కదా!

(4) మిక్కిలి దుర్లభమయిన విషయమిట్లు సులభమైనది కదా! అని నా కన్నులు సంతోషించునట్లు - సంతసించిన వాడనై ఆనందించు చున్నాను - చిలుకలు సంచరించు తోటలు కల్గిన తిరుప్పేర్ నగర్‌లో నిలచియున్న స్వామి ఉత్తమమైన పరమ పదమును అనుగ్రహించును.

(5) తేనె నిండిన తోటలను కల్గిన తిరుప్పేర్ నగరాధిపతి నాకు పరమ పదమునిచ్చెదనని తలచి - ప్రతిజ్ఞ చేసి మాంసప్రచురమై - ఆత్మకు ఆధారమగు ఈ శరీరమున ప్రవేశించెను - నన్ను మిక్కిలి బాధించు పుణ్యాపాపములను నశింపచేసెను.

(6) తిరుప్పేర్ నగరము నందు నివసించువాడు, తిరుమాలిరుఞ్జోలై పర్వతమున అధివసించి యున్న వాడును అగు భగవానుడు ఇపుడు వచ్చి - ఇచట నివసింతుననుచు - నా హృదయమున నిండుగా ప్రవేశించెను - భగవానుని అనుగ్రహమును పొంది ఆస్వామి యొక్క గుణానుభవమనెడి అమృతమును పానము చేసి సంతోషింతిని -

(7) ఇట్లు అనుభవించి, సంతోషించిన నాకు ఏకొఱతయు లేదు. గొప్పదగు భగవద్దాస్యమను రసము అధికమై తత్పర్యవసానమైన.. నమో"వాచకమును పలుకగల్గితిని. అనగా ఆనందము వలన పుట్టినదియు, నమశ్శబ్దార్థమును అగు తిరువాయ్‌మొழிని సేవింప గల్గితిని. తుమ్మెదలు ఆనందించు తోటల చే పరివేష్టితమైన తిరుప్పేర్ నగరమున నివసించుస్వామి నేను సేవించి సంతోషించునట్లు నానేత్రములందుండి ఎచటకును పోవుట లేదుకదా! ఆహా!

(8) స్వామి నా కన్నుల నుండి కదలడు కదా! ఆ భగవానుడు నాపట్ల చూపు ఆదరము ఎట్టిదో నా మనస్సునకును అందనిది. అతడు స్వప్రయత్నముతో తెలియగోరిన వారికి

అతిసూక్ష్మముగా తోచువాడు (గోచరము కానివాడు) ఆయనను సప్త స్వరముల రస స్వరూపుడగుటచే పరమ భోగ్యుడై మిక్కిలి ఆశింప తగినవాడు. చిత్ర వర్ణములు గల గొప్ప మణులతో నిర్మింపబడిన గృహములచే నిండిన తిరుప్పేర్ నగరమున నివసించు స్వామి నాహృదయమున ఇప్పుడు ప్రవేశించినది నిజము.

(9) ఇపుడు నన్ను ఒక వస్తువుగా చేసి తనను నాయందు నిలిపెను. ఇంతకముందు నన్ను విషయాంతరముల యందు పోవునట్లు ఉపేక్షించినది ఎందులకు? పర్వతముల వలె ప్రకాశించు సౌధములచే నిండిన తిరుప్పేర్ నగర్‌లో వేంచేసి యున్న స్వామి ఈ విషయమున నాకు ఒక సమాధానమును కృప చేయవలెనని ప్రయత్నించితిని.

(10) ఛిద్రమైన ఓడ ఒడ్డుకు చేరునట్లు నిన్ను చేరితిని - సంతోషించి, నీకు కైంకర్యమును చేసి తిరువాయ్‌మొళ్ళిని పాడి నీ పాదములను పొందితిని. స్వామీ! ఇదియే ఎన్నటికిని నేను కోరునది. వేదవిదులగు శ్రీవైష్ణవులు నిత్యావాసము చేయుచున్న తిరుప్పేర్ నగర్‌లో వేంచేసియున్న స్వామి అగు నీకు అనన్య భక్తులగు వారికి దుఃఖములు నిలువవు -

(11) ఫలశ్రుతి : విశాలములైన సస్యక్షేత్రములచే చుట్టబడిన తిరుప్పేర్‌నగర్‌ను గూర్చి మహనీయులు పలువురు నివసించు కురుకాపురికి నిర్వాహకులగు ఆళ్వార్లు అనుగ్రహించిన మధురమైన ద్రావిడ పాశుర సహస్రము లోని ఈ దశకమును నేర్వగల్గిన వారు నిరతిశయ తేజోరూపమైన పరమపదమును ఏల గల్గుదురు.

ముగింపు : భగవానుడు అహృదయమైన మాటను సైతము గొప్పగా తలచి, అనుగ్రహించుననుటను "తిరుమాలిరుఞ్జోలైమలై ఎన్ఱే నెన్న తిరుమాల్ వన్దెన్నెఞ్జె నిఱైయప్పుకున్దాన్" అను సూక్తి తెలుపుచున్నది. ఇట్టి అర్థము మిత్రభావేన సంప్రాప్తమ్" అను శ్రీరామాయణ శ్లోకములోని 'మిత్రభావేన అను పదము వలన వ్యక్తమగు చున్నదని తని శ్లోకీ వ్యాఖ్యలోని "మిత్రభావేన ఎన్గిఱదు క్రియైయాయ్ బుద్ధిపూర్వమిన్ఱియలే. వాయాద కాది ప్రేరితరైప్పోలే కోల్‌విళిక్కాట్టాలే మిత్రమానార్ శెయ్యుం శెయలై చ్చెయ్‌దార్ ఎన్ఱాకవుమామ్" అను సూక్తి వలన తెలియచున్నది - మఱియు పిళ్ళైలోకాచార్యుల వారు శ్రీవచన భూషణ గ్రంథములోని నాల్గవ ప్రకరణమున భగవన్నిర్హేతుక కృపా వైభవమును వర్ణించుచు, "ఎన్నూరైచ్చొన్నాయ్. ఎన్ఱాప్పోలే శిలవత్తై యిట్టి మడిమాఱ్గయిట్టి" అని సాయించుట, ఇట్టి పాశురములను బట్టి యేనని చెప్పనగును. తిరువిరుత్తములోని 95వ పాశురమగు, యాదాను మోరాక్కైయిల్ పుక్కు" అను పాశురము ఈ దశక భావమును సంగ్రహముగా తెలుపు చున్నదను నిర్వాహము కలదు. ఈ పాశురమున పరాంకుశ నాయకి తనకు భగవానుడు తన పట్ల ప్రావణ్యమును కల్గించి. ఇతర విషయముల యందు అరుచిని కలుగ చేసిన మహోపకారమును అనుసంధించి, భగవానుని పాద పద్మముల నాశ్రయించుట ప్రధానాంశమని నమ్పిళ్ళై ఈడు వలన తెలియచున్నది - ప్రస్తుత దశకములో కూడ ఆళ్వార్లు, పిడిత్తేన్ పిఱవి కెడుత్తేన్ పిణిశారేన్ మడిత్తేన్

మనైవాళ్ర్క్కైయుళ్ నిఱ్పదోర్ మాయైయై" అని, ఊనేయ్కురమ్బై యదనుళ్పుకున్దు. తానే తడుమా వినైకళ్ తవిర్త్తాన్ " అని ఇన్నిన్నైప్పోరుళాక్కి తనదెన్నుళ్వైత్తాన్" అనియు భగవదనుగ్రహము వలన కల్గిన జన్మబంధ రాహిత్యమును, విరోధినిరసనమును, నిర్హేతుక విషయీకారమును అనుసందించిరి కదా! మఱియు పూర్వోక్త తిరువిరుత్త పాశురమున మాతావినైప్పితువై" అని భగవానుని మాతృత్వ ప్రయక్త వాత్యల్యము పితృత్వ ప్రయుక్త స్వామిత్వమును అనుసంధించినట్లే ఈ దశకములో కూడ"ఊనేయ్కురమ్బైయదనుళ్పుకున్దు" అని వాత్సల్యమును, దశక మొత్తము స్వామిత్వమును అనుసంధించిరి. ఇట్లు పలు విధముల యాదాను మోరాక్కైయల్ పుక్కు" అనుపాశురమునకు ప్రస్తుత దశకమునకు అర్ధసామ్యము కలదని చెప్పవచ్చును -

ఈ విధముగా విశిష్టమైన స్వామిత్వ గుణ ప్రకాశకమగు తిరుమాలిరుఞ్జొలైమలై" దశకమును గూర్చి, తిరుప్పేర్ నగర్" దివ్య దేశమును గూర్చి విన్నపించు అవకాశమును దాసునకు అనుగ్రహించిన పెద్దలకు నాహృదయ పూర్వక కృతజ్ఞతాంజలులను సమర్పించు కొనుచు, విరమించుచున్నాను.

"జీయాత్ పరాంకుశ పయోధిర సీమభూమా"

నమ్మాళ్వార్ తిరువడిగళే శరణమ్



నమ్మాళ్వార్

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# సర్వేశ్వరుడు సుఖారాధ్యుడు

ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్.రామానుజాచార్యస్వామి

నరసాపురం

ప్రపన్నజన కూటస్థులైన నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళి ప్రథమ శతకమున క్రమముగా భగవానుని పరత్వమును, అతడే సేవింపదగినవాడను విషయమును, సౌలభ్యమును, మన అపరాధములను క్షమించు సహనశీలమును, శీలగుణమును ప్రస్తుతించి ఇట్టి కల్యాణ గుణములు కలవాడైన సర్వేశ్వరుడు సుఖారాధ్యుడు. ఆతనిని ఆరాధింపుడని లోకులను ఉద్బోధించుచున్నారు.

భగవంతుడు అవాప్త సమస్తకాముడు. నిరతిశయ ఐశ్వర్యసంపన్నుడు. అట్టివానికి మనమేమి సమర్పింపగలము? ఆయన కోరునదేది? అని సందేహింప నవసరము లేదు.

ఆయన అవాప్త సమస్త కాముడు కనుక మనము సమర్పించు వస్తువులతో ఆయనకు పనిలేదు. నిరతిశయ ఐశ్వర్య సంపన్నుడు కనుక మనమిచ్చిన దానితోనే తృప్తి పొందవలసిన స్థితియు లేదు. అట్లయిన మనము సమర్పించుటెందులకు? అన్నచో మన యోగ్యతను (సత్తను) కాపాడుకొనుటకు మాత్రమే.

ఒకడు రాజువద్దకు వెళ్ళి రెండు నిమ్మపండ్లను ఇచ్చెను. ఆ రాజు సంతోషించి ఆయాచకునకు గృహారామాదుల నొసగెను. ఇచట యాచకుడిచ్చిన రెండు నిమ్మపండ్లు గృహారామాదులను సంపాదించి పెట్టినవా? లేక రాజు నిమ్మపండ్లను చూచి ఎఱుగడా! అట్టైన అంతటి సంపదనేల ఇచ్చెను? అని ప్రశ్నించినచో నేమి చెప్పుదుము.

రాజు నిమ్మపండ్లను తెలియనివాడును కాదు. రెండునిమ్మపండ్లకు అంతటి సందను ఇచ్చు వెర్రివాడును కాదు. ఆ నిమ్మపండ్లకు సంపదను తెచ్చిపెట్టు శక్తియులేదు. కాని యాచకుడు ప్రీతిపూర్వకముగా నిచ్చుటచేత ఈతడు నాయందు ఎంతప్రీతి కలవాడో కదా! అని సంతసించి మాత్రమే సంపదను ప్రసాదించినాడు.

అట్లే సర్వేశ్వరుడు కూడ మనమిచ్చు వస్తువుల యందలి విలువను కాని ఆధిక్యతను కాని లెక్కింపక. ఆ సమర్పణ వెనుకనున్న భక్తిని మాత్రమే లెక్కించును. ఈ విషయమును స్వయముగా స్వామియే చెప్పినాడు.

"పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి ।
తదహం భక్త్యుపహృతం అశ్నామి ప్రయతాత్మనః ॥"

త్రము, పుష్పము,ఫలము, నీరు వీనిలో ఏఒక్కటియైనను ఎవడు నాయందు భక్తితో సమర్పించునో విని స్వీకరింతును. ఇచట "ప్రయతాత్మనః" అనుమాటను జ్ఞప్తియందుంచుకొనవలెను.

భగవంతునకు సమర్పించుటయే పరమప్రయోజనముగా భావించి పరిశుద్ధమైన నస్సుతో సమర్పింపవలెను. అట్టి భక్తితో తనకు సమర్పించు పత్రపుష్పాదులు ఎంత ల్పమయినను దానిని ప్రీతితో స్వీకరించును.

"యాఃక్రియాః సంప్రయుక్తాః స్యుః ఏకాగ్రగత బుద్ధిభిః ।
తాః స్సర్వాః శిరసాదేవః ప్రతిగృహ్ణాతి వై స్వయమ్ ॥"

శుద్ధమైన మనస్సుతో ఏ కైంకర్యములు చేయుదురో వాని నన్నిటిని భగవానుడు యముగా శిరస్సుతో గ్రహించుచున్నాడు. అంతియేకాక

"అణ్వాపి ఉపహృతం భక్తైః మమ భోగాయ జాయతే ।
భూర్యపి అభక్తోపహృతం నమే భోగాయ జాయతేః ॥"

భక్తితో సమర్పించినది అణువైనను భగవంతునకు భోగ్యమగును. భక్తిలేక మర్పించినది ఎంత పెద్దదైనను అది భోగార్హము కాదు" అని తానే చెప్పినాడు.

ఇచట పత్రమును ప్రీతితో సమర్పించి భగవానుని అనుగ్రహమును పొందినది పది. అరణ్యావాస సమయమున దూర్వాసమహర్షి ధర్మరాజును పరీక్షింపరాగా ద్రౌపది క్షయపాత్రలో మిగిలియున్న ఒక పత్రమును సమర్పించి శ్రీకృష్ణుని అనుగ్రహమును ందినది.

పుష్పమును సమర్పించినవాడు గజేంద్రుడు.
"నాహం కళేబరస్యాస్య త్రాణార్థం మధుసూదన ।
కరస్థ కమలాన్యేవ పాదయో రర్పితం తవ ॥" అని కమలమును భగవానుని దముల యందు సమర్పించుటయే పరమ ప్రయోజనముగా తలచినవాడు.

శ్రీరాముడు అరణ్యావాసమునకు వేంచేయునని తెలిసి 13 సం॥లుగా సేకరించి చిన ఫలములను స్వామికి అర్పించి మోక్షమునందినది శబరి.

తీర్థమును సమర్పించి భగవానుని అనుగ్రహమును పొందినవాడు రంతిదేవుడు. ానొక సమయమున రంతిదేవుడు నలుబది దినములు నిరాహారుడై యుండగా స్వామి ద్ద బ్రాహ్మణరూపమున వచ్చెను. అపుడు రంతిదేవుడు తనవద్ద నున్న జలమును మర్పించి శ్రీమన్నారాయణుని అనుగ్రహమును పొందెను.

ఇచట "పత్రం పుష్పం ఫలం తోయం" అనువానికి మరియొక విధమైన సమన్వయమును పెద్దలు చెప్పుదురు

"ఛందాసి యస్య పర్ణాని" అశ్వత్థ వృక్షమునకు ఆకులు ఛందస్సులు. ఛందస్సులు అనగా వేదములు. వేదములను అధ్యయనము చేయుట పత్ర సమర్పణము. లేక "ద్రావిడ వేద సాగరమ్" అని ప్రసిద్ధి పొందిన దివ్య ప్రబంధమును అనుసంధానము చేయుట పత్ర సమర్పణము. ఇది నిష్కామ బుద్ధితో అత్యంత ప్రీతితో అనుసంధానము చేయవలెను.

భగవంతునికి అర్పింపవలసిన పుష్పములు ఎనిమిది.

"అహింసా ప్రథమం పుష్పం పుష్ప మిన్ద్రియనిగ్రహః ।

సర్వభూతదయా పుష్పం క్షమాపుష్పం విశేషతః ॥

జ్ఞానం పుష్పం తపః పుష్పం ధ్యానం పుష్పం తథైవ చ ।

సత్యమష్ట విధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥" అనునట్లు ఈ ఎనిమిది పుష్పములను సమర్పించిన ఆతడు సంతోషించును. ఈ విషయమునే పెరియాళ్వారులు తమ "పూచ్చుడల్" అను దివ్యప్రబంధమున చక్కగా వివరించియున్నారు.

"సర్వకర్మఫల త్యాగం తతః కురు యతాత్మవాన్"

అనునట్లు మనమాచరించు సమస్త లౌకిక వైదిక కర్మ ఫలములను ఆతనికే అర్పించవలెను. "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్ । యత్ తపస్యసి కౌన్తేయ తత్ కురుష్వ మదర్పణమ్ ॥ అని ఆతడే ఆనతిచ్చెను కదా! ఇట్లు చేయుట ఫల సమర్పణము.

"ఆహ్లాద శీత నేత్రాంబుః" నయనేన ఉద్గీర్ణ బాష్పాంబునా" అనునట్లు సర్వేశ్వరుని దివ్యమంగళ విగ్రహాను సంధానముచే కలిగిన ఆనంద పారవశ్యముచేత ఉబికిన కన్నీటిని భగవంతనికి అర్పించవలెను. ఇట్లు కన్నీరు విడచిన అర్జునుని "మా శుచః" అని కన్నీరు తుడిచినాడు కదా స్వామి. ఇదియే తీర్థ సమర్పణము.

అన్యత్పూర్ణా దపాం కుంభాత్ అన్యత్పాదావనే జనాత్
అన్యత్కుశల సంప్రశ్నాత్ నచేచ్ఛతి జనార్దన : ॥

కాళ్ళు కడుగుకొనుటకు నీరు, పూర్ణకుంభము, కుశలమా! అను ఒకమాట తప్ప వేరేమియు కోరనివాడు జనార్దనుడని విదురుడు చెప్పినాడు. ఈ విషయము నిజమని నిరూపించినాడు స్వామి. నిండు కౌరవ సభలో పరాభూతురాలైన ద్రౌపది "రక్షమామ్ శరణాగతామ్" అని ప్రార్థింపగా అక్షయ వస్త్ర ప్రదానము చేయుటయే కాదు. తానేమియు చేయలేక పోతినే అని బాధపడినాడు. అవతార పరిసమాప్తిలో ఉద్ధవునితో

"గోవిందేతి యదాక్రందత్ కృష్ణా మాం దూరవాసినమ్ ।
ఋణం ప్రవృద్ధ మివమే హృదాయా న్నాపసర్పతి॥" అని వాపోయినాడు.

తనను సేవింప వచ్చిన కుచేలుడు ఇచ్చిన గుప్పెడు అటుకులకు అష్టైశ్వర్యములను ప్రసాదించినాడు. కుచేలుని భక్తికి కరగిపోయినాడు.

కనుక అవాప్త సమస్త కాముడైనను మనము ప్రీతితో సమర్పించు వస్తువునకై ఆతడెదురు చూచును. ఆతడు శ్రియఃపతి కదా! నేను క్షుద్రుడను కదా! అని శంకింప పనిలేదు.

"అహమ్మస్మ్యపరాధ చక్రవర్తీ కరుణే త్వం చ గుణేషు సార్వభౌమి"
నేను అపరాధ చక్రవర్తిని. నీవు సద్గుణ సార్వభౌమురాలవు.

అనునట్లు సార్వభౌమత్వము ఇరువురకు సమానమే కదా! నీరు పల్లమునకు ప్రవహించునట్లు ఆయన కృప అత్యంతము దీనులైన వారియందు ప్రసరించును. కావున మనము అల్పులమని సందేహింప వలసిన పనిలేదు.

దేవతాంతరములు "దేహి మే దదామి తే" ముందు నీవు నాకిమ్ము. తరువాతనేను నీకిత్తును అని నిర్బంధింతురు. వారి వారి కర్పింప వలసిన పదార్థములను అర్పించియే తీరవలెను. లేనిచో వారి యనుగ్రహము లభింపదు. లభించిన అనుగ్రహము మాత్రము ఎంతకాలముండును! అంతే కాదు. ఇంద్రాదులు తమశక్తి వృద్ధి పొందుట కొరకు హవిస్సులను స్వీకరింతురు. కాని సర్వేశ్వరుని విషయమట్లుకాదు. ఆతడుపరిపూర్ణ శక్తి సంపన్నుడగుటచే మన సమర్పణలతో ఆతనికి పనిలేదు.

కావున తేలిక విషయమేమనగా భగవంతుని ఆరాధించుటకు అధికార నియతిగాని (ఇట్టివాడే తగినవాడు) ద్రవ్యనియతిగాని (ఈ వస్తువే సమర్పింపవలెను అనుట) లేదు. దేవతాంతరములను ఆరాధించుట కంటె సర్వేశ్వరుని ఆరాధించుట సులభతరమని తేలినది.

ఈ విషయమునే ఆళ్వార్లు మనకు తెలియజేయుచున్నారు. జీవుడు మణివంటివాడు. సంసారము బురదవంటిది. బురదలో పడిన మణి తనకాంతిని కోల్పోయినట్లుగా సంసారములో పడిన జీవుని ఆత్మగుణములు మరుగున పడిపోవును. బురద తొలగిపోగా మణి ప్రకాశించునట్లు సంసారము తొలగిపోగా ఆత్మయొక్క యథార్థ స్వరూపమైన గుణాష్టకము సాక్షాత్కరించును. "అపహత పాప్మా విజరో విమృత్యుః విశోకః, విజిఘిత్సః, అపిపాసః, సత్యకామః, సత్యసంకల్పః" అనునవి గుణాష్టకము. అనగా జీవుడు ముక్తదశలో 1.పాపము లేనివాడు, 2. ముసలితనము లేనివాడు, 3. మరణము లేనివాడు 4. దుఃఖము లేనివాడు 5. ఆకలి లేనివాడు 6. దాహము లేనివాడు 7. పరిపూర్ణమైన కోరికలు కలవాడు 8. తాను తలచినది చేయగలవాడు. అట్టివాడు భగవత్కృపకు పాత్రుడగును.

కావున సంసార గంధమును తొలగించుకొని గుణాష్టకమును పొందగోరు చేతనులారా! మీరు భగవంతుని నామాను సంధానము చేయుడు. ఆతడు దుఃఖము లేనివాడు.

దుఃఖము లేకపోవుట అనగా హేయగుణములు లేనివాడని భావము. భగవంతునకును ఒక దుఃఖమున్నదా! అన్నచో ఆయన పరదుఃఖ దుఃఖి. అనగా సంసారులమైన మన స్థితిని జూచి దుఃఖించువాడు. ఈ విషయమును ద్రౌపది చరిత్రమున గమనించితిమి కదా! కనుక హేయగుణ రహితుడైన భగవంతుని వలన ప్రయోజనములను పొంది విడిచిపెట్టకుడు. మంచి తీర్థమును స్వామికి సమర్పింపుడు. ఆపై ఏదో ఒక ధూపమును పుష్పమును సమర్పింపుడు. భగవదారాధనకు అన్నివస్తువులు యోగ్యములే.

ఈ విషయమును వివరించు సందర్భములో శ్రీపరాశర భట్టారకులు "కొయ్యపొట్టు పొగయైనను చాలు. కంటికారి పువ్వైనను చాలు" స్వామి ప్రీతితో స్వీకరించునని చెప్పినారట. ఇది వినిన నంజీయరు "న కణ్టకారికా పుష్పం దేవాయ వినివేదయేత్" ముళ్ళుగల పూవులు స్వామికి సమర్పింపరాదని శాస్త్రము నిషేధించుచున్నది గదా! యని పలుకగా భట్టరువారు "శాస్త్రము నిషేధించుట భగవంతునకు పనికిరాదని కాదు. ఆ పూవులను కోయునపుడు భక్తునిచేతికి గాయమగునని తన భక్తుని యందు గలప్రీతితో భగవంతుడు నిషేధించెను." అని సమాధానము చెప్పిరట. కావున భగవంతునకు సమర్పింపదగని పుష్పమేదియులేదు.

ఆ సర్వేశ్వరుడు తులసీ మాలాలంకృతుడు. వేదవేద్యుడు. అట్టివానిని ఆరాధించు అర్హత నాకు కలదా యని సందేహింపకుండుటే కైంకర్యము చేయుటతో సమానము. కావున ఆయనను ఆరాధించుటకు అందరు అర్హులే.

ఆ సర్వేశ్వరుడు సర్వసముడు "సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః" అనునట్లు ఆయన అందరియందు సమభావము కలవాడు. ఆయన ద్వేషించు వాడు కాని, ప్రేమించువాడు కాని లేనివాడు. అనగా మన గుణదోషములతో ఆయనకు పనిలేదు. "దేవానాం దానవానాంచ సామాన్యమధిదైవతమ్" అనునట్లు దేవదానవులందరు ఆశ్రయింపదగినవాడు. ప్రహ్లాద విభీషణాదులను అనుగ్రహించినవాడు పాపారాధియైన కాకాసురుని కటాక్షించినవాడు.

"ఆనయైనం హరిశ్రేష్ఠ దత్తమ స్యాభయం మయా।
విభీషణోవా సుగ్రీవ యది వా రావణ స్స్వయమ్॥" అని వచ్చినవాడు విభీషణుడో, పాపరాధియైన రావణుడో తెలియకనే ఆశ్రయించిన మాత్రమున అభయ ప్రదానము గావించిన మహనీయుడు.

ఆయన కృప నిర్హేతుకము. "దోషోయద్యపి తస్యస్యాత్" అనునది ఆయన మతము.

అట్టి సర్వేశ్వరుని నామనస్సు విడిచిపెట్టదు. నా నాలుక ఆయననే కీర్తించును. భగవంతుడావేశించెనా! అనునట్లు నాదేహ మూగిపోవుచున్నది. ఆ ఆవేశముచే నాట్యమాడుచు స్వామిని సేవించి ఆరాధించుచున్నాను. ఆయన అనంత కల్యాణ గుణ విశిష్టుడు. నిత్యసూరులు ఆ కాల్యాణ గుణములయందు ఆసక్తులైనవారు. "బహవో నృప కల్యాణ గుణాః పుత్రస్య సన్తితే" "రాజా! నీ కుమారుని యందు అనేక కల్యాణ గుణములున్నవి" అని అయోధ్యావాసులు ఆ గుణములు లెక్కింపలేనివనుచున్నారు. ఒక్కొక్క గుణమును గూర్చి చెప్పవలెనన్న ఏండ్లును పూండ్లును పట్టును. నిత్యసూరులలో ఒక్కొక్కరు ఒక్కొక్క కల్యాణగుణము నందు ఆసక్తులైనవారు. తాను అనుభవించిన గుణమే గొప్పదని వాదులాడువారు. అట్టి గుణములు కలవాడగుటచేతనే నా శరీరము కూడా ఆ గుణావేశమునకు లొంగి నాట్యమాడుచున్నది.

భక్తులను స్వీకరించుటలో గుణములను బట్టి స్వీకరించుట, దోషములను బట్టి విడచుట లేనివాడు. స్వీకరించిన వారికి తన కైంకర్యమును ప్రసాదించుటలో హెచ్చుతగ్గులు చూపని వాడు.

"చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినోర్జున!

ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్ష భ ॥" అని భగవంతుని ఆశ్రయించు భక్తులు నాలుగు విధములుగ నుందురు. 1.నష్ట ఐశ్వర్య ప్రాప్తికాముడు (పోగొట్టుకొన్న ధనమునను తిరిగి పొందకోరువాడు) 2. జిజ్ఞాసువు (తెలిసికొనగోరువాడు) 3. అర్థార్థి (అపూర్వ ఐశ్వర్యప్రాప్తి కాముడు) 4. జ్ఞాని. వీరిలో మొదటి ముచ్చురకు ఫలము లభించునంతవరకే భగవంతునితో పని. అట్టివారికి ఆయా ప్రయోజనములను ప్రసాదించును. జ్ఞాని అట్లుగాక యావదాత్మ భావి (ఆత్మఉన్నంతవరకు) సర్వేశ్వరుని కూడియుండ గోరువాడు. కావుననే జ్ఞానీతు ఆత్మైవ మే మతమ్" అని చెప్పినాడు. ఈ విధముగా స్వప్రయోజనపరులెవరో అనన్య ప్రయోజన పరులెవరో తెలిసికొని వారలకు ఆయా ఫలము నిచ్చువాడు. అనన్య ప్రయోజనులకు నిరంతర మధురానుభూతిని ప్రసాదించువాడు.

ఆయన అమరులకు అమృతము నొసంగినవాడు. భగవంతుడు అపర్యాప్తామృతము. అట్టివానిని విడచి ఆయనను బాధపెట్టి క్షీరసాగరమును మథింపజేసి అమృతమును పొంది తిరిగి ఆయనను చూడని అల్పప్రయోజనపరులుగదా దేవతలు. ఆయన దివ్యాయుధము సుదర్శనచక్రము. ఆశ్రిత విరోధులను నిరసించుటచే అది

ప్రకాశవంతమైనది. ఆయన క్షీరసాగరమున శయనించును (ఆర్తుల మొరలు సులభముగా వినుటకు). అంతేకాదు. అమృతముకంటె మిక్కిలి మధురమైనవాడు. అమృతము నారగించి అమరులుగా పేరొందిన దేవతలకు కూడ ఆయుర్దాయ పరిమితి కలదు. కాని అపర్యాప్తామృతమైన భగవదనుభూతి పొందినవారలకు పరమపదము లభించుటచే వారికి ఆయుః పరిమితికాని తిరిగి జన్మము కాని లేదు. కావున భగవంతుడు అమృతము కంటె భోగ్యమైనవాడు.

ఇట్టి సర్వేశ్వరుడైన శ్రీరామచంద్రుని ఆశ్రయింపుడు. ఆతడు సముద్రముచే చుట్టబడిన లంకానగరమునకు ప్రభువైన ఇరువది చేతులు పదిశిరస్సులుగల రావణుని ఖండించినవాడు. ("మృత సంజీవనం రామవృత్తాంతం" అనునట్లు రామకథ మృతసంజీవని వంటిది.) అట్టి శ్రీరాముని పాదములకు శిరసా నమస్కరింపుడు. దాట శక్యము కాని ఈ కాల సముద్రమును (పాప సముద్రమును) దాటుడు. "విష్ణు పోతం వినా నాన్యత్" అనునట్లు ఈ కాల సముద్రమును దాటుటకు శ్రీరాముని పాదకమలములనెడి నావ తప్ప మరియొకటి లేదు సుమా! భక్తులారా! విషయాంతర సంపర్కమును విడచిపెట్టుడు. భోగ్యభూతుడైన పరమాత్మ సులభుడైయుండగా అన్యవిషయము లందాసక్తి యేల? ఆ విషయాసక్తిని తొలగించుకొని భగవంతుని ఆరాధింపుడు. ఆతడు అనేక జన్మార్జితమై దేహ పరంపరలకు కారణమైన మీ పాపరాశిని భస్మము చేయును. ఆయన "సర్వ అఘ నాశనుడు" కదా! అంతేకాదు. పునర్జన్మకు అవకాశములేని పరమపదమును ప్రసాదించును. అనగా అనిష్టనివృత్తినేకాక ఇష్టప్రాప్తిని కూడ కలిగించువాడు.

అయినచో పరమ పురుషార్థమైన పరమపదమును అనుగ్రహించునా! అని సందేహింపకుడు. ఆయన లక్ష్మీనారాయణుడు. ఆ లక్ష్మీదేవి కారుణ్యరూపిణి.

"లక్ష్మ్యాసహ హృషీకేశః దేవ్యా కారుణ్యరూపయా
రక్షకస్సర్వ సిద్ధాన్తే వేదాన్తే2పి చ గీయతే॥" అని లక్ష్మీదేవితో ఆయన రక్షకుడుగా వేంచేసియున్నారను విషయమును సర్వసిద్ధాన్తములు, వేదాన్తములు ప్రస్తుతించుచున్నవి. కావున తప్పక పరమపదమును అనుగ్రహించును.

ఆతడు మోక్ష ప్రతి బంధకములుగానున్న పుణ్యాపాపరూపములైన కర్మను పోగొట్టును. "ఉభే విద్వాన్ పుణ్యాపాపే విధూయ" అని గదా వేదాంత వచనము. పుణ్యము కూడ పాపము వలె భగవత్ప్రాప్తికి ప్రతిబంధకమే. ఒకటి బంగారు సంకెల వంటిదికాగా మరియొకటి ఇనుపసంకెల వంటిది. ఏమైననేమి మనలను బంధించుటకు. కనుక భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములుగా నున్న పుణ్యాపాపరూపమైన కర్మను పోగొట్టువాడు ఆ సర్వేశ్వరుడే.

అతడే గరుడధ్వజుడు. దివ్యమంగళ విగ్రహుడు. లక్ష్మీపతి. మన ఘోర పాపములను క్షణకాలములో పోగొట్టువాడు.

"యద్బ్రహ్మకల్ప నియతాను భవేప్యనాశం
తత్కల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే" బ్రహ్మ కల్పాంతమనుభవించినను తీరని పాపములను అరక్షణములో మనము చేయుచుండగా ఆ పాపరాశి నంతటిని పోగొట్టువాడు కదా సర్వేశ్వరుడు. (పోగొట్టుటయేకాదు. గరుత్మంతునితో సమముగా మనలను కూడ ఆదరించునని తిరుక్కురుగైప్పిరాన్ పిళ్ళాన్ చెప్పుదురు). ఈ భావమునే
"యః కశ్చిదేవ యది కించన హన్త జన్తుః
భవ్యో భజేత భగవన్త మనన్య చేతాః ।
తం సోఽయ మీదృశ ఇయానితి వాప్యజానన్
హై వైనతేయ సమ మప్యరరీ కరోషి॥"

"ఎవడు అనన్యమైన మనస్సుతో భగవంతుని ఆశ్రయించునో అట్టివానిని ఈతడిట్టివాడు, ఇంతటివాడు అని లెక్కింపక గరుత్మంతునితో సమముగా ఆదరించును." అని శ్రీకూరేశమిశ్రులు వరదరాజస్తవములో కీర్తింతురు.

శ్రియః పతియైన శ్రీమన్నారాయణుడు తన పరత్వమును తలచుకొని ఉదాసీనుడగుట కాని, చేతనుల దోషములను చూచి విడచిపెట్టుటకాని చేయనివాడు. ఈ విషయమునే నమ్మాళ్వార్లు ఈ తిరువాయ్మొழி 1-6లో అనుగ్రహించియున్నారు. అట్టి ఈ పది పాశురములను ఎవరు నిత్యము అనుసంధానము చేయుదురో వారికి పరమపదము తప్పక లభించును.

ఈ విధముగా "పరివది లీశనైప్పాడి" అను ఈ దశకములో నమ్మాళ్వార్లు సర్వేశ్వరుడు సుఖారాధ్యుడను విషయమును ప్రకటించుచు ఆయన నాశ్రయింపుడని సంసారిచేతనులకు ఉపదేశము చేయుచున్నారు.



పరాంకుశ నాయికి

శ్రీమతే శఠగోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# శ్రియఃపతియే పరతత్వము

ఉ.వే.శ్రీమాన్. కె.ఇ.స్థలశాయి
రాజమహేంద్రవరం.

శ్రియః పతియు, శ్రీవైకుంఠనికేతనుడు, నిత్య ముక్తానుభావ్యుడు, అవాప్త సమస్త కాముడు నైన శ్రీమన్నారాయణుడే పరదైవము. ఇదియే సర్వశాస్త్రైక సమ్మతమైన అభిప్రాయము. అట్టి సర్వేశ్వరుడు అనాద్య చిత్సంబంధముచే సంసారమగ్నులై ఉన్న చేతనులను ఉద్ధరించుటకు సంకల్పించి వేద శాస్త్రములను ప్రసాదించెను. "శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేశ్చలన కారణం" అను నట్లును, శాస్త్రాధ్యయనమునకు పురుషత్వ, బ్రాహ్మణత్వాది యోగ్యతా పేక్ష ఉన్నందు వలననూ సమస్త వేదశాస్త్ర సారభూతమైన 'అష్టాక్షరీ' మన్త్రమును స్వాంశ సంభూతుడైన నరునకు, నారాయణుడై బదరికాశ్రమమున ఉపదేశించి, దానిని లోకమున ప్రవర్తింపజేసెను. 'అష్టాక్షరీ' మన్త్ర వివరణాత్మకమైన ద్వయ మన్త్రమును తన పట్టమహిషియైన లక్ష్మీ తాయార్లకు శ్రీవైకుంఠమున ఉపదేశించి లోకమున ప్రవర్తింపజేసెను. అనంతరము శ్రీకృష్ణావతారమున అర్జునునకు గీతోపదేశ వ్యాజముతో సమస్త చేతనులకూ సంసార తరణోపాయమగు ద్వయ వివరణాత్మకమైన చరమ శ్లోకమును అనుగ్రహించెను. ఈ మూడును సాక్షాత్తూ భగవదుపదిష్టములై సమస్త వేద శాస్త్ర, పురాణేతిహాసాది ప్రమాణములకు సాంభూతములై, వీటిని అనుసంధించు వారికి భుక్తి, ముక్తి దాయకములై అలరారు చున్నవి.

ఈ మూడు మన్త్రములునూ అల్పాక్షరములై, సర్వులకూ గ్రహణ ధారణ సులభములై, శబ్దార్థములచే రక్షకములై ఉన్ననూ వీటియందు అపరిమితములైన ఉపనిషద్రహస్యార్థములు నిక్షిప్తమై ఉండుటచే, ఆ అర్థములు సదా చార్యోపదేశ గమ్యములగుటచే, ఏతదర్థోప దేశకులగువారు అజ్ఞానామిశ్రిత శుద్ధజ్ఞానులై ఉండవలసి ఉండుటచే, అటువంటి వారు ఈలీలా విభూతియందు దుర్లభులగుటచే, శ్రీవైకుంఠమందలి శుద్ధసత్వయుక్తులైన నిత్యసూరులనే ఆళ్వారాచార్యులుగా ఈలోకమందు అవతరింపజేసి, మన్త్రత్రయ రహస్యార్థములనూ దివ్య ప్రబంధములుగా, ఆచార్యోపదేశములైన వేదాన్త గ్రన్థములుగా లోకమున సద్వారకముగా ప్రవర్తింప చేసెను.

ఈ విధముగ భగవన్నియుక్తులై నిత్యసూర్యగ్రగణ్యులైన శ్రీవిష్వక్సేనులు నమ్మాళ్వార్లుగ కలియుగారంభమున ఈ లీలా విభూతిలో అవతరించిరి. భగవన్నిర్హేతుక కృపా విశేషముచే లబ్ధజ్ఞానులై భగవద్వాక్కులుగ నాల్గు వేదములకు సారములన దగు నాల్గు ప్రబంధములను అనుగ్రహించిరి. అవి వరుసగా 1.తిరువిరుత్తం 2.తిరువాశిరియం 3.పెరియతిరువన్దాది 4.తిరువాయ్‌మొళి ఈ తిరువాయ్‌మొళి ప్రబంధము సామవేద శిరస్సగు ఛాందోగ్యోపనిషత్

సారము అని పెద్దలు అను సంధించు కొందురు. వీరి ప్రబంధములు నాల్గునూ వేదములైనచో వీటికి అంగములుగా తిరుమంగై ఆళ్వార్లు కృపచేసిన ప్రబంధములు పేర్కొన బడుచున్నవి. వేదములకు శిక్షా, వ్యాకరణాదుల వలె నమ్మాళ్వార్ల నాల్గు ప్రబంధములకున్నూ వీరి ప్రబంధములు అంగములు. "స ఆత్మా. అంగాన్యన్యాదేవతాః" అను ఉపనిషద్వాక్యముల వలె, ఆళ్వార్లలో నమ్మాళ్వారులు అంగియై, మిగిలిన ఆళ్వార్లందరూ అంగభూతులై అలరారుచున్నారు. "నంబెరుమాళ్ నమ్మాళ్వార్ నంజీయర్" అను ఉపదేశ రత్నమాలలోని మణవాళ మహామునుల శ్రీసూక్తిని అనుసరించి ఆళ్వార్లందరిలోనూ వీరి వైలక్షణ్యము, వీరి ప్రబంధముల కుండు వైలక్షణ్యము మిక్కుటమైనది. వీరి ప్రబంధములలోనూ సామవేద సారభూతమగు 'తిరువాయ్‌మొళ్ళి' గ్రంథ విస్తారమును బట్టి, అర్థవిస్తారమును బట్టి గొప్ప ప్రాముఖ్యమును సంతరించు కొన్నది. 'వేదానాం సామ వేదోస్మి' అని గీతలో భగవానుడు సామవేదమును తనకు అత్యంత ప్రియమైనదిగా చెప్పుకొనెను. అట్లే ఆళ్వార్లు అనుగ్రహించిన నాలాయిర దివ్య ప్రబంధములలోనూ, ఈ తిరువాయ్‌మొళ్ళి ప్రబంధమే భగవన్ముఖోల్లాసకరమై అలరారు చున్నది.

ఈ ప్రబంధమున నమ్మాళ్వారులు 32 దివ్య దేశముల యందున్న పెరుమాళ్ళకు మంగళాశాసనము చేసి, ఒక్కొక్క దివ్యదేశమున సర్వేశ్వరుని ఒక్కొక్క కల్యాణ గుణమును ప్రకాశింప చేసినారు.

ఈ తిరువాయ్‌మొళ్ళి యందు మొత్తము 1102 పాశురములు కలవు. ఇది 10 శతకములుగాను, ఒక్కొక్క శతకము నందును 10 దశకములు గాను విభజింప బడినది. శతకమును 'పత్తు' అనియు, దశకమును 'తిరువాయ్‌మొళ్ళి' అనియు వ్యవహరింతురు.

ఇంతు ఆళ్వార్లు భగవత్ స్తుతి రూపములోనూ, పరోపదేశ రూపము గానూ, 'తోళ్ళి' (చెలి) 'తాయ్'(తల్లి) మగళ్(నాయిక)అవస్థల లోనూ ప్రబంధావిష్కరణ చేసిరి. అంతియేగాక సకల వేద శాస్త్రములలోనూ ప్రతిపాదింపబడిన జీవాత్మ పరమాత్మ భేదము, జీవాత్మలలో పరస్పర భేదము, ప్రకృతి, ఈశ్వర భేదము, ఆత్మ నిత్యత్వము, దేహా2నిత్యత్వము, భక్తి, ప్రపత్తులను స్పష్టముగా ప్రకాశింప జేసిరి. తిరుమన్త్ర, చరమశ్లోక, అర్థపంచక, తత్వత్రయములు ఇందు చెప్పబడిననూ, ద్వయ మన్త్రమే ముఖ్యముగా ప్రతిపాదింపబడుటచేత దీనికి "దీర్ఘశరణాగతి" అని ప్రసిద్ధి కలిగినది. అంతియే గాక ఇందు పరతత్వ స్థాపనము కూడ చేయబడినది. ఇతర శాస్త్రములలో స్పష్టముగా అర్థముగాని పరతత్వ నిర్ణయమును నమ్మాళ్వారులు విశదీకరించి దృఢపరచిరి.

'ఒన్ఱుమ్‌తేవుం అను నాల్గవ పత్తులోని 10వ దశకము నందు పరోపదేశ రూపముగా పరతత్వ నిర్ణయము గావించిరి. మొదటి పత్తు ప్రథమ దశకము 'ఉయర్వఱ' యందు తమ మనస్సునకు పరతత్వమును ప్రబోధించి, శ్రుతిచ్ఛాయలో నారాయణుడే పరతత్వమని

స్థాపించిరి. ద్వితీయ శతకము రెండవ దశకము 'తిణ్ణన్వీడు' నందు పరోపదేశ రూపముగా ఇతిహాస, పురాణ ప్రమాణములతో పరతత్వ నిర్ణయము గావించిరి.

ఆళ్వార్లకు 'వాయుమ్ తిరైయుగళమ్' అను క్రింది తిరువాయ్మొళ్ళిలో భగవద్విశ్లేషము కలిగినది. అందుచే దుఃఖము కలిగినది. అది వర్ణనాతీతమైన బాధ. అనన్తరము భగవత్సంశ్లేషము లభించగనే ముందటి విశ్లేష బాధ అత్యంతాభావ స్థితి నందినది. దీనికి కారణమేమని విమర్శించినచో ఇతర లౌకిక విషయముల లాభా లాభముల వంటిది కాని గొప్ప విషయ వైలక్షణ్యము ఇందు కలదు. భగవానునితో కలయిక లేనపుడు ఆయనతో కలయిక తప్ప వేరొకటి కావాలనిపించదు. ఆయనతో సంశ్లేషము లభించినప్పుడునూ ఆయనయే తప్ప తదితరము రుచించదు. దీనికి కారణము భగవానుడు సకల కల్యాణ గుణాత్మకుడగుటయే. దానికి కారణము ఆయన సర్వేశ్వరుడగుటయే. 'ఉయర్వఱ వుయర్నల ముడైయవన్' అనగా ఆయన నిరతిశయానందము కలవాడు అనగనే 'అయర్వఱు మమరర్ గళదిపతి' అనగా నిత్యసూరి నాయకుడు అను ప్రథమ శతక మొదట పాశురము నందలి మొదటి పాదము, మూడవ పాదము స్ఫురించును గదా!

ద్వితీయ శతక ప్రథమ దశకమునందు (వాయుమ్ తిరైయుగళుమ్) 'మూవాముతల్వా' అని ప్రాసంగికముగా కారణత్వము ప్రస్తుతమగుటచే దానిని ఉపపాదించుచున్నారు. పరతత్వ స్థాపనమును 'ఉయర్వఱ వుయరలమ్' అను తిరువాయ్ మొళ్ళి యందు శ్రుతిచ్ఛాయచే అన్వయ ముఖముగా చెప్పిరి. అది స్వానుభవరూపమై 'పరత్వే పరత్వమును' అనగా పరవాసుదేవుని యందలి పరత్వమును ప్రతిపాదించుచున్నది. ఈ 'తిణ్ణన్వీడు' తిరువాయ్ మొళి యందు పరోపదేశ రూపమై, అన్వయ వ్యతిరేకములు రెండిటి చేత ఇతిహాస పురాణచ్ఛాయలో 'అవతారే పరత్వం'అనగా విభవావతారమైన శ్రీకృష్ణుని యందలి పరత్వమును ప్రతిపాదించిరి. 'అన్వయ' మనగా శ్రీమన్నారాయణుడే పరతత్వము అని చెప్పుట. 'వ్యతిరేక'మనగా వేరెవ్వరూ కారనుట.

శ్రీకృష్ణుడే పరదైవము. "కృష్ణఏవహి లోకానా ముత్పత్తి రపి చాప్యయః" అని పురాణ ప్రమాణము. ఆయనయే ప్రళయ కాలము నందు భూమ్యాకాశములను తన ఉదరమునందు ఉంచుకొనును. బ్రహ్మాదులకు కూడ మనోవాక్కులకు అందని అనంత కల్యాణ గుణ పరిపూర్ణుడతడు. ధర్మార్థ కామ మోక్షములనెడు పురుషార్థములను అందరికినీ ప్రసాదించగల సమర్థుడు ఆయనయే. కర్మ, నిబన్ధనముచే ఏర్పడు ఆవిర్భావ, తిరోభావ, జన్మ, నాశ, వికల్పములనెడు దోషములు లేని దృఢమైన నిత్యవిభూతిని స్వాశ్రితులకు ప్రసాదించగలడు. "చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః". నాల్గు పురుషార్థములనూ భక్తులకు ప్రసాదించుటకే నాల్గు భుజములను స్వామి ధరించెనట. నమ్మాళ్వారుల ఈ భావమును అనుసరించియే 'కృష్ణ కర్ణామృతము' అను కావ్యమును రచించిన లీలాశుకులను కవి శ్రీకృష్ణుని స్తుతించుచూ 'హస్త న్యస్త నతాపవర్గ మఖిలో దారం కిశోరాకృతి' అంటారు. అనగా స్వాశ్రితుల

మోక్షమును తనగుప్పిట ఉంచుకొని బాలకృష్ణుడు క్రీడిస్తున్నాడట. అట్టి ఉత్కృష్టుడైన శ్రీకృష్ణుడే సర్వస్వామి. ఇది సత్యము. వేరెవ్వరనూ పరతత్త్వము కాజాలరు.

శ్రీకృష్ణుడే పరతత్త్వము ఇతరులు కారనుట ఎట్లు పొసగును. బ్రహ్మరుద్రులను ఈశ్వరులుగా కీర్తించు కొన్ని ప్రమాణములు పురాణాదులలో కనిపించు చున్నవి గాదా? అను ప్రశ్నకు నమ్మాళ్వారులు సమాధానము నిచ్చుచున్నారు. ఆయా పురాణములలో వారి, వారి స్థితులను విమర్శించినచో శిరస్సును ఖండించు వారుగనూ, శిరస్సును పోగొట్టు కొనిని వారుగనూ దర్శన మిచ్చు చున్నారు. వారి, వారికి కలిగిన ఆపదలను తొలగించి రక్షించిన వాడు స్వామియే. ఇక, ఈశ్వరత్వము కలిగి ఉండుటకు అర్హులు ఎవరు? వారా? ఈయనయా?

అహో! ఎంతపాపము! రత్నమునకు, రాతికి వైషమ్యము చెప్పవలసి వచ్చినది కదా! చేతనులు మన్దమతులగుట వలన భగవత్పరత్వమును ఉపపాదింప వలసి వచ్చెను. ఎల్లప్పుడు భగవద్గుణానుభవము చేయు నాకుఇట్టి స్థితి కలిగినదే! ఏడేడు లోకముల యందలి చేతనులునూ అదేపనిగా పాపములను చేసిననూ, వాటిని తొలగించి రక్షించువాడు సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుడే. అదియును వీరు అర్థించినచో కాక తన నిర్హేతుక దయచేతనే అనుగ్రహించువాడు ఆయన. ఆయన కాక వేరెవ్వరూ ఆ విధముగ రక్షింప గలరు? వీరు చేసిన పాపము సర్వేశ్వరుని దయచే పోవును గాని, తాము ప్రాయశ్చిత్తమును చేసుకొని పోగొట్టుకొన వలెనన్నచో అది సాధ్యము కాకపోగా అది మరింత అధికముగా వృద్ధి పొందును. 'నహి పాలన సామర్థ్య మృతే సర్వేశ్వరం హరిం' అను విష్ణు పురాణ ప్రమాణమును బట్టి ఆయనయే సర్వ రక్షణ సమర్థుడు కదా! రాజస, తామస పురాణములయందు కీర్తించబడు బ్రహ్మ, రుద్రులు ఆయా సమయములయందు వారకి ఏర్పడిన ఆపదలను పోగొట్టుకొనుటకు సర్వేశ్వరుడగు హరినే ఆశ్రయించినారు కదా! 'తతః క్రోధపరీతన సంరక్త నయనేనచ। వామాంగుష్ఠ నఖాగ్రేణ ఛిన్నం తస్య శిరోమయా॥' అను మత్స్యపురాణ ప్రమాణమును గమనించినచో సర్వసృష్టికి తండ్రియు, తనకును తండ్రియైన బ్రహ్మకు ఐదు శిరస్సులుండుట, తనకునూ ఐదు శిరస్సులుండుట ఓర్వలేని మహేశ్వరుడు తన ఎడమచేతి బొటన వ్రేలితో బ్రహ్మ శిరస్సును ఖండించెను. అప్పటినుండి బ్రహ్మ చతుర్ముఖుడయ్యెను. అందుచే శివునకు బ్రహ్మహత్యా పాతకము చుట్టుకొనెను. దానిని పోగొట్టుటకు సర్వేశ్వరుడగు శ్రీహరి భిక్షము నిచ్చి ఆయన పాతకమును నశింపజేసెను. అందువలన సర్వస్మాత్పరుడు నారాయణుడే అనుట సమంజసము. అట్లుగాక కర్మవశ్యులైన బ్రహ్మరుద్రులను అధికులుగా గుర్తించుట ఎట్లు పొసగును? అనుచున్నారు ఆళ్వార్లు.

ఇంకను సౌశీల్యము (అని నమ్మాళ్వార్లు శ్రియః పతి పరత్వమును ప్రతిపాదించిరి.) చేతను, త్రివిక్రముడై లోకక్రమణము చేయుట చేతను శ్రీహరియే ఈశ్వరుడు. ఈయన వేదాత్మకుడైన గరుత్మంతుని వాహనముగా కలవాడు. ఈయనను అనుకరించి తనకును

ఒక ఎద్దును వాహనముగా ఏర్పరుచుకొని వృషభవాహనుడయినాడు శివుడు. భగవానుని నాభి కమలమువందు బుట్టిన బ్రహ్మ, అయోనిజుడై అజుడు అను పేరు సంపాదించెను. వీరిరువురికిని స్వాతి శయము కలదు. అట్టి రాజస, తామస ప్రకృతులునూ, అపకృష్టులైన వీరికిని, ఆకార త్రయ సంపన్నురాలై అత్యంతోత్కృష్టురాలైన లక్ష్మికిని తన హృదయమునే నివాస స్థానముగా కల్పించెను. సమస్త లోకములు తన పాదమునందు ఒదగునట్లు త్రివిక్రముడై లోకములను కొలచెను. ఆహా! ఎంత సౌశీల్యము. ఇట్టి పరదైవము వేరొకడుండునా? సౌశీల్య మనగా "మహతః మన్దైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః" అని అనగా అన్ని విధములుగనూ గొప్పవాడు తనకంటే తక్కువ వారితో కలసి మెలసి ఉండుట అని అర్థము.

'కారణంతు ధ్యేయః' అను వచనమును బట్టి సర్వకారణుడైన శ్రీకృష్ణుడే ఆరాధ్యుడు. పుష్పాదుల కంటే అత్యంత సౌకుమార్యము కలిగి ఉండుట చేతను ఆయనయే పూజనీయుడు.

దేవజాతిని, సమస్త పదార్థములను సద్వారకముగా సృజించుట కొరకు తన నాభికమలము నందు, నాల్గు పద్మములను పూయించినట్లు చతుర్ముఖ బ్రహ్మను జనింపజేసెను. 'లోకవత్తు లీలా కైవల్యమ్' అనునట్లు ఇది యంతయు ఆయనకు లీలయే. సృష్ట్యాద్యుపకారకుడగు సర్వేశ్వరునే పూవులచే పూజించదగును. కిరీటాద్యాభరణ విశిష్టుడై, సౌందర్యయుతుడై, అత్యంత సుకుమారుడైన వాడు ఆయన. ఈ లక్షణములచే స్వామిత్వము, ఈశ్వరత్వము ప్రకాశమగును. శివుడు జటాధారియై దిగంబరుడై, కొండొకచో చర్మాంబర ధారియై, యోగిగా, దీక్షితునిగా రామ నామామృత పానము చేయు భాగవతునిగా దర్శన మిచ్చును. శ్రుతి ప్రతిపాద్య పరమాత్మత్వా సాధారణ లక్షణమగు పుండరీకాక్షత్వము శ్రీకృష్ణునకే కలదు. శివునకో తద్విరుద్ధమైన విరూపాక్షత్వము కలదు.

భీష్మ పితామహుడు రాజసూయ యాగ సందర్భమున అగ్రపూజార్హుడు పుండరీకాక్షుడగు వాసుదేవుడే అనెను. అందుచే సౌందర్య, సౌకుమార్యాది గుణ విశిష్టుడైన పుండరీకాక్షుడగు శ్రీకృష్ణుడే పూవులచే పూజింప దగినవాడు. తన దివ్యాత్మ స్వరూపమునకు తగిన కల్యాణ గుణములు కలవాడై, స్వసఙ్కల్ప కల్పిత నిఖిల జగద్వ్యక్తుడై, సర్వేశ్వరత్వ సూచకమైన కమల దళాయత లోచనుడై "నారాయణ పరంజ్యోతిః" అని శ్రుతులలో తేజోరూపుడుగా చెప్పబడు స్వామియే పూజ్యుడు దీనిని అంగీకరించువారే వైదికులు. తదితరులు అవైదికులుగా గుర్తింప దగియున్నారు. "విష్ణు భక్తి విహీనోయ స్సర్వ శాస్త్రార్థ వేద్యపి। బ్రాహ్మణ్యస్తస్య నభవేత్త స్యోత్పత్తి ర్నిరూప్యతామ్॥" అని కదా పాద్మ పురాణ వచనము.

మరియు, ఆశ్రితుల రక్షణ కొరకే స్వామి క్షీరసాగర శాయియై వేంచేసి ఉన్నాడు. ఆపత్సఖత్వముచే సర్వేశ్వరత్వము ఆయనకే తగి ఉన్నది. చేతనా చేతనములను, రెండు వర్గములుగా ఏర్పడియున్న సమస్త పదార్థములను ప్రళయ కాలమున అసమ్బాధముగా తన కుక్షియందు నిలుపుకొనును. "తద పశ్యమహం సర్వం తస్య కుక్షౌ మహాత్మనః" అని మహా భారత వచనము. చేతనులను రక్షించుటకు తగిన జ్ఞానము కలవాడు పరమాత్మ, అపరాధ సహస్ర భాజనులమై సంసార సముద్రము నందు పడి దుఃఖించుచున్న మనలనందరినీ రక్షించుటకై, 'రక్ష్యాపేక్షాం

ప్రతీక్షతే' అనునట్లు క్షీర సముద్రము నందు పవ్వళించియున్న శ్రియఃపతియే సర్వేశ్వరుడు.

ప్రళయ కాలమునందు చిన్న శిశువు రూపము ధరించి, పదునాల్గు భువనములనూ తన కుక్షియందు నిడుకొని, ప్రళయార్ణవమున తెప్పగా మఱ్ఱియాకుపై తేలియాడు అఘటిత ఘటనా సామర్థ్యముచే సర్వస్మాత్పరుడు నారాయణుడే, ఆయన మనో వ్యాపారమును తెలుసుకొనుట అసాధ్యము. చిట్టివాడుచిన్నర పిడుగై గోవర్ధన కొండనెత్తి గోగోపికల గాచుట, కాళిందీ సర్పదర్ప భంజనుడగుట, మృతుడైన కుమారుని పునర్జీవితుని జేసి, గురువు గారైన సాందీపనికి ప్రసాదించుట. ఇవియే పరత్వ సూచకములు. "ఏష నారాయణ శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః నాగపర్యఙ్క ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్॥" అను శ్లోక నిదర్శనములు.

తన సంకల్పముచే దేవజాతిని, తదితరమైన సమస్త పదార్థ జాతమును "యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి" అనునట్లు సృష్టించి, రక్షించువాడు శ్రీకృష్ణుడే. ఆయా పదార్థ జాతమును ఏ విధముగ రక్షించవలెనో వాటికితగిన విధముగ రక్షణము కల్పించును. "స్ఫురన్తి సర్వే తవ శక్తి లేశైః" అనునట్లు ఆయన అనుగ్రహము చేతనే ఇతరులు రక్షకులు గాని, స్వాభావిక రక్షకులు గారు. "నహి పాలన సామర్థ్యమృతే సర్వేశ్వరం హరిమ్" అనునట్లు శ్రీకృష్ణుడే సృష్టి పాలన శక్తులచే సర్వేశ్వరుడు.

సృష్టి స్థితులే కాక సంహారము కూడ ఈయన అధీనమే. "పరిత్రాణాయ సాధూనాం' అనియు, "నసమ్భ్రాన్తం సమాహారే" అను విధముగను రక్షించుటకే శ్రీకృష్ణుడై అవతరించిన సర్వేశ్వరుడు సంహార కాల మాసన్నమైనపుడు కార్యరూప సమస్త సృష్టిని తన లోనికి చేర్చుకొనును. తిరిగి సృష్టి సమయమున తన నాభికమలమున బ్రహ్మను, ఇన్ద్రాది దేవతలకు వాస స్థానములైన దివ్యలోకములను సృజించును.

ఈ విధముగ చతుర్ముఖ, పశుపతి, శతమఖ ప్రభృతి సమస్త దేవతలకు కారణభూతుడు శ్రీకృష్ణుడైన నారాయణుడే, అనుటకు విశ్వసింపతగిన ప్రమాణము కలదా? అనగా వారి (ఆయాదేవతల) వాఙ్మూలములే ప్రమాణములని నమ్మాళ్వారులు అనుచున్నారు.

పూర్వమొకప్పుడు రుద్రుడు నారాయణుని స్తోత్రము చేసి మెప్పించెను. స్వామి రుద్రుని వరము కోరుకొమ్మనెను. అపుడు రుద్రుడు, "స్వామీ! నేను ఈశ్వరుడను కావలెను" అని కోరెను. "నిన్ను ఆశ్రయించిన వారికి నీవే ఈశ్వరుడవు కాగలవు" అని స్వామి వరమిచ్చెను. అప్పుడు రుద్రుడు, "నీవు ఇచ్చిన వరము లోక ప్రసిద్ధ మగునట్లు నీవే నన్ను ప్రార్థించి, వరము పొందు వరము ఇవ్వుము" అని అడిగెను. స్వామి 'తథాస్తు' అనెను. రుద్రున కిచ్చిన వర ప్రభావము చేతనే స్వామి శ్రీకృష్ణావతారమున శివునకై తపస్సు చేసి, మెప్పించెను. శివుడు పార్వతితో ప్రత్యక్షమై, "శ్రీకృష్ణా! నీవు సర్వేశ్వరుడవు. అవాప్త సమస్త కాముడవు. అట్టి నీకు నేను ఏమి చేయగలను." అని ప్రశ్నించెను. శ్రీకృష్ణుడు రుక్మిణీదేవికి పుత్రుడు కలుగునట్లు వరమిమ్మని కోరెను. అప్పుడు శివుడు "కృష్ణా! నీవు నీ గొప్పతనమును దాచుకొని, నా వద్ద వరము కోరుటను చూచిన జనులు నీవు

చేసిన దానినే అనుసరింతురు. నాకు గొప్పతనమును ఆపాదించుటకే నీవు నా కొరకు తపస్సు చేసి, వరమునడుగు చున్నావు గానీ, నీవే మాకు స్వామివి". అని పలికి శ్రీకృష్ణునకు పుత్రుని ప్రసాదించెను. శివుడు శ్రీకృష్ణుని సంబోధించునప్పుడు 'కళ్వా' అని సంబోధించును. ఆపదమునకు అర్థము 'కపటి' అని.

'హరి వంశము' నందలి ఈ కథను (శ్రీకృష్ణుడు శివస్తోత్రము చేయు ఘట్టము) వినుచున్న ఒకశ్రోత అయిన బ్రాహ్మణుడు 'ఎప్పుడూ యాచించుట తెలియని వాడు యాచించినట్లు ఉన్నదని, శ్రీకృష్ణుడు తాను శక్తుడైననూ అశక్తునివలె నటించినట్లు ఉన్నదని అభిప్రాయ పడెనట. "అంజలిం సమ్పుటం కృత్వా విష్ణుముద్దిశ్య శఙ్కరః ఉమయా సార్ధమీశానో మాహాత్మ్యం వక్తు మైహత॥" అనునట్లు చక్కగా చేతులు జోడించి, పార్వతితో కూడి నిలచి శివుడు విష్ణువును ప్రార్థించుచూ ఆయన మాహాత్మ్యమును చెప్పుటకు ఆరంభించెను. ఇటువంటి చక్కని ప్రార్థనా క్రమము కృష్ణుడు శివస్తోత్రము చేయునపుడు కనబడదు. "నమోఘంటాయ కర్ణాయ నమః కట కటాయచ" అని కృష్ణుడు చేసిన శివస్తోత్రము. దీనిని బట్టియే ఆశ్రోత ఆ విధముగ అభిప్రాయ పడెను. "నాత్తళుమ్బ నాన్మగను మీశనుమాయ్ ముతైయాకత్త" అను 'తిరుమొళ్రి' పాశురమును అనుసరించి, బ్రహ్మ, రుద్రులు విష్ణు స్తుతి చేయుట యందు నిరతులై వారి నాలుకలు కాయలు కాచునట్లు స్తోత్రము చేయుదురు. దానికి కారణము ఆయన శేషియగుట. వీరు శేషభూతులగుటయే.

అందువలననే నమ్మాళ్వారులు ఈ పాశురమునందు స్వామిని కళ్వా! అని సంబోధించు చున్నారు. ఆయన మాహాత్మ్యమును మరగు పరుచుకొను మాయావి ఆయన. అందరినీ మోహింప చేయగలడు. యశోదకు అఖిల భువనములను తన నోట చూపి, తిరిగి ఆమెకు కలిగిన జ్ఞానమును తిరోధాన మొనర్చిన వాడు కదా! ఎంత అద్భుతము.

చతుర్ముఖాదులు స్తోత్రము చేయునపుడు 'ఇతైవ!' అనగా స్వామీ! అని అందురు. స్వామీ! మమ్ములను సృజించి కదా తిర్యగ్జాతులను సృజించినది. అని సర్వస్రష్టగా ఆయనను నుతింతురు. ఇట్టి వారి వాక్యములను బట్టియే శ్రీమన్నారాయణుని పరత్వము స్పష్టమగుచున్నది కదా!

అని ఈ విధముగా 'తిణ్ణన్‌వీడు' అను ఈ దశకమునందలి పది పాశురముల తోనూ పురాణేతి హాసచ్ఛాయలో భగవానుని అవతార పరత్వమును ఉపపాదించి పదకొండవ పాశురము చేత ఈ దశకాను సంధాన ఫలమును వివరించు చున్నారు.

సర్వ లోకములునూ స్తోత్రము చేయు చుండగా వామనుడైన శ్రీహరి త్రివిక్రముడై ఏడు లోకములనూ కొలచుట మొదలైన దివ్య చేష్టితములచే, భగవానుని సర్వేశ్వరత్వమును ప్రతిపాదించు ఈ దశకమును అర్థముతో అనుసంధించు వారికి భగవద్విశ్లేషము ఎన్నటికీ కలుగదు అని నమ్మాళ్వార్లు శ్రియః పతి పరత్వమును ప్రతిపాదించిరి.

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః
అస్మద్గురుభ్యోనమః

# అహం బ్రహ్మాస్మి

**శ్రీమతి ల.సా. ఎన్. హేమాబ్జవల్లి,**
**నరసాపురం.**

"అహం బ్రహ్మాస్మి" అను ఉపనిషద్వాక్యమునకు "నేను బ్రహ్మనైయున్నానని" అర్థము, "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసినవాడు బ్రహ్మయే అగుచున్నాడు. ఇచట బ్రహ్మయై ఉన్నాడు, బ్రహ్మయే అగుచున్నాడు అనగా బ్రహ్మతో సమానుడగుచున్నాడని అర్థము. బ్రహ్మతో సమానుడగుట అనగా "లక్ష్మీపతిత్వము, జగత్కారణత్వము" తప్ప తక్కిన బ్రహ్మ లక్షణములు కలవాడని భావము.

లోకములో ఇద్దరు మిత్రులను చూచి "వారిద్దరు ఒక్కటే" అని చెప్పుట కలదు. ఇచట ఒకరు అనగా శరీరమా, ఆత్మయా, గుణములా? శరీరములు ఒక్కటైనచో ఇద్దరుగా చెప్పబడరు. జీవస్తు ప్రతి శరీరం భిన్నః అని కదా! కనుక ఒక ఆత్మ ఏకకాలమున రెండు శరీరములను ధరింపజాలదు. గుణసామ్యమును బట్టి మాత్రమే ఒకటి యని చెప్పబడుచున్నారు.

అట్లే పరమాత్మ శరీరి. చేతనా చేతనాత్మకమైన జగత్తు అంతయు ఆయనకు శరీరము. ఆయనకు శరీరమైన జీవుడు ముక్తదశలో ఆత్మగుణపూర్తి కలవాడై బ్రహ్మభావనను పొందును. అంతమాత్రము చేత ఈ జీవుడు బ్రహ్మ కానేరడు. శకుంతల నాటకమున దుష్యంత పాత్రధారి ఆమహారాజు యొక్క రూపగుణశీలాదులను అనుకరించును కాని అతడే దుష్యంతమహారాజు కాడు కదా!

జీవునకు ఇట్టి భావనాప్రకర్ష కలుగవలెనన్న మనస్సు ఆ పరమాత్మవరకు పర్యవసించవలెను. అర్థపంచక జ్ఞానము కలిగి శ్రియః పతినే ధ్యానింపవలెను. లోకములో సంసారి చేతనులకు భార్యాబిడ్డలయందు ఎంతటి వ్యామోహముండునో అట్టి వ్యామోహము భగవానుని పట్ల ఉండవలెను. అప్పుడే ఆ ధ్యానము స్థిరమై తానే ఆతడను భావనను పొందును. ఆ భావన కలిగినపుడు పరమాత్మ చెప్పిన మాటలనే చెప్పును. ఆయన లీలలనే అనుకరించును. ఆయనకు గల ఆనందమునే పొందును.

పరమాత్మకు మిక్కిలి ప్రీతి పాత్రుడైన వానికి మాత్రమే ఇట్టి అదృష్టము కలుగును. అందులకై మనము ఆయన యందు పరమ ప్రీతికలిగి శరణాగతి చేసి ఆయననే స్మరించుచుండవలెను.

ఆళ్వార్ల గోష్ఠిలో ప్రధానులు నమ్మాళ్వార్లు. వీరికే పరాంకుశులని పేరు. వీరు భగవంతుని

నిర్హేతుక కటాక్షముచేత కలిగిన భక్తిరూపాపన్న జ్ఞానము కలవారు. వీరు అనుగ్రహించిన నాలుగు ప్రబంధములలో తిరువాయ్ మొழி సామవేదసారము. సామవేదము గానము చేయబడునది. వీరును తమ దివ్య ప్రబంధమును "ఇశై మాలిగళ్" ఇత్యాతిగా చెప్పియున్నారు.,

నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழிలో తమను నాయికగాను, చెలికత్తెగాను, తల్లిగాను భావన చేసికొని భగవంతుని కీర్తించినారు. వీరికి స్త్రీ భావన ఎట్లు సొసగు ననగా స ఏవ వాసుదేవో 2 సౌ సాక్షాత్ పురుష ఉచ్యతే! స్త్రీ ప్రాయమితరత్సర్వం జగద్బ్రహ్మ పురస్సరమ్॥" అను విధముగా ఆ వాసుదేవుడొక్కడే పురుషుడు. బ్రహ్మ మొదలు ఈ జగత్తు అంతయు స్త్రీ ప్రాయము. పరమాత్మ స్వతంత్రుడు. కావున పురుషుడు. మిగిలిన చేతనా చేతన జగత్తు ఆయనకు పరతంత్రము. కావున స్త్రీ ప్రాయమగుచున్నది.

చెలికత్తె నాయికా నాయకుల మధ్య సంబంధమును కూర్చును. ప్రణవములోని 'అ' కారము నారాయణుని, 'మ'కారము జీవుని సూచింపగా 'ఉ'కారము వారిద్దరి మధ్య సంబంధమును సూచించును. ఆ 'ఉ'కారమే చెలికత్తె. యనగా సంబంధ జ్ఞానమని అర్థము.

తల్లి తనకుమార్తెను పెంచి పెద్ద చేసి అత్తవారింటికి పంపదలచును. కుమార్తె భర్త సంశ్లేషమునకు త్వరపడినను అది ఉచితము కాదనియు, ఆతడే వచ్చి తీసికొని వెళ్ళు వరకు ప్రతీక్షింపవలెనని బోధించి భర్త వచ్చి తీసికొని వెళ్ళువరకు కుమార్తెను కాపాడును. తిరుమంత్రములోని "నమః" పదము ఈ అర్థమునే తెలియజేయును.

"ప్రణవ" "నమః" పదములచే తెలిసికొనబడిన సర్వేశ్వరుని వైలక్షణ్యమును తలచి ఆ విశ్లేషమును సహింపలేని త్వరయే నాయిక. ప్రాప్యత్వరయే నాయికావస్థ.

ఈ విధముగా మూడు భావనలు పొందిన నమ్మాళ్వార్లు "తిరువాయ్ మొழி" 5వ శతకములోని 6వ దశకములో తల్లి భావనతో కుమార్తె అవస్థను చెప్పుచున్నారు.

పరాంకుశనాయిక తిరుక్కురుంగుడి నమ్బి యొక్క సౌందర్యమును సేవించినది.

"శఙ్గి నోడుమ్ నేమియోడుమ్ తామరై క్కణ్గళోడుమ్
శెమ్కనివాయ్ ఒన్ఱి నోడుమ్ శెల్కిన్ఱతు ఎన్నెఞ్జమే"

శంఖచక్రములతోను తామరపుష్పముల వంటి నేత్రములతోను, ఎఱ్ఱని అధరము తోను నామనస్సున సంచరించుచున్నాడు అనునట్లు, ఆ తిరుక్కురుంగుడి నంబిగారి సౌందర్యమును సేవించినది. ఈ విధమైన భగవత్సంశ్లేషము బాహ్యముగా కలిగినదిగాని మనస్సున స్మరించి ధరించియుండు స్థితి లేకపోయినది. ఇట్లు ప్రియుని విరహముచే కృశించియున్న ఈమె స్వామి ననుకరించి విరహవ్యథను పోగొట్టుకొనదలచినది. అర్జునునకు గీతోపన్యాసమును చేసిన శ్రీకృష్ణపరమాత్మవలే జ్ఞానముద్ర కలదియై పరమాత్మవలె మాటలాడ ప్రారంభించినది. ఇదిచూచిన పరాంకుశనాయిక తల్లి "ఈమెకు ఈ వికారము మణి మంత్ర ఔషధములచేత కలిగెనా!" అని సందేహించి

అట్టి లక్షణములు ఏమియు కనపడుకుండుటచే అట్టిది కాదని తెలిసికొనెను. ప్రియుని విరహమును అపనయింపకోరి ఈమె సర్వేశ్వరుని అనుకరించుచున్నదనియు తెలిసి కొన లేక పోయెను. బంధువులందఱును నీ కుమార్తె ఇట్లు ఉన్నదేమని ప్రశ్నింపగా పరాంకుశ నాయిక తల్లి "భగవానుడు ఈమెను ఆవేశించియున్నాడని" చెప్పుచున్నది.

ఒక శరత్పూర్ణిమ నాడు గోపికలతో రాసక్రీడలాడుచున్న శ్రీకృష్ణుడు అదృశ్యుడయ్యెను. గోపికలు శ్రీకృష్ణవిరహమును సహింపలేకపోయిరి. మిక్కిలి దుఃఖించిరి. వారు తమ విరహబాధను, పోగొట్టుకొనుటకు శ్రీకృష్ణుని చేష్టితములను అభినయించి ప్రాణములను నిలుపుకొనిరి. కృష్ణుని యందు నిమగ్నమైన మనస్సుగల ఆ గోపికలలో ఒకతె నేను కృష్ణుడను అని పలుకగా మరియొక గోపిక నామురళీగానము వినుడీయని పలికెను. మరియొక గోపిక కాళీయమర్దనము నభినయించుచు "నేను కృష్ణుడను" దుష్ట కాళీయుడా! నిలు నిలు అని పలికెను.

ఇట్లు గోపికలు కృష్ణావతార సమయమున ఉన్న వారగుటచేత కృష్ణ సామ్యాపత్తిని పొంది కృష్ణలీలలను అనుకరించిరి. పరాంకుశనాయిక భక్తి రూపాపన్న జ్ఞానమును పొందిన దగుటచే ఉభయ విభూతి నాయకుడైన సర్వేశ్వరుని అనుకరించుచున్నది.

పరాంకుశనాయిక చెప్పుమాటలను విని ఆమె తల్లి బంధువులతో చెప్పిన మాటలుగా ఈ దశకము సాగినది.

ఈ దశకములో నమ్మాళ్వార్లు 1. సర్వేశ్వరుని జగత్ సృష్ట్యాది క్రియాకలాపములు 2. ఆయనను ప్రతిపాదించు విద్యలు 3. జగత్తుకు ప్రధాన కారణమైన పంచమహాభూతములును 4. సకల యజ్ఞాది క్రియలను 5. జగద్రక్షణను 6. అవతారచేష్టలను 7. జగత్తులో ఆయనకుగల సకల బంధువర్గమును 8. బ్రహ్మాదిదేవ మహర్షి వర్గమును 9. పుణ్య పాప రూపకర్మలను 10. స్వర్గనరకాది రూపమైన ఫలములను అనుకరించి వచించిరి.

1. కడల్ ఞాలమ్: ఈ జగత్తును సృజించువాడును, రక్షించువాడును, కొలిచినవాడును ఉద్ధరించిన వాడును మ్రింగినవాడును నేనే అని ఈమె చెప్పుట చూడగా ఈమె యందు సర్వేశ్వరుడు ఆవేశించినాడని తోచుచున్నది.

"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తదా" అనునట్లు ఆ పరమాత్మయే ఈ సమస్త ప్రపంచము పుట్టుటకు, వృద్ధి నొందుటకు నశించుటకు కారణమైనవాడు. "తత్సృష్ట్వా, తదేవాను ప్రావిశత్" దానిని సృజించి దానియందు ప్రవేశించి అని తైత్తరీయోపనిషత్; "పద్భ్యాం భూమిః" పాదములనుండి భూమి పుట్టినది అని పురుష సూక్తము.

"ఆత్మనః ఆకాశః సంభూతః ఆకాశాత్ వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ" బ్రహ్మానందవల్లి పరమాత్మయొక్క మనస్సునుండి ఆకాశము, దానినుండి వాయువు, దాని నుండి అగ్ని, అగ్ని నుండి నీరు, దాని నుండి భూమి పుట్టుచున్నవి. అని చెప్పిన విధముగా ఈ జగత్తును సృష్టించినవాడు పరమాత్మయే.

ఈ భూమికి అంతర్యామి యైనవాడును పరమాత్మయే. "యః పృథివ్యాం తిష్ఠన్, యం పృథివీ నవేద" "ఎవడు భూమి యందు అంతర్యామిగా నుండునో, ఎవనిని భూమి తనకు అంతర్యామిగా తెలిసికొనలేదో"

తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్ తదను ప్రవిశ్య సచ్చత్యాచ్చా భవత్, అన్తః ప్రవిష్ట శాస్తా జనానాగ్ం సర్వాత్మా అందఱికి అంతర్యామిగా నుండి నియమించువాడు.

"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేऽర్జున తిష్ఠతి" భగవద్గీత. సర్వేశ్వరుడు సమస్త ప్రాణుల హృదయమునందు అంతర్యామియై యున్నాడు అనునట్లు ఈ జగత్తుకు అంతర్యామిగా నుండువాడు పరమాత్మయే.

బలిచక్రవర్తిని మూడడుగుల నేల యాచించి త్రివిక్రమావతారుడై భూమిని గ్రహించినవాడును, ఆసురప్రకృతులైన రాక్షసులగు హిరణ్యాకాదుల నుండి భూమిని ఉద్ధరించిన వాడును, ప్రళయకాలమున భూమిని తన గర్భమునందు ఇముడ్చుకొన్నవాడును ఆపరమాత్మయే.

2. కళ్కుమ్‌కల్కిక్కి: "ఉపనిషత్తులచేత తెలియదగినవాడును, వేదములకు నిర్వాహకుడును, ప్రవర్తకుడును, అర్థ తాత్పర్యములు నిర్ణయించువాడును, ఫలమైనవాడును నేనే" అని ఈమె చెప్పుచున్నది. దీనిని చూడగా సర్వేశ్వరుడు ఆవేశించెనేమో అని అనిపించుచున్నది. ఇంత చిన్న వయస్సులో ఈమె నేర్చిన మాటలను విద్యాధ్యయనము చేయని మీకు ఏమని చెప్పుదును!"

ఆచార్యులనుండి నేర్వవలసినది వేదవిద్య. "అనన్తావైవేదాః" అనునట్లు ఆవేదములు అనంతములు. వేదములకు శిరో భాగము ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తులు స్థానముగా గలవాడు పరమాత్మ. "వేదైశ్చ సర్వైః అహమేవ వేద్యః" "వేదములన్నింటిచేత తెలియదగినవాడను నేనే." కావుననే వేదాంతవేద్యుడని కీర్తింపబడుచున్నాడు.

సుప్త ప్రబుద్ధ న్యాయానుసారము సృష్టికాలమున "ధాతా యథాపూర్వమకల్పయత్" అనునట్లు పూర్వమువలె ఆవేదములను సృజించినవాడును, తిరిగి ప్రళయకాలమున ఆవేదములను ఉపసంహరించి తనలో దాచిన వాడును ఆ పరమాత్మయే.

ఆ వేదమున గల సంశయములను తీర్చి తాత్పర్య నిర్ణయము చేయువాడును ఆ పరమాత్మయే. వేదమున గల సంశయములనగా సగుణ నిర్గుణ శ్రుతులు సాకార నిరాకారములను బోధించు శ్రుతులు వీనికి సమన్వయమెట్లని సందేహము కలుగగా వానిని నివారించి 'యశ్శ్రుతి స్మృతి సూత్రాణా మన్తజ్వరమశీశమత్" అనునట్లు అపార్థమును చెప్పువారివలన వేదములకు కలిగిన అన్తజ్వరమును పోగొట్టిన వారును "శేషో వా సైన్యనాథోవా శ్రీపతిర్వా" "ఆదిశేషులా? విష్వక్సేనులా లేక శ్రియః పతియా" అని ప్రాజ్ఞులచేత కీర్తింప బడిన భగవద్రామాను జాదుల రూపమున అవతరించి వేదములకు తాత్పర్య నిర్ణయము చేయువాడును, ఆ వేదముల సారాంశమైన మూలమంత్రాదులును వాని వలన కలుగు ఫలమును తానే. ఇట్టి సర్వేశ్వరుని స్వరూపము "వేదేనానేన వేదితవ్యమ్" అనునట్లు వేదముల చేతనే తెలియవలెను.

3. కాణిన్ఱ నిలమెల్లామ్: కనిపించుచున్న భూమియు, ఆకాశమును, అగ్నియు, వాయువును, సముద్రమును నేనే. ఇట్లు చెప్పుచున్న ఈమెను సముద్రవర్ణుడైన సర్వేశ్వరుడు ఆవేశించెనని తోచుచున్నది. సకల పదార్థములను సాక్షాత్కరింపజేసిన నా కుమార్తె చేష్టలను ఏమని చెప్పుదును.

ఈ జగత్తునకు ప్రధాన కారణము పంచమహాభూతములు. అవి భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనునవి. ఇవి కార్య కారణములచేత రెండు విధములు. ప్రత్యక్షముగా కంటికి కనుపించునవి కార్యభూతములు. శాస్త్రప్రమాణముచేతనే తెలియబడునవి కారణభూతములు. ఇచట కార్యరూపముగా కంటికి కనిపించు ఈ పంచమహాభూతములకు మూలమై, శాస్త్ర ప్రమాణాదులచేత తెలిసికోదగిన కారణరూప పంచమహాభూతములను కూడా తెలియచేయుచున్నారు.

తస్మాద్వా ఏ తస్మాత్ ఆత్మనః ఆకాశ స్సంభూతః, ఆకాశాత్ వాయుః, వాయో రగ్నిః, అగ్నేరాపః అద్భ్యః పృథివీ ॥ అని పంచమహాభూతముల ఉత్పత్తిని తైత్తరీయోపనిషత్తు తెలుపుచున్నది.

ఈ విధముగా తెలిసికోదగిన పంచమహాభూతములలో భూమి చివరిది. "యస్య పృథివీ శరీరమ్; యః పృథివ్యాం తిష్ఠన్" "ఎవనికి భూమి శరీరమో, ఎవడు భూమియందు (అంతర్యామిగా) ఉన్నాడో" అనునట్లు ఈ భూమియు పరమాత్మయే.

పంచమహాభూతములలో మొదటిది ఆకాశము. ఇది పరమాత్మనుండి ప్రభవించినది. ఇది అన్నింటికి అవకాశమును ప్రసాదించునది. తేజః పదార్థములలో ప్రధానమై ఉష్ణస్పర్శగలది అగ్ని. "ముఖాదిన్ద్రశ్చాగ్నిశ్చ" అని అగ్ని పరమాత్మముఖమునుండి పుట్టుచున్నది. కావున ఆ అగ్నియు పరమాత్మయే.

ఈ అగ్నికి ముందున్నది వాయువు. "వాయోరగ్నిః" అని కదా! ఇది స్పర్శచే తెలిసి కోదగినది. గాలి లేక నిలువజాలని వారమగుటచే మనకు సన్నిహితమైనది. ఇట్టి వాయువు పరమాత్మయే.

"అగ్నేరాపః" అగ్నినుండి నీరు. ఇది రుచి చేత తెలిసి కొనదగినది. ఈ విధముగా "భూమి రాపోనలో వాయుః ఖం" అనునట్లు ఈ పంచమహాభూతములు పరమాత్మనుండి ఉద్భవించిన వగుటచేత అవియన్నియు పరమాత్మయే అనుచున్నారు. అట్టి పరమాత్మ సముద్రమువలె నీల వర్ణుడై తేజోరాశియై వెలుగుచున్నాడు.

4. శెయ్కిన్ఱ కిఱియెల్లామ్: భూత భవిష్యత్ వర్తమాన కాలములయందు చేయదగిన యజ్ఞయాగాది క్రియలును, వాని ఫలమును అనుభవించువాడును, యజ్ఞయాగాది క్రియలనుచేయువారిని ప్రేరేపించువాడును నేనే యని చెప్పుటను బట్టి ఈమెయందు సర్వేశ్వరుడు ఆవేశించియుండవచ్చునని తోచుచున్నది.

"అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ" అనియు "యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాఙ్గో యజ్ఞ వాహనః । యజ్ఞభృత్ యజ్ఞకృత్ యజ్ఞీ యజ్ఞభుక్ యజ్ఞసాధనః ॥ యజ్ఞాన్తకృత్

యజ్ఞగుహ్యం" (సహస్రనామం) అనునట్లు త్రికాలముల యందు చేయు యజ్ఞయాగాదులు నేనే. అనగా చేయబడుచున్న యజ్ఞయాగాది క్రియలన్నియు నేనే. చేయబోవు యజ్ఞ యాగాది క్రియలును నేనే. ఇదివరలో చేసిన యజ్ఞ యాగాదులును నేనే. (అనగా స్వర్గాది ఫలములను కోరి చేయు యజ్ఞమును, దేవతాంతరములను కోరి చేయు యజ్ఞమును, మోక్షసాధనమైన యజ్ఞ యాగాదులును నేనే అనుట) ఆ యజ్ఞయాగాదుల ఫలమును అనుభవించు వాడును, ఆ యజ్ఞయాగాదులను చేయువారిని ప్రేరేపించువాడను నేనే" అని శ్రీకృష్ణ పరమాత్మయే తెలిపియున్నాడుకదా!

5. తిఱమ్బామల్: లోకములను రక్షించినవాడును, గోవర్ధన పర్వతమును ఎత్తిన వాడును, అసురులను సంహరించిన వాడును, పాండవులను రక్షించినవాడును, సముద్రమును చిలికిన వాడును నేనే యని ఈమె పలుకుచున్నది.

తన యాజ్ఞకు ఎదురులేక ఈ భూమిని రక్షించువాడును, (ఇంద్రుడు రాళ్లవాన కురిపించినను చలింపక). గోవర్ధన గిరిని గొడుగుగా నెత్తి గోవులను గోపాలురను కాపాడినవాడును, "ద్వాభూతసర్గౌ లోకే2స్మిన్ దైవ ఆసుర ఏవ చ" అనునట్లు ఆసుర ప్రకృతి గలిగిన హిరణ్యాక్ష హిరణ్యకశిప్వాది అసురులను సంహరించిన వాడును, యుద్ధవిముఖుడైన అర్జునునకు కర్తవ్యమును బోధించి యుద్ధోన్ముఖునిగా చేసి ఆశ్రితులైన పాండవులను రక్షించినవాడును, భాండములో పెరుగును ఉంచి కవ్వముతో చిలుకు వారివలె సముద్ర మధ్యమున మందర పర్వతము నుంచి దాని క్రింద కూర్మరూపమై నిలచియు, దేవతలయందు అసురులయందు ఆవేశించియు, క్షీరసాగరమును మధించినవాడు ఆ పరమాత్మయే.

6. ఇనవేయ్మలై : గుంపులుగుంపులుగా వెదురు పొదలు గల గోవర్ధనగిరిని ఎత్తిన వాడును, సప్తవృషభములను చంపినవాడును, దూడలను మేపినవాడును, పశువులను కాచినవాడును, గొల్లలకు ప్రధానుడును నేనే అని ఈమె చెప్పుట చూడగా నిత్య సూరులకు ప్రధానుడైన సర్వేశ్వరుడు ఆవేశించినాడని తోచుచున్నది.

గోవర్ధనగిరిని ఎత్తి గోవులను గోపాలరును రక్షించినవాడును, నప్పిన్నై పిరాట్టికి పందెముగా పెట్టిన సప్త వృషభములను ఒక్కసారిగా చంపినవాడును, "వత్స మధ్యగతం బాలం" అనునట్లు చిన్నదూడల మధ్యనున్నవాడును పరువములో అడుగిడుచున్న దూడలను మేపిన వాడును, గోపాలుర సమూహమునకు ప్రధానుడును, నిత్యసూరులకు నిర్వాహకుడును ఆ సర్వేశ్వరుడే.

7. ఉత్తార్కళ్:- లోకరీతిగా నాకు బంధువులు లేరు. శాస్త్రరీతిగా అందఱును బంధువులే. అందఱను బంధువులుగా నేనే చేసుకొంటిని. ప్రయోజనము నాశించి నన్ను చేరిన వారిని సంసారమున పడద్రోయువాడను. అనన్య ప్రయోజనులై నన్ను చేరినవారికి బంధువయినవాడను నేనే అని ఈమె పలుకుచున్నది.

పరమాత్మకు ఈ లోకములో కర్మవశ్యతచేత కలిగిన బంధువులెవరును లేరు. "పతిం

విశ్వస్య" గతిర్భర్తా ప్రభు స్సాక్షీ "అనునట్లు అందరు ఆ పరమాత్మకు నిరుపాధిక బంధువులే. వారిలో కొందఱు తనను ఆశ్రయించునట్లుగా చేయువాడును , ప్రయోజనాంతరపరులను సంసారసాగరమున పడద్రోయు వాడును, అనన్య ప్రయోజనులై తననాశ్రయించిన వారికి సకల విధ బంధువై అనుగ్రహించువాడును ఆ పరమాత్మయే.

8. ఉరైక్కిన్దముక్కణ్:- "బ్రహ్మరుద్రేంద్రాది సకల దేవతలును, దక్షాది ప్రజాజతులు, మన్వాదులు నేనేయని ఈమె పలుకుట చూడగా మేఘవర్ణుడైన పరమాత్మ ఆదేశించి యుండవచ్చునని తోచుచున్నది.''

వేదములో భగవద్విభూతిని తెలుపు ప్రకరణములో "న సన్నచాసః శివ ఏవకేవలః" అనియు, అర్థవాద ప్రకరణములో ఏక ఏవ రుద్రో నద్వితీయాయతస్థే, అనియు, నారాయణసూక్తములో "సశివః" అనియు భగవద్గీతలో "రుద్రాణాం శంకరశ్చాౕస్మి" అనియు చెప్పబడు త్రినేత్రుడగు రుద్రుడును ఆ పరమాత్మయే.

విరూపాక్షాయ బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ శ్రేష్ఠాయ అనునట్లు రుద్రునకును తండ్రియై ప్రమాణ ప్రసిద్ధుడై నారాయణ సూక్తమున "సబ్రహ్మ" అని చెప్పబడు చతుర్ముఖ బ్రహ్మయు ఆ పరమాత్మయే.

ఆ చతుర్ముఖ బ్రహ్మచే సృజింపబడి నిత్య సృష్టికి కారణమైన దక్షాది ప్రజాపతును పరమాత్మయే.

భగనద్వి భూతిలో నొకడై సేంద్రః అనియు; "దేవానాం అస్మివాసవః" అనియు కీర్తింపబడు దేవతలకు నాయకుడైన ఇంద్రుడును ఆ పరమాత్మయే. వేదములను ప్రకాశింపచేసిన నారదమన్వాదులును ఆ పరమాత్మయే అట్టి పరమాత్మ నీలవర్ణుడు.

9. కొడియ విన్నై: "నాకేవిధమైన పాపము కలుగదు. పాపమనగా నాకోపమే తప్ప వేరేమియుకాదు. ప్రతికూలురచే పాపమును చేయించువాడును భక్తుల పాపములను పోగొట్టువాడను నేనే. క్రూరుడైన రావణుని లంకతో సహా చంపినవాడును నేనే అని పలుకుట చూడగా గరుడవాహనుడైన స్వామి ఈమెను ఆవేశించినట్లు తోచుచున్నది. కర్మవశ్యులైన బద్ధ చేతనులకు పాపము కలుగు విధమున భగవానున కే పాపమును అంటదు. "అనశ్న న్నభిచాకశీతి", అనియు "నమాం కర్మణి లిమ్పన్తి, న మే కర్మపలేస్పృహా" అనిగదా! చెప్పబడినది "యత్వ్రత్రియం తదిహ పుణ్య మపుణ్య మన్యత్" (భగవానునకు ఇష్టమైనది పుణ్యము–కానిది కోపము) అని చెప్పినట్లు పాపమనగా స్వామి ఆగ్రహమే దానికి నిర్వాహకుడును స్వామియే. "తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషు నరాధమాన్, క్షిపామి" అనునట్లుగా వారిని సంసారములో పడవైచి వారిచే పాపములు చేయించువాడును ఆ స్వామియే.

"అహం త్వా సర్వపాపేభ్యః మోక్షయిష్యామి" అని చెప్పిన విధముగా తనను ఆశ్రయించిన వారి పాపములను పోగొట్టి మోక్షమునొసంగువాడును ఆ స్వామియే.

10. కోలజ్గొళ్ ఉవర్క్కుమ్: "అల్పసుఖముగల స్వర్గమునకు, సుఖమేలేని నరకమునకు,

అపరిచితమైన ఆనందము గల మోక్షమునకు, నేనే నిర్వాహకుడను; జ్ఞానానంద స్వరూపులైన జీవాత్మలకు; విచిత్ర స్వభావముగల మూలప్రకృతికిని నేనే నిర్వాహకుడను" అని చెప్పుట చూడగా ఈమెను భగవానుడాదేశించినట్లు తోచుచున్నది.

పుణ్య కర్మలు చేసినవారు ఆ పుణ్య ఫలరూపమైన సుఖమును అనుభవించుటకు ఏర్పడినదై చూడచక్కనిదైన స్వర్గాది భోగలోకములకు నిర్వాహకుడును సర్వేశ్వరుడే!. పాపకర్మలు చేసినవారు ఆపాపకర్మఫలరూపమైన "బాధలను అనుభవించుటకు ఏర్పడినదై మిక్కిలి దుఃఖమును కలిగించు కుంభీపాక రౌరవాది నరక లోకములకు నిర్వాహకుడును స్వామియే.

మన ప్రయత్నముచేకాక కేవల భగవత్కృపచే మాత్రము లభ్యమై అపరిచ్ఛిన్నమైన ఆనందమును ప్రసాదించు మోక్షమును స్వామియే.

"కడల్ఞాలం" అనిప్రారంభించి "మోక్కముమ్యాన్" అని చెప్పుట జగత్సృష్టికి మూలకారణమనుటతో ప్రారంభించి మోక్ష ప్రదత్వము వరకు సర్వము శ్రీయఃపతి అధీనమే యని చెప్పుట యగుచున్నది. దేవతలని, రాక్షసులని, మనుష్యులని ఇత్యాద్యనేక శరీరములను ధరించిన జ్ఞానానంద స్వరూపులైన జీవాత్మలకు నిర్వాహకుడును స్వామియే. చిత్ర విచిత్ర స్వభావముగలదై దేహేన్ద్రియ త్వేన భోగ్యత్వేన అవస్థితాం అనునట్లుండే మూల ప్రకృతికిని కారణము సర్వేశ్వరుడే! "మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్" అని తానే చెప్పినాడు గదా!

11. కమలవాసినియైన శ్రీదేవికిని; భూదేవికిని, నీళాదేవికిని, నాయకుడైన సర్వేశ్వరుని స్తుతించిన వారును వఙ్గుది వళనాడు అను దివ్య దేశమందు వేంచేసియున్న నమ్మాళ్వార్లు అంతరంగ కైంకర్యముగా వేదార్థములను పరిశీలించి అనుష్ఠించిన తిరువాయిమొழி యందు ఈ పది పాశురములను అను సంధించు వారు శ్రీ వైష్ణవ సంపదగలవారై, భాగవత కైంకర్యనిష్ఠులై కీర్తిమంతులగుదురు.

ఈ పాశురసారమును మణవాళమహామునులు తమ తిరువాయిమొழி నూత్తందాది యందు ఈ విధముగా సంగ్రహించి యున్నారు.

కడల్ఞాలత్తీశనై మున్ కాణామల్ నొన్దే
ఉడనా అనుకరిక్కలుత్తు– తిడమాగ
వాయ్న్దవనాయ్ తాన్ పేశుం మాఱనురై యదనై
ఆయ్న్దురైప్పార్ ఆట్చేయ్య నోత్తార్.

ఈ లోకములో సర్వేశ్వరుని సేవింపనందుకు బాధపడి కృష్ణావతార సమయమున గోపికలను అనుకరించి వారివలె హృదయమందు తలచి ఆ సర్వేశ్వరుడే తాననునట్లు అనుకరించి పాడించిన ఆళ్వార్ల యీ శ్రీసూక్తి వైభవమును అనుసంధించువారు ఆళ్వార్లకు కైంకర్యము చేయుటకు నోచినవారగుదురు.

శ్రీమతే శఠకోపాయనమః

అస్మద్గురుభ్యో నమః
శ్రీ పరాంకుశదాసాయ నమః
శ్రీమతే రామానుజాయనమః

# నమ్మాళ్వారుల భాగవతనిష్ఠ

ఉ.వే.శ్రీమాన్. గోవిందరాజన్ స్వామి
నరసాపురం

వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్ ।
యశ్శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడ భాషయా॥

ముముక్షువులయిన వారలకు అందున శ్రీ విశిష్టాద్వైత సంప్రదాయస్థులగు వారికి నిత్యానుసంధేయమగు తిరుమంత్రమున ప్రథమ పదమగు ప్రణవము భగవచ్ఛేషత్వమును తెలుపుచున్న విధముగనే భాగవత శేషత్వమును కూడా తెలుపుచున్నది. ఈ భాగవత శేషత్వమే వైష్ణవ సంప్రదాయమునకు అత్యంత ప్రధానమైయున్నది. భగవద్భక్తులగుట కన్ననూ భాగవతదాసులైయుండుట పరమోత్కృష్టమని పూర్వాచార్యులు తెలియజేసియున్నారు. పరమపదమునందు సైతము భగవత్సేవను అతిశయించి భాగవత సేవయే వాంఛనీయము, అనుసరణీయము, అని ఆళ్వార్లు విశదపరచి యున్నారు.

భాగవత వైభవమును పురాణేతిహాసములు బహుధా ప్రకటించియున్నవి. "వాసుదేవేభగవతి భక్తిముద్వహతామ్ నృణామ్! జ్ఞానవైరాగ్య వీర్యాణాం నేహ కశ్చిద్వ్యపాశ్రయః" అని శ్రీమద్భాగవతము తెలుపుచ్నుది.

పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః
తేనైవ తే ప్రయాస్యన్తి తద్విష్ణోః పరమం పదమ్"

భాగవత సంబంధమున్న మానవులే కాదు పశు పక్ష్యాదులు కూడా పరమ పదమును పొందుచున్నవి. "యం యం స్పృశ్యతి పాణిభ్యాం యం యం పశ్యతి చక్షుషా! స్థావరాణ్యపి ముచ్యన్తే కింపున ర్బాంధవా జనాః" భాగవత శ్రేష్ఠుల కరచరణాది స్పర్శమాత్రమున వీక్షణ మాత్రమున సమస్త జీవులు మోక్షమును పొందగలవన్నచో భాగవత శ్రేష్ఠుల మహిమ నేమని చెప్పవచ్చును? తత్త్వజ్ఞానము కాని తదనుగుణమగు అనుష్ఠానము కాని లేనివారు సయితము భాగవత సంబంధము చేతనే మోక్షమును పొందకలుగుదురు. జ్ఞానానుష్ఠానములు కలిగినవారయినను భాగవత సంబంధము లేనిచో ముక్తి దుర్లభము.

భగవంతుని కన్నను భాగవతులే అధికులు. ఏలయనగా భగవదాశ్రయమునకు వేరొకరి పురుషకారము కావలసియున్నది. సర్వేశ్వరుడు సర్వ తంత్ర స్వతంత్రుడు కనుక మనము చేయు దోష కార్యములందు కోపించినను కోపించవచ్చును. భాగవతుల విషయమున అట్లుకాదు. భాగవతానుగ్రహమునకు వేరొకరి పురుషకారముతో పనిలేదు.

వారు అపార కరుణా సముద్రులు కనుక మన దోషములను పరిగణింపక స్వరూపానుగుణముగ్ మనలను వినియోగ పరచుకొని తా జ్యోపాదేయములను కటాక్షించి రక్షింతురు. పితామహం నాథమునిం విలోక్య....." అని ఆళవందారులు ప్రార్థించినట్లు మనయందు దోష బాహుళ్యము మిక్కుటముగా నుండినను భాగవత సంబంధము లేశమాత్రముండిన భగవదనుగ్రహమును పొందగలము.

విష్ణు భక్తుల హృదయములు భగవానునకు జంగమ నివాసములు, వారిని చూచినంతనే జాత్యాదులను గణింపక సాష్టాంగముగ నమస్కరింప వలెనని ఋషివాక్యము.

నారాయణ పరాస్సర్వే నకుతశ్చ న బిభ్యతి
స్వర్గాపవర్గ నరకే ష్వపి తుల్యార్థ దర్శినః స్వర్గాపవర్గ నరకాదుల యందు సమభావము కల్గి శ్రీమన్నారాయణ చరణార వింద దాసులయిన వారికి దేనిని గురించియు భయము కలుగనేరదు. జన్మ మాత్రాధిక్యతలను సామాన్యుల విషయమునందే కాని విష్ణుదాసుల విషయమున పరిగణింపరాదు. భగవంతుని యందు అనన్యమైన భక్తి కల్గియుండువారే ఉత్కృష్టులు. జాత్యాది నైచ్య భావములు వారి యందు చూడరాదు. "నశూద్రా భగవద్భక్తా విప్రాభగవతాస్మృతాః సర్వ వర్ణేషు తే శూద్రా యే హ్యభక్తా జనార్దనే" విష్ణుభక్తి లేనివాడే జాత్యల్పుడు. "శ్రవణం కీర్తనం విష్ణోః....." అని చెప్పినట్లుగా భగవంతుని యందు అష్టవిధ భక్తి కలిగి తొమ్మిదవది యగు భగవద్భక్తుల యందు అనురాగము కలిగియుండువాడే శ్రీమంతుడు. బ్రహ్మజ్ఞానికి వేదవేదాంగాది శాస్త్ర జ్ఞానములకన్న భగవంతుని యందు అనన్యమగు భక్తి కల్గియుండుటే మిన్నయని చెప్పబడినది. విష్ణుభక్తి లేక కేవల శాస్త్రజ్ఞానము కలవారు నిరర్ధక జీవులు. విష్ణు భక్తి వర్జితుడయిన చతుర్వేద పారంగతుడగు బ్రాహ్మణుని కన్న శ్రీమన్నారాయణుని యందు అచంచల భక్తి కల శ్వపచుడు పూజనీయుడవి పురాణవచనము. నమే పూజ్యః చతుర్వేదీ పూజయన్భక్తి వర్జితాః
సమే పూజ్యః సదా చాసౌ మద్భక్త శ్శ్వచోపియః
తస్మై దేయం తతోగ్రాహ్యం సచపూజ్యోయథాహ్యహమ్" అని తనను పూజించిన విధముగనే విష్ణుదాసులను సేవించవలెనని భగవానుడు విశదముచేసియున్నాడు. వాఙ్మాత్ర ప్రబోధముతోకాక సర్వేశ్వరుడు రామకృష్ణాద్యవతారముల యందు తాను ఆచరించుట ద్వారమున భాగవత వైభవమును ప్రకాశింప చేసియున్నాడు.

"ధర్మజ్ఞ స్సమయః ప్రమాణం వేదాశ్చ" అని వేదములకన్న ముందుగా ధర్మజ్ఞులయిన వారి వర్తనము ప్రమాణమని చెప్పబడినది కదా! అట్టి ధర్మ వేత్తలకు తలమానికము శ్రీరామచంద్రుడు. "రామో విగ్రహవాన్ ధర్మః" "ధర్మజ్ఞ సత్య సంధశ్చ" మర్యాదానాంచ లోకస్య కర్తా కారయితా చ సః......" ఇత్యాదిగ అనేక తావుల యందు రామచంద్రుని సకల ధర్మజ్ఞునిగా, సమస్త ధర్మములకు మూలముగ మహర్షి వాల్మీకి వివరించియున్నారు. సకల ధర్మవేత్తయైన ఆ స్వామి తాను శ్రేష్ఠమగు వైవస్వత వంశమున చక్రవర్తి కుమారుడై

అవతరించియు సామాన్య కిరాత స్త్రీయగు శబరి యిచ్చిన ఫలములను ప్రీతితో ఆరగించినాడు. "శబర్యా పూజిత స్సమ్యక్ రామో దశరథాత్మజ్ఞః" అని శబరి చేసిన పూజ ఉత్కృష్టమని చెప్పిరి. శబరికి గల భాగవత సంబంధమును పరిగణించియేకదా స్వామి ఆమె యిచ్చిన ఆతిథ్యమును స్వీకరించినది. తిర్యక్ యోని యందు జన్మించిన జటాయువునకు, పరమోత్కృష్టులైన వారికి మాత్రమే చేయునట్టి బ్రహ్మమేథ సంస్కారమును తాను స్వయముగా చేసి భాగవతోత్కర్షను ప్రకటించియున్నాడు. శ్రీమద్రామాయణమున లక్ష్మణస్వామి భగవచ్ఛేషత్వమును నిరూపించువారు కాగా శత్రుఘ్నులు భాగవతశేషత్వమే పరమోత్కృష్టమని నిరూపించిన వారనుట సంప్రదాయ సిద్ధము.

"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అని ధర్మ సంస్థాపన కొఱకు అవతరించి శ్రీకృష్ణ భగవానుడు, జ్ఞానియైన వాడుకూడ లోకవృత్తము ననుసరించి వర్ణాశ్రమ ధర్మములను పాటింపవలెనని శాసించియున్నాడు కదా! అట్టి స్వామి "మమవర్త్మాను వర్తన్తే మనుష్యాః పార్థ సర్వశః" అని సందేశమునిచ్చియున్నాడు. అట్టి కృష్ణభగవానుడు పాండవదూతయై హస్తినకు వెళ్లినపుడు భీష్మద్రోణాది జాత్యుత్కృష్టులయిన వారిని వదలి వృషలుడయిన విదురినింట విందును ఇష్ట పడినాడు కదా!

విదురాన్నాని బుభుజే శుచీని గుణవంతిచ' అని విదురదత్తాన్నము శుచివం తము గుణవంతమునని స్పష్టము చేసెను. పరమ భాగవతుడగు విదురదత్తాన్నము కన్న శుచివంతము గుణవంతము వేరొకటి కానేరదని స్పష్టము చేసినట్లే కదా!

ఈవిధముగా పురాణేతిహాసాదులందు ప్రతిపాదింపబడి నిరూపింపబడిన భాగవత వైభవమును ప్రసన్న జన కూటస్థులగు శ్రీ నమ్మాళ్వార్లు ఎట్లనుగ్రహించిరో యించుక పరిశీలింతుము.

భాగవత గోష్ఠి యందు అన్వయింప కలుగుటయే తాము కోరుకొను పరమ పురుషార్థమని ముందుగా ప్రకటించియున్నారు. "తుళిక్కిన్షవాన్ ఇన్నిలమ్ శుడరాళ్లిశజేన్ది అళ్లికిన్న మాయప్పిరాన్ అడియార్గళ్ కుళాజ్గళే ఉడన్ కూడువదెన్ను కోలో'' శ్రీమన్నారాయణ చరణారవింద దాసులగు వారితో కలసి ఉండకలుగట ఎన్నడో అని ఆశపడిరి. "పాఱ్కడల్ శేర్న్ద పరమనై, పయిలుమ్ తిరువుడైయార్ పయిలుమ్ పిడిప్పడైత్తోర్ ఎమ్మొయాళుమ్ పరమర్" క్షీరాబ్ధినాథుని సేవించుట అనెడి గొప్ప సంపద కలవారు జాతి గుణాదులచే ఎంత తక్కువ వారయినను వారే జన్మజన్మములకు పరమ ప్రాప్యులని స్పష్టముచేసిరి.

"సంసార విష వృక్షస్య ద్వేఫలే హ్యమృతోపమే
కదాచిత్కేశవే భక్తి తద్భక్తైర్వా సమాగమః''

భగవద్భక్తులతో సమాగమమే చేతనునికి అమృతోపమానమని చెప్పినట్లుగా

భగవద్దాసులయిన వారికి దాసభూతులుగా నుండుటకన్నా వేరొకటి కోరుట లేదని స్పష్టము చేసిరి. సర్వేశ్వరుని స్వరూప గుణాదులను తన్మయత్వముతో అనుసంధించునట్టి భాగవత శ్రేష్ఠులే తమకు పరమ ప్రాప్యులని ఆళ్వార్లు భావనచేసిరి.

సకల లోకములను సృజించిన వాడును సర్వలోకరక్షకుడును అయిన సర్వేశ్వరుని యందు అనన్యార్హమగు భక్తికల భాగవతాగ్ర గణ్యులే. " కుంభి నరగర్ గళేత్తువరేలు మవర్ కణ్డీర్, ఎమ్బల్ పిఱప్పిడైతోఱెమ్ తొట్రుకులమ్ తాజ్గళే" కుంభీపాక నరకము నుండి మనలను ఉద్ధరింప కలవారు అని విశదపరచిరి.

జన్మాద్యభిమానములు శేషత్వ విరోధులు. అట్టి విరోధములను పరిహరించిన వారే భాగవతులు. శ్రీమన్నారాయణ చరణారవింద నిష్ఠులై వానికి శేషభూతులై యుండువారికి జాత్యాదులచే నేర్పడు నైచ్యములు కలుగనేరవు. వీరే మనకు ఆశ్రయణీయులగుదురని నమ్మాళ్వార్లు విశదము చేసిరి. "శణ్డాల శన్దాళర్ గళాగిలుమ్" చండాలాదుల కంటె నీచమగు జన్మ కల్గిన వారైనప్పటికిన్నీ భగవత్ శేషభూతులయిన భాగవతోత్తముల దాసానుదాసులే మనకు ఆశ్రయణీయులు అని వివరించిరి. అడియారడియార్ తమ్మడియార్డియార్ తమక్కడియారడియార్ తమ్మడియార్ అడియోజ్గళే" అని ప్రార్థించిరి. "త్వద్భృత్యభృత్య పరిచారక భృత్యభృత్య భృత్యస్యభృత్య ఇతి మాం స్మర లోకనాథ" అని కులశేఖరులు ప్రార్థించుట దీనిచేతనే కదా!

"అడియార్కళ్ కుళాజ్గళుడన్ కూడువదెన్ఱు కోలో" భగవద్దాసులతో కూడియుండుట ఎన్నడో అని ఆర్తి చెందిరి. భాగవత గోష్ఠితో సదా అన్వయించి యుండకలుగటయే తాము కోరుకొను పరమ పురుషార్థమని ప్రకటించిన ఆళ్వార్లు అట్టి భాగవత సంబంధమును పొందకలిగితిమి అని ఆనందపడిరి. భాగవత శేషత్వమే పరమ పురుషార్థమని భగవదనుగ్రహ ప్రాప్తికి ఇదియొక్కటియే పరిపూర్ణమయిన అత్యంత సులభమయిన మార్గమని విశదము చేసిరి.

"మమ మద్భక్త భక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్
తస్మాత్ మమ భక్త భక్తశ్చ పూజనీయః విశేషతః" అని సర్వేశ్వరుడు ఆనతిచ్చిన రీతిని "కొడుమావినైయేన్ అవనడియారడియే కూడు మితు వల్లాల్ విడుమాఱెన్బ తెన్నన్దోవియన్ మూవులగు పెఱినుమ్" భాగవత శ్రీపాదములను వదలి త్రిలోకైశ్వర్యములను సైతము కోరుకొనను. భాగవతసేవ త్రిలోకాధి పత్యము కన్న మిన్నయని స్పష్టము చేసిరి. "వియన్ మూవులగు పెఱినుమ్బోయ్ తానేతానేయానాలుమ్" త్రిలోకాధిపత్యమునకు కైవల్యమునకును అతిశయించినదై భాగవతసేవ వాంఛనీయమని పలికిరి.

అడిక్కీళ్ శయమ్ యుడివైతలనిన్ఱార్ తిరుత్తాళ్ వణజ్గి ఇమ్మైయే, పయినేయిన్బమ్ యాన్ పెత్తదుఱుమో పావియేనుక్కే" అనేక దోషములు కలిగిన తనకు వైష్ణవులయిన వారియొక్క శ్రీపాదములను ఆశ్రయించుట యొక్కటియే కోరదగినది

తక్కిన పురుషార్థము లేవియు సుఖకరములు కాజాలవని నిశ్చయముగా పలికిరి. "అవనడియార్ శిఱుమా మనిశరాయ్మైయెన్నైయాణ్డారిజ్గేతిరియు" అని భగవద్దాసుల నాశ్రయించుట మాని సర్వేశ్వరుని ఆశ్రయించి అనుగ్రహము పొందగోరుట తగదని హితవు చెప్పిరి. పెరియ తనిమాపుకళ్నుకర్బి మూవులకిన్పీడు పేఱుఱుమో? సర్వేశ్వరుని అనంత కల్యాణ గుణాను సంధానమునకు త్రిలోకాధిపత్యాదులు సమానములగునా? అని సూటిగ ప్రశ్నించిరి. అట్టి సర్వేశ్వరుని శ్రీపాదములందు ప్రవేశింప కోరుట కన్ననూ వానికి దాసులయిన వారి యొక్క సహవాస సుఖమే ప్రతిదినము లభించవలెను అని కోరుకొనిరి.

"సంగం సర్వాత్మనాత్యాజ్యం" అవి అసంభవమయినపుడు "సద్భిరేవ" ఉత్తములయినవారితోడి సాంగత్యమును అభిలషింప వలెను "మణిమలైపోల్ కిడన్దాన్ తమర్కళ్ కూట్టమ్ నాళుమ్ నజ్గట్కు కూట్ట" అని వైష్ణవులయిన వారి సమూహమే ప్రతిదినము మనకు సేవింప లభించును గాక అని ప్రార్థించిరి. సర్వేశ్వరునకు శేషభూతులైయుండు వారి సంబంధ సంబంధులకు శేషభూతులై యుండుట తమకు అత్యంత ప్రీతి పాత్రమని ఆళ్వార్లు ప్రకటించిరి. ఐజ్గణైవేళ్తాతై కోతిలడియార్తమ తమర్కళ్ తమర్కళ్ తమర్కళాయ్ శతిరేవాయ్క్క తమియేట్కే" ఈ సంసారమునందు ఒంటరియైన తనకు భగవత్ప్రాప్తిని సాధించుటకు ఒక్కటే మార్గమని అది భగవద్దాసులకు దాసాను దాసులైయుండుటేయని భావించిరి.

సర్వేశ్వరునితో కించిత్ విశ్లేషమును కూడా సహింపలేనట్టి భగవచ్ఛేషభూతులై యుండునట్టి వారలకు దాసులైయుండు వారే మనకు పరమ ప్రాప్యులు వారలకు దాసులైయుండుటయే కావలెనని కోరుకొనిరి. ఊళ్రితో యాళ్రియూళ్రి వాయ్క్క" ఈ విధముగా నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళి యందు పెక్కు చోట్ల భాగవత శేషత్వమును ప్రకటించిరి. ముఖ్యముగా "నెడుమాట్కడియై........ అను 8వపత్తు 10వ తిరువాయ్మొళ్రి ఈ భాగవతశేకేషత్వ ప్రతిపాదికమే. శ్రీ నమ్మాళ్వార్లు ప్రతిపాదించిన ఈ యర్థమునే తరువాతి ఆళ్వార్లు, ఆచార్యులు అందరు బహుధా ప్రసంగించియున్నారు.

తిరుమంగైయాళ్వార్లు "తణ్శేఱ యెమ్బెరు మానేతాళ్ తొళ్రువార్ కాణ్మినేన్ తలై మేలార్" అని భగవద్దాసులు తమకు శిరోధార్యులగుదురని ప్రారంభించి భాగవత వైభవమును ప్రకటించియున్నారు. కులశేఖరాళ్వార్లు పెరుమాళ్ తిరుమొళ్రియందును, తొండరడిప్పొడి యాళ్వార్ తిరుమాలై యందును ఈ యర్థమునే చాటి చెప్పిరి. ఇట్లు శ్రీ నమ్మాళ్వార్లు ప్రతిపాదించి నిరూపించిన భాగవత శేషత్వమే శ్రీవైష్ణవులయిన వారలకు శిరోధార్యము. కనుక అట్టి భాగవత శేషత్వము నందు మనోవాక్కాయ కర్మలను అర్పించి భాగవత కృపకు తమ్మాలమున భగవదనుగ్రహమునకు పాత్రులగుదుము కాక యని ప్రార్థించుచున్నాను.

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః

# కాన్తాకనకములు త్యాజ్యములు

ఉ.వే.శ్రీమాన్. ఇ.గోపాలకృష్ణమాచార్యస్వామి
నెల్లూరు.

గడచిన 'నెడుమా ఱ్కడిమై (8-10) అనుదశకములో శ్రీనమ్మాళ్వారులు భాగవత శేషత్వము భగవచ్ఛేషత్వమునకు పరాకాష్ఠ, కావున దానిని ప్రార్థించుచు దాని భోగ్యతను ప్రతిపాదించినారు. "పయిలుం శుడరొళి" (3-7) అను దశకమున భాగవతోత్తములు మనకు శేషిభూతులు అని మాత్రమే ప్రతిపాదింపబడినది. ఇక "కొణ్డపెణ్డిర్" అను ఈ దశకమునందు సర్వేశ్వరుడే మనకు నిరుపాధిక బన్ధువు. తక్కిన పుత్ర మిత్ర కళత్రాదు లందరును సోపాధిక బంధువులు మాత్రమే. కావున సోపాధిక బన్ధువులను వీడి నిరుపాధిక బన్ధువైన సర్వేశ్వరుని ఆశ్రయించి ఉజ్జీవించండి' అని ఉపదేశించుచున్నారు.

1. చేతనులారా, భార్యాపుత్రులు బన్ధువులు మిత్రలు ఆత్మీయులు వీరిని మనము గ్రుడ్డిగా ప్రేమించుటతప్ప ఆపద వచ్చినపుడు వీరెవ్వరును మనకు ఉపకరింపరు కావున ప్రళయకాలమున ముల్లోకములను తన కడుపున నుంచుకొని కాపాడిన మహోపకారికి దాసులై ఉజ్జీవింపుడు.

2. మన చేతిలో ధనమున్నంత వరకును బన్ధువులు మనలను రక్షించువారివలే మనచుట్టూ జలగలవలె చేరి లాభమును పొందుచుందురు. ఆ ధనము లేని సమయమున మన వైపనను చూడరు. ఇదీ లోక స్వభావము కావున మీరు సప్తసాల వృక్షములను ఖండించి సుగ్రీవుడిని ఆపదనుండి గట్టెంక్కించిన ఆ ఆపద్బాంధవుని ఆశ్రియింపుడు. అంతకు మించిన మార్గమేదిలలో. మనము ఉజ్జీవించుటకు లేదు సుమండీ.

3. మన చేత ధనమున్నంతవరకును మనలను స్తుతించి, అది లేని దశలో 'అయ్యో' అని కూడా అనని ఈ దైహిక బన్ధువులను విశ్వసింపక - దుష్ట శిక్షణకై ఉత్తర మధురలో అవతరించిన శ్రీకృష్ణుని అనుగ్రహమునకు పాత్రులై అతనికి దాసులుకండి. ఇంతకు మించిన శ్రేయస్సు లేదు.

4. "ఆపత్సమయమున సహకరింతురు గదా' అని మనము చేరదీస్తే ప్రేమతో జేరిన వీరు, మనకు దుర్దశ కలిగినపుడు ఆవైపైనను చూడరు. ఇది వీరి స్వభావము. కావున వీరిని వీడి భక్తసులభుడైన ఆ శ్రీకృష్ణ భగవానుని శరణుపొంది ఉజ్జీవించండి

5. మన యవ్వనమును ధనమును చూచి మధుర భాషణములతో మన చెంతచేరి తమ పొందును అందించిన ఆ యువతులే ధనము యౌవనము నశించినంతనే మనలను ఈసడింతురు. కావున ఇట్టి వీరిని నమ్మక శ్రీకృష్ణభగవానునికి దాసులై ఉజ్జీవించండి.

6. చేతనులారా సర్వేశ్వరుని స్మరణమే మనకు సకల పురుషార్థములనొసంగును. దీనికి అధికారి నియమముగాని, శ్రమగాని - ఇంతకు మించిన మరియొక ఉపాయముగాని లేనేలేదు. ఒకవేళ ఫలము కొంచ మాలస్యముగ సిద్ధించినను ఇది స్వరూపానురూపమైన దగుటచే అవశ్యము ఆచరణీయము. కావున ఆ శ్రీకృష్ణుని కల్యాణగుణములను కీర్తించి ఉజ్జీవించండి.

7. అనన్య ప్రయోజనముగ భగవద్గుణములను కీర్తించి ఆనందించువారి కొఱకు మధురానగరమున నవతరించిన శ్రీకృష్ణుని గుణానుభవము కంటె మేలైన పురుషార్థము మరియేదియును లేదు. ఇదియే ఉజ్జీవకము.

8. దేవతాన్తరముల నాశ్రయించి ఉన్నదానిని కూడా పోగొట్టుకొని అనర్థమును పొందకుడు. సుఖారాధ్యుడైన శ్రీకృష్ణపరమాత్మ తప్ప మనకు మరియొక రక్షకుడులేడు. ఇది నిజము.

9. శ్రీకృష్ణుడు తప్ప వేరొక రక్షకుడులేడు అతడు ఉత్తర మధురానగరమున అవతరించి భూభారమును తొలగించినాడు. ఆశ్రితులను రక్షించినాడు. ఈ లోకమున మీది అనుకొనునది ఏదియు మీదికాదు అంతయు అతనిదే. కావున మీ సర్వస్వము అతనిదే అని భావించి అతనికే సమర్పించి ఆతనినే ఆశ్రయించి ఉజ్జీవింపుడు. సందేహింపకుడు.

10. మనకు కృష్ణుని కంటే వేరు రక్షకము లేదని విశ్వసించు వనమాలియైన ఆ శ్రీకృష్ణపరమాత్మను ద్రవిడ భాషలో నోరారా కీర్తించిన తిరుక్కురుగూర్ అనుదివ్య క్షేత్రములో వేంచేసియుండు శ్రీనమ్మాళ్వారులు అనుగ్రహించిన వేయి పాశురములలో ఈ పది పాశురములను అనుసన్ధించువారు మనకు పరమ ప్రాప్యులు సుమండీ. కావున ఆ భాస బన్ధువులను విశ్వసింపక నిరుపాధిక బన్ధువైన ఆశ్రియః పతినే ఆశ్రయించి ఉజ్జీవించండి - అని ఈ దశకమున శ్రీనమ్మాళ్వార్లు సర్వేశ్వరుడే మనకు నిరుపాధిక బన్ధువు. అతని నాశ్రయించి ఉజ్జీవింపుడు - అను విషయమును చక్కగా విశదీకరించినారు. ఈ దశకము యొక్క సారమును శ్రీమణవాళమహామునులు తమతిరువాయ్ మొழி నూత్తన్దాదిలో ఇట్లు సాయించినారు.

పా. కొణ్డపెణ్డిర్ దాం ముదలా క్కూఱుముత్తార్- కన్మత్తాల్
అణ్డినవరెన్నే, అవరై విట్టు - తొండరుడన్ ।
శేఱ్కుం తిరుమాలై - చ్చేరుమెన్మాన్ - ఆర్కు మిదం
పార్కు పుగழ் - మాఱన్ పణ్డు

తా. భార్య మొదలగు బన్ధువులందరును మన కర్మానుసారం మనకు సంప్రాప్తించినవారే గాని వాస్తవ బన్ధువులుగారు - మనకు వాస్తవ బన్ధువు ఆ సర్వేశ్వరుడొక్కడే అతడు మన హితమును కోరి మనలను తన భక్తులతో చేర్పించి మంచి మార్గమున నడిపించును. కావున నిరుపాధిక బన్ధువైన ఆ స్వామినే ఆశ్రయించి ఉజ్జీవింపుడు అని నమ్మాళ్వారులు ఈ దశకమున అనుగ్రహించినారు.

ద్రమిడోపనిషత్సఙ్గతిలో శ్రీవాదికేసరి అళ్గియ మణవాళ జీయర్ ఈ దశక సారాంశమును ఇట్లు కటాక్షించినారు.

శ్లో॥ ఆద్యే చకార నవమే శతకే శఠారిః
తచ్ఛేషతానుభవ సన్మతి సమ్మతేన ।
నిశ్చిత్య సర్వవిధ బన్ధుతయా త మీశ
మాపత్సఖం ప్రణమతేతి పరోపదేశమ్ ॥

తా. తొమ్మిదవ పది మొదటి తిరువాయ్ మొళ్రిలో భగవచ్ఛేషత్వము భాగవత్ శేషత్వ పర్యన్తమని నిర్ణయించిన ఆళ్వార్లు - నిరుపాధిక బన్ధువు ఆపత్సఖుడును ఆ సర్వేశ్వరుడే కావున అతనినే ఆశ్రయింపుడు -అని పరోపదేశము గావించుచున్నారు.

ఇట్లే శ్రీమద్వేదాన్త దేశికులు తమ ద్రమిడోపనిష త్తాత్పర్య రత్నావళిలో

శ్లో॥ ఆపద్బన్ధుత్వ కీర్త్యా, దృఢమతి జనతాత్, దైత్యనాశాయ భూమౌ,
జాతత్వాత్, ఉత్తరస్యాం పురి మధుర పదా2లంకృతాయాం దయా2బ్ధేః ।
బన్ధోః కృష్ణస్య పాదాశ్రయణ మిహ వినా నో సహాయః పుమర్థః
రక్షాసామర్థ్య హానేః భవిన ఇతి హితం కారిసూను ర్బభాషే ॥

తా॥ ప్రళయకాలమున సకల ప్రపంచమును తన కడుపులో నుంచుకొని రక్షించినవాడు సప్త సాలవృక్షములను భేదించి సుగ్రీవునకు ధైర్యమును కలిగించినవాడు ఉత్తర మధురానగరములో దయతో అవతరించి పలువురు దైత్యులను సంహరించినవాడు, సర్వవిధ బన్ధువు అయిన ఆ శ్రీకృష్ణుని పాదపద్మముల నాశ్రయించుట తప్ప, ఆపత్సమయంలో సహాయపడగలవాడు మరియొకరు లేరుగావున, ఆతనిని ఆశ్రయించుటయే పరమపురుషార్థము - సంసారులమైన మనము మనలను రక్షించుకొనలేము - అని "కొణ్డపెణ్డీర్" అను ఈ దశకము యొక్క సారమును కటాక్షించినారు.

గమనిక:- ప్రహ్లాదునకు తండ్రి రక్షకుడు కాలేదు శ్రీభరతాళ్వానునకు తల్లి రక్షకురాలు కాలేదు. జయంతునకు (కాకాసురనకు) తల్లి తండ్రి ఇరువురును రక్షకులు కాలేదు విభీషణునకు సోదరుడు రక్షకుడు కాలేదు ద్రౌపదికి భర్తలు రక్షకులు కాలేరు గజేన్ద్రుని అతని వారెవ్వరును కాపాడలేదు. ఆపత్సమయంలో వీరినందరిని ఆ భగవన్తుడే గదా కాపాడినది. కావున అతడే సర్వ రక్షకుడని తాత్పర్యము.

శ్లో॥ త్వమేవ మాతాచ పితా త్వమేవ
త్వమేవ బన్ధుశ్చ గురు స్త్వమేవ
త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ
త్వమేవ సర్వం మమ దేవదేవ ॥

శ్రీరస్తు
శ్రీమతేశఠగోపాయనమః

# నమ్మాళ్వార్ల పరమపదానుభవము

ఉ.వే.శ్రీమాన్. ఎన్.వి.ఎల్.ఎన్.రామానుజాచార్యస్వామి
పెంటపాడు

ప్రపన్న జనకూటస్థులైన నమ్మాళ్వార్లు తిరువాయిమొళ్ళిలో 10-8 వరకు భగవద్విషయమై తమకుగల ప్రావణ్యాతిశయమును వెల్లడించిరి. పరమయోగులకు లభించు పరమభక్తి వీరికి లభించినది. ఇక ఈ నిత్య విభూతిలో నుండి అనుభవింపదగినది ఏదియు వీరికి గోచరము కాలేదు. పరమపదమునకు వేంచేయవలెను అనేకోరిక అధికమయ్యెను. వీరిని పొందుటకు వీరికంటె మిక్కిలి తొందర గలవాడు శ్రియఃపతి. కావుననే వీరికి పరమపదము పొందవలెననే ఆశను మిక్కుటముగా చేయదలచి అర్చిరాది మర్గము మొదలు భగవత్ప్రాప్తి పర్యంతము గల సమస్త విషయములను సాక్షాత్కరింపచేసెను.

ఆ సాక్షాత్కారములో వీరికి సర్వేశ్వరుని 'భోగ్యగుణపూర్తి' నిరుపాధిక శేషిత్వము, అనన్యార్హతాపాదకత్వము, భోగ్యతాపూర్తి, శ్రియః పతిత్వము, శేషిత్వము, సర్వాధికత్వము, ఆశ్రిత సౌలభ్యము, పరమపద నిలయత్వము. సత్కార్యము అనునవి గోచరించినవి.

తోడనే వేదాంతములందు ప్రసిద్ధమైన 'అర్చిరాది మార్గమును' సమస్తక్లేశాపహమైన భగవత్సందర్శనమును; అర్చిరాది మార్గ సత్కారములును, పరమపదమును, నిత్యసూరులు ఆదరించుప్రకారము, శ్రీశ్రియఃపతులేదురువచ్చి ఆదరించుటయు, నిత్యసూరిపరిషత్యం సేవ్యుడైన శ్రీమన్నారాయణుడు దేవేరులతో వేంచేసియున్నవిధము; నిత్యసూరుల మధ్య ఆనంద నిర్భరులైయున్న విషయము సాక్షాత్కరించినవి.

"యతోవాచోనివర్తన్తే అప్రాప్యమనసా సహ" అనునట్లు వాక్కునకే కాదు మనస్సునకును అందని ఆ పరమపదానుభవమును అన్యాపదేశముగా చెప్పి అనుభవించుచున్నారు ఆళ్వార్లు.

అనగా సర్వేశ్వరుడనుగ్రహించిన యీ తురీయ పురుషార్థము శ్రీవైష్ణవుల కందఱకు లభించునట్లు చెప్పిరి. ఇట్లు చెప్పుట యెందులకనగా యీ లీలా విభూతిలో నున్నవారికి కూడా (ఆళ్వార్ల శ్రీపాదములాశ్రయించిన వారికి) ఆ పురుషార్థము (పరమపదము) లభించునని చెప్పుట కొఱకు.

'అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్' అనునట్లుండునది అర్చిరాది

మార్గము. "ధూమోరాత్రిః తథాకృష్ణఃషణ్మాసాదక్షణాయనమ్" అనునట్లుండునది ధూమాదిమార్గము.

• వీనిలో అర్చిరాది మార్గము ద్వారా పోయినవాడు పునర్జన్మలేని పరమపదమును పొందుచున్నాడు. ధూమాది మార్గమున పోవువాడు మరలివచ్చు చున్నాడు. ఈ విషయమునే ఛాందోగ్యోపనిషత్తు "తద్య ఇత్థం విదుఃయే చేమే2రణ్యే శ్రద్ధా తపః ఇత్యుపాసతే తే2ర్చిషమిభి సంభవన్తి" అనగా ఆత్మనిష్టుడు, పరమ పురుషనిష్టులు అర్చిరాది మార్గమును పొందుచున్నారు "అనియు" అదియు ఇమేగ్రామ ఇష్టాపూర్తే దత్తమిత్యు పాసతే తే ధూమ మభి సంభవన్తి" ఎవరు గ్రామదులందే నివసించి యాగాదులు, తటాకాది నిర్మాణములు, దానాదులు, ఉపవాసాదులు చేయుదురో వారు మరల జన్మించువారై ధూమాధి మార్గమును పొందుచున్నారు. అనిచెప్పుచున్నది.

ప్రపన్నుడు ఈ అర్చిరాది గతిచింతనము ప్రతినిత్యము చేయవలసియున్నది. కావుననే అనుసంధానమునకు వీలుగా ఈ అర్చిరాది గతి చింతనను శ్లోకరూపమున అనుగ్రహించినారు "నడాదూరు అమ్మాళ్"అని ప్రధితులైన వాత్స్య వరదాచార్యులవారు. విస్తరభీతిచే దానినిట ప్రస్తావించుటలేదు.

రాజకుమారుడు పోవుచున్నపుడు లోకులేవిధముగా మర్యాదలనుచేసి సత్కరింతురో భగవత్సంబంధముచేత ముక్తపురుషుని కూడ ఇంద్రవరుణాది దేవతలు సత్కరింతురు.

1. శ్రీకృష్ణ పరమాత్మ మధ్యరాత్రము నందవతరింపగా మేఘములు మెల్లగ గర్జించినవి. ఆకాశమునుండి పుష్పవృష్టి కురిసినది. అట్లే సకలవిధ బంధువు; ఆనందావహమైన దివ్య కల్యాణగుణ పరిపూర్ణుడగు సర్వేశ్వరుని దాసులగు ముక్తపురుషులనుచూచి ఆకాశమునందంతట వ్యాపించియున్న మేఘములు తూర్యఘోషములు చేసినవి. అగాధములైన సముద్రములు అలలనెడి చేతులను పైకెత్తి నర్తించినవి. సప్తద్వీపములతో కూడిన భూమి తనయందుగల మంచి వస్తువులను కానుకగ సమర్పించినది.

2. శ్రీమన్నారాయణుడు నిరుపాధికశేషి. ఆయనకు అంతరంగ భక్తులు పరమపదమునకు పోవుచుండగా దేవాదులు సుగంధశీతల జల సంపన్నములైన మేఘములనెడి పూర్ణ కుంభముల నుంచిరి. నిరవధిక జల ప్రపూర్ణములగు సముద్రములు గంభీరముగ ఘోషించినవి. లోకులందరు మహోన్నత రమణీయ పర్వతపంక్తులను తోరణములుగా చేసి అంజలి బద్ధులై స్వాగతము పలికిరి. ఈ విధముగా అంతరిక్ష పర్యంత వాసులు సత్కరించిరి.

3. సర్వేశ్వరుడు "త్రీణిపదావిచక్రమే" అనునట్లు ఈ భూమిని కొలిచినవాడు. అది ఆయనకు అనన్యార్హతాపాదకమైనది. ఆయన భక్తులను చూచిన ఊర్ధ్వలోకవాసులు సత్కరింప సంకల్పించిరి. ముక్తపురుషులకు ఎదురేగి ధూపమును సమర్పించి పుష్పవృష్టి కురిపించిరి. తమషత్వాను రూపముగా అంజలి ఘటించిరి. ఆయాలోకములందలి మునులు తమ మౌన వ్రతమును విడచి ఎదురేగి "దయతోవేంచేయుడు మీకు స్వాగతము" అని ఇరువైపుల బారులు తీర్చినిలచి స్వాగతమును సాదరముగా పలికిరి.

(మౌనవ్రతులు (జపమునందున్నవారు) మౌనమును విడచి రావచ్చునా! అనగా రాకూడదనుట సామాన్యవిషయము. కానీ గురువుకాని ఉత్తమవైష్ణవులు గాని వేంచేయునపుడు తమజపాదులను విడచి వారితో మాట్లాడి పూజాదులు చేసి గౌరవింపవలెను. ఇది విశేష విషయము) అశ్రియఃపతి తేనెస్రవించు తులసిమాలను కిరీటమందు ధరించిన భోగ్యభూతుడు. ఆయన భక్తులను చూచిన దేవతలు ముందుగనే వారికి నివాస స్థానములను ఏర్పరచిరి. 'వారిచటనిలతురో, ఇచట నిలచెదరో' అని ఆ దేవతల ఆశ. రామావతారకాలమున లక్ష్మణస్వామి నిద్రనుకూడ వీడి శ్రీరామ కైంకర్యమును చేసినట్లుగా ఈ దేవతలును ముక్తపురుషల విషయమై ఏదోయొక కైంకర్యమును చేసి తమ స్వరూపమును నిలబెట్టుకోదలచినవారు. ద్వాదశాదిత్యులు కిరణరూపములైన తమచేతులతో మార్గమును చూపించిరి. లక్ష్మీపురుషకారాముచే ముక్తులై లక్ష్మీనారాయణులను సేవింప బోవుచున్న వారి స్వాగతమునకై సముద్రఘోషతో సమానమగు మురజాది వాద్యములను మ్రోగించిరి.

5. వరుణేంద్ర ప్రజాపతులను ఆతివాహిక దేవతలు తమ తమ తలవాకిట నిలచి "ఈముక్త పురుషులు శ్రియఃపతికి అంతరంగ భక్తులు" అని ఆదరించి "ఇటు వేంచేయుడు, మా అధికారముగల ఈ ప్రదేశములందు వేంచేయుడు, మా అధికారములను స్వీకరింపు"డని ప్రార్థించిరి. ఊర్ధ్వలోకము లందలి వైదికులు వేదపఠనముచే పవిత్రమైన ముఖముగల వారై తమయాగఫలమును వీరి (ముక్తపురుషుల) శ్రీపాదములందు సమర్పించిరి. కిన్నరులు గరుడులు పాటలు పాడిరి.

6. ఈ విధముగా వైదికులు తమ కర్మ ఫలమును సమర్పించు నంతలో కొందరు మంచిపరిమళముగల ధూపమును సమర్పించిరి. మరికొందఱు కాహళములను (డప్పులు) దక్షిణావర్త శంఖములను మ్రోగించిరి. ఆతివాహికులవత్సులు దేశాంతరగతుడై తిరిగివచ్చిన తమ కుమారుని చూచినంత ఆనందముతో ముక్తపురుషులను సంభావించి "శ్వేషిత్వ చిహ్నమైన సుదర్శనాయుధమును ధరించిన మీరలు ఈ స్వర్గలోకమును పాలింపుడు" అని ఆశీర్వదించిరి.

7. దేవతాస్త్రీలు స్తోత్రము చేయుచుండగనే భాగవతోత్తములను అనుసరించు కోరికగల సప్తమరుత్తులు, అష్టవసువులు స్తోత్రముచేయసాగిరి. ఆ సర్వేశ్వరుడు. క్షీరాబ్ధిశాయి. బ్రహ్మరుద్రేంద్రాదులకు కారణభూతుడైన కేశవుడు. ఆధిరాజ్య సూచకమై అత్యుజ్జ్వల మణిమయ శోభితమైన కిరీటమును దాల్చినవాడు. ఆతడే భూలోకమునకు వేంచేసి కుంభఘోణ క్షేత్రమునందు పవళించినవాడు (పరమపదానుభవమునందు కూడ ఆళ్వార్ల అర్చావతార ప్రావణ్యమును, అందున కుంభఘోణక్షేత్ర మందలి ప్రీత్యతిశయమును విడువలేదు) ఆతనికి దాసులైన ఈముక్త పురుషులను స్తోత్రము చేయుచు మరత్తులు వసువులు బహుదూరము వెంబడించిరి. (ఇంత వఱకు ముక్తపురుషులను ప్రకృతి మండలమునగల సత్కారము నిరూపింపబడినది. ఇకపై పరమపదమున కలుగు సత్కారము. నిరూపింపబడను.)

8. ఈ ముక్త పురుషులు ఆశ్రిత సంరక్షణార్థమై భూమి యందవతరించిన శ్రీ కృష్ణునకు కులక్రమాను గతదాసులు అని భావించి నిత్యులు ముక్తులు శ్రీకృష్ణదాసులని విభవావతార ప్రశంసా పూర్వకముగా ఆదరించిరి. సర్వేశ్వరునివలె కిరీటమకుటాది శోభితులగు నిత్యసూరులు ఎదురేగిరి. క్రమక్రమముగా (భగవంతుని కిరీటము సర్వరక్షకత్వ సూచకము. నిత్యసూరుల కిరీటము నిత్యకైంకర్య సూచకము) కంసవధకై మధురకు వేంచేసిన శ్రీకృష్ణుని చూచి తనను యువకుడుగా తలచిన వసుదేవునివలె; యౌవరాజ్య పట్టాభిషేకమునకై వేంచేయుచున్న శ్రీరామచంద్రుని చూచి యువకుడనగుచున్నానని పలికిన దశరధునివలె ముక్తపురుషుల రాకచే మరింత యువకుడుగా మారిన శ్రియః పతియొక్క పరమపదము ధ్వజాదులచే చక్కగా నలంకరింపబడగా గోపురద్వారమును సమీపించిరి.

9. వైకుంఠద్వారమునకు కావలిగానున్న నిత్యసూరులు శ్రీవైకుంఠనాధుని భక్తులగు మీరు మాచే సేవింపదగినవారు. "పయిలుమ్ తిరువుడయార్ యవరేలుమ్ అవర్కణ్డీర్ పయిలుమ్ పిఱప్పడతోరెమ్మై యాళుమ్పరమర్" అనునట్లు క్షీరాబ్దినాధుని భక్తులైనవారు జాత్యాదులచే నెంత తక్కువ వారైనను మాకు జన్మజన్మలకు ప్రాప్యులుగదా!" యని నిత్యసూరులు ముక్తపురుషులకు ఎదురువచ్చి; చేతిని అందించి, తీసికొనిపోయి, తమస్థానములందు కూర్చుండబెట్టి మిక్కిలి సత్కరించిరి. శ్రీలక్ష్మణస్వామివలె కైంకర్యనిష్ఠులగు నిత్యసూరులును శ్రీభరతులవలె గుణనిష్ఠులైన నిత్యసూరులును వీరు భూలోకమునుండి ఇచటికి వేంచేయుటకు ఎంత భాగ్యమునకు నోచిరోకదా! సముద్రము నీరు సహ్యా పర్వతము మీదకు ప్రవహించినట్లున్నది వీరి రాక! అని ఆశ్చర్యపడిరి.

10. వీరిట్లు ఆశ్చర్య పడుచుండగ "మనభాగ్యవశముచేత వీరి చటికి వేంచేసిరిగదా!

లేకున్న విషయ సంకులమైన సంసారములోనుండి అనన్యప్రయోజనులై భగవద్గుణానుభవముచేసిన మహాపురుషులు "విణ్ణుళారిలుమ్ శీరియర్" అనునట్లు ఈ వైకుంఠమును ప్రవేశించుట మా భాగ్యవిశేషముచేతనే కదా! అని నిత్యసూరులు భావించిరి. ఆనిత్యసూరులు "యత్రర్షయః ప్రథమ జాయేపురాణాః" "యత్రపూర్వే సాధ్యాస్సన్తిదేవాః' ' తద్విప్రాసో విపన్యవో జాగృవాగ్ంస సమిన్ధతే" అనునట్లు వేదమున ప్రస్తుతింపబడువారు. అట్టివారు (అనంత గరుడాదులు) "ఈతడొక సంసారి చేతనుడు. మనము సంసార గంధమే లేనివారము" అనుభావన లేక ఆముక్త పురుషుని సింహాసనా సీనుని గావించి శ్రీపాదములను శోధించిరి.

దేశాంతరముపోయి తిరిగివచ్చిన కుమారుని చూచినంత ఆనందముతో అచట అప్సర స్త్రీలు మంగళార్థమై "శ్రీశఠగోపమును, హరిద్రాచూర్ణమును (పసుపు) పూర్ణ కుంభములను, మంగళదీపములను" తీసికొని ఎదురువచ్చిరి.

శ్రియఃపతి తానే ఎదురువచ్చి తీసికొనిపోవును. అప్పుడు ఈ ముక్తపురుషుడు నిరతిశయ ఆనన్దావహమైన తిరుమామణి మంటపమునుచేరి అచట నిత్యసూరులుతో కూడ తానును బ్రహ్మానన్దమును అనుభవించును. ఈ విధముగా తమపరమ పదానుభవమును మనకు తెలియజేసినవారు నమ్మాళ్వార్లు. వారు కురుకావురికి అదీశులు. ఆ కురుకావురి నిత్యవసంతమైన తోటలతో అలరారునది. అట్టి కురికావురిలో వేంచేసియున్న నమ్మాళ్వార్లు వేదముతో సమానముగా అనుగ్రహించిన తిరువాయిమొళిలోని యీ పరమ పదాను భవమును వెల్లడించు (అందరు విశ్వసించి తరించుటకు) పదిపాశురములను ఎవరు అభ్యసింతురో వారు పరమపదమునకుపోయి భగవద్గుణాను భవమును చేయుదురు.

ఈ దశకములో "ఆళ్వార్లు ముక్తపురుషుడు పృధ్వి అంతరిక్షము వరకు గల యీ ప్రకృతి మండలమును దాటి ఆతివాహికులుగా (మార్గమును చూపించువారు) నుండు వరుణేంద్రధాత్రాదులను అతిక్రమించి బ్రహ్మాండావరణమును దాటి పరమపదములో ప్రవేశించుననియు, అచట నిత్యసూరులచే సత్కృతుడై, అప్సరస్త్రీలచే స్వాగతింపబడి శ్రీశ్రియఃపతుల అనుగ్రహముచే తిరుమామణి మంటపమును (దివ్యాస్థాన మంటపమును ప్రవేశించి) అచట నిత్యసూరులతోపాటు తానును స్వామి కైంకర్యమందు వినయోగింపబడి బ్రహ్మానందము ననుభవించునని" తెలియజేసిరి.

# తిరువాయ్‌మొ(ట్రి) వ్యాఖ్యలు

## ఈడు ప్రాశస్త్యము

ఉ.వే.శ్రీమాన్ కలవపూడి శరణ్యాచార్యస్వామి
శ్రీరామ తీర్థం

శ్రియ: పతి సమస్త చేతనాచేతనములు తనవిగా కలవాడు. తన వారందఱు తనను చేరవలెనని కోరిక గలవాడు. అనాదియైన మాయచేసుప్తులైన జీవులకు యధార్థజ్ఞానము (తత్త్వజ్ఞానము) కలిగించి వారందఱు తన్నుచేరుటకై తానవతరించి విశేషమైన కృషిచేసినవాడు. ఇంకను చేరవలసిన వారు చేరలేదనెడు విచారముతో వారిని గూడ తన్ను చేర్చుటకై తన వారైన నిత్యసూరులను చేతనోద్ధరణమునకై అవతరింప జేసినవాడు.

'మయర్వఱ మదినలమరుళినన్'

'అజ్ఞాన లేశమును లేకుండునట్లుగ భక్తి రూపాపన్న జ్ఞానమును కృప చేసిన వాడు'

అన్నట్లుగ వారికి కృపతో అజ్ఞాన లేశమును లేకుండునట్లు భక్తి రూపాపన్న జ్ఞానము ననుగ్రహించి తత్త్వమంతయు కరతలామలక మగునట్లుగ చేసినవాడు.

ఆళ్వారులందఱును ఆ కోవకు చెందినవారే. వారందఱు తమ శ్రీసూక్తుల చేత చేతనులనుద్బోధించి వారికి భగవత్తత్త్వమునుపదేశించుటయే గాక భగవంతుని చేరుటకు ఉపాయమును కూడ చూపిన వారు. వారందఱికి శరీరభూతులు నమ్మాళ్వారు.(పరాఙ్కుశులు) వీరు స్పష్టముగ భగవంతునాశ్రయించుటయే (శరణాగతియే) ఆయనను చేరుటకు ఉపాయమని

'తుయరఱు శుడరడి తొ(ట్రు)దె(ట్రు)ఎననే''

"ఓ మనసా! దు:ఖములను తొలగించు తేజిష్ఠములైన

స్వామి శ్రీపాదములనాశ్రయించి ఉజ్జీవింపుము''

అని తమ మనస్సునకుపదేశించు వ్యాజమున చేతనులకుపదేశించిరి.

శ్రీనమ్మాళ్వార్లు మనకు కటాక్షించిన దివ్య ప్రబంధములు నాలుగు. తిరువిరుత్తము, తిరువాశిరయము, పెరియ తిరువన్దాది. తిరువాయ్‌మొ(ట్రి), అందు తిరువాయ్‌మొ(ట్రి) సామవేదసారమని మన పెద్దలు చెప్పుదురు. సామవేద శాఖలవలె నిందును సహస్ర గీతికలున్నవి.

అట్టి యీ దివ్యప్రబంధము, అజ్ఞులు, అన్యధాజ్ఞానులు, విపరీత జ్ఞానులు మొదలగు వారి చేతిలో పడి అవసరములగు నర్థములను వివరింప లేకపోవుటయేగాక, అనర్థార్థముల ప్రచారమునకును మూలమగుననెడి భయముచే మన పూర్వాచార్యులగు ఎమ్బెరుమానారు (రామానుజులు) మొదలగు వారు ఇందలి పాశురములకు సరియైన వివరణ నిచ్చి వ్యాఖ్యానములను కటాక్షింపవలెనని విజ్ఞులైన తమ శిష్యులు మొదలగు వారిని నియోగించిరి.

అట్టి మహానుభావుల కటాక్షముచే నీతిరువాయ్ మొழிకి అయిదు వ్యాఖ్యానము లవతరించినవి. ఈ వ్యాఖ్యానముల రచయితలను గూర్చియు, వ్యాఖ్యానములను గూర్చియు శ్రీమణవాళమహామునులు తమ ఉపదేశ రత్నమాలయను దివ్యప్రబంధమున ఇట్లు వివరించిరి.

41. తెళ్ళారుం ఞాన త్తిరుక్కురుగైపిరాన్
పిళ్ళాన్, ఎతిరాశన్, పేరరుళాల్, ఉళ్ళారు
మన్బుడనే మాఱన్మఱైప్పొరుళై యన఼్ురైత్తదు
ఇన్బమిగు మాఱాయిరమ్.

42. తఞ్జీరై ఞానియర్‌గళ్‌తామ్ పుగழுమ్ వేదాన్తి
నఞ్జీయర్ దామ్ బట్టర్ నల్లరుళాల్, ఎఞ్జాద
ఆర్వముడన్ మాఱన్మఱైప్పొరుళై యాయ్న్దురైత్తదు,
ఏ రొన్బదినాయిరమ్

43. నమ్బిళై తమ్ముడైయ నల్లరుళాలేవియిడ
పిన్ పెరియవాచ్చాన్బిళ్ళై యదనాల్, ఇన్బా
వరుపత్తి మాఱన్మఱైప్పొరుళై చ్చొన్నదు
ఇరుబత్తు నాలాయిరమ్.

44. తెళ్ళియదా నమ్బిళ్ళై శెప్పునెఱిదన్నై
వళ్ళల్ వడక్కుత్తిరువీధిప్పిళ్ళై, ఇన్ద
నాడఱియ మారన్మఱైప్పొరుళైనన్గురైత్తదు
ఈడు ముప్పత్తాఱాయిరమ్.

45. అన్బోడழగియ మణవాళచ్చీయర్
పిన్బోరుం కఱ్ ఱఱిన్దు పేశుగైక్కాయ్, తమ్పెరియ
పోదముడన్ మాఱన్మఱైయి న్పొరుళురైత్తదు
ఏదమిల్ పన్నీరాయిరమ్.

41 "తిరుక్కురుగైపిరాన్ పిళ్ళాన్ ఎమ్బెరుమానార్ల కృపతో తిరువాయ్‌మొழிకి వ్యాఖ్యానమును ఆరు వేల గ్రంథముగ కటాక్షించిరి.

42 నఞ్జీయరు భట్టరు యొక్క కృపతో మిక్కిలి అభినివేశముతో తిరువాయ్‌మొழிకి వ్యాఖ్యానమును తొమ్మిది వేల గ్రంథముగ ననుగ్రహించిరి.

43 నమ్బిళైగారు కృపతో ప్రేరణ చేయగ, పెరియ వాచ్చామ్బిళ్ళైగారు ఆనన్దము కలిగించు విధముగ తిరువాయ్‌మొழிకి వ్యాఖ్యానమును ఇరువది నాలుగువేల గ్రంథముగ రచియించిరి.

44 నమ్బిళ్ళైగారి ఉపన్యాసములను అనుసరించి వడక్కుత్తిరు వీధిప్పిళ్ళైగారు లోకమున

కంతకు తెలియునట్లుగా తిరువాయ్ మొఴ్రికి వ్యాఖ్యానమును 'ఈడు' అను పేరున ముప్పదారు వేల గ్రంథముగ వివరించిరి.

45 అఝ్రగియమణవాళ జీయరు వారు తరువాతి వారందరు నేర్చుకొని చెప్పుటుకుగినట్టుగ తిరువాయ్‌మొఝ్రికి వ్యాఖ్యానమును పన్నెండు వేల గ్రంథముగ కృపచేసిరి."

ఈ విధముగ తిరువాయ్ మొఝ్రికి అయిదు వ్యాఖ్యానములు ఏర్పడినవి. ఇందు ఒక్కొక్క వ్యాఖ్యాత యొక్క లక్ష్యము ఒక్కొక్క ప్రయోజనమును లోకమునకందజేయుటకై యేర్పడిన దగుటచే అన్ని వ్యాఖ్యానములును అందఱును సేవింపదగినవే అయియున్నవి. వాని వివరములు క్లుప్తముగ యధావిధిగ వివరింపబడును.

ఆరాయిరప్పడి:

ఆరువేల సంఖ్యగల శ్లోకముల పరిమాణము గల వ్యాఖ్యానమగుటచే దీనిని "ఆరాయిరప్పడి" అందురు. శ్రీవిష్ణు పురాణ సంఖ్యననుసరించి ఈ వ్యాఖ్యానమును శ్రీతిరుక్కురు గైప్పిరాన్ పిళ్ళాన్ గారు తమ ఆచార్యులగు "ఎమ్బెరు మానార్"(రామానుజుల) ఆదేశముతో రచించిరి.

ఈ వ్యాఖ్యానము చాలచక్కని రీతిలో నున్నది. సంస్కృత సమాసము లిందు మిక్కిలిగా నుండును. అవియు దీర్ఘ సమాసములై యుండును. తిరువాయ్‌మొఝ్రిపాశురములకు చాల దగ్గఱగ నుండునట్లు వీరు వ్యాఖ్యానించిరి. మూలమునగల పదములకు సరియైన తాత్పర్యము అందునంత వఱకును తేలికైన చక్కని పదములలో వీరు తాత్పర్యరూపమున కటాక్షించిరి. అంతమాత్రమున ఇది సంస్కృత వ్యాఖ్యానమని భ్రమపడనక్కర లేదు - ఈ సమాసములకు ద్రావిడ ప్రత్యయములను చేర్చి ద్రావిడ వ్యాఖ్యానము గనే నిరూపించిరి. వీరి దృష్టి తాత్పర్యము చిన్నదా? పెద్దదా? అనిగాక మూలములోని ప్రతి పదమునకు భావమిందు పొందుపరుప బడినదా? లేదా? అనియే చూచును. వివరణము చాలనట్టు తోచినచో మఱొకటి రెండు సమాసములను కూర్చుటకును సంకోచింపరు.

ఈ వ్యాఖ్యానము చదువుటకు చాల సరసముగ నుండును. గంగాఝరి ప్రవహించు నట్లుండును. మృదుమధురములగు పదములతో పెద్ద పెద్ద సమాసములుండును. అయినను తాత్పర్యము సుగమమై యుండును.

ఈ వ్యాఖ్యానమున కొక మచ్చు తునక :-

"ఇలనతు - 1 - 1 - 3 "

"ఇప్పడి స్వేతరసమస్తవస్తు విలక్షణ స్వరూపగుణ విభూతికనాన వెమ్బెరు మానుడైయ జగదైశ్వర్యమ్ శొల్లుకిఱతు. పృథివ్యన్తరిక్షాది సకలలోక వర్తియాన చేతనాచేతనాత్మక సమస్తవస్తుక్కళుక్కుమ్ శేషియాయ్ సర్వజగదాత్మ భూతనాయ్ తద్గత దోషై

రసంస్కృష్టనాయ్ స్వశరీరభూత జగన్నియమన రూప ఐశ్వర్యత్తైయుడయవనాయ్ స్వేతరసమస్త విజాతీయను మాయ్ ఇరున్ద వెమ్బెరుమానై నామ్బెత్తోమ్, "అవన్తుయరఱుశుడరడి తొఴుదెఴ్హనమ్మననే".

ఈ వ్యాఖ్యానము భగవద్విషయము లందు మూలమునకు క్రిందనే యుండును.

ఈ విధముగ సాగినది వీరి వ్యాఖ్యానము. ఇందలి గుణగణముల ననుభవించి యానందింతురుగాక.

ఒన్బది వాయిరప్పడి

ఈ వ్యాఖ్యానము తొమ్మిది వేల శ్లోక సంఖ్యగల దగుటచే ఒన్బది వాయిరప్పడిగ ప్రసిద్ధి నందినది. దీనిని భట్టరు వారి కృపతో వారి ఆజ్ఞానుసారము నఞ్జీయరుగారు(వేదాన్తి) కటాక్షించిరి. శ్రీభాష్యగ్రంథమునుసరించి ఈవ్యాఖ్యానము తొమ్మిది వేల శ్లోక సంఖ్యగలుగునట్లుగా కూర్చబడినది.

ఇది చిన్న భగవద్విషయ కోశములందు గానరాదు. పెద్ద భగవద్విషయ కోశములందు ఆరాయిరప్పడి క్రింద నిలువుగీతకు ఎడమవైపున కాననగును. ఇది కేవలము ప్రతి పదార్థమును కాదు. కేవలము తాత్పర్యమును కాదు. తాత్పర్యము తెలియునట్లుగ అన్వయక్రమములో వ్యాఖ్యానము సాగినది. చిన్నచిన్న సంస్కృత పదములున్నను ఇది ద్రావిడ పదములతోనే కూర్చబడినది. నిదానముగ పాశురముల యొక్క అర్థ తాత్పర్యములు దీని వలననెఱుగ వచ్చును. 'పన్నీరాయిరప్పడి' ఉండుట వలన దీనియవసర మంతగ నుండక పోవచ్చునని దీనిని చిన్న భగవద్విషయ కోశములందు చేర్చలేదని అనుకోవచ్చును.-

ఈ వ్యాఖ్యానము నడచిన రీతి:- "మతువార్"1,6 - 2 "ఇరణ్డామ్ బాట్టిల్ ఆశ్రయణత్తుక్కు అధికారి నియమమిల్లై యెన్గిరార్, "మతువార్' ఎన్ఱుతుడఙ్గి: ఐశ్వర్య సూచకమాయ్ తిరుక్కుఴవిన్ స్పర్శత్తాలే మధుస్యన్దియాన తిరుత్తుఴాయై యుడైయనాయ్ అపౌరుషేయ మాన వేదప్రతిపాద్యనాయ్ ఉళ్ళవనుక్కు "ఎతువేతెన్ఱుతుడఙ్గి" ఇప్పడి విలక్షణ నానవనుక్కు నానడిమైశయ్ కైక్కు అయోగ్య నెన్ఱు పారాతే అన్తరఙ్గ వృత్తియోడు బహిరఙ్గ వృత్తి యోడు వాశియినిక్కే ఎల్లావృత్తియైయుమ్ శెయ్యక్కడవనాకై ఆళ్ శెయ్కైక్కధికారమ్"

ఈ విధముగ పాశురభావములను తెలుపునదై ఈ వ్యాఖ్యాన మమరి యున్నది.

పన్నీరాయిరప్పడి:

ఈ వ్యాఖ్యానము పంౘ్రెండు వేల శ్లోకముల సంఖ్య గలదగుటచే దీనికీ పేరు వచ్చినది. దీనిని వాది కేసరి అఴగియ మణవాళ జీయరు సాయించిరి. భాగవత సంఖ్య గూడ ఈ సంఖ్యయేయగుటచే భాగవత ప్రక్రియగా నిది రచింపబడినదని చెప్పవచ్చును. పాశురముల ప్రతి పదార్థమెఱుగుటకు ఇది మిక్కిలి ఉపయోగపడును.

శ్రీమణవాళమహామునులు దీనిని గూర్చి చెప్పుచు "పిన్బోరులక త్రిటిన్దు పేశుగైక్కా" అని ప్రయోజనము వివరించిరి. తరువాతి వారు ఈ వ్యాఖ్యానముతో తిరువాయ్మొళ్రిని సేవించినచో తమ తరువాతి వారికి విశదముగ బోధ పడునట్టు ఉపదేశింపగలరు.

ఇందు పదములను అన్వయ క్రమములో కూర్చి వ్యాఖ్యానించిరి. కేవలము ప్రతి పదార్థము గాక, పదము నకు పై పదముతో నుండెడి సంబంధమును తెలుపునట్టి అన్వయ క్రమముతో వారీ వ్యాఖ్యానము రచించిరి. ప్రతి పాశురమునకును అవతారిక యుండును. చివరకూడ అవసరమగు చోట ముగింపు మాటలు నుండును.

ఈ వ్యాఖ్యాన సహాయమున మూల గ్రంథము నందలి పదములకు అర్థము సుగమమగును. అప్పుడు " ఈడు"లోని స్వారస్యములు చక్కగా గ్రహింప నవకాశముండును.

పెద్ద భగవద్విషయ కోశములలో ఆరాయి రప్పడి క్రింద నిలువు గీతకు కుడివైపున ఈ వ్యాఖ్యానము గలదు. దీని యుపయోగములను గుర్తించి దీనిని చిన్న భగవద్విషయ శ్రీకోశము లందును ఆరాయిరప్పడికి క్రింద చేర్చిరి, చిన్న భగవద్విషయకోశములందు సులభముగ గ్రహింపనగుటకు అన్వయ క్రమమును చూపుచు మూడేసి పదములకు సంఖ్యలనిచ్చి ఆక్రింద సమగ్రమగు పన్నీరాయిరప్పడి నిచ్చుటయే గాక మరల ఆ క్రింద తెలుగున ప్రతి పదార్థమును అన్వయ క్రమముననుసరించి మీది అన్వయ క్రమపు సంఖ్యలను చేర్చి చూపిరి. అందుచే ఈ వ్యాఖ్యానము యొక్క ఉపయోగము చాల ఎక్కువగ నుండునని యూహింపవచ్చును -

వ్యాఖ్యానపు తీరు:-"అణజ్గైన" 1-6-4

"అనన్తరమ్ ఇప్పడి ఎన్నైయుమఙ్గీకరిత్త స్వామి నిత్యసూరి కళుక్కు నిరన్తరానుభావ్యమాన గుణ వైభవత్తైయుడైయవనెన్గిరార్ -

అణజ్గైవ - అణజ్గేటివాప్పోలే, ఆడుమ్ - ప్రేమత్తాలేససంభ్రమ వృత్తమ్ పణ్ణుగిఱ, ఎన్ - ఎన్నుడైయ, అఙ్గమ్ : శరీరమ్, వణంగివళ్రిపడుమ్- ప్రణామాది ముఖత్తాలే యారాధిక్కు మ్బడియాన, ఈశన్- స్వామియానవన్, అమరర్-నిత్యానుభవపరరాన నిత్యసూరికళ్, పెణఙ్గపిదత్తు- స్వానుభూత గుణ తారతమ్య ముఖత్తాలే సరస వివాదకోలాహలోక్తి పణ్ణుమ్బడియావ, కుణమ్కెళ్రు- గుణఙ్గళ్ శెటివు, కొళ్కైయినాన్ - కోట్బాట్టై యుడైయవన్కిడీర్.

కొళ్కై యెన్ను ఆశ్రయ విషయమాకవుమామ్ ఇప్పడి సర్వాధికన్ కిడీర్ బన్దత్తాలే యెన్నై యడిమై క్కొణ్డా నెన్ను కరుత్తు-"

ఈ విధముగ సాగిన ఈ వ్యాఖ్యానము పాఠకులను ప్రవచన సమర్థులనుగా జేయుననుటలో నెట్టి సందియము లేదు.

ఇరుపత్తు నాలాయిరప్పడి

ఈ వ్యాఖ్యానము ఇరువది నాలుగు వేల శ్లోక సంఖ్య కలది. గాయత్ర్యక్షర సంఖ్యాను

సారముగ ఇరువది నాలుగు వేల సంఖ్య గల శ్లోకములతో వాల్మీకి మహర్షి శ్రీరామాయణమును కూర్చినట్లుగనే వీరును రామాయణ ప్రక్రియగ ఈ వ్యాఖ్యానమును సంతరించిరి.

ఈ వ్యాఖ్యానమును కటాక్షించిన వారు శ్రీ పెరియవాచ్చాన్పిళ్ళై గారు. నమ్పిళ్ళై గారు ప్రేరణ చేయగ వీరీ వ్యాఖ్యానమును రచించిరట. ఈమహానుభావులు నాలాయిరమునకును వ్యాఖ్యానములు రచించిరి. వీరి వ్యాఖ్య "నా మూలం లిఖ్యతే కించిత్ నాన పేక్షితముచ్యతే, అన్నట్లు గనుండును. వీరి వ్యాఖ్యానము అన్వయ క్రమమును బట్టిగాక మూలము నందలి పదముల సమాసముల కూర్పుననుసరించును.

పెద్దభగవద్విషయ కోశములందు పన్నీరాయిరప్పడి ఒన్బదినాయిరప్పడుల క్రింద "ఈడు' నకు మీద 'ఇ' అను నక్షర సంకేతముతో ఈ వ్యాఖ్యానము చేయబడినది. చిన్న భగవద్విషయ కోశముల యందీ వ్యాఖ్యానమీయ బడలేదు. బహుశః అందు 'ఈడు' వ్యాఖ్యానమున్నందున ఇది గతార్థమైయుండునని పొందుపఱుపబడలేదేమో!

ఇందును ప్రతి దశకమునకును, ప్రతి పాశురమునకును అవతారిక యుండును. పాశురము నందలి అర్థపూర్తి గల కొన్ని పదముల సముదాయమును తీసికొని దానికి వివరణముగ వీరు తమ వ్యాఖ్యానమును పొందుపఱచిరి.

మచ్చునకొక చిన్న భాగము:- "ఎన్జైయే" 1.10.7 "మణివణ్ణనెన్జై" ఎన్ఱు అవనుడైయవై లక్షణ్యత్తైయుమ్. స్వనికర్షత్తైయు మనుసంధిత్త కలుకిడార్. "తుఞ్జమ్పోతుమ్ విడాతు తొడర్ కణ్డాయ్ ఎన్ఱతువే అను సంధిత్తపడి,(ఎన్జైయేయేన్ఱుమ్) ఎనక్కుపరివవానవనే యెన్ఱుమ్, పరివనామళతన్నిక్కే(ఎమ్బెరుమానెన్ఱుమ్) ఎనక్కువకుత్త స్వామియెన్ఱుమ్,(శిన్దైయుళ్ వైప్పన్) విషయాన్తర ప్రవణమాన నెఞ్జిలే వైప్పన్. నెఞ్జిలేవైత్తు రహస్యప్రాయశ్చిత్తమ్ పణ్ణి విడుమళవన్నిక్కే(శొల్లువన్) ఇవన్పేశుమళవో వివ్విషయమ్ ఎన్ఱుకై విడుమ్బడి పిఱర్ కేట్క శొల్లానిన్ఱేన్(పావియేన్) విలక్షణ భోగ్యమాన విష్విషయత్తై యఱ్రుక్కొక్కునానొరు. పాపకర్మా ఉండావదే! తమోభిభూతియాలే అకత్నితే అగ్నిప్రక్షేపత్తైపణ్ణి సత్యమ్ తలైయెడుత్తవాతే అను తపిక్కుమాప్పోలే పావియేన్ ఎన్గిడార్.

ముప్పత్తారాయిరప్పడి - ఈడు - దాని ప్రాశస్త్యము

ఈ వ్యాఖ్యానము శ్రుత ప్రకాశిక సంఖ్యాననుసరించి ముప్పది ఆరువేల గ్రంథముగ కూర్చబడినది. దీనిని రచించిన వారు శ్రీవడక్కుత్తిరు వీదిప్పిళ్ళైగారు, వీరు నమ్పిళ్ళైగారి శిష్యులు, తమ ఆచార్యుల ప్రేరణతో నీ వ్యాఖ్యానమును వీరు వేంచేపు చేసిరి. నమ్పిళ్ళైగారు తిరువాయ్మొழி పాశురములను ఉపన్యసించు చుండగా విని వీరు దానిని గ్రంథస్థము చేసిరి. ఈ వ్యాఖ్యానమునకిదే సాటి.

"గగనం గగనాకారం సాగర స్సాగరోపమః" అన్నట్టుగ దీనికి సాటిగ చెప్పుటకు మఱొకటి

లేదు. సంస్కృతమున శ్రీగోవిందరాజుల వారు శ్రీరామాయణమునకు వ్యాఖ్యానము రచింప బోవుచు ఇట్లు ప్రతిజ్ఞ చేసిరి.

"వైయర్థ్యం పునరుక్తతా మనుచితారంభం విరోధం మిథో,
సాధుత్వంచ పదప్రబంధ రచనా వాక్యేషు నిశ్శేషయన్,
స్వారస్యంచ పదేపదే ప్రకటయన్ రామాయణస్య స్వయం,
వ్యాఖ్యా మేష తనోతి సజ్జనముదే గోవిందరాజాహ్వాయ:,"

"వ్యర్థపద ప్రయోగములు, మరల మరల నొకే విషయమును చెప్పుట, అనుచితమగు దానినారంభించుట, అన్యోన్య విరోధము మొదలగు వానిని తొలగించుచు, పదముల స్వారస్యమును ప్రకటించుచు ఈ వ్యాఖ్యానమును రచించుచున్నాను" అనియు -

"క్వచి త్పదార్థం క్వచి దన్వయార్థం
క్వచి త్పదచ్ఛేద సమర్థనాని,
క్వచిత్ క్వచిద్గాఢ నిగూఢ భావం
వక్ష్యే యథాపేక్షమపే క్షణీయమ్."

"కొన్నిచోట్ల పదముల కర్థమును, మరికొన్ని చోట్ల అన్వయార్థమును, కొన్నిచోట్ల పదచ్ఛేదము చేసి సమర్థించుటయును, మరికొన్నిచోట్ల గాఢముగ నిగూఢమైన భావమును చెప్పుచున్నాను - కావలసిన వారు వారి అవసరమును బట్టి చూచుకొనవచ్చును."

అనియును ప్రతిజ్ఞ చేసిరి. ఆ మార్గముననే వీరును వ్యాఖ్యానమును సాగించినట్లు కనబడును.

ఈ వ్యాఖ్యానము చాల విశాలమైనది. తిరువాయ్ మొழி వ్యాఖ్యానములలో దీనిని మించినది లేదని చెప్పవచ్చును. మూలములోని ప్రతి పదమునకును స్వారస్యమిందు వివరింపబడినది. పదములు వేఱు చేయుటలో, కలుపుటలో ఏర్పడు వివిధ స్వరస విశేషములు ప్రదర్శింపబడినవి.

ఈ వ్యాఖ్యానము శ్రీరామాయణ రహస్యములను పెక్కింటిని బయలు పఱచినది. ఈ వ్యాఖ్యానము లేనిచో ఆ రహస్యము లన్నియు ఎక్కడనో అడుగునపడి యుండునేమో. ఇందు సాధారణముగ ప్రతి పాశురపు అవతారిక లోను రామాయణములో సమన్వయముండును. రామాయణ శ్లోకమారంభింపగనే బహుశ: వీరికి వాల్మీకి హృద్గతాభిప్రాయములు కరతలా మలకములగు నేమో. అందలి శ్లోకములలోని ప్రతి పదమునకును విశేషార్థములను వివరించును.

"చైత్రశ్శ్రీమాన్..........." "భవాంస్తుసహ..........."
"కురుష్వమామ్........." "అనురూపస్సవైనాథ:........."
"రామందశరథం......." "సృష్టస్త్వం...." "మంగళాని ప్రయుఞానా:....."

"తంద్రుష్ట్వా........" "అప్రమేయం హి.........." "నివాసవృక్షః....॥"

"త్వమప్రమేయశ్చ....." "సక్షీచ.." "మిత్రమౌపయకం..." "మిత్రభావేన"

"నకశ్చిన్నాపరాధ్యతి...." తమస: పరమోధాతా...."

ఇట్లు రామాయణ శ్లోకములు వీరిచే వ్యాఖ్యానింపబడినవి చెప్పుకొనుచు వెళ్లుట బాహువులతో సముద్రమును తరింప యత్నించుటయే యగును. శ్రీమద్రామాయణమున వీరిచే వివరింపబడని విశేషార్థములు గల శ్లోకమేయుండ దనుట అతిశయోక్తి కాదు.

"దామ్నా చై కోదరే బద్ధ్వా.." ఇత్యాది విష్ణు పురాణశ్లోకములును, "త్వదంఘ్రిముద్దిశ్య....' ' ఇత్యాది స్తోత్రరత్న శ్లోకములును మాత్రమే గాక భగవద్గీతాది పేరున్న గ్రంథము లందలి శ్లోకములును ఆయా సందర్భము లందు చక్కగా వివరింపబడినవి -

అంతే గాక తత్వ త్రయమును గూర్చియు, మంత్ర మంత్రార్థములను గూర్చియు వివరించు ఘట్టము లెన్నియో యున్నవి. "అగలకిల్లేన్" ఇత్యాది ఘట్టములందు శరణాగతిని గూర్చి చాల విశదముగ వివరించిరి. వీరు దేనిని వివరించుటకు ప్రారంభించినను దానిని సాకల్యముగ విశద తరముగ వివరించి గాని విడువరు. వీరి భాషశైలి కూడ మిక్కిలి మృదు మధురమైయుండును.

వీరి వ్యాఖ్యానమొక యెత్తు. అందలి యవతారిక లొకయెత్తు. వ్యాఖ్యానమారంభించుటకు ముందు శ్రియ: పతులనుపేరుతో వీరు గ్రంథమును పరామర్శించిరి. అవియే అవతారికలుగ భావింపవచ్చును.

ఇందు ప్రవృత్తి గలుగుట కొఱకై ఈ ప్రబంధవైలక్షణ్యము, ప్రతిపాద్య వైలక్షణ్యము, ప్రబన్ధ నిర్మాత(నమ్మాళ్వార్) యొక్క వైలక్షణ్యము ఈ మూడు శ్రియ: పతులందును కూర్చబడినవి, ఇది ఒక తత్వ శాస్త్రమగుటచే దీని యందు చిదచిదీశ్వర తత్వములు మూడును వివరింపబడినవి, ఇతర మతముల కంటె విశిష్టాద్వైతము యొక్క ప్రాశస్త్యము చక్కగా చూపబడినది. ఈ మహాగ్రంథముచే ప్రతిపాదింపబడు సర్వేశ్వరుడెట్టివాడో వివరించి అట్టివాడు నారాయణుడేయని నిర్ణయింపబడినది.

మఱియు పరస్వరూపము, ప్రత్యగాత్మ స్వరూపము ఉపాయ స్వరూపము, విరోధి స్వరూపము, ఫలస్వరూపము అనబడు అర్థపంచకము ఇందు విశదముగ వివరింపబడినది.

ఇక - శ్రీనమ్మాళ్వార్లకు సాటి యెవరైన ఉన్నారా? అని ప్రశ్నించుకొని, వారికి గల ఒక్కొక్క గుణములో నొక్కొక్కరు మాత్రమే సాటియగుదురని, లక్ష్మణ ప్రహ్లాదుల నుదాహరించి అన్ని గుణములకును సాటియగు వారుండరని స్పష్టపఱచిరి.

అంతేగాక, ఈ శ్రియ: పతులందు జిజ్ఞాసు ప్రశ్నలు, జిగీషు ప్రశ్నలు అని రెండు రకముల ప్రశ్నలు చూపబడి సమాధానము లీయబడినవి. తెలిసి కొనగోరువారు జిజ్ఞాసువులు - విషయ మెఱుగుటతో వారికి తృప్తి కలుగును- దానికి తగిన సమాధానములు వారి కిచ్చిరి -

జయింపగోరు వారు జగీషువులు - వారికి దోషములనుట్టంకించటయే పని. అట్టివారిని నిరుత్తరులుగా చేయునట్టి సమాధానములు వారికిచ్చి తమ మతమును నిలబెట్టుకొనిరి. దీని వలన వెల్లరును ఇందు ఆసక్తి గలిగి, దీనినధ్యయనము చేసి భగవంతుని చేరునవకాశము కలిగినది.

ఇట్టి విశేషములుండుటచేతనే మన పెద్దలు ఈ 'ఈడు' వ్యాఖ్యానమునే కాలక్షేపము చేయుదురు. ఇందు చర్చింపబడిని విషయముండదు. దీనిని కాలక్షేపము చేయనిదే తత్వజ్ఞానము సుప్రతిష్ఠితము కాజాలదు. భగవద్గుణానుభవము జరుగదు.

ఇట్టి ఈ వ్యాఖ్యానమునకు రెండు అరుంబదములు అవతరించినవి. (ఇవి ఈడు వ్యాఖ్యానమునకు వ్యాఖ్యానములు) ఒకటి అడ్డైయ వళ్లైజ్ఞనవరుమ్బదము - రెండవది జీయరరుమ్బదము - ఈ రెండు అరుమ్బదములును 'ఈడు' వ్యాఖ్యానము క్రింద నిలువు గీతకు కుడియెడమ లందు పెద్ద భగవద్విషయ కోశములలో నీయబడినవి. చిన్న కోశములలో జీయరరుమ్బదము పూర్తిగ నీయబడినది. విశేషాంశములున్నచో "అడ్డైయవళ్లైజ్ఞనవరుమ్బదము అక్కడి కవసరమగు భాగము మాత్రము ఈయబడినది.

ఈ అరుమ్బదముల సహాయముతో అధ్యయనము(కాలక్షేపము) చేసిన భగవద్విషయము నందు మంచి ప్రతిభావంతులగుదురు.

ఇంకను ఈ వ్యాసమున చేర్చదగిన విషయములెన్నియో ఉన్నను గ్రంథవిస్తర భీతిచే నింతతో ముగించుచునారు.

వకుళాభరణం వందే జగదాభరణంమునిమ్

య శ్శృతే రుత్తరం భాగం చక్రే ద్రావిడ భాషయా,



పరాంకుశ నాయిక

శ్రీ:

శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమతే శఠకోపాయ నమః

శ్రీరంగనాథ దివ్యపాదుకాభ్యాం నమః

# శ్రీ శఠకోపులు - భగవత్పాదుక

- ఉ.వే. శ్రీమాన్ కె.వి.ఆర్.నరసింహాచార్య స్వామి,

ఉక్కునగరం, విశాఖపట్టణం.

శ్లో॥ మాతాపితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్త దంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥

శ్లో॥ వృషభే తు విశాఖాయాం। కురుకాపురి కారిజమ్ ॥
పాండ్యేదేశే కలేరాదౌ। శఠారింసైన్యపం భజే ॥

శ్రీశఠకోపులు, వకుళభూషణులు, వకుళాభరణులు, పరాంకుశులు, ఇత్యాది ప్రసిద్ధ నామధేయములతో విరాజిల్లుచున్న శ్రీనమ్మాళ్వార్లు – పాండ్య దేశమున "కురుకాపురి" అను పట్టణమున ప్రమాది నామ సంవత్సర వైశాఖ శుద్ధ చతుర్దశి యందు, విశాఖా నక్షత్రమున విష్వక్సేనాంశగా, "కారి" అను ఆ దేశపు మహారాజునకు కుమారులుగా అవతరించిరి. వీరి జననము అతి విచిత్రము. ఆ రాజునకు దైవదత్త కుమారులు వీరు.

పుట్టిన దగ్గరనుంచియు ఏ విధమైన చలనము లేకపోవుటచే ఆ రాజు భగవంతుని ప్రార్థించగా – స్వామి – "ఆ బాలుడు కారణజన్ముడనియు, ఆతనికై దిగులు పడవలదనియు చెప్పెను. ఆ తర్వాత భగవదాజ్ఞతో ఆ రాజు ఆ బాలుని ఆలయమునకు దగ్గరలో ఉన్న నిద్రనెరుగని చింత చెట్టు వద్ద ఊయలలో దించి వెడలిపోయెను. ఆ చింతచెట్టు ఎవరో కాదు ఆదిశేషుడే. వీరి అవతారమునకు ముందుగనే భగవంతుని ఆదేశముతో అచట చింత చెట్టుగా వెలసినాడు. ఆ బాలుడు వెంటనే ఊయలనుండి క్రిందకు దిగి చింతచెట్టు తొఱ్ఱలో చేరెను. భగవన్నామమే ఆధారముగా క్రమముగా పెరిగి పెద్దవాడగుచున్న ఆ బాలునకు శ్రీవిష్వక్సేనులే "పంచసంస్కారముల' ' నొసగినారు. మధురకవి యాళ్వారులకు వీరి సందర్శనము కూడ ఒక విచిత్ర సంఘటన.

ఆ విధముగా పెరిగి పెద్దవారైన వీరు నాలుగు వేదముల సారముగా ద్రవిడ భాషలో రమ్యములైన ప్రబంధములను రచించినారు.

1) ఋగ్వేదసారముగా "తిరువిరుత్తము" 100 పాశురములు.

2) యజుర్వేదసారముగా "తిరువాశిరియం" 7 పాశురములు

3) అధర్వణ వేదసారముగా "పెరియతిరువందాది" 87 పాశురములు

4) సామవేదసారముగా, ఛాందోగ్యోపనిషత్తుకు వివరణగా, "తిరువాయ్మొழ்ழி' అని దాదాపు వేయికి పైగ్గా నున్న పాశురములతో నున్న – గ్రంధము – వీరి రచనలు.

ఈ "తిరువాయ్మొழ்ழி" పది శతకములుగా విభజింపబడినది. ఒక్కొక్క శతకము మరల పదేసి దశకములుగా విభజింపబడినది. శతకమునకు "పత్తు" అనిపేరు. ఒక్కొక్క శతకము నందలి – పది – భాగములలో – ఒక్కొక్క దశకమున 10 పాశురములు – ఒక – ఫలశ్రుతి పాశురము – వెరసి – 11 పాశురములుండును. ఈ విధముగా ఒక శతకము నందు 110 పాశురములు – పది శతకములకు (పత్తులకు) దాదాపు 1100 పాశురములు కలవు.

రెండవ శతకము 7వ దశకమున కేశవాది నామ వర్ణనలో రెండుపాశురములు ఎక్కువ కలవు. ఆ విధముగా 1102 పాశురములు ఈ ప్రబంధమున కలవు.

దీనినే మోక్ష ప్రబంధమనియు, చరమ ప్రబంధమనియు అందురు.

మన్మథునితో సమానమైన రూపము కలవారగుటచే వీరిని "కారిమారన్" అని కూడ పిలిచెడి వారట.

వీరి కవిత్వము అత్యంత సుందరము, ఆకర్షకము అగుటచే అళ్వార్లందరు గుమిగూడి వచ్చి, వీరు నివసించియున్న చింత చెట్టుకు వ్రేలాడుచు "నన్ను ముందు పాడుమంటే – నన్ను – ముందు పాడుమని – ఈ ఆళ్వార్లను వేడుకొనెడి వారట. అందువలననే ఈయనకు "భగవత్కవి" అను కూడ పేరు వచ్చినది.

"భగవంతుడొక్కడే పురుషుడు. మిగిలిన ప్రపంచమంతయు స్త్రీలతో సమానము" "స్త్రీప్రాయం విశ్వమేతత్" అనుసూక్తి ఆధారముగా వీరు తమ యందు నాయికాత్వమును ఆరోపించుకొని భగవంతునితో విరహమును అనుభవంచినట్లుగా ఈ తిరువాయ్మొழ்ழி యందు కీర్తించబడినది.

శ్లో॥ "యోముని ర్నాయికా భావ మాత్మన్యారోప్య చక్రిణః ।

హరింప్రాప, శఠారాతిం తం వందే భగవత్కవిమ్॥" అను శ్లోకము ఈ విషయమును స్పష్టము చేయుచున్నది.

వీరి భక్తికి మెచ్చి భగవంతుడు ప్రత్యక్షమై మోక్షమును ఇచ్చెదననగా – ఈ ఆళ్వార్లు తమకు మోక్షము వలదనియు, స్వామి పాదసేవనే నిత్యము తాము కోరుకొను చున్నామనియు భగవంతుని ప్రార్థించిరట.

భగవంతుని పాదములను నిత్యము వదల కుండగ నుండునది పాదుకయే కావున, వీరు "భగవత్పాదుక"గా అభివర్ణింపబడినారు. అందుకనియే భగవదాలయముల యందలి భగవంతుని పాదుకకు "శ్రీశఠకోపము" అను పేరు వచ్చినది.

తిరువాయ్‌మొழி - రెండవ శతకము - తొమ్మిదవ దశకము లో - శ్రీనమ్మాళ్వార్లు స్వామిని ప్రార్థించిన విధానము - ఇచట - క్లుప్తముగా వారి మాటలలోనే ఈయబడుచున్నది.

1) "స్వామి!! అతి సుందరములైన నీ దివ్యపాదార విందములను నా శిరస్సుపై ఉంచుము. అంతకన్న వేరు పరమ పదమును నేను కోరుటలేదు"

2) "నేను నీ శ్రీపాదములను శీఘ్రముగా చేరునట్లు అనుగ్రహింపుము"

3) "నాయందభిమానముతో నాకు ప్రత్యక్షమై నీ యొక్క భక్త పరాధీనతను చాటుకొన్నావు. నాప్రాణావసాన సమయమునకు నేను నిన్ను స్మరించునట్లు అనుగ్రహించుము."

4) "అవ్యాజానురాగముతో ఒక్క క్షణమైనను నన్ను విడువకయున్న ఓస్వామి!! నీయొక్క శ్రీపాదసేవయే సదా నాకు లభించునట్లు అనుగ్రహించుము"

5) "స్వామి!! నాకు మోక్షమో, మరణమో, స్వర్గమో, ఏదైన రానిమ్ము, మరల జన్మ లేకపోయినను నాకు బాధలేదు. ఎన్నో అవతారములను దాల్చిన నీ దివ్య మంగళ విగ్రహము నందలి "కల్యాణగుణములను" అనుభవించుటయే నేను కోరుకొనునది"

6) "మనోవాక్కాయములతో సదా నీ ఎదుటనే ఉండి నీసేవ చేయునట్లు నన్నను గ్రహించుము'

7) "సర్వ దేశ దశాకాలముల యందును నీ శ్రీపాదములను ఆశ్రయించి వదలకుండ నుండునట్లు అనుగ్రహించుము. ఆ విధముగ ఎల్లప్పుడు నా యెదుటనే ఉండుము"

8) "నిత్య సూరి భోగ్యుడవగు నీవు - సదా నామనస్సునందు నిలచి యుండుము"

9) "నిశేషభూతుడనై యుండి కూడ ఇంత కాలము నిన్ను తెలిసికొన జాలక అహంకార మమకారాదులతో నశించుచున్న నన్ను ఉద్ధరింపుము"

10) "స్వామి!! రామకృష్ణాద్యవతారములలో దుష్ట శిక్షణ చేసిన నీవు నన్ను కూడ వదల వలదు. నా సంసారేచ్ఛ వదలించి నీ శ్రీపాదముల యందు చేర్చికొని నీ నిత్య కైంకర్యమును నాచే నీవే చేయించికొనుము. ఇది కూడ నీ అనుగ్రహము లేనిదే జరుగదు." అని - ఇవి క్లప్తముగా వారి మాటలు.

అట్లే "పెరియతిరువందాది" లో కూడ కొన్ని పాశురములలో ఈ భావము వ్యక్తమైనది. అందు ముఖ్యముగా -------

"అழிకు మరావోమాయవన్" అను 31వ పాశురమున -

"క్షీరాబ్ధిలో మఱ్ఱియాకుపై పవళించియున్న ఆస్వామికి - ఎప్పుడును వదలని నీడవలెను, పాదములను ఎల్లవేళల వదలి యుండని పాదుకవలెను" తమను తాము - భావించుకొనుట - గమనార్హము.

ఈ విధముగా భగవంతుని యందు దృఢమైన భక్తితో భగవత్పాదుకగా ప్రసిద్ధులైన శ్రీనమ్మాళ్వార్లను - శ్రీమద్వేదాంత దేశికులు తమ పాదుకాసహస్రమున అనేక స్థలములలో

ప్రశంసించి యున్నారు. దానికి ఆధారము "తిరువాయ్‌మొళ్లి 2వ శతకము 9వ దశకము" అని వేరుగ చెప్పనక్కరలేదు.

పాదుకాసహస్రము భగవంతుని పాదుకను వర్ణించిన గ్రంధముగా సర్వవిదితము.

అందు ప్రస్తావ పద్ధతిలో భరత వాల్మీక్యాదులను నమస్కరించుచు - 3వ శ్లోకమున "త్వన్నామానం మునిమిహ భజే త్వా మహం స్తోతుకామః" అని పాదుకతో సమానమైన పేరుగల, శఠకోప సంజ్ఞను దాల్చిన మునిని అనగా శ్రీనమ్మాళ్వార్లను కూడ నమస్కరించినారు. వారు పాదుక వలెనే భగవత్పాదములను ఎప్పుడును విడువని వారుగా చెప్ప బడినారు.

అట్లే సమాఖ్య అను రెండవ పద్ధతి యందును, నాద చిత్రాది పద్ధతుల యందును శ్రీశఠకోపులకు - భగవత్పాదుకకు - "సామ్యము - అభేదము - ఆధిక్యము మొ॥ వానిని చమత్కారముగా వర్ణించినారు. "సమాఖ్య" అని పద్ధతికి పేరు పెట్టుటలోనే సమ+ఆఖ్య అని ఇద్దరకును పేరులో సామ్యమున్నదని తెలియచేయబడినది. ఇందు వీరు భగవత్పాదుకను వర్ణించిన విధమును యథామతి పరిశీలింతము.

సమాఖ్య పద్ధతి యందలి మొదటి శ్లోకమున (21 వశ్లో) - విష్ణుపదాసక్తయైన పాదుకను - విష్ణుపదాసక్తులైన శ్రీశఠకోపులను కూడ నమస్కరించినారు. వీరిద్దరకును సామ్యము శఠజయము. శ్రీనమ్మాళ్వార్లు శఠులను జయించినవారుగా ప్రసిద్ధులు. పాదుక కూడ శఠమైన తమ (వేదాంతదేశికుల) మనస్సుజయించినది.

ఆ విధముగా శఠజిత్సంజ్ఞ ఇద్దరకును సార్ధకమైనందున వారిద్దరకును కలిపి ఒకే పర్యాయము నమస్కరించుట జరిగినది. ఈ విధముగా ఇందు శ్రీ శఠకోపులకు భగవత్పాదుకకు సామ్యము వర్ణించబడినది.

(ఇచట శఠకోపులు కూడ తమ చిత్తమును హరించినట్లు వర్ణితము)

ఇదే విషయము చిత్ర పద్ధతి 10వ శ్లోకమున (920శ్లో) మరొక విధముగా వర్ణించబడినది.

శ్లో॥ బాధాఘాళీ ఘాటతుచ్ఛే గాథాభానాయ ఫుల్లకే।
సమాధౌ శఠజిచ్చూడాం వృణోషి హరిపాదుకే ॥

(ఇందు "అపునరుక్త వ్యంజనము" అను చిత్రము వర్ణితము)

ఈ శ్లోకమున "పాపరహితులైన గాధాసహస్ర రచయితయైన శ్రీశఠకోపుల యొక్క శిరస్సును అధిరోహించినట్లుగా పాదుక వర్ణింపబడినది. పాదుక కూడ పాపరహితయైనది. శ్రీమద్వేదాంత దేశికుల ద్వారా వేయి శ్లోకములను రచింప చేయుటకు కారణమైనది. ఇచట ప్రధానముగా "శఠజిచ్చూడా" అను పదము ద్వారా "శఠజిత్తైన శ్రీనమ్మాళ్వార్లకు శిరోభూషణమైనట్లుగాను, అట్లే శఠులను జయించిన వారిలో అగ్రగణ్యయై నట్లుగాను (అందువలననే శ్రీనమ్మాళ్వార్లు కూడ పాదుకను తమ శిరసున ధరించినారు) పాదుక వర్ణించబడినది. ఈ

విధముగా శ్రీశఠకోపుల కంటే పాదుకకు ఆధిక్యము ఇచట వర్ణితము. సహస్రగాథారచనలో మాత్రము పరస్పర సామ్యము.

ఇదే విషయము మరొక విధముగా సమాఖ్యా పద్ధతి 10వ శ్లోకమున - అనగా 30 వ శ్లోకమున వర్ణించబడినది.

"సహస్ర గాథారచనలో ఇద్దరకును సామ్యమున్నది కావున
శఠకోప సమాఖ్య పాదుకకు కూడ యుక్తమే" అని॥

ఇక సమాఖ్య రెండవ శ్లోకమున- (22శ్లో)-

"ద్రమిడోపనిష ద్రహస్య శూన్యులను కూడ మోక్షమునకు పంపుటకై శ్రీశఠకోపులే మరల పాదుకగా అవతరించనట్లు వర్ణించబడినది. శ్రీశఠకోపుల "తిరువాయ్‌మొழி" పఠించిన వారికి, దాని యర్థమును తెలిసిన వారికిని మోక్షము కరతలామలకము. కాని దానిని చదివి అర్థము చేసికొను శక్తి లేనివారిని కూడ మోక్షమునకు పంపుట శ్రీశఠకోపుల ఆశయముగా వర్ణించబడి, అందుకనియే పాదుకగా అవతరించినట్లు వర్ణించబడినది. శ్రీశఠకోపులే పాదుక అని. ఆలయములలో శ్రీశఠకోపము శిరసుననుంచినంత మాత్రముననే సర్వపాపములు నశించి మోక్షమునకు దగ్గరగుదురు కదా. ఈ విధముగా ఈ శ్లోకమునకూడ శ్రీశఠకోపులకు పాదుకకు అభేదము వర్ణించబడినది.

తరువాతి శ్లోకమున (సమాఖ్య - 3 - శ్లో23) - పాదుక నమ్మాళ్వార్ల పేరును - అనగా శఠకోప సంజ్ఞను ధరించుట శ్రీరంగనాథుని శ్రీచరణముల నుండి పుట్టిన చతుర్ధ కులజులనుదిద్ధరించుటకే - అని వర్ణించినారు. ఇచటకూడ శ్రీశఠకోపులు చేసిన కృత్యమే పాదుక కూడ చేసినది. కావున ఇద్దరకును సామ్యము వర్ణితము.

అనంతర శ్లోకమున (సమాఖ్య-4-శ్లో24)- "శఠకోప సమాఖ్య"తో ప్రసిద్ధులైన ఆ మునిచేత (నమ్మాళ్వార్ల చేత) శ్రుతియు, పాదుకతో ఆశ్రుతికి అర్థమును - ఉపజీవ్యమైనట్లు వర్ణించబడినది. నమ్మాళ్వార్లు శ్రుతికి ఉపజీవ్యమైనారు. అనగా వారి ద్వారా ద్రావిడ వేదము ఉద్ధరించబడినది. ఆ "శఠకోప" సమాఖ్యనే ధరించి - పాదుక శ్రుతికి అర్థమైన శ్రీరంగనాథునకు ఉపజీవ్యమైనది. శ్రుతికి అర్థము భగవంతుడేకదా. ఆ భగవంతునకు పాదుకయే ఆధారము. పాదుక లేనిదే ఆయనకు గమనమసాధ్యము. కావున ఉపజీవ్యమైనట్లు వర్ణించబడినది. ఈ విధముగా కూడ ఇద్దరకును సామ్యము వర్ణితము.

"శ్రీశఠకోపులు లేనిదే ద్రవిడ వేదము ఎట్లు లేదో - అట్లే -
పాదుక లేనిదే శ్రీరంగ నాథునకు గమనము లేదు" అని.

తదనంతర శ్లోకమున - (సమాఖ్య 5-శ్లో25)- "పండితులు శ్రీశఠకోపసూరి యొక్క - కర్ణామృతమైన గాథాసహస్రమును విని - పాదుక యొక్కనాదమును స్మరించు చున్నారు" అని

వర్ణించబడినది - ఇచట "పాదుకానాదము - ద్రమిడ వేదగానము ఒక్కటే" అని చెప్పబడినది.

ఇదే విషయము "నాదపద్ధతి"లో కూడ మరియొక విధముగా చెప్పబడినది.(నాదపద్ధతి 76=456శ్లో)

"శఠకోప మహర్షిగా పాదుక ఏ సంహితనైతే దర్శించినదో "హరి చరణ సరోజామోదముతో' ' సంతోషించిన ఆ పాదుక యొక్క నాదములు శ్రుతి పరిషత్తు నందు ఆ సంహితయొక్క - సౌరభమును యోజన చేయుచున్నవి" అని.

శ్రీశఠకోపుల యొక్క వేదనాదము - శ్రుతి పరిషత్తునకు అనగా వేదసమూహమునకు సౌరభమునిచ్చినది. ఇచటి - పాదుకా నినాదము శ్రుతి పరిషత్తునకు అనగా చెవుల సమూహమునకు సౌరభమును ఇచ్చినది.

''హరిచరణ సరోజామోద సమ్మోదితత్వము'' అనగా శ్రీరంగనాథుని చరణ కమలాశ్రయణము వలన వచ్చిన సంతోషము ఇద్దరకును సమానము. ఇచట కూడ ద్రమిడ వేదనాదముతో పాదుకానాదమునకు సామ్యము చెప్పబడినది.

తదనంతరశ్లోకము -(సమాఖ్య-6-26శ్లో) బహుచమత్కార యుక్తము. శ్రీశఠకోపముని- శ్రీరంగనాథుని శేషత్వమున- "త్వద్దాస దాసగణనా చరమావధౌ" అని శ్రీయామునాచార్యులు "త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్స భృత్య ఇతి" అని శ్రీకులశేఖరులు చెప్పినట్లుగా సప్తపురుషాంతరములలో దాస్యమును పొంది - భగవత్ శేషత్వ పరాకాష్ఠను పొందియున్నారు. మరి పాదుకయో ఆశఠకోపముని యొక్క నామధారణము ద్వారా ఆయనకే శేషత్వమును పొంది - శేషత్వ పరాకాష్ఠలో ఆయననే (ఆశఠకోపముననే - అధిగమించినది. అని వర్ణించబడినది. ఇచట శ్రీశఠకోపనామధారణ ద్వారా పాదుకకు ఆముని కంటె న్యూనత్వమున్నను, శేషత్వ పరాకాష్ఠను అధిగమించుట ద్వారా వారి కంటె ఆధిక్యమే వర్ణించబడినది.

మరియొక శ్లోకమున - (సమాఖ్య7-శ్లో27) ఇట్టి శేషత్వ ఆధిక్యమే రమణీయముగా వర్ణించబడినది. అదెట్లనగా ''పాదుక శ్రీరంగనాథునకు శయ్యగా శేషత్వమును పొంది, ఆయనయొక్క పాదాశ్రయణము ద్వారా ఆశేషత్వమును వృద్ధిచేసికొని, భాగవతనామ ధారణ (శ్రీశఠకోపనామధారణ) ద్వారా ఆశేషత్వము నందే పరాకాష్ఠను పొందినది" అని ఇచట కూడ పై శ్లోకమువలెనే పాదుకకు న్యూనత్వము ఆధిక్యము కూడ వర్ణితము.

ఇంకొక శ్లోకమున (సమాఖ్య 8-28శ్లో) శ్రీశఠకోపమునికి, పాదుకకు - శ్రీరంగనాథునకు - శేషశేషిభావము కడురమ్యముగా - అతిచమత్కారముగా వర్ణించబడినది. శ్రీశఠకోపముని పాదుకను స్తుతించుట ద్వారా (భగవంతునతో పాటు) పాదుకకు శేషభూతులైనారు. అప్పుడు పాదుకశేషి మరిపాదుకయో ఆశఠకోపముని యొక్క నామమును ధరించుట ద్వారా ఆయనకు శేషత్వమును పొందినది. అప్పుడు శ్రీశఠకోపముని శేషి.

ఈ విధముగా వీరిద్దరును పరస్పరము శేషశేషి భావమును పొందికూడ - ఇద్దరుకు కలి శ్రీరంగనాథునకు శేషభూతులైనారు. అప్పుడు శ్రీరంగనాథుడు శేషియైనాడు. ఈ విధము శేషశేషి భావమంతయు - వీరి ముగ్గురి లోనే ఉన్నది. అని మొదట పాదుక శేషి-శ్రీశఠకోపు శేషభూతులు. తరువాత శ్రీశఠకోపులు శేషి, పాదుక శేషభూతము చివరకు వీరిద్దరు శేషభూతులు శ్రీరంగనాథుడు - శేషి. కావున శేషశేషి భావము ఈ ముగ్గురి యందే పర్యసించినది - అ చమత్కారముగా యథార్థవర్ణనము-

ఇక చివరగా - (సమాఖ్య-9-శ్లో29) న "ద్రమిడ వేదము శ్రీశఠకోప రూపము దాల్చి పాదుక యొక్క ముఖము నుండి వెలువడినదై - వేదములకు పూర్వగామియైనది" అని వర్ణించినార

ద్రమిడ వేదమునకు వేదములలో పూర్వగామిత్వము ఎట్లనగా - సంస్కృత వేదము కం ద్రమిడ వేదమునకే ప్రాధాన్యమిచ్చుట వలన.

అంతేగాక - ఉత్సవాదులలో ముందు ద్రమిడ వేదపారాయణ - ఆ వెనుక వరుస సంస్కృత వేదపారాయణ జరుగుచుండును. ఈ విధముగా కూడ ద్రమిడ వేదమున పూర్వగామిత్వము సుస్పష్టము.

ఈ ద్రమిడ వేద ద్రష్ట శ్రీశఠకోపులే యైనను ఇచట పాదుకయే శ్రీశఠకోపరూపము దా ద్రమిడవేదమును చెప్పినట్లుగా వర్ణించబడినది.

సమాఖ్య పద్ధతి 2వ శ్లోకమున (శ్లో22) శ్రీశఠకోప మహర్షియే పాదుకగా అవతరించిన వర్ణించబడినది. ఈశ్లోకమున (సమాఖ్య9-29) పాదుకయే శ్రీశఠకోపమునిగా అవతరించినట్లు వర్ణించబడుచున్నది.

ఈ విధముగా కూడ ఇద్దరకును అభేదము సూచితము.

ఈ విధముగా పాదుకా సహస్రమున శ్రీమద్వేదాంత దేశికులు - శ్రీశఠకోపులకు -పాదుక -- సామ్యము - అభేదము - ఆధిక్యము మొదలగు వానిని అతి రమ్యముగా వర్ణించియున్నార ఇవియే కాక మరికొన్ని శ్లోకములు కూడ కలవు. కాని విస్తరభీతిచే ఈ వ్యాసమును ఇంతటి ముగించుచున్నాను

శ్లో॥ శ్రీనగర్యాం మహాపుర్యాం। తామ్రపర్ణ్యుత్తరే తటే।
శ్రీతింత్రిణీ మూలధామ్నే। శఠకోపాయ మంగళమ్ ॥

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః

# ద్రమిడోపనిషత్సారః

**డా.ఉ.వే.శ్రీమాన్. కన్దాళ లక్ష్మీనారాయణస్వామి**
**నెల్లూరు**

శ్రీమాన్ వేంకట నాథార్యః కవితార్కిక కేసరీ ।
వేదాంతాచార్య వర్యోమే సన్నిధత్తాం సదా హృది ॥

ప్రపన్న జనకూటస్థులైన శ్రీపరాంకుశమునీంద్రుల సామవేదసారమైన తిరువాయ్మొళ్ళి దివ్యప్రబంధము నందలి పదిపదుల సారమును భాగవతుల ననుగ్రహింపగోరి శ్రీమద్వేదాంతదేశికులవారు ద్రమిడోపనిషన్నివేశ శూన్యులమగు అస్మదాదులపై భగవన్నిర్హేతుక కృపాకటాక్షములను ప్రసరింపజేయుటకై "ద్రమిడోపనిషత్సారము" అను సంస్కృత ప్రబంధమున అనుగ్రహించియున్నారు. ఆచార్య కృపావశమున దానినిట వివరించెదను.

1శ్లో॥ సేవాయోగ్యో ऽతిభోగ్య శ్శుభసుభగతను స్సర్వభోగ్యాతి శాయీ
శ్రేయ స్తద్ధేతుదాతా ప్రపదనసులభో ऽనిష్ట విధ్వంసశీలః ।
భక్తచ్ఛందానువర్తీ - నిరుపధిక సుహృత్ - సత్పదవ్యాం సహాయః
శ్రీమాన్ సర్వోచితా యాముపనిషది మిషత్యేషు గాథా శతైర్నః ।

శ్రీ నమ్మాళ్వారులు తమ శ్రీముఖసూక్తి దివ్యప్రబంధమందలి పదిపదులలో క్రమముగా శ్రియః పతి

1. సేవింపదగినవాడు - తుయరఱు శుడరడి తొ(ళ్ళు)దెళ్ళు ఎన్మననే 1.1.1.
2. పరమ భోగ్యమైనవాడు - తేనుం పాలుం కన్నలు మముద మొత్తే 2.3.1.
3. అతి సుందరమైన దివ్యమంగళ విగ్రహము కలవాడు - ముడి చ్చోదియామ్ ఉనదు ముగచ్చోది మలర్న్దదువో 3.1.1.
4. సకల భోగ్యపదార్థముల కంటెను భోగ్యమైనవాడు - ఆఙ్గవనై యిల్లాల్ శువర్కమెయ్ దియుం మీళ్వర్గళ్ 4.1.9
5. నిరవధిక శ్రేయస్సును, తదుపాయమును అనుగ్రహించువాడు - ఆరెనక్కు నిన్ పాదమే శరణాగతన్దొళ్ళిన్దాయ్ 5.7.10
6. శరణాగతి చేయుటకు సులభుడు - అలర్మేల్ మంగైయురై మార్బా....... ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే అ.10.10

7. ఆశ్రితుల అనిష్టములను పోగొట్టువాడు - ఆగ్రియెగ్ర శంగుం విల్లు మెగ్ర 7.4.1
8. భక్తుల భావనల ననుసరించి యుండువాడు - ఉమరుగన్దుగన్ద ఉరువం నిన్నురువ మాగ్రి 8.1.4
9. నిర్హేతుక సుహృత్తు - కొండ పెండీర్ మక్కళుత్తార్ శుత్తత్తవర్ పిఱరుమ్ 9.1.1.
10. అర్చిరాది మార్గమున సహాయముగ నుండువాడు - శూళ్విశుమ్బణిముగిల్ 10.9.1.
అని ప్రతిపాదించిరి.

2శ్లో॥ ఆద్యే పశ్యన్నుపాయం ప్రభుమిహ పరమప్రాప్యభూతం ద్వితీయే
కళ్యాణోదారమూర్తే ర్థ్వితయ మిదమితి ప్రేక్షమాణ స్తృతీయే ।
ఐశ్వర్యాదే శ్చతుర్థే విషమధు తులయా ऽనన్య భోగ్యత్వ మిచ్ఛన్
షడ్భి స్స్వం పంచమాద్యైరనితర గతితా మాచచక్షే మునీంద్రః ॥

శఠకోపమునులు తమ శ్రీముఖ సూక్తి ప్రబంధము లోని మొదటి పదియందు శ్రియఃపతియొక్క ఉపాయత్వమును (వణ్ పుగళ్ నారణన్ తిణ్ కళల్శేరే 1.2.10,), రెండవ పది యందుపరమ ప్రాప్యత్వమును (నమ్ కణ్ణన్ కణ్ణల్లదు ఇల్లైయోర్ కణ్ణే 2.2.1.), మూడవ పదియందు పైన చెప్పబడినట్లు ప్రాప్యుడు, ఉపాయభూతుడునైన శ్రియఃపతి అత్యంత సుందరమైన దివ్యమంగళ విగ్రహము కలవాడని ప్రతిపాదించిరి. (ముడిచ్చోదియాయ్ 3.1.1.). నాల్గవ పది యందు తమ ప్రభువుయొక్క అనన్య భోగ్యత్వమును అనుభవించి (ఒరునాయగమాయ్ 4.1.1), అయిదవ పది మొదలుకొని ఆరుపదులలో తమ అనన్యగతిత్వమును కళైవాయ్ తున్బం కళైయాదొగ్రివాయ్ కళైగణ్ మత్తిలేన్ 5.8.8., తిరువేంగడత్తానే పుగలొన్టిల్లా వడియేన్ 6.10.10., ఎంగనే తరిక్కేన్ ఉన్నైవిట్టెన్నుమ్ 7.2.1., అరుళునిన్ తాళగళై ఎనక్కే 8.1.9., ముత్తవు ముణ్డపిరాన్ - తొణ్డరో మాయ్ ఉయ్యలల్లాల్ ఇల్లైకణ్డీర్ తుణైయే 9.1.1., కాళమేగత్తై యన్టి - మత్తొన్నిలంగతియే 10.1.1. అనుచు తెలిపిరి.

మొదటి పది సారాంశము:

3శ్లో॥ పరం నిర్వైషమ్యం సులభ మపరాధ ప్రసహనం
సుశీలం - స్వారాధం - సరసభజనం - స్వార్జవగుణమ్ ।
సుసాత్మ్య స్వానం ప్రద - మనఘవిశ్రాణన పరం
ముకుందం నిధ్యాయన్ మునిరధిజగా వాద్యశతకే ॥

ఈ శతకమున మోక్షప్రదాతయగు శ్రీమన్నారాయణుడే
1. పరాత్పరుడు - ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్ 1.1.1.
2. సర్వసముడు - పత్తిలనీశనుం ముత్తవుం నిన్నవన్ 1.2.6.
3. సర్వసులభుడు - పత్తుడైయడియవఱ్కుఎళియవన్ 1.3.1.
4. అపరాధములను క్షమించువాడు - మదియిలేన్ వల్వినైయే మళాదో 1.4.3.

5. అందరితో కలిసిమెలసి యుండువాడు. వళవే(ౘ్ఴ)లగిన్
ముదలాయ వనోరిత్తైయై 1.5.1.

6. సుఖారాధ్యుడు - నన్నీర్‌తూయ్ పురివదువుం పుగైపూవే 1.6.1.

7. ఆనందప్రదమగు సేవానిరతిని ప్రసాదించువాడు - వైప్పామరున్దామ్ 1.7.2.

8. ఋజుస్వభావము గలవాడు - కణ్ణావా నెన్జుం మణ్ణోర్ విణ్ణోఱ్కు 1.8.3.

9. తనతో సామ్యమును, ఆనందమును అనుగ్రహించువాడు - కణ్ణ పిరానెన్న ముదం...
ఎన్నుడై శూఴ్లులుళానే 1.9.1.

10. ప్రతిఫలాపేక్ష లేక మోక్షాంత ఫలములనను గ్రహించువాడు- ఎణ్ణిలుం వరుం
ఎన్ని వేణ్డువమ్ 1.10.2

అనుచు భగవద్గుణగానము చేసిరి.

4శ్లో॥ దికాభ్యాం ద్వ్యష్టాంఘ్రి ర్దురధిగమ నీతి స్థపుటితా
యదంత్యా మీమాంసా శ్రుతిశిఖర తత్త్వం వ్యవృణుత ।
తాదాదౌ గాథాభి ర్మునిరధిక వింశాభి రిహ నః
కృతీ సారగ్రాహం వ్యతరదిహ సంగృహ్య కృపయా ॥

బ్రహ్మసూత్రముల యందు నాలుగు అధ్యాయములు గలవు. అందు ప్రతి అధ్యాయమునకు నాలుగు పాదములు చొప్పున మొత్తము పదహారు పాదములు కలవు. ఇందు మొదటి రెండు అధ్యాయములను ప్రథమ ద్వికమని, తరువాతి రెండధ్యాయములను ద్వితీయ ద్వికమని వ్యవహరింతురు. ఇట్లు విపులమైనది దుర్గ్రాహ్య న్యాయములతో కూడినది అగు ఉత్తర మీమాంసా శాస్త్రము వేదాంత తత్త్వమును తమ తిరువాయ్ మొఴ్రి దివ్య ప్రబంధమున మొదటి పదియందు ఒకటి, రెండు దశకములలో సారరూపముగా కృపజేసిరి.

5శ్లో॥ పరత్వాద్వై రిత్థం పరిచరణసక్తో గుణగణైః
ప్రభుం సేవాయోగ్యం ప్రథమశతకే వీక్ష్య వరదమ్ ।
తమేవ స్వాత్మర్థ ప్రియ మథచ భోక్తుం వ్యవసితో
వరేణ్యత్వం తస్య ప్రథమ వరణీయం ప్రథయతి ॥

సర్వేశ్వరుడు పరత్వాది కళ్యాణగుణములచే సేవాయోగ్యుడు, వరదుడు అని మొదటి పదియందు బోధించి, ఆతని కైంకర్యమునందాసక్తులైన శఠకోపమునీంద్రులు తమకు అత్యంతప్రీతి పాత్రుడైన భగవానుని కళ్యాణగుణములను అనుభవింపదలచి అందు ప్రథమ గణ్యమైన ఆయనయొక్క సర్వోత్తమత్వమును తెలుపుచున్నారు.

రెండవది పది సారాంశము -

6శ్లో॥ ద్వితీయే కతిక్లేశక్షణ విరహా - ముత్తుంగలవితం
మిలత్ సర్వాస్వాదం - వ్యసనశమనం - స్వాప్తిముదితమ్ ।
స్వవైముఖ్యత్రస్తం - స్వజన సుహృదం - ముక్తిరసదం
స్వకైంకర్యోద్దేశ్యం - సుభగసవిధస్థం నిరవిశత్ ॥

ఇందు శ్రియఃపతి

1. తనతో క్షణకాల విరహము గూడ దుర్భరమని భక్తుల తలపింపజేయువాడు - మడనారాయ్.... నీయుమ్ తిరుమాలాల్ నెంజమ్ కోళ్పట్టాయే । 2.1.1.
2. అత్యంత లలితుడు - తిణ్ణన్ వీడు 2.2.1.
3. మధుర పదార్థములన్నియు కలసినట్లు ఆనందింపజేయువాడు - తేనుం పాలుం నెయ్యుం కన్నలు మముదమొత్తే 2.3.1.
4. దుఃఖమును శమింపజేయువాడు - నాడినాడి నరశింగా వెన్టుమ్ 2.4.1.
5. తమను (నమ్మాళ్వార్లను) పొందుటచే ఆనందించువాడు - ఎన్మడివు కాణాదే ఎన్నుళ్ కలన్దానై 2.5.8.
6. తాము అతనిపట్ల విముఖులగుదురేమోనని భయమొందువాడు- మణివణ్ణనే ఎన్పోల్లా త్తిరుక్కురళా వెన్నుళ్ మన్ని 2.6.1.
7. తమ వంశములో నెల్లవారిని అనుగ్రహించువాడు - కేశవన్ తమర్ కీళ్మే లెమతే రెళపిఅప్పుమ్ 2.7.1
8. మోక్షానందము నను గ్రహించువాడు - వీడు ముదలామ్ పుణైవన్ పిఅవిక్కడల్ నీన్దువార్కే 2.8.1.
9. తాము చేయు కైంకర్యమును స్వీకరించువాడు - ఎమ్మావీట్టు త్తిఅముమ్ శెప్పమ్ 2.9.1.
10. అందు కొఅకే అందమైన తిరుమాలిరుం శోలైమలై అనుదివ్య క్షేత్రమున వేంచేసియున్నవాడు - మాలిరుంశోలై......... శార్వదుశదిరే 2.10.1. అని ప్రస్తుతించినారు.

7శ్లో॥ ఉపాయత్వైకాంతం ప్రథమమిహ సేవ్యత్వ ముదితం
తతశ్చ ప్రాప్యత్వోపయిక మతి భోగ్యత్వ మవదత్।
ద్వయం తత్ స్వా సాధారణ తను విశిష్టస్య గణయన్
తృతీయే విశ్వేశం శుభసుభగరూపం కథయతి ।

మొదటి పదియందు ఉపాయత్వమునకు ముఖ్యముగా నుండదగిన సేవ్యత్వమును, రెండవ పదియందు ప్రాప్యత్వమునకు ఉపకరించు భోగ్యత్వమును ప్రతిపాదించి, పైరెండు గుణములును సుందరతర దివ్య మంగళ విగ్రహము కలవానికే

అనుచు, మూడవ పదియందు సర్వేశ్వరుని మనోహర మంగళకర రూపమును కీర్తించు చున్నారు పరాంకుశులు.

మూడవ పది సారాంశము-

8శ్లో॥ అనీదృక్ సౌందర్యం - తనువిహిత సర్గాది సుభగం
స్వసేవార్థాకారం - ప్రగుణవపుషం - మోహనతనుమ్ ।
అపశ్యత్ లబ్ధార్చావిభవ - మతిదాస్యావహతనుం
సదాదృశ్యం స్తుత్యాకృతి మఘవిరుద్ధాకృతి మిహ ॥

తృతీయ శతకమున శఠకోపమునులు పరమాత్మ యొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును ధ్యానించుచు ఆతనిని

1. అనుపమ సుందరుడు - ముడిచ్చోదియాయ్ 3.1.1.
2. జగత్సృష్టి గావించి అందముగా చూపట్టువాడు
మున్నీర్ ఞాలం పడైత్త ఎమ్ముగిల్వణ్ణన్ 3.2.1.
3. తాము చేయు సేవను స్వీకరించుటకే ఆకృతిని దాల్చినవాడు - తిరువేఙ్గడత్తు
ఎంద్దైతంద్దై తంద్దైక్కే - వఱ్ఱువిలా వడియై శెయ్యవేండుమ్ నామ్ 3.3.1.
4. అత్యుత్తమ గుణములతో నొప్పుదేహములుకలవాడు -పుగఱ్ఱు నల్లొరువ నెన్గో 3.4.1
5. అతిసుందర శరీరుడు - కైమ్మావుక్కరుళ్శెయ్‌ద కార్ముగిల్ పోల్ వణ్ణన్ కణ్ణన్ 3.5.1.
6. మన సేవలందుటకై అర్చారూపము నొందినవాడు - నెంజినాల్
నినైప్పాన్ యవన్ అవనాగుం నీల్కడల్ వణ్ణనే 3.6.9.
7. భాగవత పర్యంత కైంకర్యమొసగు దివ్యస్వరూపుడు - పయలుం
శుడరొళి మూర్తియై ప్పంగయ కణ్ణనై 3.7.1.
8. సర్వదాసేవ్యుడు - ముడియానే మూవులగుం తొఴుదేత్తుం శీర్ అడియేన్ 3.8.1.
9. స్తుతింపదగు రూపముతో నొప్పువాడు - ఎన్ వళ్ళల్ మణివణ్ణన్
తన్నైక్కవి శొల్ల వమ్మినో 3.9.5.
10. నిర్దుష్టమగు దివ్యాకృతితో భాసిల్లువాడు - తుక్కమిల్ ఞానచ్చుడరొళిమూర్తి 3.10.9.

అనుచు పలువిధములుగ గానము చేసిరి.

9.శ్లో॥ శ్రియ! కాంతో ఽనంత శ్శుభతను విశిష్టః ఫలమసౌ
ఫలావాప్తే ర్హేతు స్స్వయ మితి చ నిర్ధార్య శతకైః
ఇదానీం బుద్ధిస్థ క్రమత ఇహ యుక్త్యా మునివరః
ఫలత్వం తస్యైవ ద్రఢయతి తదన్యేషు విముఖః ॥

శ్రియః పతియే పరాత్పరుడు, ఉపాయభూతుడు, దివ్యమంగళ విగ్రహము గలవాడు

అని మొదటి మూడు పదులలో నిశ్చయించిరి. ఇతర విషయ పరాఙ్ముఖులైన శఠకోపసూరులు ఆ శ్రీమన్నారాయణుని పరమ ప్రాప్యత్వమును నాల్గవ శతకమున దృఢపరచుచున్నారు.

నాల్గవ పది సారాంశము -

10శ్లో॥ స్థిరైశ్వర్యం తుర్యే సహజ బహుభోగ్యం నిరవిశత్
మిథశ్శిష్టం - క్లేశావహసమిత తుల్యం - నిజజనమ్ ।
కృతార్థీ కుర్వంతం - ప్రణయి భిషజం - సద్బహుగుణం
స్వహేయం - స్వాపేక్ష్యం - స్వమతఫల ముచ్చైస్స్వవగతమ్॥

ఈ శతకమున లక్ష్మీనాథుని

1. శ్రీపాదములే మనకు నశింపని సంపద - ఒరునాయగమాయ్ 4.1.1.
2. సహజముగ పలువిధముల భోగ్యుడు - పాలనాయ్ ఏఱ్ఱు లగుండు పరివిన్రి 4.2.1.
3. తనతో కలసిమెలసి యుండువాడు - కోవైవాయాల్ పొరుట్టు ఎత్తినెరుత్తమిరుత్తాయ్ 4.3.1.
4. సంబంధి, సదృశ వస్తువులను చూచునపుడు బాధనొందించువాడు
మణ్ణైయిరన్దు తుఱ్ఱగావి 4.4.1
5. తమ వారిని ధన్యులగావించువాడు - ఇనియెన్నకుఱై యెఱ్ఱుమైయుమే 4.5.1.
6. తనను ప్రేమించువారి బాధలకు ఔషధము వంటివాడు - మాయప్పిరాన్
కళల్ వాఱ్ఱత్తినాల్। అదువే యివళుత్తేనోయ్క్కరుమరున్దాగుమే । 4.6.3.
7. అపరిమిత కళ్యాణగుణ సంపన్నుడు - శీలమిల్లాచ్చిఱియ నేలుమ్ 4.7.1. అనికీర్తించి,
8. భగవత్ప్రీతిపాత్రములుకాని ఆత్మ-ఆత్మీయములను విడువవలెను -
మాఱాళన్ కవరాద మణిమామై కుఱవిలమే 4.8.1.
9. భగవదనుభవము లేని ఈ దేహము కూడ ఉపేక్షింపదగినది
పణి కణ్ణాయ్‌శామారే 4.9.1.
10. అర్చామూర్తి కైంకర్యమే తమకు అభిమతమైన ఫలము - నుమ్ దెయ్వముమాగి నిన్హాన్ పొలిన్దునిన్నపిరాన్ కణ్డీర్ ఒన్ఱుం పొయ్యిల్లై పోత్తుమినే 4.10.5. అనియును ప్రబోధించిరి.

11శ్లో॥ ఉపాయత్వం యత్ర ప్రథమశతకేఽభావ్యత విభో
రనన్యోపాయ స్తద్దఢయతి పరం పంచమముఖైః ।
నిరీహస్త్రాదౌ నిరవధిక నిర్హేతుక దయా -
సరిత్స్రోతః పద్మం శరణయతి నాథస్య చరణమ్ ॥

సర్వేశ్వరుని విషయమున మొదటిపదియందు ప్రతిపాదించిన ఉపాయత్వమును, అయిదవ పది మొదలుకొని ఆరుపదులలో ధ్రువీకరించుచు, అనన్య గతికులు, విషయపరాఙ్ముఖులు అయిన వకుళభూషణులు ఈ అయిదవ పదియందు

నధిక దయయనెడి నదీప్రవాహము నందు వికసించిన అరవిందములవంటి ఆశ్రియః
యొక్క దివ్య చరణముల నాశ్రయించుచున్నారు.
ఐదవపది సారాంశము
శ్లో॥ దయానిఘ్నం - భక్తై రఘువిమథనం - ప్రేమజనకం
జగద్రక్షాదీక్షం - స్మృతిజుష - మహంభావవిషయమ్ ।
శరణ్యం దీనానాం - సర్వసకృత దాస్యా భ్యుపగమం
ప్రచఖ్యౌ తం ప్రాప్తం - ప్రశకనకృతం పంచమశతే ॥
ఈ శతకమున శఠకోపమునులు శ్రియఃపతిని
పరమదయాళుడు - మెయ్ మాలాయొழిన్దేన్ ఎమ్బిరానుం ఎన్మేలానే 5.1.7.
భక్తుల ద్వారా పాపములను హరింపజేయువాడు - కలియుం కెడుం కణ్డుకొణ్మిన్
కడల్వణ్ణన్ పూదఙ్గళ్ మణ్మేళ్ 5.2.1.
భక్తులకు తన విషయమున ప్రేమ జనింపచేయువాడు - నెంజప్పెరుం శెయుళ్
మర్ కాదల్ కడల్ పురయ వెళవిత్త 5.3.4.
జగద్రక్షణ సమర్థుడు - పారెల్లాముణ్డ నమ్పామ్పణైయాన్ 5.4.1.
తమ స్మరణమునకు విషయభూతుడు - తిరుక్కురుంగుడి నంబియై నాన్ కణ్డపిన్-
నిఱైన్దెన్నుళ్ళె నిన్ఱొழిన్దాన్ 5.5.8.
అంతర్యామియై తమను ఆయనగా భావింపచేయువాడు -
ల్ ఞాలం శెయ్దేనుం యానేయెన్నుమ్ 5.6.1.
దీన శరణ్యుడు - ఆఱెనక్కునిన్ పాతమే శరణాకత్తన్దొళిన్దాయ్ 5.7.10.
ఆనందముతో చేయు కైంకర్యము నంగీకరించువాడు -ఆరావముదే 5.8.1.
మన కైంకర్యమును స్వీకరించుటకు సంసిద్ధుడు - తిరువల్ల వాళఱైయుమ్ కోనాఱై
అడియేన్ అడికూడవదెన్నుకోలో 5.9.1.
సమర్థుడైయున్నను రామకృష్ణాద్యవతారములెత్తి సామాన్యుని వలె బహుకృత్యముల
ను వాడు - పిఱన్దవారుం వళర్న్దవారుమ్ 5.10.1.
యు స్తుతించినారు.
శ్లో॥ అనాద్యంతా నంద స్వరస కరుణాకంద జనితః
ప్రణేతుః వ్యాపారః ప్రపదన విపాకార్హ ఉదితః ।
తమాచార్యోపజ్ఞం చిరవిఘటిత స్వాత్మఘటన -
స్ఫురచ్ఛక్తిం షష్ఠే ముని రశరణో యాతి శరణమ్ ॥
అపరిమితానంద భరితము కరుణామూలకము అయిన భగవానుని
క్షము ప్రపత్తి చేతనే పొందదగినదని తెలిపి, నమ్మాళ్వార్లు ఈ ఆరవపదియందు

ఆచార్య సమాశ్రయణము ద్వారా పొందదగినవాడు, ఆత్మ సమర్పణముచే సాక్షాత్కరించువాడు అగు సర్వేశ్వరుని అనన్య శరణులై శరణు పొందుచున్నారు.

ఆరవ పది సారాంశము -

14శ్లో॥ గురుద్వారోపేయం స్వయమభిమతం వైరిఘటకం
చరిత్రైః కర్షంతం పరవిఘటనం స్వాన్వితహరమ్ ।
నిదానం ధృత్యాదేః ఘటకవశ భూతిద్వయ మగాత్
అవర్షాత్ వైఘట్యం - త్వ వికల శరణ్యస్థితి మిహ ॥

ఈ శతకమున సర్వేశ్వరుడు

1. ఆచార్యుని ద్వారా పొందదగినవాడు - కురుగినంగాల్ పెరుమానైక్కణ్డు - కైకళ్ కూప్పిచ్చొల్లీర్ వినైయాట్టియేన్ కాదన్మైయే 6.1.1.
2. సహజముగ ప్రియమైనవాడు - పోకునమ్బీ యున్తామరై పురై కణ్ణినైయుమ్ శెవ్వాయ్ ముఱువలుమ్ 6.2.2.
3. పరస్పర విరుద్ధ వస్తువులయందును అంతర్యామిగ నుండువాడు - నల్కురవుమ్ శెల్వం నరగం శువర్క్కముమాయ్ 6.3.1.
4. తన లీలాచేష్టితములచే భక్తుల హృదయములను దోచుకొనువాడు కుఱవైయాయ్చ్చివరోడు కోత్తదుమ్ 6.4.1.
5. ఆశ్రితులకు విశ్లేషమును కలిగించువాడు - ఇవళై ఉమక్కాశై యిల్లై అన్నమీర్ విడుమినో 6.5.1.
6. తన భక్తుల ఆభిజాత్యాదులను హరించువాడు - ఎన్ కొజ్గల రేలక్కుఱవి ఇలన్దదు శంగే 6.6.1.
7. ఆళ్వార్ల ప్రాణధారణకు మూలమైనవాడు - ఉణ్ణుంశోఱు పరుకునీర్ తిన్నుంవెత్తిలయు మెల్లాం కణ్ణన్ 6.7.1.
8. ఉభయవిభూతులను ఆచార్యునకు వశపరచినవాడు - పొన్నులగాళీరో పువనముழுదాళీరో 6.8.1.
9. ఆళ్వార్లకు తన విశ్లేషమును సహింపలేని దవను కలిగించినవాడు - ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో 6.9.5.
10. పొంగో పొంగముగా శరణు పొందదగినవాడు - అలర్మేల్ మంగైయురైమార్పా పుగలొన్నిల్లా వడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగున్దేనే 6.10.10.

అని కీర్తింపబడినవాడు.

15శ్లో॥ తదేవం షష్ఠాంతం విహిత సవిశేష ప్రపదనః
ఫలాలాభాత్ ఖిన్నస్త్వరిత హృదయ స్సప్తమశతే ।

అనిష్టోపన్యాస ప్రభృతిభి రనిష్ఠప్రశమనే
స్వతస్సిద్ధ్య చ్ఛీలం ప్రభు మభిముఖం సమ్ముఖయతి ॥

ఇట్లు విశేషముగ ప్రపత్తి జేసినను భగవత్కైంకర్య రూపమైన ఫలము సిద్ధింపక పోవుటచే ఖిన్నులై నమ్మాళ్వార్లు భగవత్ప్రాప్తికై త్వరపడుచు, ఏడవశతకమున అనిష్టములను తెలిపి, వాటిని తొలగించుటకు అరవిందాక్షుని అభిముఖునిగా చేసికొన స్తోత్రము చేయుచున్నారు.

ఏడవపది సారాంశము -

16శ్లో॥ సహన్ శార్వ్యాశంకా ముపశమితగర్హః ప్రకటయన్
స్వగోప్తృత్వం గుప్తిక్రమ మఖిలజంతు ప్రణయితామ్ ॥
శ్రితాక్రందచ్ఛేత్తా స్మరణవిశద శ్చిత్రవిభవః
స్తుతాయుంజన్ స్తోత్రవ్యసనజిత్ అదర్శి ప్రభువరః ॥

ఈపదిలో ఆశ్రితవత్సలుడగు శ్రీవత్సలాంఛనుడు

1. ఆళ్వార్లకు దుష్ప్రవృత్తి కలుగునను శంకను కల్గించువాడు- ఉణ్ణి లావియ ఐవరాల్ కుమైతీర్త్తు 7.1.1.

2. నిందను తొలగించువాడు - శెజ్గయల్ పాయ్నీర్ తిరువరంగత్తాయ్ ఇవళ్ తిరత్తెన్శెయ్గిన్ద్రాయే 7.2.1.

3. తన రక్షకత్వమును తెలుపువాడు - వెళ్ళచ్చురిశం గుడాళియేన్ది 7.3.1.

4. రక్షణప్రకారమును తెలుపువాడు - ఆழியొழி శంగుం విల్లుమెழி 7.4.1.

5. సకల ప్రాణులయందు తనకుగల ప్రేమ నుగ్గడించువాడు
శరాశరం ముత్తవుం నఱ్పాలుక్కుయ్త్తవన్ 7.5.1.

6. ఆశ్రితుల ఆక్రందనలను ఉపశమింపజేయువాడు - ఏత్తురుం వైకున్దత్తై అరుళుం నముక్కు 7.6.10.

7. ధ్యానమున ప్రత్యక్ష సమానాకారముగ భాసించువాడు ఏழையర్ ఆవియుణ్ణాం తామరైనాణ్ మలర్పోల్ వన్దు తోన్ఱుమ్ 7.7.1.

8. విచిత్రవైభవముతో నలరారువాడు - మాయా వామననే 7.8.1.

9. తనను స్తుతించునట్లు చేయువాడు - ఎన్నాల్ తన్నైఇన్ - తమిழ்పాడియవీశనై 7.9.1.

10. తనను స్తుతించుట వలన వీరికి కలుగుశ్రమను పోగొట్టువాడు
ఇన్బం పయక్క ఎழில్ మలర్ మాదరుమ్ తానుమ్ ఇవ్వేళులగై 7.10.1.

అని ప్రశంసింపబడినాడు.

17శ్లో॥ అథానిష్టాన్ పుంసాం స్వయముపజిహీర్షన్నపి విభుః
తదిచ్ఛాం బాహ్యేషు ప్రశమయితుకామః క్రమవశాత్ ।
నిజే చ్ఛాసంసిద్ధ త్రివధ చిదచిద్వస్తువితతిః

శ్రితేచ్ఛావైచిత్రీవశ ఇతి వదత్యష్టమశతే ॥

ఎనిమిదవ శతకమున సర్వేశ్వరుడు జీవులకు కలుగు అనిష్టములను పోగొట్టుదలంచుచు, వారికి క్రమముగ విషయ వ్యామోహమును శమింపజేయగోరి, చేతనాచేతనములను వశీకరించుకొనినవాడై, ఆశ్రితుల కోరికల వైచిత్రికి వశుడై యుండునని శఠకోపముని బోధించుచున్నారు.

ఎనిమిదవ పది సారాంశము-

18శ్లో॥ దిదృక్షాయాం దృశ్యః - ప్రభు రగణి నిస్సంగ సులభః
స్వవిశ్లేషైకాంతః - శ్రుత విహిత సౌష్క్యల్య విభవః ।
అపేక్షా సాపేక్షః - స్వవితరణ సజ్జో - హృది రతః
స్వదాస్యం - తన్నిస్థాం - తదవధి మపీహ ప్రకటయన్ ॥

ఇచట పరాత్పరుని

1. భక్తులకు సేవించు కోరిక కలిగిన వెంటనే సేవింపదగినవాడు
- కాణు మాఱరుళాయ్ 8.1.2.

2. విషయేచ్ఛ లేకుండు వారికి సులభుడు - శంగమ్ శరిన్దన శాయిళన్దేన్ తడములై పొన్నిఱమాయ్త్తళర్న్దేన్ 8.2.1.

3. తమ విశ్లేషదశలో తమనుకాదని ఏకాంతమందున్నవాడు -
-వరువార్ శెల్వార్ వణ్ పరి శారత్తిరున్ద 8.3.7.

4. సుప్రసిద్ధములగు జగత్సృష్ట్యాది లీలలను గావించువాడు - వార్ కడావరు వియానై మామలైయిన్ మరుప్పిణైక్కువిడిఱుత్తురుట్టి 8.4.1.

5. చేతనుల ప్రార్థనకై ఎదురు చూచువాడు - తామరైనీళ్ వాశత్తడంబోల్ వరువానే ఒరునాళ్ కాణవారాయ్ 8.5.1.

6. ఆశ్రితులకు తనను సమర్పించుకొనుటకు సంసిద్ధుడు -నల్లవరుళ్గళ్ నమక్కే తన్దరుళ్ శెయ్వాన్ 8.6.1.

7. తమ హృదయమందు నెలకొన్నవాడు - ఎన్దన్ కఱుత్తైయుఱ వీత్తిరున్దాన్ 8.7.1.

8. తాము గావింప వలసిన కైంకర్యమును తెలుపువాడు -
ఒరువనడియే నుళ్ళానే 8.8.1.

9. కైంకర్యనిష్ఠను తెలియజేయువాడు - తిరుప్పులియూర్ అరుమాయన్ పేరన్నిప్పేచ్చిలళ్ 8.9.1.

10. కైంకర్యమునకు పరమావధియగు భాగవతకైంకర్యమును ప్రకటించువాడు - అవనడియారడియే కూడు మిదువల్లాల్ విడుమాఱెన్బ తెన్నన్దో 8.10.1

అని ప్రస్తుతించినారు.

19శ్లో॥ అభీష్టం విశ్వస్మిన్ విషమఫలకాంక్షిణ్యా విషమం
ప్రయచ్ఛంతం దృష్ట్వా పరమపురుషార్థైక రసికః ।
నిరస్తాన్యాపేక్షో నిఖిల జగీదీశస్య నవమే
నిదానం సిద్ధీనాం నిరుపధి సుహృత్త్వం గణయతి ॥

అనర్థావహములగు ఫలములను వాంఛించు చేతనుల ఈప్సితములను నెరవేర్చు భగవానుని దలచి, పరమ పురుషార్థమగు భగవత్కైంకర్యము నందు ఆర్తిగల నమ్మాళ్వార్లు ఇతర వాంఛలు లేనివారై తమను అనుగ్రహించుటకు మూలకారణమగు సర్వేశ్వరుని నిరుపాధిక సుహృత్త్వమును తొమ్మిదవ పదియందు కీర్తించుచున్నారు.

తొమ్మిదవ పది సారాంశము -

20శ్లో॥ అభావ్యేకో బంధుః - చిరకృతదయ - శ్శీలజలధిః
స్వసంబంధాత్ గోప్తా - స్వగుణగరిమ స్మారణ పరః ।
అశక్యో విస్మర్తుం - ఘటకముఖ విస్రంభవిషయో
సుమజ్ఞాని - స్సిద్ధ్యున్ముఖ సమయ - ఇచ్ఛన్నవసరమ్ ॥

ఈ శతకమున పరాంకుశమునులు పరమాత్మైక శరణులై ఆ పరమపురుషుడే -

1. మనకు ఏకైక బంధువు - ముత్తవు ముణ్డపిరాన్ తొణ్డరోమాయ్ ఉయ్యలల్లో ఇల్లై కణ్డీర్ తుణ్డైయే 9.1.1.

2. అనాదిగ తమపట్ల దయజూపువాడు - మెల్లడియైక్కొడు - విన్నైయేనుం పిడిక్క నీ యొరునాళ్ కూవుదల్ వరుదల్ శెయ్యాయే 9.2.10.

3. సౌశీల్యగుణ సముద్రుడు - శీలమెల్లయిలాన్ 9.3.11.

4. తనతోడి సంబంధమును బట్టి రక్షించువాడు - అడియానివనెన్ఱు ఎనక్కారరుళ్ శెయ్యుం నెడియానై 9.4.10.

5. తన కళ్యాణ గుణౌన్నత్యమును గుర్తింపజేయువాడు - శిఱుకిళిప్పైదలే, నిన్ వెయ్యవా యొక్కుం వాయన్ నిన్ పశుం శామ నిఱత్తన్ 9.5.6.

6. విస్మరింప శక్యముగానివాడు - పెరుగుమాల్ వేట్కైయుమ్ ఎన్శెయ్‌గేన్ తొండనేన్ 9.6.1.

7. ఆచార్యుని ద్వారా తప్పక పొందదగినవాడు - శెంగాల మడనారాయ్ ఎన్కుడక్కూత్తర్కైన్ నుమరోడే 9.7.1.

8. అనుకూలవతియగు శ్రీదేవికి భర్తయగువాడు - కొడియేరిడై కోగనగత్తవళ్ కేళ్వన్ 9.8.2

9. అభీష్టసిద్ధి సమయమును కల్పించువాడు - మాలైయుం వన్దదు మాయన్ వారాన్ మామణి పులమ్బవల్లేరణైన్ద 9.9.10.

10. ఆశ్రితులను బ్రోచు అవకాశమునకై పరీక్షించువాడు మాలైనణ్ణి తొల్గదెల్గమినో విన్నైకెడ 9.10.1

అని ఆనతిచ్చిరి.

21శ్లో॥ ఉదంత్తై రిత్యేవం నిరుపధిక సౌహార్దపిశునైః
ఉదన్యా ముద్వేలా ముపజనితవంతం నిజపదే ।
త్రివర్గా తిక్రాంత స్థిరనగర ఘంటాపథగతేః
సహాయీ కుర్వాణ శ్చరమశతకే విందతిమునిః ॥

ఈ విధముగా తనయొక్క అవ్యాజప్రేమను సూచించు గాథలద్వారా తనను పొందు విషయమున ఆర్తిని అతిశయింపజేసినట్టి సర్వేశ్వరుని, తాము చరమ పురుషార్థస్థానమైన శ్రీవైకుంఠమును గూర్చివెడలుటకు రాజమార్గమగు అర్చిరావిది మార్గమున తమకు సహాయకుడు అగుటకు చివరిదియగు ఈ పదవపదిలో నమ్మాళ్వార్లు ప్రార్థించుచున్నారు.

పదవపది సారాంశము -

22శ్లో॥ గతిం వ్యధ్వక్లేశచ్ఛిద మపదశంకాస్పదరసం
భజద్భిః సుప్రాపం - వివిధ భజన ప్రక్రియ మిహ ।
ఫలే తీవ్రోద్యోగం - స్వవిషయకృతాత్యాదర మగాత్
యదృచ్ఛాతుష్టం - సత్సరణి - మపునర్జన్మ సయుజమ్ ॥

ఈ శతకమున భగవదనుభవైక చిత్తులైన పరాంకుశమునులు ప్రాప్యుడగు శ్రీమన్నారాయణుడే తమకు ప్రాపకుడని భావించుచు

1. సర్వేశ్వరుడే మనకు కాళమేగత్తై యన్ని మత్తానిలంగతిమే 10.1.1.
2. చెడు మార్గములలో పడి అనుభవించు బాధలను పోగొట్టువాడు
కెడుమ్ ఇడరాయ వెల్లామ్ కేశవావెన్న 10.2.1.
3. అస్థానమున భయమును కలిగించువాడు - మామణివణ్ణా ఉన్శెంగమలవణ్ణా - మెన్మలరడి నోవనోవనీపోయ్ -
అమగిళ్న్దుగన్ద వైమేయ్క్కిన్టున్నోడు అశురర్గళ్ తలైప్పెయ్యిల్ యువంగొలాంగే 10.3.7.-
4. సేవించువారికి సులభ ప్రాప్యుడు - పణినెంజే నాళుం పరమపరంపరనై - పిణియొన్డుం శారా పిఱవికెడుత్తాళుమ్ 10.4.7.
5. వందన కీర్తనాద్యనేక విధములైన సేవలద్వారా ప్రాప్యుడు-
ఎణ్ణుమ్ తిరునామం తిణ్ణం నారణమే ।

అరవైత్తైయాన్ తాళ్వాయ్ మలరిట్టు నాళ్వాయ్ నాడీరే ।
పాడీరవన్ నామం వీడే పెఱలామే । 10.5. 1,4,5.

6. మోక్షఫలము నొసంగుటకు సంసిద్ధుడు - అఱ్ఱియానరుళ్ తరువానమై గిన్నాన్ 10.6.1.

7. తమను మిక్కిలి ఆదరముతో గాచువాడు - ఎన్నెంజు ముయిరు మవైయుండు తానేయాగి నిఱైన్దానే 10.7.1

8. యాదృచ్ఛికస్మరణ మాత్రము చేతనే సంతుష్టి నొందువాడు తిరుమాలిరుం శోలమలై యన్దేనెన్న తిరుమల్ వన్దు ఎన్నెంజు నిఱైయప్పుగున్దాన్ 10.8.1.

9. అర్చిరాది మార్గ గమ్యుడు - శూఴ్విశుమ్బణి ముగిల్ తూరియ ముఴక్కిన 10.9.1.

10. పునర్జన్మ రాహిత్యమును కల్పించి తనతో సాయుజ్యమును అనుగ్రహించినవాడు - ఎన్నవావఱచ్చూఴ్న్దాయే 10.10.10.

అని అనుగ్రహించినారు.

23శ్లో ॥ పరం ప్రాప్యం పశ్యన్ పరిచరణహేతుం విగణయన్
పరిష్కుర్వన్నా జ్ఞా మనితర శరణ్యా శ్శరణయన్ ।
అనిష్టప్రధ్వంస ప్రభృతిషు నిదానం చ కథయన్
ముహుర్దేవం లక్ష్మ్యా సహిత మిహ భేజే మునివరః ॥

ఈ తిరువాయ్ మొఴిదివ్య ప్రబంధమున శఠకోపమునివరులు పరమాత్మను ప్రాప్యునిగ భావించి కైంకర్యహేతువులను కటాక్షించి, సర్వేశ్వరుని యాజ్ఞను నిర్వచించి, తదేక శరణులై ఆతని సన్నిధిలో శరణాగతిచేసి, అనిష్టనివారణకు అభీష్టప్రాప్తికి ప్రధాన కారణమును ప్రబోధించి, లక్ష్మీసమేతుడగు నారాయణుని సేవించినారు.

24శ్లో॥ పురా శోక శ్శ్లోకో ఽభవదితి నయాదిత్యుపనిషత్
మునేః పుణ్యశ్లోకాదజని వరభక్తేః పరిణతిః ।
వ్యపోహ్యా స్వంభావం హరిచరణ సంతానకలికామ్
అవిక్షత్ యోగీ యస్తను మతనుకారుణ్యావివశః ॥

పూర్వకాలమందు (త్రేతాయుగమున వాల్మీకి - మహర్షియొక్క) శోకము శ్లోకముగా నుద్భవించినట్లు, ఈ దివ్యప్రబంధము పుణ్యచరితులైన శ్రీశఠ కోపమునుల ముఖమునుండి వారి మిక్కుటమైన భక్తియొక్క పరిణామముగా అవతరించినది. దీనికి ఫలముగా ఈ మునివరులు సర్వేశ్వరుని అపారకారుణ్యమునకు ముగ్ధులై తమ స్వాతంత్ర్యభావనను వీడి శ్రీమన్నారాయణుని చరణములయందు సమర్పింపబడిన సంతాన కుసుమము వంటి అప్రాకృత దివ్యదేహమును పొందిరి.

25శ్లో॥ సతా మిత్థం సారం ద్రమిడనిగమ స్యాన్వకథయత్
బహూనాం విద్యానాం బహుమతి పదం వేంకటపతౌః ।
దిశా సౌధశ్రేణీ దృఢఘటిత జైత్రధ్వజపటీ -
పరామర్శ భ్రశ్యత్ ప్రతిమత నిరాబాధ నిగమః ॥

అనేక శాస్త్రములయందు బహుమానపాత్రులయినవారు, వేదవిరుద్ధమతములను ఖండించి వైదిక ధర్మమును ఉద్ధరించి, నలుదిక్కుల జయపతాకలను స్థిరముగ నెగురవేసి తమకీర్తిని చాటుచున్నవారు అయిన వేంకటనాథులు సత్పురుషుల కొఱకు ద్రమిడ ప్రబంధ సారమును ఈ విధముగా ప్రబోధించిరి.

26శ్లో॥ మనువ్యాస ప్రాచేతస పరిషదర్వా క్వచిదియం
సుధాసిక్తా సూక్తిః స్వయముదయ మన్విచ్ఛతి జనే ।
నిరుంధ్యుః కే వింధ్యాచలవికట సంధ్యానట జటా
పరిభ్రాంతా పంగోరుపరి యది గంగా నిపతతి ॥

మను వ్యాస వాల్మీకి ప్రభృతులు అనుగ్రహింపదగిన అమృత మయమగు ఈ కవిత నా వంటి సామాన్యుని నుండి ఉద్భవించినది. శివజటాజూటమున సుడులు తిరుగుచున్న పావన మందాకినీ నది ఒక కుంటివానిపై ప్రవహించినచో ఆపగలవారెవ్వరు. అవ్యాజము, నిరంకుశమునగు భగవంతుని అపారకరుణచే తాము ఈ ద్రమిడోపనిత్సారమును వచింపగలిగితిమి అని భావము.

శఠారి మునివరేణ్యులు తమ తిరువాయ్మొళ్ళిదివ్య ప్రబంధమందు భగవత్కళ్యాణ గుణానుభవము చేయుచు, పరమార్థ స్వరూపము నానతీయగా, అట్టి శ్రీముఖసూక్తి ప్రబంధ సుధారసగుళికలను కవితార్కిక కేసరులైన శ్రీమద్వేంకటనాథ దేశికులు తమజ్ఞాన పీఠికపై కవితా ప్రతిభతో రంగరించి, ప్రపన్నజన ప్రపంచమునకు అనుగ్రహించినారు. అట్టి ఉపనిషత్సారౌషధమును అస్మదాదులు సేవించి, ఉజ్జీవింపగలుగుటకు హేతువు ఆచార్యనిర్హేతుక కృపయేగాని వేరొకటి కాజాలదు.

కవితార్కిక సింహాయ కళ్యాణగుణశాలినే ।
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః ॥
"ఆచార్య శ్శరణం మమ"

శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః

# పెరియ తిరువన్దాది - శ్రీనమ్మాళ్వార్ల అనుభవము.

ఉ.వే.శ్రీమాన్.కిడాంబి వేంకటాచార్యస్వామి
నరసాపురం

శ్లో॥ నన్యానంతాంఘ్రి నలినయుగ్మే కర్తా లోకార్తి కబళ నానామ్।
భద్రాయ ద్రావిడ నిగమానాం ద్రష్టా పాష్టాయ వకులభృత్ స్వాత్॥

భగవన్నిర్హేతుక కృపాలబ్ధ సర్వజ్ఞత్వ భద్రులు ప్రపన్న జనకూటస్థులు నయిన నమ్మాళ్వార్లు భగవదనుభవ పరీవాహరూపముగా ననుగ్రహించిన దివ్య ప్రబన్ధములు (1) తిరువిరుత్తము (2) తిరువాశిరియం (3) పెరియ తిరువన్దాది (4) తిరువాయ్‌మొழ்ழி అనునవి.

వానిలో ఋగ్వేద సారమైన తిరువిరుత్తంలో ఆళ్వార్లు భగవదనుభవమునకు విరోధులైన శరీరాత్మభ్రాన్తి, దాని వలన చేయబడు దుష్కర్మ తత్ఫలితముగా సిద్ధించు శరీరము (పొయ్‌నిన్ఱ జ్ఞానముం, పొల్లావొழுక్కుం, అழுక్కుడమ్బుం) అనువానిని తొలగించ వలసినదిగా గ్రంథాదియందే శ్రియఃపతిని ప్రార్థించి గ్రంథాంతమున "తిరుమాల్ తిరుప్పేర్ వల్లార్ అడిక్కణ్ణి శూడియ - పిఱప్పార్ - పొయ్‌న్నిలత్తే" భగవన్నామములను ధ్యానము చేయు భక్తులకు దాసులైన వారికి పునర్జన్మ లేదని ముగించినారు.

ఆళ్వార్ల ఈ అనుభవము, కైకేయి "రాజన్" అని తనను సంబోధింపగనే భరతునికి కల్గిన స్థితి వంటిది - రాజు అనగానే ప్రకృతి సంబంధ శరీరము, తానికి తగిన స్వాతంత్ర్యము, భగవానునికి దూరమగుట జరిగి ఆత్మనాశనము పర్యంతము సిద్ధించును అని భరతుని ఆశయము.

యజుర్వేదసారమైన తిరువాశిరియమున "జాగృవాగ్ంసః సదాపశ్యన్తి" "ఉణ్డోకణ్గళ్ తుంజుదలే" అను రీతి నిత్యముక్తులచే సదా అనుభవింపబడు భగవానుని దివ్య మంగళ విగ్రహ సౌన్దర్యమును నాగ పర్యకమున యోగనిద్రాముద్రితుడైన స్వామి విషయముగా ననుభవించినారు.

ఆళ్వార్ల ఈభావన, "ఏభిశ్చ సచివైస్సార్థం" అనురీతిగా భావించి చిత్రకూటమున వేంచేసియున్న శ్రీరామచంద్ర స్వామిని అయోధ్యా నగరమునకు తోడితెత్తును అను భరతుని భావన వంటిది.

ఇక నాల్గవ దివ్య ప్రబన్ధము సామవేద సారమైన తిరువాయ్‌మొழ்ழிలో ఆళ్వార్లు తాము శ్రియఃపతి విషయమున ఆశపడిన నిత్యకైంకర్యమును భగవానుని కటాక్షముచే పరిపూర్ణముగా పొంది కృతకృత్యులైన పద్ధతిని విస్తరముగ అనుభవించినారు.

ఆళ్వార్ల ఈ యనుభవము పట్టాభిషేకానంతరము "తతోఽభ్యషించత్ భరతం మహాత్మా" అన్నట్లు

శ్రీరామచంద్రస్వామి కటాక్షమునకు భాజనమై తన పారతంత్ర్యమునకు తగినట్లు ప్రవర్తించిన భరతుని స్థితి వంటిది.

ప్రస్తుతము అధర్వణ వేదసారమైన పెరియతిరువన్దాది విషయము వివరింప వలసియున్నది.

ఈ పెరియ తిరువన్దాది 87 పాశురములతో విలసిల్లు అత్యద్భుత దివ్య ప్రబన్ధము.

ఇందలి పాశురములన్నియు ముక్తక పద్ధతిలో ననుగ్రహింప బడియున్నవి. మాధుర్య ప్రసాద గుణములకీ పాశురములు పుట్టినిల్లు.

ఇక "పెరియ తిరువన్దాది" అను దివ్య ప్రబన్ధనామమును గూర్చి కొంత తెలిసికొన వలసియున్నది.

పూర్వ పాశురమునందలి చివరి పదముతో తరువాతి పాశురము ప్రారంభమగుట అంతాది అను దానిచే తెలియుచున్నది.

ముదల్ తిరువన్దాది మున్నగు దివ్య ప్రబన్ధములకు సంఖ్యావాచకములు విశేషణములుగా కూర్పబడి, ముదల్ తిరువన్దాది, ఇరండాం తిరువన్దాది ఇతోదిగా వ్యవహరింప బడుచున్నవి.

కాని ఈ అన్తాది ప్రబంధమునకు పెరియ అనగా పెద్ద అను విశేషణము కూర్పబడినది. దీనికి ముఖ్యముగా ఒకటి రెండు పద్ధతులతో స్వారస్యమును గ్రహింపవచ్చును. (1) స్వారస్యములో గొప్పది - (2) ఆళ్వార్లు భగవానునితో "నీవు గొప్పవాడవా? నేను గొప్పవాడనా? అని వాదులాడి తమ ఉన్మస్తకానందమును ప్రకటించుటచే - గొప్పది.

స్వారస్యములో గొప్పవియనుట అను ప్రత్యేకత దివ్య ప్రబన్ధ సాధారణ విషయమైనను ఈ పెరియ తిరువన్దాది ప్రబన్ధములో స్వారస్యాతి శయము ప్రతిపాధురమున ఆస్వాదనీయముగా నుండును.

కొన్ని ఉదాహరణములు

(1) ఇత్తైముత్తైయాన్ శేవడిమేల్ - (61పా)

ఆకాశమునందు ప్రకాశించు నక్షత్రములు, స్వామియైన భగవంతుడు ఊర్ధ్వ లోకాల్ని కొల్చినపుడు, అచ్చటి వారందరు గుమిగూడి స్వామి శ్రీచరణములపై వేదోక్త విధితో సమర్పించిన పుష్పముల వలె నున్నవి.

"జ్యోత్స్నాంబునేందుకుంభేన తారా కుసుమ శారితం" రాత్రియనెడి కన్య చంద్రుడనెడి కడవతో వెన్నెల అనెడి నీటితో ఆకాశపు తోటను తడపగా, అచ్చట పూచిన పుష్పముల వలె నక్షత్రములు ప్రకాశించుచున్నవి. అనెడి లౌకిక సారస్వతము లోని భావమునకు పై ఆళ్వార్ భావనకు గల తేడాను గ్రహింప వచ్చును - రెండిటి యందును రూపణము సమాన మైనను, ఆళ్వార్ల భావన ఆత్మ ధర్మమైన శేషత్వముతో కూడినది - ఈ సారస్వత భావన కేవలము చమత్కారముతో గూడినట్టిది.

పై పాశుర హృదయమును సంసారులు శబ్దాది విషయములను వీడలేనట్లు ఆళ్వార్లు భగవద్విషయమును వీడజాలరని "శిటియాచ్చాన్" అను ఆచార్యులు సాయింతురట" అనునది.

**(2) మీనెన్నుంకంబిల్ (62పా)**

ఆకాశమనునది ఒక పెద్దగొడుగు - దానికమ్ములు వరుసగానున్న నక్షత్రములు. చంద్రుడు కామకు అమర్చబడిన వెండివలయము - ఛత్రమునకు కాడ ఊర్ధ్వలోకాల్ని కొలిచిన నీలరత్న మయమైన (సదృశమైన) స్వామి శ్రీపాదము - ఇట్టి స్వామియే సంసార తాప నివారణమునకు మహౌషధము - "ఛత్రము బాహ్యతాపమును మాత్రమే పోగొట్టును. స్వామి శ్రీపాదము బాహ్య, ఆంతర తాపములను రెండిటిని పోగొట్టును" అనునది ఇందలి స్వారస్యము.

**(3) పిన్ తురక్కుం (63 పా)**

వెనుక నుండి ముందునకు త్రోయు గాలికి ఒక నీలమేఘము సముద్ర జలమును కంఠదఘ్నముగా పానము చేసి ఆకాశమున పోవుచు, గాలి ఆగిపోగా తిరిగి క్షీరసాగరమునకే వచ్చి చేరినది.

దీనిలో ఆళ్వార్లు శ్రీరామావతార క్రమమును వర్ణించి యున్నారు.

"భగవానుడు దేవతా ప్రార్థనచే శ్రీరాముడుగా అవతరించి, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి, వారి (దేవతల) కోరికలు తీరిన పిమ్మట క్షీరసాగరమున శయనించినాడు - అని ఈ పాశుర భావమును వంబిళ్లగారు అనుగ్రహించినారు.

ఇక పెరియ అను పదములోని రెండవ స్వారస్యము - ఆళ్వార్ల భగవానునితో వాదులాడి తమ ఆనందమును వ్యక్తము చేయుట - అనునది. "పువియుం ఇరువిశుంబుం"(75పా)

రాక్షస సంహారము చేసిన చక్రాయుధము గలదేవా! భూమి, విశాలమైన ఊర్ధ్వలోకము(లు) నీలో ఇమిడియున్నవి - ఇట్టి విభూతి మంతుడవైన నీవు నా శ్రోత్రేంద్రియము ద్వారా (చెవి) లోన ప్రవేశించి స్థిరముగ నుంటివి.

అన్నిటిని నీయందు ఇమిడ్చికొని పెద్ద వాడవు (బ్రహ్మ) అని పేరొందిన నిన్ను శాశ్వతముగ నాయందు ఇమిడ్చికొన్న నేను పెద్దవాడనా? నీవు పెద్దవాడవా? "ఉళ్ళు" ఆలోచింపుము - "యార్ అఱివార్" నిన్ను పెద్దవాడవని పల్కువారెవరున్నారు? ఆలోచింపుము.

ఈ విధముగా ఆళ్వార్లు భగవానుని "యాన్ నీయెన్నుమఱుతలైత్తు" నీవా? నేనా? అని ఎదిరించి తమ ఉన్మత్తకానందమును ప్రకటించిన వారగుటచే ఈ దివ్య ప్రబన్ధమును పెరియ అను విశేషణముతో వ్యవహరించుట సర్వథా సమంజసము.

పూర్వము పేర్కొన బడినట్లు, ఆళ్వార్లు ఈ దివ్య ప్రబన్ధమున, భరతుడు పదునాల్గు సంవత్సరములు రామాగమన కాంక్షతో, శ్రీరాముని గుణములను అనుభవించుచు కాలక్షేపము చేసినట్లు స్వామి దివ్యమంగళ విగ్రహ దివ్యాత్మ గుణములతో ఆశరెట్టింపుకాగా అనుభవించుచు కాలక్షేపము చేసినారు.

దాని సంగ్రహ ప్రకారమిట్లు.

"మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధ మోక్షయోః" అన్నట్లు మనుష్యులు సంసార బన్ధమున స్థిరముగా నుండుటకు - మోక్షము నొందుటకు వారి మనస్సు మాత్రమే కారణమనుటచే, ఆళ్వార్లు మొదటి పాశురముననే "ముయత్తి - - - మున్దుత్తనెంజే" నాకంటె ముందుగ భగవంతుని గూర్చిన ప్రసంగమున ఉత్సాహమును జూపిన ఓమనసా! నీ సహకారముతో "నల్పూవై పూ-ఈన్ద వణ్ణన్ పుగఝ్" చక్కని అగిసెపూల వర్ణము గల భగవంతుని కల్యాణ గుణములను స్తోత్రము చేయుదును" అని తమ ఆశను తెలిపిరి. "నెంజమే నల్లనల్లై" మనసా! బాగుబాగు. అని భగవద్విషయమున తమ ఆశను ఆళ్వార్లు ప్రకటించుచుందురు.

పరకాల సూరి కూడ "నల్లనెంజే" అనియు (మంచి మనసా) "వానవర్ తంగళ్ శిన్దైపోల ఎన్నెంజమే" నిత్య సూరుల ఆలోచనవలె, అన్య పర్యము లేక భగవద్విషయముననే ఆసక్తమైన ఓమనసా!" అని మనస్సును ప్రశంసించు చుందురు. ఇట్లే మిగిలిన ఆళ్వార్లు కూడ.

తమకంటె మనస్సును వేరు చేసి సంబోధించుట ఆళ్వార్ల శ్రీసూక్తి లోని చమత్కారము.

ఇంతలో ఆళ్వార్లకు "నిత్య సంసారులమైన మనము నిత్య సూరి నాయకుని స్తుతించిన" నిందించినట్లే స్తోత్రము మానుకొన్న నిందింప నట్లే అను భావన కల్గినది - వెంటనే ఇంతకును స్వామిని స్తుతించుటకును, మానుటకును నాకేమి శక్తి గలదు - అది స్వామి కృత్యము గదా! అని తలంచి ఉదాసీనులైరి - స్వామి ఊరకుండునా! వెంటనే స్వామి ఆళ్వార్లకు తమతో గల నిరుపాధిక సంబంధమును తెలిపినాడు - అంత ఆళ్వార్లు "పెత్తతాయ్ నీయేపిఅప్పిత్త తన్దైనీ" కన్న తల్లివి, జన్మనిచ్చిన తండ్రివి నీవు కదా! అని భావించినారు. కావున భగవానుని "మాతృదేవోభవ, పితృదేవోభవ" ఇత్యాదిగా భవించి స్తుతింపవలసిక కృత్యము ఆళ్వార్లది - తల్లిదండ్రులు సంతానము మాటలలో దోషములను జూతురా! ఇంత మాత్రమే గాక జ్ఞానమును ఉపదేశించిన ఆచార్యుడు గదా భగవానుడు - కావున భగవానుని స్తుతించుటకు ఆళ్వార్లు ఉపక్రమించినారు - భగవానుని మన శక్తితో స్తుతింపలేము, భగవానునికి మనము అక్కఅలేదు అని ఆర్తితో బాధపడుచు స్తోత్రము చేయుట భక్తుల భావనలోని యొక విలక్షణ భావన. దీనిని భగవానుడు ఎల్లప్పుడును కోరుచుండును.

ప్రకృతమను సరామః.

ఆళ్వార్లు భగవానుని దివ్య మంగళ విగ్రహమును ఇట్లు అనుభవించుచున్నారు.

**(1)** "కొణ్డల్తాన్ **(49పా)** మేఘములను, కొండలను, సముద్రమును, చీకటిని, అగిసెపూవును, ఇంకను శ్యామల వర్ణముగల పదార్థములను జూచినపుడు నామనస్సు నన్ను వీడి స్వామి వంకకు పరుగు పెట్టుచున్నది-" ఇంతకును మేఘములు స్వామి శరీర కాంతిని పొందుటకు "ఎజ్గెపుక్కు ఎత్తవంశెయ్ దిట్టనకొల్" ఏదేశములకు వెళ్లి ఏమి తపస్సు చేసినవో" అనిస్వామి తిరుమేని కాన్తిని భావన చేసినారు.

ఇట్టి "కార్కలన్ద మేనియాన్"(86పా) నీలమేఘశ్యాముడు, చక్రాయుధుడు, ప్రళయమున చరాచరములను తన ఉదరమున ధరించి కాపాడినవాడు, అయిన స్వామి "శార్కులన్ద శౌల్ నినైన్దు" కల్యాణ గుణములతో కూడిన వాక్కులతోనే మనము ఘోర సంసార తాపమును పోగొట్టుకొనవలెను.

పిమ్మట ఆళ్వార్లు భగవానునికి గల ఆశ్రయణ సౌకర్యాపాదకములు, ఆశ్రిత కార్యాపాదకుములు అయిన కల్యాణగుణములనిట్లను భవించుచున్నారు.

"పూర్వము పూతన తెలివి మాలినదై స్వామిని చంపదలంచి విషముతో గూడిన స్తన్యమును స్వామికి ద్రావించినది - లోకగురువైన స్వామికి ఆవిషస్తన్యమే మిక్కిలి రస్యమై పరిణమించినది - (స్తన్యంతద్విష సమ్మిశ్రం రస్యమాసీత్ జగద్గురోః) పూతన దోషమునే గుణముగా స్వీకరించి స్వామి తన వాత్సల్యమును ప్రకాశింపజేసినాడు. ఓ మనసా! ఇంతకును నీవు పూతనకు ఏమగుదువు? ఆమెకు గల తెలివిపాటిది కూడ నీకు లేదే!" పూతన విషమిశ్ర స్తన్యమును స్వామిచే త్రాగించినది కాని తాను త్రాగలేదు - కాని నీవు మాత్రము సాక్షాత్ విషమైన శబ్దాది భోగములనే అనుభవించుచు ఆత్మనాశనము నొందుచున్నావు. ఇప్పటికైనను తెలివి తెచ్చుకొని స్వామిని ఆశ్రయింపుము. స్వామి తన వాత్సల్య గుణముతో నిన్ను స్వీకరించును". భగవానునికి వాత్సల్య గుణముతో బాటు స్వామిత్వము అను మరియొక గుణము గలదు. దానిని ఆళ్వార్లు ఇట్లు భావించుచున్నారు.

"సువర్ణ కిరీటధారి, సహస్రనామ వాచ్యుడు సకల తేజః పదార్థములను తనయందు లయింపజేసి కొనిన సుదర్శనాయుదుడు స్వామి (ఇవన్నియును స్వామిత్వమునకు సూచకములు)

ఇట్టి భగవానుడు "పారుండాన్"(42పా) ప్రళయమున భూమిని మ్రింగి, సృష్టికై భూమిని వెలిగ్రక్కి వరాహావతారమున అండభిత్తినుండి భూమిని ఎత్తి త్రివిక్రమావతారమున కొలిచి తన స్వామిత్వమును ప్రకటించియున్నాడు - (తన సొత్తును కాపాడుకొను వాడు గదా స్వామి) కావున "అవైమత్తు ఒరువర్కు ఆవాన్‌పుగా" ఆ లోకములు శ్రీమన్నారాయణునికే తప్ప వేరెవ్వరికిని శేషభూతములు గావు.

తన స్వామిత్వమును జూచి భయపడనవసరము లేకుండ భగవానుడు "శీరాల్‌పిఱన్దు" (16పా) "గొప్పగా పుట్టి, గొప్పగా పెరుగక, వామనుడను పేరుతో వ్యవహరింపబడి, బలి ఔదార్యమునకు ఇంద్రుని కోరికకు తగినట్లు యాచకుడై బలియొద్దకు వెళ్ళి దానధారతో భూమిని పొందినాడు స్వామి. ఇది స్వామికి చెందినదే గదా! ఒకప్పుడు ఈ భూమిని తన ఉదరమున రక్షించి వెలిగ్రక్కిన వాడుగదా! స్వామి? దానిని యాచనచే గాని పొందలేడా" అని స్వామిని ఆళ్వార్లు ప్రశ్నించినారు.

"వనగిరీశ తవైవసతాకథం వరద వామన భిక్షణ మర్హతి" అని రస్యముగా ప్రశ్నించినారు కూరత్తాళ్వాన్

ఆకొలుచుటలో కూడ "నెటికఱుఅల్‌గళ్ తాళ్‌నిమిర్త్తి" గండపెండేరము దాల్చిన

పాదమును చాపికొలువగా అందలి మణులు విజయ ఘోషణలు చేసినవి "దూత్యేబలేర్విమధనే శకటస్యభంగే యాత్రోత్సవేషుచ విభోః ప్రతిపన్న సఖ్యా, వీరాయితాని" అని పాదుకాసహస్రమున శ్రీదేశికులవారు స్వామి అందెల శబ్దమును అనుభవించినారు - లోకులకు అన్యశేషత్వమును తొలగించి, తనపాదచ్ఛాయలో నుండగల్గినట్లు చేసిన తన కృత్యమునకే స్వామి మురిసిపోయినాడు. అప్పుడు స్వామిని ఆళ్వార్లు ఇట్లు ప్రశ్నించినారు "అడియాల్ పడికడన్దముత్తో, అదన్మేల్ ముడియాల్ విశ్భుళన్దముత్తో" "స్వామీ! భూమి యంతయు, నీపాదమున ఒదిగియున్నది - దానికి అన్య శేషత్వము తొలగినది అను సంతోషమా నీకు? స్వామిత్వము ప్రకటించుచు ఊర్ధ్వలోకాల్ని కిరీటము చే కొలిచిన సంతోషమా? తెలియకున్నారము"

అనగా నిత్యసూరులతో వలె స్వామి నిత్య సంసారులతో కూడ కలసి మెలసి యుండు స్వభావం గలవాడు - పరుమ సౌశీల్యం గలవాడు.

ఇంతియేగాక దర్శించి ఆశ్రయించుటకు సులభుడైన వాడు స్వామి.

"క్షీరసాగరశయనుడైన స్వామియే చక్కని ఉపాయం తెలిసిన వాడై "కుడంగళ్ తలైమీదు ఎడుత్తుక్కొండుశుఉల ఆడి" అనగా కృష్ణుడుగా అవతరించి భాండనృత్యమునకై కుండలను తలమీద కెత్తుకొని ఆకాశమున తిరుగనట్లు గుండ్రముగ నర్తించి "ఏత్తుమిన్ నమర్ గాళ్ ఎన్నుతాన్ కూడమాడు కూత్తనై (తిరువాయ్‌మొళి) నా దాసులారా! నేను జూపిన అపూర్వ నృత్యమును దర్శించి స్తుతింపుడు'' అని ఉపదేశించుచు తన సౌందర్యాన్ని ప్రదర్శించినాడు.

ఈ విధముగా ఆశ్రయించుటకు తగిన వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్యములే గాక ఆశ్రయించిన వారి అభీష్టములను నెఱవేర్చగల జ్ఞానశక్తులు గలవాడు స్వామి.

"కార్‌కలన్దమేనియన్ - పాంబణైయాన్" నీలమేఘశ్యాముడు, చేతధరించిన చక్రాయుధం గలవాడు, శేషశయనుడు స్వామి కైకలన్ద ఆళియాన్ అనుటచే జ్ఞానము వల్‌వైత్తాన్ (దృఢమైన ఉదరము గలవాడు) శక్తి పాంబణైయాన్ ప్రాప్తి పూర్తి గలవాడు. చేతనులారా! ఇట్టి స్వామి దివ్య మంగళ విగ్రహమును సేవించుచు, అతని కల్యాణ గుణములను స్తుతించుచు మీ దోషములను తొలగించుకొనుడు - కాలక్షేపమునకు ఇంతకంటె సన్మార్గము లేదు - "ఎప్పోధుం ఈ దేశాల్" నేను మీకు ఎల్లప్పుడును తెలుపు హితోక్తి ఇదియే'' అని పరమ దయాళువులైన ఆళ్వార్లు చేతనులకు హితవు పల్కి దివ్య ప్రబన్ధమును ముగించినారు. ఆళ్వార్లు అనుగ్రహించిన నాల్గు దివ్య ప్రబన్ధములు మూల మంత్రద్వయ చరమ శ్లోకముల వివరణలు అని పూర్వాచార్యుల నిర్వాహము.

అందు తిరువిరుత్తమున తోళి(చెలి) తాయార్(తల్లి) మగళ్(నాయికి) అను అవస్థాత్రయముచే - సంబంధజ్ఞాన - ఉపాయాధ్యవసాయ ప్రాప్యత్వరలు తెలుపబడినవి - ప్రణవ - నమః - నారాయణ శబ్దముల సారమిది - దాని వలన జీవాత్మకు గల అనన్యార్హశేషత్వ, అనన్య శరణత్వ - అనన్య భోగ్యత్వములు స్పష్టమగును.

రెండవ దివ్య ప్రబన్ధమైన తిరువాశిరియమున, నారాయణ శబ్దమునకు తత్పురుష బహుమ్రీహి సమాసములచే సిద్ధించు పరత్వ సౌలభ్యములు వివరింపబడినవి - ఎట్టనగా ఈ దివ్య ప్రబన్ధ ప్రారంభముననే స్వామి దివ్య మంగళ విగ్రహ శోభ, స్వామిలోకాల్ని సృజించి కాపాడి ప్రళయమున తన ఉదరమున దాచి రక్షించిన పద్ధతి వర్ణింపబడినది. కావున ఇది నారాయణ శబ్దము యొక్క అర్ధానుసంధానము.

ఇక నాల్గవ దివ్య ప్రబన్ధమైన తిరువాయ్‌మొழ்ிలో మొదటి మూడు పత్తులచే శ్రియఃపతి సన్నిధిలో నిత్య కైంకర్య ప్రార్ధనను తెలుపు ద్వయము నందలి ఉత్తర ఖండము తరువాతి మూడు పత్తులచే శ్రీపురుష కార పురస్సరముగానే నారాయణుని పాదార విందముల యందు శరణాగతి చేయవలెను. అనెడి పూర్వ ఖండార్ధము వివరింపబడినది - మిగిలి నాల్గు పదులచే నమః శబ్దము యొక్క అర్ధము విభిన్న పద్ధతులలో వివరింప బడినది.

మూడవ దివ్య ప్రబన్ధమైన పెదియ తిరువన్దాది చరమ శ్లోకార్ధమును వివరించుచున్నది.

ఎట్లనగా? మూల మంత్రము నందలి ప్రణవము జీవాత్మ పరమాత్మకు శేష భూతమని తెలుపుచున్నది. ద్వయ మంత్రము శ్రీదేవి పురుష కార పూర్వకముగ నారాయణుని ఆశ్రయించి ఆ మిథునమునకు కైంకర్యము చేయవలయును అని బోధించుచున్నది.

ఈ విధముగా శ్రియఃపతికి సేవ చేయవలసిన జీవాత్మ చైతన్య కార్యముగా స్వామి సేవలో ప్రవర్తింప వలెను అను విషయమును చరమ శ్లోకము ప్రకటించుచున్నది. ఈ విషయమును ఆళ్వార్లు గ్రంథ ప్రారంభముననే "మున్నుత్తనెంజే" నాకంటె స్వామి సేవకు ముందుగా నున్న మనసా!" అని మనస్సును సంబోధించి వ్యక్తము చేసినారు.

ఉపాయాంతరములు రక్షకములు కావు. స్వామి అనుగ్రహమే రక్షకము అను సర్వేశ్వరుని ఉపాయత్వమును "నెఱికాట్టినీక్కుదియో" అనగా ఉపాయాంతరములను జూపినన్ను నీనుండి దూరము చేయవా? అని ప్రశ్నించినారు. "నెఱివాశల్ తానేయాయ్ నిన్షానై" "ఉపాయోపేయత్వె తదిహతవత్త్వం" ఇత్యాది పరశ్శత ప్రమాణములు భగవానుడే ఉపాయము, ఉపేయము అని బోధించు చున్నవి.

ఇంతకును జీవాత్మ చైతన్య కార్యంగా చేయు దానిని మిషగా జేసికొని స్వామి చేతనుని స్వీకరించును - అను విషయమును "వరవాఱు ఒన్షిల్లైయాల్ వాழ்வு ఇనిదాల్" అనగా ఏ చేతనుడును కర్మజ్ఞానాది ఉపాయములలో ప్రవేశింపనవసరము లేకుండగనే వారి బాధ్యతను తానే స్వీకరించును - ఫలము కోరువాడు ఉపాయానుష్ఠానము చేయవలసియుండ అది అక్కఱ లేకుండగనే ఫలమును మాత్రము అతనికి ప్రసాదించును. కర్మజ్ఞానాదులు చేయవలసిన పని గాని, ఫలాపేక్ష గాని లేని భగవంతుడు పై భారమును నిర్వహించుట అను దానిని ఈ పాశురమున "ఉరువమాఱుమ్" తన స్వరూపస్వభావములను మార్చుకొని అని ఆళ్వార్లు అనుగ్రహించినారు.

ఈ విధముగా ఆశ్రయించిన చేతనునికి చెందిన పూర్వాఘ ఉత్తరాఘములు "అశ్లేష వినాశే" అన్నట్లు అతనికి అంటకుండ బోవును ఈ విషయమును "వానోమతీ కడలో మారుతమో" అను పాశురమున అనుగ్రహించి యున్నారు - అనగా వత్సాసురుని విసరి కపిత్థాసురుని (ఇరువురుని) సంహరించిన శ్రీకృష్ణుని శ్రీ చరణములను ఆశ్రయించిన పిమ్మట మా ప్రబలములైన పాపములు పంచ భూతములలో కలసి పోయినవా? ఒకవేళ అరణ్యావాసము చేసినవా? (వానప్రస్థము) వానికి ఫల ప్రదాన శక్తి లేదని భావము.

దీని వలన "అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి" నేను నిన్ను, నా కైంకర్యమునకు ప్రతిబంధకములైన సమస్త పాపముల నుండి విడిపింప జేతును అను గీతాచార్యుని వాగ్దానము ఫలించినట్లయినది-

ఇక "కార్ కలన్ద మేనియాన్ కైకలన్ద" ఇత్యాదిగా నీలమేఘశ్యాముడు చక్రధారి అగు స్వామి గుణానుభవముతోనే కాలక్షేపము చేయుదుము అని ఆళ్వార్లు చరమ శ్లోకములోని విషయములను ఈ దివ్య ప్రబన్ధము ద్వారా అనుగ్రహించినారు.

ఆళ్వార్ల శ్రీసూక్తులన్నియు వేదార్థ గర్భితములు. శాస్త్రార్థసార సమవాయ సమేధితములు అట్టి వానిని వివరించుట దాసునికి అసాధ్యము అయినను "వర్షబిన్దోరి వాబ్ధే సంబంధాత్ స్వాత్మలాభః"అను సూక్తి ప్రకారము ఆళ్వార్ల విషయమున. యత్కించిత్ వాచిక కైంకర్యము చేసికొని దాసుడు అబ్ధ సత్తాకుడైనాడు.

ఆళ్వార్ల తిరువవతార సంవత్సరమైన ఈ ప్రమాధి సంవత్సరమున ఆవిష్కరింపబడనున్న సంచికకు వ్యాసము వ్రాయవలసినదిగా (పెరియతిరువన్దాది) ఉ.వే.శ్రీమాన్ ఎన్.వి.ఎల్.ఎన్. రామానుజాచార్యులు వారు కోరినారు.

వారుచేయు శ్రీవైష్ణవ సంప్రదాయ సేవలో దాసునికి కూడ అన్వయించు భాగ్యము కల్గినందులకు మిక్కిలి ఆనందముగా నున్నది.

శ్లో॥ శ్రీనగర్యాం మహాపర్యాం తామ్రపర్ణ్యుత్తరేతటే।
శ్రీతింత్రణీ మూలధామ్నే శఠకోపాయ మంగళమ్॥



శార్ఙ్గ పాణి పెరుమాళ్

శ్రీరస్తు
శ్రీమతే రామానుజాయనమః

# పరాంకుశ నాయికా విరహము

ఉ.వే.శ్రీమాన్. కె.వి.వి. రాఘవాచార్యస్వామి
పాలకొల్లు

పరాంకుశ నాయిక భక్తికి సంతసించిన శ్రియఃపతి తనదివ్య స్వరూపమును సాక్షాత్కరింప చేసెను. దానిని సేవించిన యీామెకు బాహ్య సంశ్లేషాపేక్ష కలిగెను. కాని అది లభింపకపోయెను. ఆ అపేక్ష క్రమముగా విరహవ్యథగా మారెను.

లోకములో ప్రియుని వియోగముచే క్లేశపడు నాయిక ఉద్యానవనమునకు పోవుటయు, అచట కోకిల కలకూజితములు, మలయమారుతము, చంద్రుడు, మధుమాసము మొదలగునవి ఆమె విరహమును వృద్ధిచేయుటయు, నాయిక వానిని నిందించుటయు మనము కావ్యముల యందు చూచుచున్నాము.

అట్లే ఈ పరాంకుశ నాయిక కూడ భగవద్విశ్లేషము వలన జనించిన విరహవ్యథచే ఒక లీలోద్యానమున ప్రవేశించెను.

అది ఒక అసాధారణమైన ఉద్యానవనము. సముద్రతీరమునందున్నది. ఆ ఉద్యానవనములో గల 1. సారసపక్షిని, 2. క్రౌంచపక్షని, 3. ఘోషించుచున్న సముద్రమును, 4. మంద మారుతమును, 5. వర్షించుచున్న మేఘమును, 6. వృద్ధి క్షయములు గల చంద్రుని, 7. సమస్తమును కప్పివేయునట్టి చీకటిని 8. హెచ్చుచు తగ్గుచున్న ఉప్పుటేరును, 9. వెలుగుచున్న దీపమును చూచినది. వానికి గల వికారములన్నియు తనవలె భగవద్విశ్లేషముచే కలిగినవిగా తలపోసినది. ఆ గుణములు వానికి స్వభావసిద్ధములని గ్రహింపలేదు. భగవద్భక్తులు భగవంతుని గుణములను పుణికి పుచ్చుకొందురా అనునట్లు తాము వానికొరకు (సారసాదుల) దుఃఖించినారు. పరదుఃఖ దుఃఖిత్వమే కదా దయాపరుల లక్షణము.

ఈ విధముగా పరాంకుశ నాయిక విరహాగ్ని తప్తురాలు కాగా సర్వేశ్వరుడు నిలువలేకపోయినాడు. వెంటనే దర్శన మొసంగినాడు. పరాంకుశ నాయిక విరహము చల్లారినది. ఇకముందెన్నడు తనను విడచిపెట్టవద్దని ప్రార్థించినది.

నమ్మాళ్వార్లు క్రిందట దశకములో "ఉయర్వఱ ఉయర్నల ముడయవన్" అని ప్రారంభించి "కల్విహాయుమ్" అను వరకు సర్వేశ్వరుని పరత్వాది గుణములను ప్రకటించి సర్వశేషియైన ఆతని సర్వరక్షకత్వ ప్రయుక్తమైన ఉపాయత్వమును ప్రతిపాదించిరి.

అనంతరము ఈ శతకమున ఉపేయత్వమునకు తగిన ఆ సర్వేశ్వరుని నిరతిశయ భోగ్యత్వమును, ఆభోగ్యతచే క్షణకాల విశ్లేషముకూడ సహింపరానిదను విషయమును ఈ దశకమున వివరించుచున్నారు.

"రామ వ్యసన కర్శితాః" "అపి వృక్షాః పరిమ్లానాః స పుష్పాంకుర కోరకాః । ఉపతప్తోదకానద్యః పల్వలాని సరాంసి చ॥"

శ్రీరామచంద్రమూర్తి అరణ్యావాసమునకు పోవుట తోడనే ఆ రామ విశ్లేషమును సహింపలేక అయోధ్యలో గల వృక్షములు మొగ్గలతో పూవులతో చిగుళ్ళతో కూడ వాడిపోయినవి. నదులు, కుంటలు, సరస్సులు అన్నిటయందు నీరు మరిగిపోయినది. ఆ శ్రీరామచంద్రమూర్తియే తిరిగి అయోధ్యకు వేంచయగా "అకాలఫలినో వృక్షాః" అని కాలముకాని కాలములో వృక్షములన్నియు ఫలించినవి.

కావున భగవద్విరహము చేతనాచేతన వివక్ష లేక అందరినీ ఒక్కరీతిగా క్రుంగదీయును.

రామ విశ్లేషమును "జలాన్మత్స్యా వివోద్ధృతౌ" అని అంటారు లక్ష్మణస్వామి. "నీటినుండి తీసినచేప వెంటనే మరణించునట్లు శ్రీరాముని వియోగముతో తాను అట్లే జీవింపజాలను'' అని చెప్పిన లక్ష్మణునివలె నమ్మాళ్వార్లు కూడ భగవద్విశ్లేషమును సహింపలేనివారు.

వీరికి చేప అని గాని నీరు అనిగాని తాము అనిగాని తేడాలేదు. భగవద్గుణములే ధారకముగా గలవారు. తాము దుఃఖించుటకు కారణము భగవద్విశ్లేషము. లోకములో బాధపడుచున్నట్లు కనిపించువారి అందరి బాధకు భగవద్విశ్లేషమే కారణమని వీరి భావన.

సర్వేశ్వరుడు రక్షకుడు అను అధ్యవసాయము గలవారు తాపత్రయాదులను లెక్కింపరు. ఎంత వర్షము కురిసినను పర్వతములు చలింపవు కదా! అట్లుండ వలసియుండగా పెద్ద అలలుగల సముద్రతీరమున సంచరించు ఓ సారసపక్షీ! లోకమంతయు నిద్రించినది. నీవు పుట్టినది మొదలు నీ తల్లికి నిద్రయే లేదు. ఇపుడు తగిన వరునకు ఇచ్చి వివాహము చేయుటచే నిశ్చింతగా నిద్రించినది. "సదా పశ్యంతి సూరయః" అనునట్లు కన్నుమూయని నిత్యసూరులను నిద్రించినారు. కానీ నీవు నిద్రింపలేదు. నీ మానసిక వ్యథ, ఆ వ్యథను పైకి సూచించు నీ తెల్లదనము చూడగా నీవును మావలె భగవద్విరహముచే బాధపడుచుంటివా?

ఇచట సారసము తెల్లగా నుండుటకు కారణము. భగవద్విరహముచే కలిగిన వైవర్ణ్యముగా భావించుచున్నారు.

2. "కురరి విలపసి త్వం వీతనిద్రానశేషే
స్వపతి జగతి రాత్ర్యాం ఈశ్వర గ్రస్త బోధే "వయమివ"

"శ్రీకృష్ణునిచే అపహరింపబడిన మనస్సుగల మావలెనే ఓక్రౌంచపక్షీ! ఈ రాత్రియందు లోకమంతయు నిద్రించుచుండగా నీవు నిద్రింపక దుఃఖించుచుంటివా!" అనునట్లు భగవంతుడు నీ మనస్సు నపహరింపగా ఆ బాధచే క్రూరముగా అరచుచున్న ఓ క్రౌంచపక్షీ! ఈ దీర్ఘరాత్రులలో నిద్రింప దుఃఖించు చున్నావు. ఆయన దాస్యము చేసిన మావలె నీవును ఆస్వామి ధరించిన చల్లని తులసిమాలకు ఆశపడితివా! ఏమి? క్రౌంచపక్షి భగవద్విరహముచే అరచుచున్నదని భావము.

3. ఓ సముద్రమా! రాత్రింబగళ్ళు నిద్రలేక ఇట్లు ఘూర్ణిల్లుటకు కారణమేమి? దక్షిణలంకా నగరమును అంతయు అగ్నికి ఆహుతి గావించిన శ్రీరామచంద్రుని చరణకమల సేవను మావలె నీవును ఆశించి ఆ ఆశనెరవేరకపోవుటచే ఇట్లు ఘోషించు చుంటివా? నీ కోరిక త్వరలోనే తీరును లెమ్ము.

ఇచట శ్రీరామ వియోగముచే సముద్రము ఘోషించుచున్న దనుచున్నారు.

4. ఓ చల్లని వాయువా! సముద్రము నందున, పర్వతములందున, ఆకాశమందున వెదకుచుంటిని. "అమ్బుస్యపారే భావనస్య మధ్యే నాకస్య పృష్ఠే," అనునట్లు క్షీరసాగరమున తిరుమలయందు, పరమపదమున సర్వేశ్వరుని వెదకుచున్న మావలె నీవును వెదకుచుంటివా?

సూర్యుడు వెలుగొందు పగటియందుకాని, చంద్రుడు వెలుగొందు రాత్రియందు కాని నీవు నిద్రించుటలేదు. మహాభారత యుద్ధమున ఆయుధమును ధరింపనని ప్రతిజ్ఞచేసియు అసాధారణమైన సుదర్శన చక్రమును విడువలేక ధరించిన శ్రీకృష్ణుని సేవింప దలచితివా! సర్వోప కారకుడవైన నీవు సర్వకాలములందు శ్రియఃపతికి దాసుడవై ఈ విరహమును పొందితివా!

వాయువు అంతటా వీచుటను శ్రీహరిని వెదకుట కొరకే అని చెప్పుచున్నారు.

5. ప్రతి కల్పమందును లోకములన్నింటికి జలప్రదానము చేయుటకు నీరై కరుగుచున్న ఓ మేఘమా! భగవద్విరహముచే దుఃఖించుచున్న నాచెలికత్తెలవలె, నావలె నీవును దుఃఖించుచుంటివా? ఆ భగవంతుడు మధువను రాక్షసుని చంపినవాడు కదా! ఆతని వీర్యగుణమునేమనవచ్చును? లోకోపకారమై వర్షించు నీవును విరోధి నిరసన శీలుడగు ఆమధువైరి వీరగుణమునకు వశ్యుడవై జీవించలేక మరణించలేక బాధపడుచుంటివా!

మేఘము భగవంతుని వీర్యగుణమునకు వశ్యమై ఆతని వియోగమును సహింపజాలక కన్నీరు విడచుచున్నదా! అనునట్లు వర్షించుచున్నది.

6. భగవద్విరహముచే బాధపడుచున్న మావలెనే కళామాత్రుడవయిన ఓ బాలచంద్రుడా! ఆకాశము కాటుక వలె చీకట్లతో నల్లగానున్నది, నీవు ఆ చీకట్లను పోగొట్టలేక

పోవుచున్నావు. అంతేకాదు. ప్రకాశములేక క్షీణించుచున్నావు. అనేక ముఖములు రెండు నాలుకలు గల ఆదిశేషునిపై శయనించి ఉజ్జ్వలమైన చక్రాయుధమును ధరించిన శ్రియఃపతి యొక్క "ఏతద్వ్రతం మమ" "రామో ద్విర్నాభి భాషతే" మున్నగు సత్యవాక్యములను విని వానియందు ఆసక్తుడవై నీ సౌందర్యమును పోగొట్టుకొంటివా!

సర్వేశ్వరుని "రామో ద్విర్నాభి భాషతే" మున్నగు భగవంతుని సత్యవచనములకు ఆసక్తిచెంది చంద్రుడు క్షీణించుచున్నట్లు చెప్పబడినది.

7. ఓ అంధకారమా! మా స్వామి నారాయణుడు. మా మనస్సులు మాకు పూర్తిగా స్వాధీనమైనవి. అవి భగవద్విషయమునే కాని వేరొక దానిని తలపవు. అట్టి మా మనస్సులను వాత్సల్యగుణపూర్ణుడైన మా స్వామికి అర్పించితిమి. ఆ స్వామి విరహము వలన కలిగిన వ్యథను చెప్పుకొని దుఃఖించు చుంటిమి. ఇట్లుండగా నీకు మాతో "బాధ్య బాదక సంబంధ" మున్నట్లు (మేము బాధపడవలసిన వారము. నీవు బాధించవలసిన దానవు అన్నట్లుగా) మా మధ్యచేరి ఒకరి ముఖములు మరొకరికి కనుపింపనీయక క్రూరముగ హింసించుచుంటివి గదా! బాధించుటకు కారణము వలదా! శత్రువునైనను "అయ్యో" అని తలచు స్వామి స్వభావము విడచి కాలమున్నంతవరకు (జీవించియున్నంత కాలము) శత్రుత్వము వహించియుండుటేనా? కానిమ్ము. నీవే సుఖముగా నుండుము.

8. చీకటివలె మిక్కిలి నల్లనై జలసమృద్ధిగల ఓ ఉప్పుటేరూ! అజ్ఞానము కలదానవై "నాన్తోస్య ద్విజ ఉచ్యతే" అనునట్లు అంతములేని అహోరాత్ర రూపమైన ఈ కాలము గడచుచున్నను నీవు మాత్రము నిద్రింపవు కదా! కారణమేమి?

కావలిగా నుంచిన శకటములో అసురుడావేశించి బాధింపగా కాలితో తన్ని ఆ శకటాసురుని సంహరించిన శ్రీకృష్ణుని దయను కోరితివా! అది లభింపకపోవుటచే మావలె నీవును దుఃఖించుచుంటివా!

9. ఓ దీపమా! నీవు ఎల్లప్పుడు ఒక్కతీరుగా వెలుగుచుంటివి. నీవును ఆశచే బాధపడుచుంటివా! "ఆశా నామ మహావ్యాధిః" అనునట్లు మహావ్యాధివలె ప్రాణములను లోలోపలే శోషింపచేయును కదా! ఏమి నీ యాశ. "పతి సమ్మానితా సీతా భర్తార మసితేక్షణా" అనునట్లు స్వామిచే సన్మానింపబడవలెననియా! తామర పుష్పములవలె విశాలమైన నేత్రములు కలవాడును, దొండపండువలె ఎఱ్ఱని అధరము గలవాడును తులసీ మాలాలంకృతుడును అగు సర్వేశ్వరుని సౌందర్యమును సేవింప ఆశపడి అదితీరిక ఈ విధముగా వెలుగుచుంటివా! ఏమి?

ఈ విధముగా పరాంకుశ నాయిక విరహవ్యథ అధికముకాగా స్వామి తన దివ్య స్వరూపముతో సాక్షాత్కరించినాడు. అప్పుడు పరాంకుశనాయిక స్వామితో ఇట్లు విన్నవించుచున్నది.

స్వామి! ఆశ అనే వ్యాధి ప్రాణములను శోషింపచేయునట్లుగా నిన్ను సేవింపవలెనను ఆశతో రేయింబగళ్లు ఎదురుచూచునట్లు చేసితివి.

నీవు నీ ఆశ్రితులను బాధించు కేశియను గుఱ్ఱము నోటిని చీల్చినవాడవు. యమలార్జునులను మద్దిచెట్లను కూల్చినవాడవు. బలిచక్రవర్తి అపహరించిన భూమిని త్రివిక్రముడవై పాదములతో కొలచి స్వాధీనపఱచకొన్నవాడవు. నిత్య యౌవనుడవు. జగత్కారణ భూతుడవు. కావున ఓ శ్రియః పతీ? ఇకపై మమ్ములను విడువక స్వీకరింపుము. అని పరాంకుశ నాయిక ముగించినది.

సకల జగత్కారణ భూతుడై పరంజ్యోతి స్వరూపుడైన సర్వేశ్వరునిచే అపర్యాప్తామృతమైన (మిక్కిలి భోగ్యభూతుడైన) కురుకాపురాధీశులైన నమ్మాళ్వార్లు అనుగ్రహించిన ఈ పది పాశురములను అనుసంధించువారికి పరమపదము తప్పక లభించును.

ఈ దశక సారాంశమును కోయిల్ పెరియజీయర్ మణవాళ్‌మామునులు తమ తిరువాయిమొழி నూత్తందాదిలో ఇట్లను గ్రహించియున్నారు.

వాయుం తిరమాల్ మఱైయనిఱ్క ఆత్తామై
పోయ్ విఞ్జి మిక్కప్పులమ్బుదలాయ్ ఆయ
అఱియాదవత్తోడు అణైన్దழுద మాఱన్
శెఱివార్ై నోక్కు తిణిన్దు.

ఆశ్రిత సంరక్షణకై స్వయముగా వేంచేయు శ్రియఃపతి కనుపింప కుండుటచే ఆ విశ్లేషమును సహింపలేక అచేతనములతో కూడ దుఃఖించిన నమ్మాళ్వార్లు తమ శ్రీపాదములను ఆశ్రయించిన వారిని తప్పక కటాక్షింతురు.



శ్రీమతే రామానుజాయ నమ:

శ్రీమచ్ఛఠకోప గురవే నమ:

# భాగవత మంగళా శాసనమ్

ఉ.వే.శ్రీమాన్. కండ్లకుంట సీతారామాచార్యస్వామి

యరజర్ల

శ్రియ:పతియగు శ్రీనివాసుడు సకలచేతన సంరక్షణార్థము శ్రీమన్నమ్మాళ్వారులను లీలా విభూతియగు ఈ ప్రకృతి మండలమున అవతరింపజేసినాడు. వీరు జన్మ ప్రభృత్యాషోడశాబ్దములు యోగనిష్ఠులై యుండి భగవదనుభవమును పరిపూర్ణముగా అనుభవించిరి. మయర్వఅ మతినలమరుళినన్, అని వీరు సాదించినట్లుగా భగవన్నిర్హేతుక జాయమానకటాక్షలబ్ధ పరావర తత్త్వయాథాత్మ్య జ్ఞాన విభవులై వేంచేసి యుండిరి. కనుకనే

**శ్లో॥ పద్మాసనోపవిష్టం పరపద యుగళే నివిష్ట చైతన్యమ్।**

**పరతత్త్వ బోధముద్రం పరమాచార్యం వన్దే పరాంకుశమ్॥**

అని పూర్వదేశిక స్తోత్రము వీరిని స్తుతించినది.

ఇట్టి మహాపురుషులగు వీరు పరమభక్తికృత పరిపూర్ణ తత్త్వజ్ఞాన నిధులై భగవద్గుణ పరివాహమునసోలలాడి లోకోజ్జీవనమునకై దివ్య ప్రబంధములను ప్రసాదించినారు.

వేదతమిళ్ శెయత పిరాన్, అని కొనియాడిన చందమున వీరు ఋగ్యజుస్సామాథర్వణ రూప సంస్కృత వేద చతుష్టయ సారమును ద్రామిడ భాషలో ప్రసాదించిరి.

వేదైశ్చ సర్వైరహ మేవ వేద్య:, అనిన సర్వవేదములచే తెలియబడు భగవత్తత్త్వమును భగవత్పరత్వమును భగవత్కల్యాణ గుణవైభవమును అతి మనోహరముగా తా మనుభవించి సాదించిరి.

అవియే వేద తుల్యములగు ద్రావిడ దివ్య ప్రబంధములు.

1.తిరువిరుత్తం. 2. తిరువాశిరియం. 3. పెరియ తిరువందాది. 4. తిరువాయ్‌మొళ్ళి.

ఈ దివ్య ప్రబంధములనే ద్రావిడ వేదములని తత్త్వవిత్తములు నాథయామున యతివరాది పూర్వాచార్యులు అనుభవించి సంస్కృత వేదాంతముతో సరిపోల్చి ద్రావిడ వేదములని, ద్రావిడ వేదాంతములని దివ్య ప్రబంధములను గౌరవించిరి. వీటిలో తిరువాయ్‌మొళ్ళి సామవేదసారమై ప్రపన్న జనపారిజాతమై పరిఢవిల్లుచున్నది.

ఈ ప్రబంధమునకు దీర్ఘశరణాగతి యనియు ప్రసిద్ధి కలదు. దీనియందు ఆళ్వారులు శరణాగతి వైభవమును సంపూర్ణముగా విశదీకరించినారు.

శ్రీవైష్ణవ సంప్రదాయమున శ్రీరామాయణమునకు ఎట్టి గౌరవ ప్రశస్తి కలదో ఈ ప్రబంధమునకు అంతటి ఉత్కృష్ట స్థానము కలదు.శ్రీరామాయణమునకు దీటైన ప్రబంధము ఇది ఒక్కటియే

యనుట అతిశయోక్తి ఎంత మాత్రమున్ను కాజాలదు. శ్రీరామాయణమునందు వలెనే దీనియందున్ను ద్వయ మంత్రార్ధ వివరణము కలదు - అనగా శరణాగతి వైభవము. శరణ్య వైభవము. పురుషకార వైభవము. ప్రపన్న జన వైభవమున్ను విపులీకరింపబడినవి.

అర్థ పంచక జ్ఞానమును ఆకారత్రయ సంపత్తిని తత్త్వత్రయ ప్రశస్తిని సర్వ ప్రబంధములని బంధించినారు. కనుకనే ఈ మహానుభావులను ఈ విధంగా స్తుతిస్తూ పూర్వార్యులు వీరి వైశిష్ట్యమును ప్రకాశింప జేసినారు.

శ్లో॥ భక్తి ప్రభావ భవ దద్భుత భావబంధ సంధుక్షిత ప్రణయసార రసౌఘపూర్ణః।
వేదార్థరత్న నిధి రచ్యుత దివ్యధామ। జీయాత్ పరాంకుశ పయోధి రసీయభూమా॥ యని.

ఈ దివ్య ప్రబంధమున ద్వయ మంత్రమందలి ఉపాయోపేయ విశేషములను నిబంధించినారు. మొదటి (3) పత్తులయందు ఉత్తర వాక్యార్ధమును, తరువాతి (3) పత్తుల యందు పూర్వ వాక్యార్ధమును ప్రసాదించి తరువాతి (4) పత్తుల మందు తదనుగుణ విశేషార్ధములను నిబంధించినారు.

ఇంతయేకాక భగవద్గుణ వైభవమును ఒక్కొక్క దశకమున ఒక్కొక్క గుణ సారస్యమును అనుభవించి ప్రకాశింప జేసినారు.

ఆశ్రయణ సౌకర్యాపాదకములు ఆశ్రిత కార్యాపాదకము లనిగదా గుణద్వైవిధ్యము. ఇవిగాక దివ్యాత్మగుణములు దివ్య మంగళ విగ్రహ గుణములు పుష్కలముగా అభివర్ణించినారు. మొదటి తిరువాయ్మొళ్లి యందు పరత్వ వైభవమును ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్;, ఇతరోచ్ఛ్రాయ రహితమైన సర్వోచ్ఛ్రాయములగు జ్ఞానానందాది కల్యాణ గుణవిశిష్టుడైన పరత్వమును కొనియాడినారు.

పర: పరాణాంపరమరి,, అన్న శ్రుత్యర్థమును తెలిపినారు. ఇట్లే భజనీయత్వమును. ఉమ్మొయిర్ వీడుడయానిడై వీడు శెయిమిన్;; అని మోక్షనిర్వాహకుడైన స్వామికి ఇతర సాధ్య సాధనముల నన్నిటిని నవాసనగా పరిత్యజించి ఆత్మసమర్పణము చేయండి అని తెల్పినారు - సర్వలోక శరణ్యాయరాఘవాయ మహాత్మనే (నివేదయతమాం,) అన్న శ్రీరామాయణార్థమును ప్రసాదించినారు.

ఇట్లే తరువాతి దశకముల యందలి. సౌలభ్య, సౌశీల్య, ఆర్జవాదులను అభివర్ణించినారు.

ద్వితీయ శతకమున ప్రాప్యనిష్కర్షమును చేసినారు - తనక్కేయాక వెనైక్కొళ్ళుమీతే,, యని నీ కొఱకే నన్ను స్వీకరించు మా నాకని మోక్షము కోరనని మొఱలిడినారు.

తృతీయ శతకమున ప్రాప్యమగు భగవత్కైంకర్యమునకు చరమావధియగు భాగవత దాస్యము నపేక్షించినారు.

చతుర్ధ శతకమున ఐశ్వర్య, కైవల్యములను ఈసడించి భగవత్కైంకర్యమునే పరమ పురుషార్థముగా ఆపేక్షించినారు.

ఒన్రుం తేవు - అను దశకమనందు మరల భగవత్పరత్వమును విస్పష్టముగా ప్రసాదించినారు. ఆదిప్పిరాన్ నిఱ్క మత్తెత్తెయవం నాడు దితే,, అని సకల జగత్కారణుడు సర్వాపన్ని వారకుడు సర్వ సంరక్షకుడు ఉండగా రక్షకుడగు దైవము ఎవరాయని విచారింతు రాయని హెచ్చరించు చున్నారు.

అయిదవ పత్తునందు రెండవ దశకము తమ ఉపదేశముచే మనస్సు మాఱి భగవానునికే అనన్యార్హ దాసులగు శ్రీవైష్ణవ సమూహమును సేవించి వీరి వైభవము నిత్యముగా అభివృద్ధి జెందుగాక యని మంగళాశాసనము గావించినారు.

"నణ్ణాదార్ ముఱువలిప్ప,, అను వెనుక తిరువాయ్ మొఴ్రిలో ఆళువారులు సంసారులు పడుచున్న దు:ఖములను జూచి అయ్యోయని మిక్కిలి జాలి పొందినారు. వీరికి దు:ఖకారణము రాగ ద్వేషములని గ్రహించి భగవత్కృప దప్పవేఱు రక్షకములేదని వీరిని రక్షించమని భగవానుని ప్రార్థించినారు-ఇక భగత్కృపచే 'సత్త్వాత్సంజాయతే జ్ఞానం,, అనినట్లు సత్త్వగుణము అభివృద్ధి చెంది భగవద్భక్తి అంకురించి తద్ద్వారా భగవదాశ్రయణము జేసి సుఖించుచున్నారనియును. సాత్త్వికుల చేత లోకోజ్జీవనము కలుగగలదనియు సాత్త్వికులకు మంగళాశాసనముచేయు చున్నారు.

'పొలిక పొలిక పొలిక,, యని మంగళమగు గాక మంగళమగు గాక మంగళమగు గాక యనుచు అభినివేశాతిశయముచే ముమ్మాఱు మంగళమును ఆశాసించుచున్నారు -

కలియుగమున జనులకు తరించు మార్గము భగవదాశ్రయణము తప్ప ఇంతకు మించిన సుకరోపాయము దుర్లభమని సాదించినారు - ఆశ్రితులగు శ్రీ వైష్ణవ జన వైశిష్ట్యమును కొనియాడుచున్నారు - భక్తజనావళికి ప్రబల పాపములు నశించి భగవత్సంబంధము వలన నరకములు మూతపడినవి - యముడు కింకర్తవ్యతా మూఢుడైనాడు - సర్వేశ్వరుని అనంత కల్యాణ గుణములు అన్ని దిశలయందు బొగడ బడుచున్నవి - భగవానుని సౌందర్య, సౌశీల్య, స్వామిత్వ, సౌలభ్య, వాత్సల్య గుణములను సుజనులు తనివిదీర అనుభవింరచుచున్నారు. భక్తిహీన జనులు అరుదైనారు. భగవన్నామ సంకీర్తనము కర్ణపుటములనింపుచున్నదని సంతుష్టులై ఆశ్రిత జనమును ఆహ్వానించుచున్నారు -'కండోం కండోం కండోం కణ్ణుక్కినియన కండోం,, తొండీ

రెల్లీరుం వారీర్,, అని కన్నుల కింపగు సద్గోష్ఠిని సేవించితిమి సేవించితిమి సేవించితిమి ప్రావణ్యముగల వారందరు సేవించ రారోయని సంతోషాతిశయమున కేకలు వేయుచు హర్ష పరవశులైనారు.

లోకము నందంతటను భాగవత సంచారము కల్గినందున కలిదోషము నశించినవట- ఆ దోషము లెవ్వియనగా - 'వ్యాధి దుర్భిక్షతస్కరాది,,. అనినట్లు వ్యాధులు, అనావృష్టి, చౌర్యలములు మొదలగునవి:-

'యత్రాష్టాక్షర సంసిద్ధో మహాభాగో మహీయతే। నతత్ర సంచరిష్యంతి,, యనునట్లు మహాభాగవత జన సంచారము చేత పావనయుగుచున్న భూఖండమున అనావృష్ట్యాది దోషములు దూరమగుచున్నవని సాదించినారు-

విశేషించి ప్రపన్నజన కూటస్థులగు వీరికి అష్టాక్షర సంసిద్ధత్వమే గోచరించుచున్నది. ఏ విధముగా ననిన -

1. విషయ ప్రవణ్యమను రోగము.

2. స్వరక్షణోపాయ శూన్యత్వమను దుర్భిక్షము.

3. ఆత్మాపహారమను దొంగతనమున్ను నశించినవని వీరి తిరువుళ్ళము.

మాధవుని దాసులు హరి సంకీర్తనముచే లోకమును పావనము చేయుచున్నారనియు సంతోషించుచున్నారు.

మేఘవర్ణుడైన స్వామియొక్క సౌందర్య శీల ఔదార్యములను మిక్కిలి భోగ్యముగా అనుభవించు మహాప్రాజ్ఞులైన శ్రీ వైష్ణవ జనసహవాస సంశ్లేషములు అమోఘములు గదా! కలియుగ ధర్మము నశించి కృతయుగ స్వభావమే అంతట వర్తించు చున్నది. భగవదనుభవానందమే అవిచ్ఛిన్న ప్రవాహమైనది గదాయని అనుభూతి పరవశులగుచు కొనియాడినారు - మరియును మహాపురుష సంశ్రయముచే ధన్యులయిన సజ్జనాళి కృపచేత లోకము సుఖించుచున్నదనియును వారి వైభవమును ప్రశంసించినారు. సంకీర్తనాదులచే విష్ణుభక్తులు ఆడుచు పాడుచు హర్షాతిరేకమున గంతులు వైచుచు సర్వోత్కృష్ట కృష్ణతత్త్వమును తద్భక్తి విశేషమును ప్రబోధించుచున్న వారి వ్యాపారములు నాటకముల వలె సంతోషింపచేయుచున్న వనుచున్నారు. ఇట్టి గోష్ఠికి మంగళమగు గాక యని గోష్ఠియొక్క విశేషాభివృద్ధిని కాంక్షించుచున్నారు.

తమ జ్ఞానోపదేశముచే శ్రీవైష్ణవ ధర్మము వికాసము జెంది అలరారుచున్న భాగవత జనములు లోకమంతట నాక్రమించినారనియు తత్ఫలముగా అసుర రాక్షసావేశముగల రాజసులును తామసులున్ను పూర్ణముగా నశించుచున్నారనియును సంశయము పని లేదనుచున్నారు.

యుగధర్మమును మార్చి వైకుంఠుని దాసులు భగవానుని దివ్య చారిత్రపీయూష పానమున పరవశింపజేయు నమ్మహాత్ములనాశ్రయించి ఆనందించుడని పరోపదేశము జేసినారు.

నారాయణుని మాహాత్మ్యమును సంసారులకు హృద్యముగానుద్బోధించినారు.

ఇతర దేవతల యందలి పరత్వభావన తొలగిన సర్వేశ్వరుని యందు పరత్వ భావన స్థిరపడగలదని తలంచి సృజ్యత్వ, కర్మవశ్యత్వ, పరిమిత ఫలప్రదత్వాదుల చేత వారి అపరత్వమును ప్రతిపాదించి, మార్కండేయనుం కరియే,, యని మార్కండేయ మహామునిని సాక్షియనియు తెలియజేసినారు.

సర్వదేవతాంతర్యామియై సర్వకర్మసమారాధ్యుడై, సర్వకర్మ ఫలప్రదుడగు నారాయణుడే మోక్షప్రదాత - కావున కణ్ణనల్లాన్ తెయ్వమిల్లై,, యనుచు పరతత్త్వమగు కృష్ణుని నిజస్వరూపమును తెల్పినారు.

అట్టి దైవమును ఆశ్రయించి తమ ఆత్మాత్మీయములను సమర్పించుడని హితోపదేశము జేసినారు. ఇట్టివారు శ్రీవైష్ణవులు గాన వారిని శీఘ్రముగా నాశ్రయించి దాస్యముజేసి స్వరూపోజ్జీవనమును పొందుదురుగాక యనుచు ఉపదేశించినారు -

భగవద్భక్తుల అతిశయము గ్రహించి పూజించి గౌరవించి ఆశ్రయించియు తరించగలరు - 'సద్భిరేవ సహాసీత,, అనినట్లు వారిని కూడియుండుటే పరమ పురుషార్థము.

కావున అట్టి శ్రీవైష్ణవ పుంగవులను సేవించి తరించుడీ అనియును కృపజేసిరి - అట్టివారిలో ఇరుతెగల వారుందురు - కొందఱుగుణజితులు - మఱికొందఱు కైంకర్య ధురంధరులు - గుణజితులు భగవద్గుణములను మాటిమాటికి అనుభవించి గుణసారస్యమున మునిగియుందురు - ఆహ్లాదశీత నేత్రాంబుః, పుళకీకృత గాత్రవాన్,, అనినట్లు కన్నులనుండి రస్యగుణానుభవముచే గల్గు ఆనందపారవశ్యమున జారుచున్న బాష్పధారలు గలవారలు. మేనెల్లపులకాంకురములతో నిండినవారు.

కైంకర్యనిష్ఠులు - 'గుణైర్దాస్యము పాగతః,, అన్న ఇళయ పెరుమాళ్ళ స్వభావము వంటి స్వభావము గలవారై నిత్య కైంకర్య నిరతులై యుందురు. ఇట్లు గుణనిష్ఠులు, కైంకర్య నిష్ఠలు ఉందురు. ఇట్లే మీరు కూడ ఓ సుజనులారా! మహాత్ములగు భగవద్భక్తుల పంచజేరి ఇతర ప్రయోజనములు గోరక అనన్య ప్రయోజనులై ఉజ్జీవించుడుయను చున్నారు.

'న వాసుదేవ భక్తానాం అశుభం విద్యతే క్వచిత్,, అనురీతి వాసుదేవ పరాయణులకు ఏవిధములగు దుఃఖపరంపరలు అంటవు.

'ఏషహ్యేవానందయాతి,, యనుప్రమాణానుసారముగా శ్రీకృష్ణుని సేవించి వానితో పరమానందమును అనుభవించుదురు గాక - మహాత్ములు వాసుదేవ భక్తులగు శ్రీవైష్ణవులు నట్టి వారే కదా! కాన వారినాశ్రయించుట గూడ మిక్కిలి సుకరము - 'కృపాసింధుభ్య ఏవచ। పతితానాం పావనేభ్యశ్చ। వైష్ణవేభ్యోనమోనమః,, దయాళులు దీనబాంధవులు లోకపావనులు నైన శ్రీవైష్ణవుల దివ్య శ్రీసూక్తులను సేవించి వారికి సేవలు చేయుడు. వారిని కొనియాడుడు వారికి మంగళా శాసనమును చేయుడనుచున్నారు - ఇక ఈ శ్రీమన్నమ్మాళ్వారులది దివ్య హృదయము - మిక్కిలి గభీరము అతి కోమలము రసభరితము శుద్ధసాత్త్వికము - పరవ దయాసంభరితము - భక్తి రూపాపన్న జ్ఞానశోభితము - కావుననే ఈ మహానుభావులు భగవన్మాహాత్మ్యమున మునిగి భగవానుని దివ్య పావనత్వ భోగ్యత్వములకు పరవశించి స్వామిని వేనోళ్ల పొగడినారు - మరియు తిరుమంగైయాళ్వారులు భక్తి సారమునీంద్రులు. శ్రీకులశేఖర ప్పెరుమాళ్ శ్రీపాణ ప్పెరుమాళ్ శ్రీవిష్ణుచిత్తులు మొదలగు పరమ భాగవతులు తత్త్వయాథాత్మ్యజ్ఞాన నిధులు భగవత్కారుణ్య పాత్రులునైన శ్రీవైష్ణవ పుంగవులనున్ను పరమ ప్రీతితో పొగడి మంగళాశాసములు చేసినారు.

వీరి వంటి సర్వోత్తమ కల్యాణ గుణ పూర్ణులు లోక కల్యాణాభికాంక్షులు పరమశాంతులు

దాంతులు సచ్చరిత్రులునైన సాధుపురుషులు భూమియందంతటను వ్యాపించినారు.

బద్ధ సంసారులగు మీరు వారిని గూడి ఉజ్జీవించుడని పరమహితమును అనుగ్రహించినారు సహర్షకోలాహలముచేయుచు పల్లాండు పాడినారు.

ఓంశాంతిశ్శాంతి శ్శాంతి: అనిన వైదికనిర్దేశ ప్రక్రియగా పొలిక పొలిక పొలిక యనుచు మంగళాశాసన తత్పరులైనారు. వీరి జ్ఞానానుష్ఠానములు మనకు పరిగ్రాహ్యములు కావున ఇట్టి మహాదేశికుల దివ్యానుగ్రహమే ఉపాయాంతర శూన్యులమగు మనకు నిత్యమంగళప్రదము-

వీరి మంగళాశాసనము సకల శ్రీవైష్ణవ లోకమునకు శ్రీరామరక్ష.

'కలియుగమొన్డుం ఇన్టిక్కే తన్నడియార్కరుళ్ శెయ్యుం,, అని వీరు సాదించిన రీతిగా భగవానుడు తన దాసులగు వారికి కల దోషములు ఒకటియు అంటకుండజేసి సంరక్షించును.

చివరకు 'ఇప్పత్తుళ్ళత్తై మాశఱుక్కుమే,, అని కృపచేసిరి - ఈ పది పాశురములు మనోదోషముల తొలగించును అని - ఈ తిరువాయ్మొళ్ళి దివ్య గానముననుభగవదాశ్రయముననుభాగవతానుగ్రహమునను ఈ మహాఫలము నందుదురని తెల్పిరి- 'మనేఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయో:,, మనస్సే మానవుని బంధమోక్షములకు కారణము. మనోదోషములు నశించి శుద్ధ మనస్సును పొందుట ఎట్లన మోక్ష విరోధములు నగు దేవతాంతర పరత్త్వము వైష్ణవేజాతిబుద్ధి:. అన్నట్లు భాగవతుల పట్ల జనసామాన్య భావము. భగవద్భక్తి హీనజన సహవాసము. ప్రయోజనాంతర ప్రావీణ్యము మొదలగునవి.

భగవత్కృపచే ఇవి నశించి శుద్ధమనస్కుడై భగవత్ప్రవణుడగును. తరువాత భక్తజనము నందు ప్రీతి కలుగును. భగవద్భాగవతాను గ్రహమున ముక్తుడగును.

ముముక్షుపునకు ముక్తునకు నిత్యులకున్ను మంగళాశాసనమే పరమ కర్తవ్యము. స్వరూప ప్రయుక్తము. అని శ్రీమన్నమ్మాళ్వారుల దివ్య శ్రీసూక్తి-

ఆళ్వార్ దివ్య తిరువడిగళే శరణం

శ్రీరంగశఠజిద్గురవే నమ:



శౌరిరాజ పెరుమాళ్

# చెప్పిన విరోధము-చెప్పక తప్పదు

("శొన్నాల్ విరోదం")

ఉ.వే. శ్రీమాన్ కొ.ఇ సంపత్కుమారాచార్య స్వామి,

నెల్లూరు.

భాగవతుల బోధనల ద్వారా భగవద్గుణానుభవజ్ఞానము కలిగి అందు అభిరుచి కలుగుట జరిగినది. ఆ అభిరుచి తమ వరకే నిలువక "చక్షుశ్రవా:" అనునట్లు సర్పముల నేత్రములు శ్రవణేంద్రియములు చేయు పనిని, తమ పనిని కూడా చేయునట్లు మనస్సు, వాక్కు, చేతులు, నేత్రములు, చెవులు, మొదలగు ఇంద్రియములు తమతమ ఇంద్రియ వ్యాపారము వరకే నిలువక ఇతర ఇంద్రియ వ్యాపారములను కూడ ఆశించునట్టి విషయమును తెలిపిన ఆళ్వార్లు తమ ఆర్తిని, తెలిపి విలపించుచు, "ఆశ్రితరక్షణను బాగుగా తెలిసిన "స్వామీ! తమరు ఆశ్రిత విరోధులగు కంసాదులను వధించి "యోగక్షేమం వహామ్యహమ్" అనునట్లు ఇంద్రునకు ముల్లోకాధి పత్యమును, నలకూబరమణిగ్రీవులకు నీ పాదారవింద స్పర్శచే స్వస్వరూపమును అనుగ్రహించితిరిగదా! అట్టి పాదారవిందములను సేవించవలెనని ఆశపడి అది లభించక నీ తిరునామములను అనుసంధించుచు పడియున్నాను", అని సర్వేశ్వరుని ప్రార్థించి నావంటి వారు సంసారులలో నున్నారా! అని చూడగా తాము భగవద్గుణానుభవములో ఎట్లుసంపూర్ణమనస్కులైరో! అట్లే సంసారులును శబ్దాది విషయములో సంపూర్ణ మనస్కులై, ఆశాపాశబద్ధులై వివిధ మత-మతాంతరాభినివేశముతో క్షుద్ర దేవతల యొక్క, మనుష్యుల యొక్క స్తోత్రప్రశంసల చేయుటను చూచి ఖిన్నులై తాము వారి దుఃఖమును హితోపదేశాదులతో మాన్పదలచి తమ దుఃఖమును మరచిరి. అట్లు చేసినను వారు వీరి హితమును పెడచెవిని పెట్టి యధాస్థితిలో నుండుటను చూచి వారికంటే తమ ఆధిక్యమును ఇట్లు తెలిపిరి.

సమస్త కళ్యాణ గుణాకరుడు, సర్వసుందరుడు కవిత్వమునకు చాలినంత విషయమును కల సర్వేశ్వరుని గూర్చి పాడిన కవిత్వమును నిత్యసూరులు అమృతముగాననుభవించుచు స్వామికి వినిపించి కొనియాడుచుందురు. పాడినవారికి కావలసినవాటినన్నిటిని ఇచ్చు పరమోదారుడు; ఉభయవిభూత్యైశ్వర్యము కలవాడును శ్రియః పతి యగు ఆ భగవంతుడు. సర్వసులభుడై యుండగా అట్టి స్వామిని స్తోత్రముచేసి భోగమోక్షముల పడయవచ్చునే! అట్లుచేయక గుణహీనులగు పురుషుల విషయమై గుణములున్నట్లుఆరోపించి స్తోత్రము చేయుట వృధా ప్రయాస తప్ప ఫలితము శూన్యము, స్వరూపహానియే యగును. భగవత్సేవకై ఇంద్రియములనుపయోగించిన వ్యర్థమెన్నటికిని కానేరదు. (రావణ విషయమై విభీషణుని వలె ఆళ్వార్లు తటస్థముగా తమకు గల అతిశయమును తెల్పుచున్నారు.)

కవులారా! క్షుద్రవిషయములలో కవిత్వము చెప్పుట మీకు హితకారికాదు. నామోచ్చారణచే మీకు కలుగు అనర్థమేమి? భగవన్నామమును ఉచ్చరింపుడు అని ప్రహ్లాదుడు అసురులకు తెల్పిన విధముగా మీ దుర్గతిని చూచి ఇట్లు చెప్పుచున్నాను. మీరెట్లు మీఅభిమతమునుండి విరమింపరో అట్లే నేనున్ను మీ హితమునుండి విరమింపను. సముద్ర ఘోష ఇష్టము లేకున్నను వినునట్లు, నా హిత వాక్యమును విందురుగాక! మార్గభ్రష్టులైన వారు మార్గాను యాయులను అనుసరించిపోవలెను గదా. "త్రయ ఏవాధనారాజన్......యస్యైతే తస్యతద్ధనమ్" అన్నట్లు నేనే స్వామికి శేషభూతుడను. నాకరణములును శేషభూతములు. నా జిహ్వాయు శేషభూతమే. కావున నావలెనే నా నాలుకయు స్వామిని కొనియాడుటయే స్వరూపము. (ముందు తిరువాయ్‌మొళిలో ఈ విషయమును ప్రస్తుతించినారు) నా కార్యమును స్వామి విని సంతోషించిన శేషభూతుడగు నాకు (చేతనునకు) విశేషసంతోషముగదా! ఇదియే శేషశేషిభావ సంబంధము. ("యస్యైతే" అనుటచే అనన్యార్హశేషత్వము చెప్పబడినది.)

మధుపములు మధుపానముచే శబ్దించగా గానముగా పరిణమించి నట్లు. భగవదనుభవములో జనించిన హర్షము కావ్యముగా వెడలినది. తిర్యక్కులు, ముముక్షువులు సర్వేశ్వరుడను వ్యత్యాసములేక ఈ గానమును ఎల్లరు ఆస్వాదింతురు. వేదములలో ప్రతిపాదితమైన పరత్వము గోచరముకాదు. వేదమునకన్న శ్రీరామాయణము ఆ పరాత్పరుని విభవావతారంలోని సౌలభ్యాది గుణమును ప్రకాశింపచేయుచున్నది. కావుననే వేదమునకన్న శ్రీరామాయణమునకు ఆధిక్యము. అంతకన్నను తిరుమలలో సులభ సేవ్యుడుగా వేంచేసియుండి తమ కళ్యాణ గుణాదులను బహుమానముగా నా కవిత్వమునకు ఉపకరించునట్టి ఆ స్వామి పరమోదారుడు. ఏ ప్రభువైనను కవిత్వము చెప్పినవారికి బహుమానముగా గజమునిత్తురు. ఆళ్వారు స్తోత్రము చేయగా ఈశ్వరుడు ఏనుగు వలె ఉత్తుంగమైన తననే వీరికి వశమొనర్చెను. వీరును భగవంతుని స్తోత్రముచేసి తిరువేంగడముడైయాన్ అను ఉత్తుంగ గజమును వశపరచుకొనిరి. వీరును ఆ తుమ్మెదలతో సగోత్రులైరి ఇతరులవలె ఏనుగును మాత్రమే ఇచ్చి ఊరకుండక దర్శనీయుడై సదా స్తోత్రము చేయతగిన వాడైనాడు. లోకస్థులు ఇతరులను కొనియాడుచుండగా వారికి హితమును చెప్పు సమర్థునిగా నన్ను తీర్చి దిద్దిన మహోపకారకుడు ఆ స్వామి. శ్రీరామాయణంలో శ్రీరాముడు గంగను దాటి అరణ్యమునకు పోయిన పిదప అరణ్య సంచారములో శ్రమ కలిగి ఆ శ్రమను పోగొట్టుకొనుటకై "సుమంత్రా! రథముమ తీసుకొని రమ్ము!" అని చెప్పు నేమో! యని సుమంతుడు గుహుని యొద్ద కొంతకాలము వేచి యున్నట్లుగా తిరువేంగడముడై యాన్ కూడ విముఖులైన చేతనులు తమయందు అభిముఖులై వత్తురేమో! యని ఆశతో తిరుమలలో వేచియున్నాడు. అపకారముచేసినను విడువరాని సంబంధము వానికి మనకు మధ్యనున్నది .

సూదిపై మీరు పర్వతమును నిలబెట్టుట ఎట్లు దుర్లభమో! భగవత్తత్త్వమును

తెలుసుకొనలేని క్షుద్రుల విషయమై గుణముల నారోపించి స్తోత్రము చేయుట అట్టిదే "సతి ధర్మిణి ధర్మా:" ఒక వ్యక్తి యున్న గదా! వాని యందు ధర్మములుండును-ఈ మనుజులు సర్వేశ్వరుని ఐశ్వర్యము కన్నను తమ ఐశ్వర్యము గొప్పదనిన్ని, సుందరమైనదనిన్ని, స్థిరమైనదనిన్ని తలచి తమను తామే కొనియాడుకొనువారుకదా! ఇట్టి వారిని కొనియాడుటలో ప్రయోజనమేమి? (కావున ఆళ్వార్లు వీరిని "మానిడం" అని అచేతనముగా తెల్పిరి)

కరిక్కాల్‌శోళు బ్రహ్మరాయన్ అను రాజు "తిరువాయ్‌మొళ్ళి"కి వ్యాఖ్యానము వ్రాసి నంజీయరుగారికి చూపించిరి. వారు నంబిళ్లైగారు దీనిని విని తగిన రీతిగా గౌరవించుడని ఆనతిచ్చిరి. వారును విని ఆళ్వార్లు హృదయముననుసరించి వారి మార్గముననే పోతిరిగదా! అనిరి. అందులకు రాజు ఆహా! ఆళ్వార్ల కన్న నాకు గల గొప్పతనమును గమనించలేదు గదా! నేను రాజకార్యమును చేయుచు దీనిని రచించితినిగదా! ఆళ్వార్లు ఏ ఇతర కార్యములు లేక భగవంతుని స్తోత్రము చేసినారు అని తనను తాను పొగొడుకొనెనట. ఈ లోకుల స్వభావము ఇట్లుండును.

పంటచేలకన్నను చెరువుల ఆధిక్యముచే పంట తప్పక ఫలించు ప్రదేశమని కొని యాడ తగిన తిరుక్కురుంగుడి నాథుడు ఆ స్వామి. (రక్ష్య వర్గముకన్నను రక్షకత్వం బహుముఖముగా వ్యాపించి మిన్నగా యుండు సర్వేశ్వరుడు వర్తించు ప్రదేశమని అర్థము) అట్టిస్వామి విషయములో కవిత్వం చెప్పుటకు వీలగునట్లు వారిగుణములను నాకు ప్రకాశింపచేసిన నానాథుడు ఆ స్వామి. ఇతరుల విషయమై కవిత్వము చెప్పు రీతిగా గాక వీరి విషయమై చెప్పిన దంతయు యదార్థములే (నూటికి నూరు సాక్షాత్కరించ తగినవియే) ఇతరుల విషయమై చెప్పుట యంతయు అర్థవాదమే. స్వామి గుణములు అర్థవాదములుగా సమగ్రముగా చెప్పుటకును సాధ్యముగానివి. ఈ స్వామిని తమ వరకే గాక తమప్రపన్న కులమునకంతకును నాథుడుగా తెలిపిరి. ఇట్టి సమస్త కళ్యాణగుణాత్మకుడును, సర్వ స్తోత్రార్హుడును అగు సర్వేశ్వరుని విడచి, అతిక్షుద్రుడును స్తోత్రానర్హుడును అగు వానిని స్తోత్రము చేసి ప్రయోజనమేమని నుడివిరి.

భగవంతుడు ప్రకృతి సంబంధమును నివర్తింప చేయును. కాలకృతపరిణామములేని దేశములో (శ్రీ వైకుంఠములో) అర్చిరాది మార్గమునపోయి ఎన్నికల్పములున్నను ప్రచ్యుతి లేని క్రమములో (సహజ సిద్ధమగు) సర్వకాల సర్వావస్థలలో సర్వకైంకర్యములను అనుగ్రహించును. వాటికి ఉపాయభూతుడుగా నుండును. ఇట్టి స్వామిని విడచి గుణలేశమన్నా లేని యొక వ్యక్తిని వెదికి వెదకి అతని యొద్దకు పోగా అతడు సత్కారముచేయవలసి యుండు నేమో! అని తలచి కనబడక తొలగిపోవును. వీరును అతనికై వెదకుచునే యుందురు. ఇట్లు పరస్పర అన్వేషణము తప్ప ప్రయోజనము శూన్యము. జ్ఞానాధికులు తమ స్థాయికన్నా ఉన్నత స్థాయిని వెదకుదురుగాని అధః పతనమును కోరుకొనరుగదా.

ఓ కవులారా! మీ కవిత్వము పూర్తియగు వరకైనను జీవింపజాలని అల్పాయుష్కులగు

మానవులను స్తోత్రము చేసి సత్కారము పొందిన అది ఎందులకు ఉపయోగపడును? ఎన్ని దినములకు సరిపోవును? ఇంతవరకు చేసిన ఋణమునకు సరిపోవునా! మీ విశేషజ్ఞతకు సరిపోవునా!

సదా భగవంతుని స్తోత్రము చేయు స్వభావము కలిగి ఆకారణముచే నిరతిశయ తేజోమయ మణులతో కూడిన కిరీటముతో మూర్ధాభిషిక్తులైన వారు నిత్యసూరులు గదా! అట్టి నిత్య సూరినాథుడు ఆ స్వామి. అట్టి స్వామిని స్తోత్రము చేసిన వారికి నిత్యసూరులు వారి సభలో మీకు స్థానమును కల్పించి స్వామికి మీ కవిత్వమును విన్పింపచేతురు. వారును మీ కవిత్వమును విని తనివితీరక మాటి మాటికి అనుభవింతురు. విభీషణుడు ఆశ్రయించినంతనే లంకకు పట్టాభిషిక్తుని చేసి తరువాత ప్రతిబంధకమగు రావణుని సంహరించినట్లు నిత్య సూరినాథుడగు ఆ స్వామి తనతో సమానమైనట్టి కిరీటాదులను మీకు కృపచేసి "మమ సాధర్మ్యమాగతా:", "పరమం సామ్యముపైతి" అనునట్లు తమతో సమానమగు అలంకారగుణాదులను కృపచేయును.

భగవద్వ్యతిరిక్తులను స్తోత్రము చేయుట వారు పూజనీయులనికాదు. వారి వలన ఏదియో యొక ప్రయోజనమును పొందవలెననిగదా! అదియును లభించదని చెప్పుట కవిత్వము నుండి మొదట విరమించుటకై చెప్పిరి. కవిత్వము పొందిన వారికి ప్రయోజనముండదు. ఇతరులకు హితకారియును కాదు ఇది వారి యందు దాగియుండిన దోషములను బహిర్గతము చేయుటకే అగును. మీ వాక్కు వ్యర్థమగును. లేనిగుణములు స్తోత్రము చేసినందున అసత్యవాదులగుదురు.

ఇక మీరు చేయు కవిత్వమును స్వీకరించుటలో ఏ విధమగు కొరతయు లేనివారు ఆ స్వామి. కావుననే సమస్త కల్యాణ గుణాత్మకుడాయెను. ఇదియే వ్యక్తులకన్న భగవంతునకు గల ఆధిక్యము. మీ రపేక్షించిన భోగమోక్షముల నన్నిటిని అనుగ్రహించును. "భౌమం మనోరథం స్వర్గ్యం........ అపవర్గ ప్రదోహరిః ॥" అన్నట్లు ఎవరెవరు వేటిని కోరుదురో! ఆ యాప్రయోజనముల నిత్తురు. భగవద్వ్యతిరిక్తులు "అ పవర్గప్రద" "అనుటచే దోషము లేని వాడు భగవంతుడు. దేశకాల పాత్రతలను చూచి ఇంతటి ఉపకారము చేసితినని తలచకుండుట, పుచ్చుకున్నవారు తమ ఉపకారమునకు తగినట్లు ప్రత్యుపకారము చేయలేక పోతిమే అని బాధపడ వలసిన పని లేకుండునట్లు వారి ననుగ్రహించిన మహోదారుడు. వారి వలన ఐశ్వర్యాదుల పొందకపోయినను వారిని విడువజాలని సౌందర్యము కలవారు. అట్టి స్వామి విషయమై వెనుకడుగువేయక కవిత్వము చెప్పుటకు రండు.

ఓ కవులారా! మీ జీవనార్థమై కవిత్వము చెప్పినచో అది దావాగ్నిలో చిక్కుకొనినట్లుండును. ఆ తాపమును పోగొట్టుకొనుటకు బహుశీతలమైన మడుగువలెనున్న భగవంతుని స్తోత్రము చేయరండు. (ఎంబారు ధాన్యపు మూటలను మోయలేరా! గడ్డిని చెక్కుటయు చేయలేరా! అటులనే మీరును కాయక్లేశముల చేసి, చేతి పనులు చేసి జీవించు మార్గమును అన్వేషింపుడు అని

ప్పుదురట) మీరు కవిత్వము చెప్పి తద్వారా సన్మానము పొందదలచినను మీ కవిత్వము యొక్క
ప్పదనమును గుర్తించి తగిన విధముగా సత్కరించు శ్రీమంతులు ఇపుడు లేరు. మనుష్యుల
న్నా దేవతలు అధికులనినచో! ఆ దేవతలయందు మీరు పొగడిన గుణములు లేనందున ఆ
ుణములు ఆ దేవతలను అంతర్యామిగా నుండు స్వామికే చేరును. "పుండరీకాక్షుడు" అని
్త్రము చేసిన విరూపాక్షునికి చెందదుగదా! మీరు స్వామిని సర్వాధికుడు, సమస్త కల్యాణ
ుణాత్మకుడు, సర్వరక్షకుడు అను క్రమంలో స్తోత్రము చేయుదురు గదా! మీరు స్తోత్రము
యువారి యందు ఇట్టి కల్యాణ గుణములు లేనందున భగవంతుని గుణములను చౌర్యము
సిన వారగుదురు. సృష్టి స్థితి, సంహార దశలలో దేవతలతోసహా అందరిని తనలో ఉంచు
న్నందున ఆ దేవతలకు సర్వాధిక్యము లేదుగదా! ఆ దేవతలును ఆ సర్వేశ్వరుని ఎదుట వారి
ారి ఆపదలను మొరపెట్టుకొని దుఃఖమును పోగొట్టుకొనుచున్నారు. "వేదాపహార, గురు పాతక,
ృత్య పీడాదులలో ఆ స్వామి చే రక్షింపబడుట వలన సర్వరక్షకత్వము వారికి లేదు కనుక ఆధిరాజ్య
ాచకమైన కిరీటమును ధరించిన శ్రియః పతికే మీ స్తోత్రము చేరును.

జ్ఞానమనగా కేవలం భగవద్విషయమైన జ్ఞానము. మిగిలినవి అజ్ఞానమే. మీ జ్ఞానమునకు
ిషయము శ్రియఃపతియే. ఈ విధముగా సర్వశబ్ద వాచ్యుడు భగవంతుడే అయినందున మీరు
ప్రయోగించు శబ్దములన్నియు భగవంతునకే చేరును. వేదాంతములలో సర్వశబ్దములున్ను అచిత్తును
ెప్పినచో తదంతర్వర్తి యగు జీవునిన్ని, వానికి అంతర్యామి యగు పరమాత్మకును
ాచకములగుచున్నవి. విశేష్యప్రాధాన్యముచే సర్వశబ్దములు భగవంతునకే వాచకములగును. "యే
ుజంతి పితౄన్ దేవాన్..... సర్వభూతాంత రాత్మానం విష్ణుమేవ యజంతి తే॥ " అని నందున
ు ఆరాధనముకూడ అందరికి అంతరాత్మగా నుండు భగవంతునకే చేరును.

త్రోవలో నడచుచుండగా చేతిలో గల సొత్తు దొంగల పాలిట పడనప్పుడు ఎట్లు
ంతోషపడుదురో! అటులనే తమ కవిత్వము ఇతరులవిషయమైగాక భగవంతుని విషయమై
ఉపయోగపడినందుకు ఆళ్వార్లు సంతోషపడిరి.

ప్రపంచములో ఎవరైనను ఒక వస్తువును ఇచ్చిన చో దీనికి ఆధారమేమి; ఈ
ఐశ్వర్యమెక్కడిది? అని సందేహము కలుగును. శ్రీరామచంద్రుడు తన సింహాసనమును,
శత్రుంజయమను ఏనుగును తన సర్వస్వమును దానము చేసి అకించనుడాయెను . అట్టి
సమయములో త్రిజటుడు అను ఋషి వచ్చి యాచించగా సరయూతీరము ఈవలి వరకు గల
పశు సమృద్ధిని ఇచ్చి తోలు కొమ్మనేను. ఇదిగదా! ఆ స్వామి ఔదార్యము. ఆయన వేయినామములు
కలవాడు. ఆ నామములను నాకు ప్రకాశమొనర్చిన పరమోపకారి. అట్టి పురుషోత్తముడు
శ్రీమన్నారాయణుని తప్ప వేరొకరిని స్తోత్రము చేయజాలను. మేఘసదృశముగా నిరపేక్షముగా
ఇచ్చినవారు స్వామి. మేఘము వర్షించిన పిదప పాలిపోవును. కాని స్వామి శరీరము ఇచ్చిన పిదప

ఉజ్వలమగును. పర్వత సమానములై విస్తృతములై ధృఢమైన భుజములు గలవాడు స్వామి. ఇట్టి బాహుచ్ఛాయలో సర్వలోకములు ఉండతగినవి. అట్టి భగవంతుని నేను స్తోత్రము చేయుదును. నిష్ప్రయోజనులై తృణప్రాయులైన వారిని అసత్య భాషణముతో స్తోత్రము చేసిన ప్రయోజనమేమి?

నేను ఇతరులను స్తోత్రము చేయదలచినను నానాలుక స్వామిని తప్పవేరొకరిని స్తోత్రము చేయదు.

పురుషకారభూతురాలగు నీళాదేవీవల్లభుడైన స్వామిని స్తుతించి విలక్షణ శరీరమును పొంది ఆ దివ్య దంపతుల శ్రీ పాదములలో సేవ చేయుచు ఆ దంపతులను స్తోత్రము చేసిన నేను ఇతరులను ఎట్లు స్తోత్రము చేయుదును?

పరమోదారుడగు ఆ భగవంతుడు నాకవిత్వమునకు తనను విషయముగా చేసిన పిదప ఇతరుల స్తోత్రము జేయజాలను.

"విచిత్రా దేహ సంపత్తిః ఈశ్వరాయ నివేదితుం" "ఉపాదత్తే సత్తా స్థితి నియమనాద్యైః చితచితే............ ఔపనిషది॥" అన్నట్లు విచిత్రమగు దేహసంపద ఆ సర్వేశ్వరునకు ఉద్దేశించి చేతనా చేతనములను సత్తాస్థిలో నియమనాదులచే గ్రహించుచున్నాడు. అని భట్టారకులు ఆనతిచ్చిరి. మీరు వాక్ ప్రయోజనము పొందునట్లు స్తోత్రము చేసినట్లు చెప్పుచున్నారే! వేదములు కూడ స్వామిని స్తోత్రముచేయలేక మరల వచ్చినవిగదా! అట్టి విషయము కవిత్వము చేయ సాధ్యమా! ఆ సర్వేశ్వరుడు తమ పరికరములన్నియు భక్తులకుపయోగపడునట్లు అమర్చి అనుగ్రహించిన కొరత ఎట్లుండును?

హేయప్రత్యనీకమైన కళ్యాణ గుణములు నాకు ప్రకాశింపచేసిన మహోదారుడు. ఆగుణానుభవమునకు ఏర్పడిన అంతరాయమును నివర్తింప చేయు పరికరమైన చక్రాయుధమును ధరించిన మహోపకారకుడు. మోక్షానుభవముకంటే విశదముగా ఈలోకమున స్వానుభవమే జీవనముగా కలుగునట్లు చేసి ఆ నిత్య సూరులకు అధీనమైన ఆపరమపదమును నాకు కృపచేసినారు. శ్రీ రామచంద్రమూర్తి అరణ్య వాసము నుండి అయోధ్యకు తిరిగి వచ్చిన తర్వాత భరతుడు "కృతం దశగుణం మయా" అని తమ కోశాగారాదులను వారికి చూపిన విధముగా భగవంతుడున్ను శ్రీ వైకుంఠములో సంసారకాంతారము నుండి మరలి వచ్చిన జీవునకు తమ ఐశ్వర్యమును చూపించును. అటులనే ఈ అనుభవము ఒక దాని కొకటి ఇమిడి నట్లుకైంకర్యమును కృపచేసెను. ఇంత చేసినను నేను వీనివిషయములో ఏమియు చేయలేదే! అని తన మనస్సులో పరితపించుచుండును. అట్టి స్వామి ఉదారముగా తనను స్తోత్రము చేయుటకు ఇచ్చిన నాలుకతో క్షుద్రులైన మనుష్యులను గానము చేయువాడను గాను.

సర్వేశ్వరుని స్తోత్రము చెప్పు కవినైన నాకు ఇతర స్తోత్రము చెప్పుట తగదు.

భగవంతుడు ఈ జన్మలో కాక పోయినను మరొక జన్మలో నైనను ఉజ్జీవింపచేయునను

సంకల్పముతో ఈ లోకమును సృషించిన భగవంతుని ఇచ్చట ఉన్నంతకాలము స్తోత్రము చేయుచు జీవనమును గడుపుచు ఈ శరీర సంబంధము తొలగిన పిదప శ్రీవైకుంఠములో సామగానము చేయుచు "అహమన్నమహమన్నమహమన్నం" అని పాడుచునుండు కవినైన నాకు ఇతరులను కవిత్వము చేయుట తగునా! కృషీవలుడు పైరు పెట్టిన పిదప ఫలవంతముకాక తరకలైనను, ఈమారైనను ఫలవంతమగుననే ఆశతో మరలమరల పైరు పెట్టునట్లు శ్రీస్వామిని స్తోత్రము చేయుట ఉచితము. ఈ విషయమును సదృష్టాంతముగా నాలుగవ తిరువందాదిలో ఇరువది మూడవ పాశురములో తిరుమழிశై ఆళ్వారును తెలిపిరి.

ఈ తిరువాయమొழி యొక్క శబ్దమునైనను అభ్యసించినవారికి ఇతరుల స్తోత్రము చేయతగు నీచ జన్మ కలగదని ఆళ్వార్లు ఫలశ్రుతిని తెలిపిరి.

పరత్వసౌలభ్యమునకు తగినట్టి గుణ ప్రసిద్ధి కలిగి నిత్యసూరినాథుడై ఆ పరత్వముతోనే సులభుడుగా గీతలో 9వ అధ్యాయములో ఆనతిచ్చినట్లుగా అవతరించినాడు స్వామి. తిరునగరికి నిర్వాహకులై కవియునైన ఆళ్వార్లు వేదప్రతిపాద్యుడైన ఆ భగవంతుని తమ ప్రబంధములో వేయి పాశురములను అనుగ్రహించినారు. ఈ ఆత్మకు భగవంతుని స్తోత్రము చేయుట స్వరూపమనియు అందులకు ఉపక్రమింపుడని వివరించి, భగవంతుని స్తోత్రము చేయుటచే నీచ జన్మ కలగదని విరోధమైనను గట్టిగా హితమును ఉపదేశించిరి. శ్రీ కులశేఖరులును "ముకుందమాలలో నాథేన పురుషోత్తమే.......... మూకావరాకావయం॥" అను శ్లోకములో మాకు నాథుడవు, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడవు మనసా సదా సేవించినంతనే మాకు శాశ్వతానందజనకమగు మోక్ష సామ్రాజ్యమని పిలువబడు పరమపదము ననుగ్రహించు నీవుండగా మూర్ఖులమై కొన్ని గ్రామములకధిపతియును, కొంతధనమును ఇచ్చు పురుషాధముడగు నొకనిని వెదకు చున్నాము. దేవతలను, మనుష్యులను సేవించిన ఎడల ఎడతెగని సంసారబంధము కలిగి జనన మరణ దుఃఖము కలుగుచుండును. కావున ఓ మూఢు డా! నారాయణుని సేవ సదా చేయుమని నుడివెను.

కంచర్ల గోపకవియు దాశరథీశతకములో "చక్కెరమాని వేము దిన జాలిన కైవడి మానవాధముల్" అను పద్యములో క్షుద్ర దేవతల పూజించువారు అధములనియు, పురుషార్థములలో మోక్షము చివరిది. దానిని ఇచ్చువాడవు నీవే. ఇతర దైవముల భజించుట తగదని వివరించిరి. ఈ విధముగనే పెక్కురు ఆధునికులు కూడ వివరించి యున్నారు. కనుక భగవంతునే స్తుతింపవలెనని శ్రీ ఆళ్వార్ల అభిప్రాయము.



శ్రీ లక్ష్మీహయగ్రీవాయ నమః శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః
అస్మద్గురుభ్యో నమః

# పరాంకుశ ముని పరోపదేశములు

ఉ.వే. శ్రీమాన్ కె.ఎస్.జి. కృష్ణమాచార్యస్వామి
అంతర్వేదిపాలెం.

ప్రపన్నజన కూటస్థులైన శ్రీ నమ్మాళ్వార్లు భగవదనుభవానందమును ఒంటరిగా తామొక్కరే అనుభవింపజాలక సంసారిచేతనులకు కూడా తాము అనుభవించిన భోగ్యవిషయములను పంచి ఆనందభరితులను చేయదలచిరి. పరుల అనర్థములను చూచి సహించలేని దయా హృదయులు గనుక సాంసారిక విషయ భోగములయందుగల దోషములను, భగవంతుని కళ్యాణ గుణములందు గల భోగ్యతను వివరించినచో వారు ఆ సాంసారిక భోగములను విడచి భగవంతునాశ్రయింతురని ఆశపడిరి. మరియు భగవంతుడగు శ్రియః పతిని ఆశ్రయించుట వలన కలుగు ఫలితమును; జీవునకు, భగవానునకు మధ్యగల నిత్యసంబంధమును గుర్తు చేయుటవలన ఇతర విషయములపట్ల విరక్తియు, భగవదాశ్రయణముపట్ల అనురక్తియు కలుగచేయు సంకల్పముతో పరోపదేశములు కావించిరి.

**1. సంసారులకు ఇతర విషయములందు వైరాగ్యమును, భగవంతునియందు భక్తిని ఉపదేశించుట: (1-2)**

భగవంతుని యొక్క స్వరూపము చేతనాచేతనములవంటిది కాదు. అది ఆనందమయము. కావున ఇతర సంగములను విడచి మోక్షప్రదుడైన శ్రియః పతిని ఆశ్రయింపుడు. నాది నేను అనెడి అహంకార మమకారములను రెండింటినీ పూర్తిగా విడువుడు.

ఉభయవిభూతి ఐశ్వర్యము ఆ స్వామిసొత్తు, స్వామి మనలను తనవద్దకు చేరనిచ్చుటకు ఆచార్యకృప సాధనము కాగలదు. మనోవాక్కాయములనెడి త్రికరణములచేత ఆతని సేవింతుము. కాని ఉచ్చరించుటకు ఒక మంత్రము, ధ్యానించుటకు ఒక మూర్తి ఉన్ననే కదా ఆశ్రయణము సార్థకమగును. ఆ మంత్రమే అష్టాక్షరీ మహామంత్రము. ఆ దైవము సకల కళ్యాణగుణములకు ఆలవాలమైన శ్రియఃపతియే. మంత్రాను సంధానముతో అతని చరణముల నాశ్రయింపుడు. అర్థానుసంధాన పూర్వక మంత్రాను సంధానమునకు మించిన కర్తవ్యము మీకు లేదు. "అని "వీడుమిన్ ముత్తవుం" (1-2) అను తిరువాయ్ మొఴ్రి లో శ్రీ నమ్మాళ్వార్లు చేతనుల అనర్థములను చూచి వారికి ఉపదేశము కావించిరి.

## 2. భగవంతుడు సుఖారాధ్యుడు: (1-6)

భగవానుడు అవాప్త సమస్త కాముడు. "భక్తి క్రీతో జనార్దనః" అనునట్లు మనమర్పించు భక్తిని స్వీకరించి తృప్తిపడువాడు. "న మే భక్తః ప్రణశ్యతి" అని స్వయముగా భక్తునకు అభయమిచ్చియున్నాడు కదా! భక్తితో జలమును, ధూపమును, పుష్పమును సమర్పించిన చాలును, ప్రీతితో స్వీకరించును. త్రికరణములచేతను అతనిని భక్తితో సేవించుట ముఖ్యము.

ఎంతకాలము ప్రయత్నించినను పోగొట్టుకొన జాలని మన పాపములను గరుడధ్వజుడగు శియః పతి లక్ష్మీదేవి పురుషకారముచే క్షణకాలములో పోగొట్టి రక్షించును, అని "పరివది లీశనైప్పాడి" (1-6) అను దశకమున నమ్మాళ్వార్లు ఉపదేశించుచు "ఈ విధముగా వర్తించువారు సంసారమున ఎన్నడు జన్మింపరు. భగవదనుభవమే సర్వస్వముగా భావించు నిత్యసూరులతో కూడి భగవంతుని అనుభవింతురు", అని ఫలశ్రుతిని సాయించుచున్నారు.

## 3. అవతార పరత్వోపదేశము: (2-2)

కొన్ని ఇతిహాస పురాణ ప్రక్రియలచేత "సర్వేశ్వరుడు నారాయణుడొక్కడే" అని ఉపదేశించుచున్నారు "తిణ్ణన్ వీడు" (2-2) అను దశకమున, శ్రీ నమ్మాళ్వారులు. సృష్టిస్థితి సంహారాదులకు తగిన జ్ఞాన శక్త్యాది గుణములు కలవాడును, దేవ తిర్యక్ మనుష్యాది స్థావర జంగమములను సృష్టించినవాడును, ఉభయ విభూతులు కలవాడును, మోక్షము మున్నగు పురుషార్థములను ప్రసాదించువాడును, ప్రళయకాలమున సకల జగత్తును తన ఉదరములో నుంచుకొని రక్షించువాడును, అనన్యపరమైన నారాయణ శబ్దవాచ్యుడును అయిన సర్వేశ్వరుని విడచి మరియొకదేవతను ఈశ్వరుడనుట తగదు. బ్రహ్మరుద్రేంద్రులకు కలిగిన ఆపదలను పోగొట్టి కాపాడినవాడును, పుండరీకాక్షుడును అయిన శ్రీమన్నారాయణుడే సర్వేశ్వరుడు అని ఉపదేశించి "ఈ తిరువాయ్ మొழிని అర్థజ్ఞానముతో అనుసంధించువారికి ఏ కొరతయు ఉండదని ఫలశ్రుతిని సాయించిరి.

## 4. సర్వేశ్వరుని మోక్ష ప్రదత్వము: (2-8)

పరత్వ సౌలభ్యగుణములు ప్రకాశించునట్లు లక్ష్మీదేవిని తన వక్షఃస్థలమున ధరించినవాడును, బ్రహ్మరుద్రులకు అంతర్యామిగా నుండి సృష్టి సంహార కార్యములను చేయించువాడును అయిన ఆ శ్రీమన్నారాయణుని సర్వేశ్వరత్వము నిరాఘాటమైనది. సంసార సాగరమును దాటి సర్వోత్తమ పురుషార్థమగు మోక్షానందమును పొందుటకు ఆ శ్రియఃపతి పాదారవిందములను ఆశ్రయింపుడు. పరమ పదమున దివ్యమంగళ విగ్రహముతో వేంచేసి యున్నవాడై ఇక్కడకు వచ్చి హయగ్రీవ, మత్స్య, కూర్మ, రామకృష్ణాది నామములతో

అవతరించిన ఆ స్వామిని ముందుగా నేనే అనుభవించితినని తమ అనుభవ పరీవాహరూప ఆనందమునకు ముగ్ధులై ఆహా! ఏమి నా భాగ్యమనుచున్నారు, "అణైవదరవణైమేల్"(2-8) అనుదశకమున శ్రీ నమ్మాళ్వారులు.

**5. భగవంతునకు నిత్యకైంకర్యమును చేయుడని ఉపదేశించుట: (3-3)**

ప్రకృతి సౌందర్యమునకు నెలవైన తిరుమలపై గొప్ప తేజస్సుతో వేంచేసియున్న శ్రీనివాసుని, పరమపదమున గల నిత్యసూరులు కూడా వచ్చి సేవించుచున్నారు. అట్టి అద్భుతమైన అవయవ సౌందర్యముకల శ్రీనివాసుని సన్నిధిలో "నమః" అని అనుసంధించువారి సమస్త పాపములు నశించి పరమపదమున నిత్యకైంకర్యము చేయగలుగుదురు. "భగవద్భక్తులారా! శరీరము శిథిలమై అవసానదశ సమీపించక మునుపే ఆదిశేషుని పాన్పుగా చేసుకొన్న ఆ శ్రీనివాసుని, ఆ కొండయందలి తటాకమును, తోటలను దర్శింపుడు. నిత్యకైంకర్యము చేయుడు, అని "శ్రీ పరాంకుశమునులు" "ఒழ్రిల్ కాలమెల్లామ్" (3-3) అను దశకమున ఉపదేశించి ఈ తిరువాయ్ మొழ్రిని అనుసంధించువారు భగవత్ కైంకర్య లక్ష్మిని పడసి సుఖింతురని ఫలశ్రుతిని సాయించిరి.

**6. అర్చావతార సౌలభ్యము:**

భక్తులు ఆశ్రయించుటకు అర్చావతారమొక్కటే సులభమైనది. ఈ అర్చావతారమున స్వామి అర్చక పరాధీనుడై యుండును. (ఆలయములలో విగ్రహరూపమున దర్శన మిచ్చు రూపమే అర్చావతారము). ఆ పరమపదమున వేంచేసియుండు పరాత్పరుడే ఈ అర్చావిగ్రహములోను వేంచేసియుండి జగద్రక్షణ కావించుచున్నాడు.

చేతనజన సజాతీయుడై శ్రీరామచంద్రుడుగా నవతరించిన స్వామిని ఆశ్రయింపుడు. లేదా సౌలభ్య గుణప్రధానమైన కృష్ణావతారముననున్న స్వామిని ఆశ్రయింపుడు. కుడి ఎడమలు తెలియని గోపికలతో రాసక్రీడలు సలిపిన వాడును, ఇంద్రనీలమాణిక్యమువలె నల్లని దివ్యమంగళ విగ్రహము కలవాడును, పాండవ పక్షపాతియై భారత యుద్ధమున అర్జునుని రథసారథ్యము నిర్వహించినవాడును అయిన పురుషోత్తముని రాత్రింబవళ్ళు స్తుతింపుడు. విషయాంతరములపై పరిగిడు మీ మనస్సును స్వామి వైపు మరలింపుడు. ఆ స్వామియే నాకు ఎల్లప్పుడు ధారక పోషక భోగ్యభూతుడు అని భక్తి పారవశ్యముతో శ్రీ నమ్మాழ్వార్లు "శెయ్యతామరై క్కణ్ణనాయ్" (3-6) అను దశకమున ఉపదేశించుచు దీనిని అనుసంధించువారికి భగవద్భక్తి వృద్ధి చెందునని ఫలశ్రుతిని సాయించిరి.

**7. భాగవత శేషత్వమే పరమపురుషార్థము: (3-7)**

భగవత్ శేషత్వమునకు భాగవత శేషత్వమే పరమావధి. "మచ్చిత్తా మద్గత ప్రాణాః"

అనునట్లు భగవత్ కైంకర్యనిష్ఠులే భాగవతులు కదా! శ్రీమద్రామాయణమున శబరి శత్రుఘ్నులు ఈ భగవత్ శేషత్వ నిష్ఠగలవారు. వీరిలో కొందరు శ్రియఃపతియొక్క దివ్యమంగళ విగ్రహ సౌందర్యమునందు ప్రవణులు. కొందఱు ఆ శ్రియఃపతి కల్యాణగుణములలో ఆసక్తి గలవారు. కొందఱు అతిమానుషచేష్టితములకు ముగ్ధులు. ఇట్టి భగవచ్ఛేషత్వముగల వారందఱితో తమకు సంబంధముండవలెనని ఆళ్వారులు ఆశించుచున్నారు.

"దివ్యతేజోమూర్తియు, పుండరీకాక్షుడును, క్షీరసాగరశాయియు, పరమపురుషుడును, పీతాంబరధారియు, సుదర్శనాయుధుడును, ఆధిరాజ్యసూచకమగు కిరీటమును ధరించినవాడును, శ్రీకృష్ణుడుగా అవతరించిన మనస్వామి గుణానుసంధానము చేయు భాగవతోత్తములే మనకు ఆశ్రయింపదగినవారు. వారు మనకు శ్రియఃపతి కైంకర్యమును లభింపచేసి మరల జన్మించకుండునట్లు రక్షింతురు. కనుక భాగవతోత్తములను ఆశ్రయింపుడు.' ' అని పయిలుమ్ శుడరొళి మూర్త్తియై (3-7) అన దశకమున శ్రీ శఠకోపులు ఉపదేశించుచు ఈ దశకమును అనుసంధించినవారు జన్మరాహిత్యము పడయుదురని ఫలశ్రుతిని అనుగ్రహించిరి.

ఈ ఆళ్వార్లు ప్రార్థించిన రీతిలోనే శ్రీకులశేఖరసూరులును "త్వద్భృత్య భృత్య పరిచారక భృత్యభృత్య, భృత్యస్య భృత్య ఇతి" అని భాగవత శేషత్వమును ప్రార్థించిరి.

**8. మనుష్యులను స్తుతింపక భగవంతుని స్తుతింపుడని కవులను గూర్చి ఉపదేశము:**

"శొన్నాల్ విరోదమిదు" (3-9) అను దశకమున శ్రీ నమ్మాళ్వార్లు తాము స్తుతించు శ్రియఃపతికిని, కవులు స్తుతించు లోక ప్రభువులకు గల తారతమ్యమును తెలుపుచున్నారు. శ్రియఃపతి:- 1) సమస్త కళ్యాణ గుణాకరుడు, లక్ష్మీదేవికి భర్త . 2) భక్తులకు అత్యంత సులభుడు. 3)స్తుతించుటకు నిత్యసూరి బృందము కలవాడు. 4) భక్తులు వినిపించు ప్రబంధములు. వినుటకు సదా సన్నిహితుడు. 5) తననుగూర్చి పాడినవారికి భోగ మోక్షాది సకల పురుషార్థములను ఈయగలవాడు. 6) తాను భక్తులకు ప్రసాదించుటకు ఉభయ విభూతి ఐశ్వర్యములు కలవాడు. 7) ఏ విశేషణములు చెప్పినను సర్వశబ్దవాసచ్యుడు గాన తనకే వర్తించునట్లుండువాడు.

కవులు స్తుతించు మానవ ప్రభువులు: 1. స్తుతించుటకు విషయములు ఏవియును లేనివారు. 2.కావలసినవి ఇచ్చుటకు అవి తమకే లేనివారు. 3.కష్టపడి కవిత్వము చెప్పుటకేగగా ఆ ప్రభువు మరణించెనని విని కవులు నిరాశ చెందుదురు. 4.కవుల కిచ్చు ప్రతిఫలము అల్పము, అస్థిరము. 5.స్తుతించుటకు సుగుణములు లేకపోగా లోకులు మరచిపోయిన దుర్గుణములు జ్ఞాపకము వచ్చు ప్రవృత్తి గలవారు. 6.చేయకూడని స్తుతియగుటచే కవులకు నరకావహమగును. 7.క్షుద్రులను స్తుతించుటవలన శిష్టులు అతనిని వెలివేయుదురు.

కనుక ఓ కవులారా! అల్పములు, అస్థిరములు అయిన ధనములకొఱకు క్షుద్రులను స్తుతింపకుడు. మిక్కిలి భోగ్యమైన మీ కవితామతల్లిని క్షుద్రుల పాలొనరింపక దేవాధి దేవుడును, సకల కల్యాణ గుణాభిరాముడును, మాణిక్య వర్ణుడును, ఐహిక ఆముష్మిక సుఖములనే కాక మోక్షమును కూడ ఈయగలవాడును అయిన శ్రియఃపతిని గూర్చి కవిత్వము చెప్పుదము రండు.

నేను భూమండలములోని నిస్సారులైన పురుషులను గూర్చి అసత్యప్రశంసలను చేయజాలను. తిరుమల యందు ఏనుగుగున్నవలె వేంచేసియున్న శ్రీనివాసుని నా కవితకు విషయ్య భూతునిగాచేసికొనియుంటిని. ఆ సర్వేశ్వరుడు తన సేవకై నాకు శరీరేంద్రియాదులను కటాక్షించినాడు. మోక్షము కంటే అర్చావతార ఆనందానుభవము నిత్య కైంకర్యముగా ప్రసాదించియున్నాడు. అట్టి సర్వేశ్వరుని గానముచేయు కవిని కావున నాకిక అన్యునిగూర్చి కవిత్వము చెప్పుట తగదు కదా! అని తమ స్వరూప స్థితిని వివరించి "ఈ దశకమును శబ్దజ్ఞానముతో అను సంధించువారికి ఇతరులను గూర్చి కవిత్వము చెప్పు నీచజన్మ యుండదని సాయించిరి.

**9. ఐశ్వర్యము అస్థిరము: (4-1)**

"సంసారులు పరులనుండి ఆశించు ఫలములును ఐశ్వర్యములును అల్పములు, అస్థిరములు. అవి స్వరూప విరుద్ధములు. సార్వభౌములైన రాజులే రాజ్యలక్ష్మిని కోల్పోయి దరిద్రులై దీనస్థితిలో బిచ్చమెత్తుకొని జీవించుచుందురు. ఐశ్వర్యవంతుల సుఖ జీవనము వర్షములో నీటిబుడగవంటిది.

కావున సత్యమెరిగి నిత్య సంపద అయిన సర్వేశ్వరుని ఆశ్రయింపుడు. సర్వేశ్వరుని కటాక్షములేనిచో మిక్కుటమైన భోగములలో మునిగి తేలుచున్నవారు కూడా అధోగతిపాలు కాకమానరు. మీరు ఫలమును గోరి దాన ధర్మాదులు చేసినచో స్వర్గాది భోగములు సిద్ధించును కానీ ఆ పుణ్యము క్షీణించగనే సంసారమండలమునకు మరలివత్తురు. కనుక అందఱు ఆశ్రయించుటకు వీలుగా క్షీరసాగరమున శయనించినవాడును, గరుడధ్వజుడును అయిన శ్రీమన్నారాయణుని శ్రీపాదముల నాశ్రయింపుడు. అతడు నిరుపాధికశేషి. మనము ఆతనికి నిరుపాధిక శేషభూతులము. ఇహలోక ఐశ్వర్యము, స్వర్గాది భోగములు, కైవల్యము వీటి అన్నింటికంటే శ్రీమన్నారాయణుని ఆశ్రయించి విడువకుండుటయే పరమ పురుషార్థమగును.' ' అని శ్రీ నమ్మాళ్వారులు "ఒరు నాయకమాయ్॥ (4-1) అను దశకమున ఉపదేశము గావించుచు "ఈ దశకమును అనుసంధించువారు అగాధమైన దుఃఖ సాగరమును దాటి ఉన్నత స్థానమును పొంది భాగ్యశాలురగుదురు" అని ఫలశ్రుతిని అనుగ్రహించిరి.

**10. క్షుద్ర దేవతల నారాధింపకుడని ఉపదేశించుట: (4-6)**

"తీర్వారైయామిని"(4-6) అను దశకమున శ్రీ నమ్మాళ్వార్లు పరోక్షముగా అనగా

చెలికత్తె మాటలలో ఉపదేశము చేయుచున్నారు.

ఆళ్వార్ నాయిక భగద్విశ్లేషమును సహింపలేక మూర్ఛిల్లెను. అపుడు బంధువులు కలత చెంది ఏదో క్షుద్రదేవత సోకినదని తలచి సోదెకత్తెను రప్పించి హేయమైన చికిత్సలు చేయించిరి. కానీ దానివలన ఆళ్వార్లకు ఉపశమనము కలుగకపోగా వ్యాధి ముదిరినది. అపుడు ఆళ్వార్ నాయిక తత్త్వమెరిగిన సఖులు ఆ చికిత్సలు వీరికి తగవని వివరించి భగవన్నామసంకీర్తనము, భాగవత పాదధూళిమున్నగు వానిచే ఈ స్థితిని తొలగింపుడని ఆ సఖుల మాటలుగా ఈ తిరువాయ్ మొழிలో తెలుపుచున్నారు.

"ఓతల్లులారా! ఈ ఆళ్వార్ నాయికకు ఏర్పడిన వ్యాధి లోకవిలక్షణమైనది. ఇది ఆ పరాత్పరుని మూలముగ వచ్చినదే కాని క్షుద్రదేవతల మూలమున వచ్చినది కాదు. క్షుద్రదేవతల తృప్తికి మీరు చేయు ప్రయత్నములవలన ఈమె మీకు దక్కదు. కనుక మీ నీచకృత్యములను మాని ఆశ్చర్యచేష్టితుడును, పరతత్త్వమును, ఇంద్రనీలమాణిక్యము వంటి దేహకాంతి గలవాడును అయిన శ్రీకృష్ణుని పాదారవిందములకు మంగళాశాసనము చేయుడు. ఆతని భక్తులగు శ్రీ వైష్ణవుల పాదధూళిని ధరింపచేయుడు. క్షుద్ర దేవతలను గూర్చి పాడుటమాని వేదముచే తెలియదగిన ఆ ద్వారకానాథుని స్తుతింపుడు. ఆ స్తోత్రముచే ఈ పిల్ల మూర్ఛను వీడి తెలివివచ్చి ఆతనిని సేవించి ఆ ఆనందముతో నృత్యము చేయును."

ఈ విధముగా శ్రీ వైష్ణవులకు దేవతాంతర స్పర్శయు, క్షుద్రదేవతారాధకుల స్పర్శయు సత్తయాబాధకములనియు, భగవన్నామ సంకీర్తనము, భాగవత సహవాసము సత్తయాధారకములనియు తెలుపుచు "ఈ దశకము ననుసంధించువారు" దుఃఖము లేకుండ జీవింతురు" అను ఫలశ్రుతిని శ్రీ నమ్మాళ్వార్లు అనుగ్రహించిరి.

**11. అర్చలో పరత్వోపదేశము: (4-10)**

ఈ "ఒన్ఱుం తేవుమ్" (4-10) అను దశకమున శ్రీ నమ్మాళ్వార్లు అర్చావతారములో పరత్వమును సాధించుచున్నారు. "ఇదుతాన్ పరవ్యూహ విభవఙ్గళ్ పోలన్ఱిక్కే కణ్ణాలే కాణలాంబడి ఇరుక్కుమ్". అన్నట్లు పరవ్యూహ విభవములవలె కాక ఈ అర్చావతారము కంటికి కనిపించునదై అందఱకు అందుబాటులో నుండును.

"బ్రహ్మాది దేవతలను, లోకములను, సమస్త ప్రాణులను సృష్టించినవాడును, స్వాభావిక కల్యాణ గుణములు గలవాడును అయిన ఆదినాథుడైన సర్వేశ్వరుడు పరమపదభోగములను విడచి ఈ తిరునగరిలో వేంచేసి మనలను తల్లివలె కాపాడుచుండగా "దాహార్తుడు గంగయొడ్డున నూతిని త్రవ్వుటకు ప్రయత్నించునట్లు" ఇతర దేవతలను ఆశ్రయించుచున్నారా? దేవతలు పరమపురుషునకు శరీరముగ నుందురే కాని స్వతంత్రులు కారు. రుద్రునకు కలిగిన బ్రహ్మహత్యా పాతకమును వైకుంఠనాథుడగు శ్రీమన్నారాయణుడే

పరిహరించెను.

మార్కండేయాదులు దేవతాంతరమునాశ్రయించి అభీష్టములను పొందిరని అనుకొందురేమో! మార్కండేయుడు ఈశ్వరుని వలన దీర్ఘాయువును మాత్రమే పొందెను. మృత్యువునుండి అతనిని కాపాడినది శ్రీమన్నారాయణుడే. దేవతాంతరములను ఆశ్రయించునట్టి వ్యామోహమును కలిగించువాడు నారాయణుడే. "మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరంతి తే" "ఎవరు నన్నే ఆశ్రయించుచున్నారో వారు ఈ మాయను దాటుచున్నారు" అని స్వామియే తెలిపినాడు. కనుక దేవతాంతరములను ఆశ్రయింపక తిరుక్కురుగూరునందు వేంచేసియున్న శ్రియఃపతి శ్రీపాదములనే ఆశ్రయించి సేవింపుడు." అని ఉపదేశించుచు ఈ దశకమునను సంధించువారికి మోక్షము కరతలామలకమైయుండునని ఫలశ్రుతిని సాయించిరి.

**12. భాగవత వైభవము: (5-2)**

తమ ఉపదేశప్రభావముచేత దిద్దుబాటు కాబడిన శ్రీ వైష్ణవ సమృద్ధిని సేవించి మంగళాశాసనము కృపచేయుచున్నారు శ్రీ నమ్మాళ్వార్లు "పొలిగ పొలిగ పొలిగ" (5-2) అను దశకమున.

ఓ సంసారులారా! శ్రీ వైకుంఠనాథుని భక్తులు లోకమంతటను వ్యాపించియున్నారు. రాజస తామస ప్రకృతిలో రాక్షసులవలె పుట్టి భగవద్విముఖులై దుర్మార్గులై తిరుగుచున్నవారిని రూపుమాపుటకై చక్రధరుడగు సర్వేశ్వరుని భక్తులు లోకమున అవతరించిరి. వీరు చతుర్వేద సారమగు పురుషసూక్తాది ఋక్కులను అనుసంధించుచు ఆ స్వామి సేవకై పుష్పములు ధూపము, దీపము మున్నగు ఉపచారవస్తువులను చేతపూనియున్నారు. అంతేకాక భగవంతుని గుణములను చక్కగా పాడుచు, నృత్యము చేయుచున్నారు. కనుక మీరు దేవతాంతరములయందు పరతత్వబుద్ధిని విడచి శ్రీమన్నారాయణుడే పరదైవమని విశ్వసింపుడు. ఆ స్వామి భక్తులను ఆశ్రయించి ఉజ్జీవింపుడు" అని భాగవత శేషత్వము కలిగియుండవలెనని ఉపదేశించుచు ఈ దశకమును అనుసంధించువారికి దేవతాంతరప్రావణ్యము, క్షుద్ర పురుషార్థప్రావణ్యము అను దోషములు తొలగునని ఫలశ్రుతిని సాయించిరి.

**13. ఆ భాస బంధువులపై ఆధారపడకుడు: (9-1)**

సహాయకులుగా రక్షకులుగా పైకి కనిపించు జ్ఞాతులు, బంధువులు రక్తమును పీల్చు జలగలవంటివారు. మన వద్ద ధనమున్నప్పుడు దగ్గఱకు చేరి స్తుతించి బహుమానములను తీసికొని పోవుదురు. దారిద్ర్యము దాపురించినచో అయ్యో! పాపమనియైనను అనుకొనరు. అట్టి ఆభాస బంధువులను రక్షకులని నమ్మకుడు. నిరుపాధిక బంధువైన శ్రియఃపతిని రక్షకునిగా

నమ్మి ఉజ్జీవింపుడు.

మనతో సంచరించు భగవంతుని ధ్యానింపక ఉపేక్షించి మన పూర్వులెందరో పుట్టి నశించిరి. శ్రీకృష్ణుడు ఉత్తర మధురలో నవతరించెను. ఆమధుర నిరంతర భగవత్ సంబంధము కలది. వామన మూర్తి అచట తపస్సు చేసెను. అది శత్రుఘ్నునికి రాజధాని. ఆ పిమ్మట శ్రీ కృష్ణుడు అక్కడ అవతరించెను. **"మధురానామనగరీ పుణ్యాపాపహరీ శుభా"** అని మహర్షులు మధురను కీర్తించిరి. అట్టి మధుర యందవతరించిన శ్రీ కృష్ణుని మంగళకరమైన చరణారవిందములను నిత్యము స్తోత్రము చేయు అధ్యవసాయమును పూనుడు" అని శ్రీ నమ్మాళ్వార్లు "కొణ్డపెణ్డీర్" (9-1) అను దశకమున ఫలశ్రుతిని అనుగ్రహించిరి.

**14. మోక్షప్రాప్తికి భక్తి ప్రపత్తులే సాధనములు: (9-2)**

తిరుక్కణ్ణపురమున వేంచేసియున్నవాడును, ప్రళయకాలమున మఱ్ఱియాకుపై పవళించువాడును, బ్రహ్మాండాధిపతియు, నిత్యసూరులకు స్వామియు, లేళ్ళచూపులను పరిహసించునేత్ర సౌందర్యముగల నప్పిన్న పిరాట్టికి భర్తయు అయిన శ్రియఃపతి యొక్క పాదద్వంద్వములయందు భక్తికలిగి ఆశ్రయింపుడు. ఆతడే మీకు రక్షకుడు. ఆతడే ఆప్తబంధువు. భక్త సులభుడు. అనన్యప్రయోజన పరులై ఆ స్వామి శ్రీపాదములనాశ్రయించి ప్రపత్తి చేసినచో ఆతడే మీ యోగక్షేమములను వహించును. సర్వేశ్వరుని శ్రీ పాదములను ఆశ్రయించిన నాకు అనాదియైన పాపములు పరిహరింపబడినవి. లక్ష్మీదేవి నిత్యవాసము చేయుచున్న వక్షఃస్థలముగల శ్రియఃపతిని తలంచినచో దుఃఖములు దరిజేరవు." అని శ్రీశఠకోపమునులు "మాలైనణ్ణి"(9-10) దశకమున ఉపదేశించిరి.

**15. దివ్యదేశ సందర్శన విధిని గూర్చి ఉపదేశించుట: (10-2)**

"కేశవా! అని నామోచ్చారణ చేసినచో యమ దూతలును దరికిరారు. ఆ పరమపదనాథుడే ఈ తిరువనంతపురమున వేంచేసియున్నాడు. ఫలాంతరముల నపేక్షింపక ఆ స్వామిని ఆరాధించు భాగవతులు ఎట్టి పుణ్యాత్ములోయని కొనియాడుడు. ఈ పెరుమాళ్ళను ఆశ్రయించువారు నిత్యసూరులగుదురు.

బ్రహ్మరుద్రాదులకు కారణభూతుడై వారి దుఃఖములను పోగొట్టిన సర్వేశ్వరుడే ఈ తిరువనంతపురమున వేంచేసియున్నాడు నిత్యసూరులలో ఒకరైన "విష్వక్సేనాళ్వారు" ఆ స్వామి కైంకర్యము చేయుచున్నారు. వారితో కలసి కైంకర్యము చేయుట సేవించుట మహాభాగ్యము కాదా!

మనము పోగొట్టుకొనజాలని ఘోర పాపములను కూడ పోగొట్టుకొను ప్రాయశ్చిత్త విధానమున్నది. తిరుక్కణ్ణపురమున ఆదిశేషునిపై పవళించి వేంచేసియున్న సర్వేశ్వరుని శ్రీపాదములు సేవించుటకు వెళ్ళుటయే. కావున ఓ బంధువులారా! త్వరపడుడు.

ప్రకృతి సౌందర్యముకల తిరువనంతపురమే మరణదశలో మనకు రక్షకము. అచట వేంచేసి యున్న శ్రియఃపతికి పరిశుద్ధములైన ధూపదీప పుష్పాదులను స్తోత్రపూర్వకముగా సమర్పించువారు నిత్యసూరులను మించిన వారగుదురు." అని శ్రీ నమ్మాళ్వార్లు "కెడుమిడరాయ వెల్లామ్" (10-2) అను దశకమున ఉపదేశించి "ఈ దశకమును అనుసంధించువారు పరమపదమునకేగి అచట భగవానుని ఆజ్ఞచే వచ్చిన అప్సర స్త్రీల సుందరహస్తములచే బ్రహ్మాలంకృతులు కాగలరు, అనగా ముక్తులు కాగలరని ఫలశ్రుతిని అనుగ్రహించిరి.

**16. అవశ్య కర్తవ్యోపదేశము: (10-5)**

ఓ భక్తులారా! శ్రీకృష్ణుని పాదద్వంద్వము నాశ్రయింపుడు. మీరు అనుసంధించదగినది "నారాయణ" అనునదియే. దీనికి ప్రణవ, నమః పదములు చేర్చుకొనుడు. చతుర్థిలేకున్నను అర్థపూర్తికి లోటులేదు.

నారాయణుడు నాకు స్వామి. అతడు జగత్ కారణుడైన శ్రీకృష్ణపరమాత్మయే. అనన్యగతికులై తన నాశ్రయించువారిని ఆ స్వామి రక్షించును. లక్ష్మీదేవి పురుషకారభూతురాలు. నారాయణుడు సకల లోక స్వరూపుడు. సర్వాంతర్యామి. సకల జగత్తులు తనకు శరీరముగను తాను వానికి ఆత్మగను ఉండును. సృష్టికాలమున తన సంకల్పమాత్రముచేతనే లోకములను [illegible]తో సృష్టించును. ప్రళయకాలమున జగత్తును తన గర్భముననిడుకొని కాపాడును. లోకముల యొక్క సర్వవిధ రక్షణము తానే చేయును.

"నారాయణ" శబ్దముతో "శ్రీమత్" శబ్దమును చేర్చి అనుసంధించినచో పాపరాశినశించును. దీనికి అధికారనియమము లేదు. నీలమేఘశ్యాముని తిరునామమును అనుసంధించువారు నిత్యసూరులగుదురు అని "కణ్ణన్ కళ్లిణై" అను దశకమున శ్రీనమ్మాళ్వార్లు ఉపదేశించిరి.

ఈ విధముగా సర్వేశ్వరుని కృపకు పాత్రులైన ఈ ఆళ్వారుల శ్రీ సూక్తులైన ఈ పాశురములను అనుసంధించు భక్తులకు ఆళ్వారులు భగవదనుగ్రహమును పురుషార్థమును కలుగచేయుదురు.

ఆళ్వార్ తిరువడిగళే శరణమ్.



శ్రీమతే శఠకోపాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# తిరువాశిరియమ్

న్యాయవేదాన్తవిద్వాన్,
ఉ.వే. శ్రీమాన్ తి.అ. కృష్ణమాచార్యస్వామివారు,
తిరుపతి.

ప్రపన్నజనకూటస్థరాన నమ్మాళ్వార్ అరుళిచ్చెయ్ద నాన్గుప్రబంధం గళిల్ తిరువాశిరియం ఎన్ఱ ప్రబంధమ్ ఆచార్యకటాక్షత్తై త్తుణైయాకక్కొండు యథామతి వివరిక్కప్పడుకిఱదు.

తమిழ்ழమొழியిల్ ప్రసిద్ధమాన వెణ్బా, ఆశిరియప్పా, కలిప్పా, వఞ్జిప్పా ఎన్నుమ్ నాన్గు పాక్కళిల్ ఏழு ఆశిరియప్పాక్కళాల్ తొడుక్కప్పట్టదు ఇన్నూల్. ఆశిరియమ్ ఎన్ఱ శొల్ శబ్దశక్తియాల్ ఆశిరియప్పావై క్కుఱిప్పిట్టు, అప్పడిప్పట్ట ఆశిరియప్పాక్కళాల్ అమైన్ద ఇన్ద నూలై లక్షణైయినాల్ తెరివిక్కిన్ఱతు ఎన్బర్ పెరియోర్. 'తిరు' ఎన్బదు ఇన్నూలుక్కు విశేషణమ్. ఇదనాల్ శబ్దమాధుర్యత్తాలుమ్, అర్థపుష్టియాలుమ్ ఇదఱ్కుళ్ల వైలక్షణ్యమాకిఱ శ్రీమత్త్వమ్ వివక్షితమ్. ఆశిరియప్పావిన్ ఇలక్కణమ్ తమిళ్ యాప్పిలక్కణనూలిల్ క్కాణత్తక్కతు. విరిప్పిన్ పెరుగుమెన్ఱు విడ ప్పట్టతు.

## అవతారికై

అజ్ఞానమ్, అన్యథాజ్ఞానమ్, సంశయమ్, విస్మృతి ఎన్నుమ్ మయర్వుకళ్ అత్తనైయుమ్ అఱ్ఱు పోమ్బడి శ్రియఃపతియాన ఎమ్బెరుమానాలే జ్ఞానముమ్, భక్తియుమ్ నిర్హేతుకమాక అరుళ్ శెయ్యప్పెఱ్ఱ నమ్మాళ్వార్ ఇవ్వులకోర్ ఉజ్జీవిప్పతన్పొరుట్టు ముఱైయే

అరుళిచ్చెయత ప్రబన్ధఙ్గళ్ తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియ తిరువన్దాది, తిరువాయ్మొళ్ళి ఎన్ను నాన్గాగుమ్.

అవత్తుళ్ తిరువిరుత్తత్తిల్, "ఇమైయోర్ తలైవా, పొయ్న్నిన్ఱ జ్ఞానముమ్ పొల్లావొళుక్కుమ్, అళుక్కుడమ్బుమ్ ఇన్నిన్ఱ నీర్మైఇనియామురైమై అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పమ్ కేట్టరుళాయ్" – శరీరమే ఆత్మా, శరీరాతిరిక్తమాక ఆత్మా ఇరున్దాలుమ్ అదు స్వతన్త్రమ్, అత్తకైయ స్వతన్త్రవస్తువుక్కు ఉలకిలుళ్ళ పొరుళ్కళ్ ఎల్లామ్ ఉరిమైప్పట్టదు ఎన్నుమ్ పొయ్యిలే నిలైనిన్ఱ జ్ఞానముమ్, అతనాల్వరుమ్ పుణ్యాపాపఙ్గళాకియ కర్మఙ్గళుమ్, అవఱ్ఱాల్ ఉణ్డాకుమ్ ప్రాకృతశరీరఙ్గళు మాయ్ క్కొణ్డు ఇప్పడియే మేల్మేలుమ్ ఉణ్డాకియ ఇన్ద హేయమాన నిలైమైయై, ఇనిమేలుమ్ అడియేనుమ్ అడియేనై చ్చేర్న్దవర్కళుమ్ అడైయాదపడి (రక్షిత్తరుళవేణుమెన్ను) దేవరీర్కు అడియేన్ శెయ్యుమ్ విణ్ణప్పత్తై దేవరీర్ శెవిశాత్తియరుళవేణుమ్ ఎన్ను నిత్యసూరికళ్ తలైవనాన ఎమ్బెరుమానై సంబోధిత్తు ప్రార్థిత్తార్ ఆళ్వార్. ఎంబెరుమానో ఇవరైక్కొండు తన్నైప్పఱ్ఱియ పాడల్కళై ప్పాడువిత్తు అవఱ్ఱిన్ మూలమాక సంసారికళైత్తిరుత్త నినైత్తానాకయాలే ఇవర్ ప్రార్థిత్త శరీరసంబన్ధ నివృత్తియాకియ మోక్షత్తై ఇవర్కు త్తన్దరుళవిల్లై. అత్తనై క్కాలవిళంబం పొఱుక్కమాట్టాద ఇవర్కు, దరిప్పతఱ్కాక ఎంబెరుమాన్ "ఇవర్ మోక్షత్తై విరుంబువదుం పరమపదమ్ శెన్ఱు నమ్ముడైయ గుణంగళై ఇడైయఱామల్ అనుభవిక్కైక్కాక అన్ఱో?" అప్పడియానాల్ అగ్గుణంగళై ఇఙ్గేయే ఇవరై అనుభవిప్పిప్పోమెన్ఱు నినైత్తు తన్నుడైయ స్వరూపరూపగుణవిభూతిగళై, మయర్వఱ మదినల మరుళిన మున్నిలుమ్కాట్టిల్ మికవుమ్ విశదమాక కాట్టిక్కొడుక్క, అదనాల్ ఆళ్వార్ సంసారదుఃఖమ్ శిఱిదే మఱక్కప్పెఱ్ఱు అవఱ్ఱై ఇత్తిరువాశరియత్తిల్ అనుభవిక్కిఱార్.

## ముదల్పాట్టు.

అతిల్ ముతల్పాట్టిల్ శెక్కర్ తొడంగి అటి తుయలమర్న్దు (1–11) అడికళిల్ రూపత్తైయుమ్ (వడివళగైయుమ్) శివన్ అయన్ తొడంగి తని

రునాయక (12-14) అడికళిల్ పరత్వమెన్నుమ్ గుణత్తైయుమ్, ాావులకళన్ద శేవడియోయ్ (14) అడియిల్ నీర్మైయైయుమ్, ాశీల్యత్తైయుమ్) అనుభవిప్పతు కాణలాగుమ్. ఎమ్బెరుమానుడైయ డివఙ్గకు ఎన్నుమ్ కడలానతు నిస్సమాభ్యధికమాయ్ కిట్టినిన్దవర్కళుక్కు ర్నిన్దు పూర్ణమాగ అనుభవిక్క ముడియాతపడి ముగత్తిల్ అలైయెరి యాలుమ్, అనుభవియామలిరుక్క మాట్టామైయానాలుమ్ రుపమానత్తిన్మాలమాక పడగైక్కొండు కడలిల్ ఇఱఙ్గుమాపోలే ఇఱఙ్గి నుభవిక్కిఱార్. ఉపమానమ్ మరకతమలై.

## తాత్పర్యమ్

శివప్పాన పెరియమేఘత్తై ఇడుప్పిల్ అణిన్దు, అదైవిడ మిగచ్చివన్ద ేజస్సైయుడైయ సూర్యనై తలైయిల్ ధరిత్తు, కుళిర్న్ద కిరణఙ్గళైకొణ్డ న్దిరనై అదన్కీఴ్రుమ్, నక్షత్తిరఙ్గళాగియ పల తేజస్సుకళై అదనడియిలుమ ాఙ్గి అలఙ్కరిత్తుకొణ్డు ప్రవాళమయమాన పలఇడఙ్గళైయుడైయతాయ్ )ళఙ్గుకిఱ పచ్చైనిఱముళ్ళ) మరకతపర్వతమానతు కడలుక్కు ఆధిపతియాన వరుణనుడైయ అలైకళాకిఱ కైకళిల్ కణ్వళర్వదు తూఙ్గువతు) పోన్దు, పీతామ్బరమ్, కిరీటమ్, కణ్ఠాభరణమ్ ముదలాగ - కన్నుడైయ మేన్మైక్కు తకుమ్బడియాన పల ఆభరణఙ్గళై శాత్తికొణ్డు వాయ్ - కణ్గళిన్ తేజస్సు శివన్దుకాట్ట, పొన్వర్ణముడైయ అవ్వేల్లావఱ్ఱోడుమ్ శ్యామలమాన తిరుమేనినిఱమ్ పోట్టియిట్టు విళఙ్గానిఱ్క (పరభాగ శోభైయినాల్ విళఙ్గానిఱ్క) విరోధికళిన్మేల్ విషత్తై కక్కుకిఱ పలతలైకళైయుడైయ తిరువనన్తాళ్వానాగియ పడుక్కైయిల్ ఏఱి, అలైవీశుగిర తిరుప్పాఱ్కడలిల్. జగద్రక్షణచిన్తనైయాగిఱ తూక్కత్తిల్ పొరున్ది, బ్రహ్మా, శివన్, ఇన్దిరన్ ముదలాన సకలదేవసమూహఙ్గళుమ్ కణ్డు కైతొழுమ్బడి పళ్ళికొణ్డరుళిన జగత్కారణమాన తిరునాభికమలత్తైయుడైయ అద్వితీయ మహానాయకనే! త్రివిక్రమనాయ్ మూవులగఙ్గళైయుమ్ అళన్దుకొణ్డ శివన్ద తిరువడికళై యుడైయవనే! (జయవిజయీ భవ).

ఇతిల్ ఎమ్బెరుమానుక్కు మరకతక్కున్ఱముమ్, అవనుడైయ పీతామ్బరమ్, కిరీటమ్, కంఠాభరణమ్ మఱ్ఱుముళ్ల తిరువాభరణఙ్గళ్ ఆగియవఱ్ఱుక్కు ముఱైయే శివన్ద మేఘమ్, సూరియన్, చన్దిరన్ నక్షత్తిరఙ్గళ్ ఆకియవైయుమ్, శివన్ద తిరువధరమ్, తిరుక్కణ్గళ్ ఆగియవఱ్ఱుక్కు ప్రవాళమయమాన (పర్వత)ప్రదేశఙ్గళుమ్ ఉపమానఙ్గళ్ ఆగుమ్. ఇదువరైయిల్ ఎమ్బెరుమానుడైయ వడివళగు ఒరు మరకతపర్వతత్తై ఉపమానమాగక్కొండు అనుభవిక్కపట్టతు.

అయన్, శివన్, ఇన్దిరన్ ముదలియ పెరుప్పెరుత్త దేవతైగళుమ్ కైయెడుత్తు కుమ్బిడుమ్బడి కిడన్దానెన్గైయాలే పరదేవతాత్వమాకిఱ మేన్మై అనుభవిక్కప్పట్టతు.

రుద్రం సమాశ్రితా దేవాః రుద్రో బ్రహ్మాణమాశ్రితః ।
బ్రహ్మా మామాశ్రితో రాజన్ నాహం కఞ్చిదుపాశ్రితః ॥
(భారతమ్, ఆశ్వ. 118–37)

దేవతైకళ్ రుద్రనై ఆశ్రయిత్తుళ్ళనర్. రుద్రన్ బ్రహ్మాదేవనై ఆశ్రయిత్తుళ్లాన్ బ్రహ్మా ఎన్నై ఆశ్రయిత్తుళ్లాన్. నాన్ యారైయుమ్ ఆశ్రయిత్తిలేన్ ఎన్దానిఱ తని ప్పెరునాయకనాన ఎమ్బెరుమాన్. తామరైయున్ది ఎన్ఱదనాలుమ్ జగత్కారణత్వమాగిఱ పరత్వమే కుఱిక్కపట్టతు. తిరుప్పాల్కడలిల్ బ్రహ్మాదికళ్ మట్టుమే కాణత్తక్క ఇత్తకైయ వడివళ్గై త్రివిక్రమనాక ఇవ్వులకిల్ అవతరిత్తు ఎల్లారుడైయ కణ్గళుక్కుమ్ ఇలక్కాక్కి, తన్ తిరువడికళై వశిష్టచణ్డాలవిభాగమఱ ఎల్లార్తలైయిలుమ్ వైత్తరుళియ సౌలభ్యసౌశీల్యఙ్గళాగిఱ – నీర్మై మూవులగళన్ద శేవడియోయ్ ఎన్ఱదనాల్ విళక్కప్పట్టదు.

ఇప్పాశురత్తిల్ పలవిశేషఙ్గళోడుకూడియ మూవులగళన్ద శేవడియోయ్ ఎన్ఱ సంబోధనపదమొన్ఱేయన్ఱి నీపల్లాణ్డుపల్లాణ్డువాళ్గ ఎన్ఱాల్ పోన్ఱదొరు క్రియాపదమిల్లై. అదర్కుక్కారణమాగ యెమ్బెరుమానుడైయ ఇయఱ్ఱైయళ్గకిలుమ్, ఆభరణశోభైయిలుమ్ పళ్ళికొండ పాన్మైయిలుమ్ తిరువులకళన్ద నీర్మైయిలుమ్ మనత్తై పఱికొడుత్తు అనుభవిత్తుకొణ్డు ఇరుక్కిఱబడియాల్ ఒరుక్రియాపదైత్తైయిట్టు పాట్టై ముడిక్కమాట్టాతుపోనార్ ఆళ్వార్ ఎన్ఱు మహావిద్వాన్ శ్రీ కాంచీ ప్రతివాది భయంకరం

